ప్రథమ ముద్రణ : 1986



వెల : రూ. 90/-

కాపీలకు :
రేఖా పబ్లికేషన్స్
6-3-609/19, ఆనంద నగర్
హైదరాబాద్ - 500 004





ముద్రణ :
శ్రీ కృష్ణచిత్ర ప్రింటర్స్,
4, నాగేశ్వరరావు రోడ్
టి. నగర్, మద్రాసు - 600 017  ఫోన్ : 441286

రావుగారు, తన అనుభవ, శక్తి సామర్థ్యముల వలన, క్లిష్టమైన నియమావళులు నియమములు అందరికి అర్థమగురీతిలో రూపొందించినారు. అందులకు వారు, ప్రశంసనీయులు.

తెలుగు భాష అధికార భాషగా యేర్పడిన యిప్పటిలో, వారి ఈ తెలుగు అనువాదం జనావళికి ఎంతో ఉపకరిస్తుంది.

ఈ కృషికి వారిని ఎంతో అభినందిస్తున్నాను.

హైదరాబాదు,
22 - 1 - 86.

(సం.) కె. జయచంద్రారెడ్డి

రావుగారు, తన అనుభవ, శక్తి సామర్థ్యముల వలన, క్లిష్టమైన నియమావళులు నియమములు అందరికి అర్థమగురీతిలో రూపొందించినారు. అందులకు వారు, ప్రశంసనీయులు.

తెలుగు భాష అధికార భాషగా యేర్పడిన యిప్పటిలో, వారి ఈ తెలుగు అనువాదం జనావళికి ఎంతో ఉపకరిస్తుంది.

ఈ కృషికి వారిని ఎంతో అభినందిస్తున్నాను.

హైద్రాబాదు,
22 - 1 - 86.

(సం.) కె. జయచంద్రారెడ్డి

న్యాయ వ్యవస్థ గూడ ప్రజలకు తెలిసే ప్రజా భాషలో తీర్పులు చెప్పవలెనన్న సుసంకల్పముతో యున్నది. కాబట్టి ఈ చట్టము అమలు జేసే క్రింది న్యాయాధికారులకు, న్యాయవాదులకు చక్కగా నుపయోగించుననుట నిస్సందేహము. శ్రీ వేంకటేశ్వరరావుగారు ఇటువంటి ప్రజోపయోగమగు న్యాయ చట్టములను మరెన్నో తెలుగులోనికి తర్జుమా జేసి ప్రజాసేవ జేయుదురని నా అభిలాష.

ఈ పుస్తకము అన్ని విధముల వారికి ప్రోత్సాహమును, వారి ప్రయత్నము సఫలీకృతము చేయుననుటలో యెట్టి సందేహము లేదు.

హైద్రాబాదు
21-2-86

ఇట్లు
(సం.) కె. రామస్వామి

న్యాయ వ్యవస్థ గూడ ప్రజలకు తెలిసే ప్రజా భాషలో తీర్పులు చెప్పవలెనన్న సుసంకల్పముతో యున్నది. కాబట్టి ఈ చట్టము అమలు జేసే క్రింది న్యాయాధికారులకు, న్యాయవాదులకు చక్కగా నుపయోగించుననుట నిస్సందేహము. శ్రీ వేంకటేశ్వరరావుగారు ఇటువంటి ప్రజోపయోగమగు న్యాయ చట్టములను మరెన్నో తెలుగులోనికి తర్జుమా జేసి ప్రజాసేవ జేయుదురని నా అభిలాష.

ఈ పుస్తకము అన్ని విధముల వారికి ప్రోత్సాహమును, వారి ప్రయత్నము సఫలీకృతము చేయుననుటలో యెట్టి సందేహము లేదు.

హైద్రాబాదు
21-2-86

ఇట్లు
(సం.) కె. రామస్వామి

పరిమితి లేదు. శిక్ష నిర్ణయించుటలో పెక్కు నేరములకు న్యాయా ధికారికి విచక్షణాధికారము కూడ లేదు. 18 సంవత్సరములు పై బడిన నేరస్థులకు ప్రొబేషను చట్టము వర్తించదు. నిబంధనలింత కఠినముగ యున్ననూ కల్తీ లేని స్వచ్ఛమయిన ఆహార పదార్థములు మార్కెటులో లభించుట, దుర్లభమయినది. ఈ పరిస్థితికి వ్యాపారులు, ప్రాసిక్యూషను సిబ్బంది, న్యాయస్థానములు బాధ్యత వహించక తప్పదు. ప్రజా శ్రేయస్సును దృష్టిలో నుంచుకొని వీరందరు తమ తమ బాధ్యతలను మనఃస్ఫూర్తిగా, నిజాయితీగా, అప్రమత్తతతో నిర్వర్తించవలెను.

ఆహార వస్తువులలో కల్తీ విస్తారమయిన ఈనాడు ప్రతి కల్తీ ఆహారపు విక్రయదారు, తన స్వంత ఉపయోగమునకు కొను మరొక ఆహారం కల్తీ అయి ఉండే పరిస్థితి గుర్తించవలెను. ఇతరులు కల్తీ చేయుట వలన తమ కుటుంబానికి కలుగు ఆరోగ్య హాని యెట్లు సహించడో అట్లే తాను ఇతరులకు ఆరోగ్య హాని కలిగించకూడదని గ్రహించవలెను. లాభాపేక్షతో ప్రజా శ్రేయస్సుకు భంగం కల్గించే యీ చర్యలు మానుకొనవలయును. సె. 14 క్రింద ప్రతి తయారీ దారు చిల్లర వ్యాపారికి వారంటీ ఇవ్వవలసిన బాధ్యత కలిగి యున్నాడు. చిల్లర (రిటైలు) వ్యాపారస్తులు అట్టి వారంటీ లేనిదే వస్తువులు కొనుట తిరస్కరించవలయును. కల్తీ వస్తువు కాదు అని నమ్మినప్పుడే కొనవలయును, యితరులకు అమ్మవలెను. సె. 12 క్రింద కొనుగోలుదారు శాంపిల్‌ను విశ్లేషణకొరకు పంపుకొను హక్కు కల్గి యున్నాడు. కొనుగోలుదారు స్వయముగాను, లేక వినియోగదార్ల సంఘముల ద్వారా ఈ నిబంధనను ఎక్కువగా ఉపయోగించుకొన వలయును.

పరిమితి లేదు. శిక్ష నిర్ణయించుటలో పెక్కు నేరములకు న్యాయాధి కారికి విచక్షణాధికారము కూడ లేదు. 18 సంవత్సరములు పైబడిన నేరస్తులకు ప్రొబేషను చట్టము వర్తించదు. నిబంధనలింత కఠినముగా యున్ననూ కల్తీ లేని స్వచ్ఛమయిన ఆహార పదార్థములు మార్కెటులో లభించుట, దుర్లభమయినది. ఈ పరిస్థితికి వ్యాపారులు, ప్రాసిక్యూషను సిబ్బంది, న్యాయస్థానములు బాధ్యత వహించక తప్పదు. ప్రజా శ్రేయస్సును దృష్టిలో నుంచుకొని వీరందరు తమ తమ బాధ్యతలను మనఃస్ఫూర్తిగా, నిజాయితీగా, అప్రమత్తతతో నిర్వర్తించవలెను.

ఆహార వస్తువులలో కల్తీ విస్తారమయిన ఈనాడు ప్రతి కల్తీ ఆహారపు విక్రయదారు, తన స్వంత ఉపయోగమునకు కొను మరొక ఆహారం కల్తీ అయి ఉండే పరిస్థితి గుర్తించవలెను. ఇతరులు కల్తీ చేయుట వలన తమ కుటుంబానికి కలుగు ఆరోగ్య హాని యెట్లు సహించడో అట్లే తాను ఇతరులకు ఆరోగ్య హాని కలిగించకూడదని గ్రహించవలెను. లాభాపేక్షతో ప్రజా శ్రేయస్సుకు భంగం కల్గించే యీ చర్యలు మానుకొనవలయును. సె. 14 క్రింద ప్రతి తయారీ దారు చిల్లర వ్యాపారికి వారంటీ ఇవ్వవలసిన బాధ్యత కలిగి యున్నాడు. చిల్లర (రిటైలు) వ్యాపారస్తులు అట్టి వారంటీ లేనిదే వస్తువులు కొనుట తిరస్కరించవలయును. కల్తీ వస్తువు కాదు అని నమ్మినప్పుడే కొనవలయును, యితరులకు అమ్మవలెను. సె. 12 క్రింద కొనుగోలుదారు శాంపిల్‌ను విశ్లేషణకొరకు పంపుకొను హక్కు కల్గి యున్నాడు. కొనుగోలుదారు స్వయముగాను, లేక వినియోగదార్ల సంఘముల ద్వారా ఈ నిబంధనను ఎక్కువగా ఉపయోగించుకొన వలయును.

యున్న అనుభవంతో, ఆసక్తితో, ఈ శాసనమునకు తెలుగులో అనువాదం చేసి వ్యాఖ్యా వ్రాయ సాహసించినాను. ఇది ఈ చట్టము నకు తెలుగులో వ్యాఖ్యాసహిత అనువాదములలో ఇదియే మొదటిది.

ఈ శాసనమునకు అధికార ఆమోదం పొందిన అనువాదం ప్రభుత్వం ఇంతవరకు ప్రచురించలేదు. నా యీ అనువాదములో, సాధ్యమయినంత వరకు ఆంధ్రప్రదేశ్ శాసన సభ సచివాలయం ప్రచురించిన పారిభాషిక పదకోశములోని పదములు, భారత సంవిధానములోను, తెలుగు అకాడమీ వారు ప్రచురించిన భౌతిక రసాయనిక, వృక్ష, గృహ విజ్ఞాన శాస్త్ర పాఠ్య గ్రంథములలో వాడిన పదములు ఉపయోగించినాను. అందులోని కొన్ని పదములు పూర్తిగా అపరిచితముగా ఉండవచ్చును. అయినను అది అధికార అనువాదము కనుక వాడినాను. (ఉదా: Container=ఆధార పాత్ర). అయితే ఎక్కువ వాడుకలో ఉండి ప్రజలకు బాగుగ పరిచయమున్న పదములు (ఉదా: శాంపిల్) అపరిచితములైన పదము ('మాదిరి', 'మచ్చు') లకు బదులు యథాతథంగా వాడినాను. అలాగే అధికార హోదాలు (ఉదా: పబ్లిక్ ఎనలిస్టు, ఫుడ్ ఇన్‌స్పెక్టరు) యథాతథంగా వాడుటయే సముంజసమని భావించి అనువాదం చేయలేదు. ఆంగ్లంలోని ఒకటికంటే ఎక్కువ పదములకు తెలుగులో ఒకే పదము అనువాద మయి ఉండవచ్చును (ఉదా: Powder=పొడి, Dry=పొడి) భేదము సందర్భమునుబట్టి గ్రహించవలెను.

అట్లే 'ఆలిండియా రిపోర్టరు', 'క్రిమినల్ లా జర్నల్', వగైరా లను తర్జుమా చేయకుండా, సౌలభ్యము కొరకు ఆంగ్లనామములతోనే ప్రస్తావించినాను. (ఉదా: ఆలిండియా రిపోర్టరుకు—ఎ.ఐ.ఆర్.)

యొున్న అనుభవంతో, ఆసక్తితో, ఈ శాసనమునకు తెలుగులో అనువాదం చేసి వ్యాఖ్యా వ్రాయ సాహసించినాను. ఇది ఈ చట్టము నకు తెలుగులో వ్యాఖ్యాసహిత అనువాదములలో ఇదియే మొదటిది.

ఈ శాసనమునకు అధికార ఆమోదం పొందిన అనువాదం ప్రభుత్వం ఇంతవరకు ప్రచురించలేదు. నా యీ అనువాదములో, సాధ్యమయినంత వరకు ఆంధ్రప్రదేశ్ శాసన సభ సచివాలయం ప్రచురించిన పారిభాషిక పదకోశములోని పదములు, భారత సంవిధానములోను, తెలుగు అకాడమీ వారు ప్రచురించిన భౌతిక రసాయనిక, వృక్ష, గృహ విజ్ఞాన శాస్త్ర పాఠ్య గ్రంథములలో వాడిన పదములు ఉపయోగించినాను. అందులోని కొన్ని పదములు పూర్తిగా అపరిచితముగా ఉండవచ్చును. అయినను అది అధికార అనువాదము కనుక వాడినాను. (ఉదా: Container=ఆధార పాత్ర). అయితే ఎక్కువ వాడుకలో ఉండి ప్రజలకు బాగుగ పరిచయమున్న పదములు (ఉదా: శాంపిల్) అపరిచితములైన పదము ('మాదిరి', 'మచ్చు') లకు బదులు యథాతథంగా వాడినాను. అలాగే అధికార హోదాలు (ఉదా: పబ్లిక్ ఎనలిస్టు, ఫుడ్ ఇన్‌స్పెక్టరు) యథాతథంగా వాడుటయే సమంజసమని భావించి అనువాదం చేయలేదు. ఆంగ్లంలోని ఒకటికంటే ఎక్కువ పదములకు తెలుగులో ఒకే పదము అనువాదమయి ఉండవచ్చును (ఉదా: Powder=పొడి, Dry=పొడి) భేదము సందర్భమునుబట్టి గ్రహించవలెను.

అట్లే 'ఆలిండియా రిపోర్టరు', 'క్రిమినల్ లా జర్నల్', వగైరా లను తర్జుమా చేయకుండా, సౌలభ్యము కొరకు ఆంగ్లనామములతోనే ప్రస్తావించినాను. (ఉదా: ఆలిండియా రిపోర్టరుకు—ఎ.ఐ.ఆర్.)

విషయ సూచిక గ్రంథము మొదటిలో ఇవ్వబడినది. కేసు విషయము వెంటనే కనుగొనుటకు వీలుగా అంశానుక్రమ సూచిక కూడా గ్రంథము చివర ఇవ్వబడినది. తీర్పుల పట్టిక అక్షరాను క్రమములో ఇవ్వబడినది.

ఈ చట్టము క్రింద పెక్కు సందర్భములలో వివిధ హైకోర్టులు విభిన్నములైన తీర్పులిచ్చినవి. సుప్రీంకోర్టు కొన్ని సందర్భములలో వివరణలిచ్చి వివాదములను పరిష్కరించినది. ఇందులో ముఖ్యమైన సుప్రీంకోర్టు, హైకోర్టుల తీర్పులన్నిటిని, 1985 సంవత్సరాంతము వరకు రిపోర్టు అయిన తీర్పులతో సహా పేర్కొన్నాను.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం అధికార భాషా చట్టం, 1966 క్రింద అధికారములను పురస్కరించుకొని జి. వో. 537 సాధారణ పరిపాలన (అధికార భాష) తేది 20-10-81 ద్వారా రాష్ట్రములోని అన్ని జిల్లా మునసబు మేజిస్ట్రేటు కోర్టులలో, అన్ని క్రిమినలు కేసులలోను విచారణ తప్పని సరిగా తెలుగులో జరుగవలెననియు, సాధ్యమయినంత వరకు అట్టి కేసులలో తీర్పులు ఉత్తర్వులు తెలుగులో వ్రాయవలెనని ఆదేశించి యున్నది. అయినను న్యాయాధికారులు తెలుగులో వ్రాయలేక పోవుటకు ముఖ్య కారణం శాసనములకు తెలుగులో అధికార అనువాదములు, వ్యాఖ్యా గ్రంథములు లేకుండటయే.

ఈ శాసనము క్రింద కోర్టులలో ప్రతి సంవత్సరము వేల కేసులు దాఖలు అగుచున్నవి. ఈ గ్రంథము అట్టి కేసులలో తీర్పులు తెలుగులో వ్రాయుటకు సహకరించునని నా నమ్మిక.

“నాకు చట్టము తెలియదు” అనే వాదన న్యాయస్థానము అంగీకరించదు. అందువలన చట్టములో ఏమి నిబంధనలు చేయబడినవి,

విషయ సూచిక గ్రంథము మొదటలో యివ్వబడినది. కోర్టు విషయము వెంటనే కనుగొనుటకు వీలుగా అంశానుక్రమ సూచి కూడా గ్రంథము చివర యివ్వబడినది. తీర్పుల పట్టిక అక్షరానుక్రమములో యివ్వబడినది.

ఈ చట్టము క్రింద పెక్కు సందర్భములలో వివిధ హైకోర్టులు విభిన్నములైన తీర్పులిచ్చినవి. సుప్రీంకోర్టు కొన్ని సందర్భములలో వివరణలిచ్చి వివాదములను పరిష్కరించినది. ఇందులో ముఖ్యమైన సుప్రీంకోర్టు, హైకోర్టుల తీర్పులన్నిటిని, 1985 సంవత్సరాంతమువరకు రిపోర్టు అయిన తీర్పులతో సహా పేర్కొన్నాను.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం అధికార భాషా చట్టం, 1966 క్రింద అధికారములను పురస్కరించుకొని జి. ఓ. 537 సాధారణ పరిపాలన (అధికార భాష) తేది 20-10-81 ద్వారా రాష్ట్రములోని అన్ని జిల్లా మునసబు మేజిస్ట్రేటు కోర్టులలో, అన్ని క్రిమినలు కేసులలోనూ విచారణ తప్పని సరిగా తెలుగులో జరుగవలెననియు, సాధ్యమయినంత వరకు అట్టి కేసులలో తీర్పులు ఉత్తర్వులు తెలుగులో వ్రాయవలెనని ఆదేశించి యున్నది. అయిననూ న్యాయాధికారులు తెలుగులో వ్రాయలేక పోవుటకు ముఖ్య కారణం శాసనములకు తెలుగులో అధికార అనువాదములు, వ్యాఖ్యా గ్రంథములు లేకుండుటయే.

ఈ శాసనము క్రింద కోర్టులలో ప్రతి సంవత్సరము వేల కేసులు దాఖలు అగుచున్నవి. ఈ గ్రంథము అట్టి కేసులలో తీర్పులు తెలుగులో వ్రాయుటకు సహకరించునని నా నమ్మిక.

“నాకు చట్టము తెలియదు” అనే వాదన న్యాయస్థానము అంగీకరించదు. అందువలన చట్టములో ఏమి నిబంధనలు చేయబడినవి,

వ్యాఖ్యానమూర్తి గౌరవనీయులు శ్రీ జస్టిస్ కె. రామస్వామి గారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

అనువాద కార్యక్రమములో సలహాలిచ్చి సహకరించిన మిత్రులకు నా కృతజ్ఞతలు.

నన్ను ప్రోత్సహించి, ఈ గ్రంథము ప్రచురించిన ప్రచురణ కర్తలు రేఖా పబ్లికేషన్సు, హైదరాబాదు వారికి, శ్రద్ధతో చక్కగా ముద్రించిన శ్రీ కృష్ణచిత్ర ప్రింటర్సు, మద్రాసు వారికి నా కృతజ్ఞతలు.

ఈ వ్యాఖ్యా గ్రంథమునకు, నా శక్తికొలది మేలి కూర్పు నిచ్చుటకు ప్రయత్నించినాను. శాస్త్రీయ, సాంకేతిక పదముల అనువాదములో ఏమైనా లోపములుండవచ్చును. ఈ గ్రంథమును ఇంకనూ మెరుగు పరచుటకు ఇవ్వబడు సలహాలు సహృదయతతో స్వీకరించి తదుపరి ప్రచురణలో పొందు పరచగలను.

ఆదిలాబాదు,
22-2-86

భవదీయుడు,
ఏటుకూరి వెంకటేశ్వర రావు.

న్యాయమూర్తి గౌరవనీయులు శ్రీ జస్టిస్ కె. రామస్వామి గారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

అనువాద కార్యక్రమములో సలహాలిచ్చి సహకరించిన మిత్రులందరికీ నా కృతజ్ఞతలు.

నన్ను ప్రోత్సహించి, ఈ గ్రంథము ప్రచురించిన ప్రచురణ కర్తలు రేఖా పబ్లికేషన్సు, హైదరాబాదు వారికి, శ్రద్ధతో చక్కగా ముద్రించిన శ్రీ కృష్ణచిత్ర ప్రింటర్సు, మద్రాసు వారికి నా కృతజ్ఞతలు.

ఈ వ్యాఖ్యా గ్రంథమునకు, నా శక్తికొలది మేలి రూప మివ్వుటకు ప్రయత్నించినాను. శాస్త్రీయ, సాంకేతిక పదముల అనువాదములో ఏమైనా లోపములుండవచ్చును. ఈ గ్రంథమును ఇంకనూ మెరుగు పరచుటకు ఇవ్వబడు సలహాలు సహృదయతతో స్వీకరించి తదుపరి ప్రచురణలో పొందు పరచగలను.

అదిలాబాదు, భవదీయుడు,
22-2-86 పేటుకూరి వెంకటేశ్వర రావు.

| | |
|---|---|
| మహర్‌చంద్ పోతారాం Vs స్టేట్ | 129. 13 |
| మహమ్మద్ యాస్మిన్ Vs స్టేట్ ఆఫ్ యు. పి. | 34, 13 |
| మనీభాయ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర | 17. 19, 46, 128, 15 |
| మహమ్మద్ ఇస్మాయిలు Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర | 7 |
| మహమ్మద్ యామిన్ Vs స్టేట్ ఆఫ్ హర్యానా | 3 |
| మాన్సింగ్ చాదూరాం Vs స్టేట్ ఆఫ్ గుజరాత్ | 10 |
| మునిసిపల్ బోర్డ్ Vs రాజారామ్ | 16 |
| మునిసిపల్ కార్పొరేషన్ ఢిల్లీ Vs గిరిధర్‌లాల్ సప్రూ | 147 |
| మునిసిపల్ కమిటీ అంబాల Vs బైసాకరామ్ | 147 |
| మునిసిపల్ కార్పొరేషన్ ఢిల్లీ Vs న్యూ క్వాలిటీ స్వీట్ హవుస్ | 140 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs లక్ష్మణదాస్ | 131 |
| మునిసిపాలిటి Vs సుకుమారన్ | 127 |
| మునిసిపలు కార్పొరేషన్ Vs ఓం ప్రకాష్ | 107 |
| మునిసిపలు బోర్డ్ చందా Vs లీలాధర్ | 104 |
| మునిసిపలు బోర్డు షాహరాన్‌పూర్ Vs ధాన్‌సింగ్ | 96 |
| మునిసిపలు కౌన్సిలు అమృత్‌సర్ Vs అర్జున్‌సింగ్ | 95 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs నానక్‌చంద్ | 80 |
| మునిసిపలు బోర్డు Vs మలుక్‌దాస్ గుప్త | 76 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs షోకీలాలు | 56 |
| మునిసిపలు కౌన్సిలు అకోలా Vs శ్రీపతిలాలు | 5 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs ఉకీచంద్ భాటియా | 12, 157 |
| మునిసిపలు కమిటీ ఢిల్లీ Vs రామస్వరూప్ | 13 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs మన్‌మోహన్‌లాలు | 13 |
| మునిసిపలు బోర్డు, కాన్పూర్ Vs జానకిప్రసాద్ | 23 |
| మురళీధర్ మేఘరాజ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర | 50, 129, 130 |
| మురళీలాల్ Vs స్టేట్ | 67 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs కాచర్‌మల్ | 146 |
| మూల్‌చంద్ Vs స్టేట్ ఆఫ్ పంజాబు | 67 |

| | |
|---|---|
| మహార్‌చంద్ పోతారాం Vs స్టేట్ | 129. 130 |
| మహమ్మద్ యాస్మీన్ Vs స్టేట్ ఆఫ్ యు. పి. | 34, 132 |
| మనీభాయ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర | 17. 19, 46, 128, 154 |
| మహమ్మద్ ఇస్మాయిలు Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర | 79 |
| మహమ్మద్ యామిన్ Vs స్టేట్ ఆఫ్ హర్యానా | 30 |
| మాన్సింగ్ చాదూరాం Vs స్టేట్ ఆఫ్ గుజరాత్ | 100 |
| మునిసిపల్ బోర్డ్ Vs రాజారామ్ | 160 |
| మునిసిపల్ కార్పొరేషన్ ఢిల్లీ Vs గిరిధర్‌లాల్ సప్రూ | 147 |
| మునిసిపల్ కమిటీ అంబాల Vs బై సాకరామ్ | 147 |
| మునిసిపల్ కార్పొరేషన్ ఢిల్లీ Vs న్యూ క్వాలిటీ స్వీట్ హవుస్ | 140 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs లక్ష్మణదాస్ | 131 |
| మునిసిపాలిటి Vs సుకుమారన్ | 127 |
| మునిసిపలు కార్పొరేషన్ Vs ఓం ప్రకాష్ | 107 |
| మునిసిపలు బోర్డ్ చంద Vs లీలాధర్ | 104 |
| మునిసిపలు బోర్డు షాహరాన్‌పూర్ Vs ధాన్‌సింగ్ | 96 |
| మునిసిపలు కౌన్సిలు అమృత్‌సర్ Vs అర్జున్‌సింగ్ | 95 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs నానక్‌చంద్ | 80 |
| మునిసిపలు బోర్డు Vs మలుక్‌దాస్ గుప్త | 76 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs షోకీలాలు | 56 |
| మునిసిపలు కౌన్సిలు అకోలా Vs శ్రీపతిలాలు | 5 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs టేక్‌చంద్ భాటియా | 12, 157 |
| మునిసిపలు కమిటీ ఢిల్లీ Vs రామస్వరూప్ | 13 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs మన్‌మోహన్‌లాలు | 13 |
| మునిసిపలు బోర్డు, కాన్పూర్ Vs జానకిప్రసాద్ | 23 |
| మురళీధర్ మేఘరాజ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర | 50, 129, 130 |
| మురళీలాల్ Vs స్టేట్ | 67 |
| మునిసిపలు కార్పొరేషన్ ఢిల్లీ Vs కాచర్‌మల్ | 146 |
| మూల్‌చంద్ Vs స్టేట్ ఆఫ్ పంజాబు | 67 |

| | |
|---|---|
| వై. యం. కోలీ Vs డి. ఎ. కొకానీ | 101,104,107 |
| శత్రుఘ్న Vs పూరీ మునిసిపాలిటీ | 99 |
| శేషరావ్‌తోపాజీ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర | 141 |
| శంభుదయాళ్ Vs ,, ,, యు. పి. | 53 |
| శ్రీచంద్ Vs ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్ | 30 |
| షబీర్ Vs అబ్దుల రహమాన్ | 57 |
| సత్యప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ యు. పి. | 4,33,45,12[illegible] |
| సర్కులువంగా రోలర్ ఫ్లోర్ మిల్సు Vs కలకత్తా కార్పొరేషను | 14 |
| సాధూరాం Vs స్టేట్ | 127 |
| సాధూసింగ్ - Vs ,, | 84 |
| సోమశెట్టి నరసింగరావు Vs స్టేట్ | 70 |
| సుందర్‌సింగ్ Vs స్టేట్ | 65 |
| స్టేట్ (ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్) Vs పురాన్‌మల్ | 14 |
| స్టేట్ Vs ఉమాచరణ్‌రాయ్ | 23 |
| స్టేట్ ఆఫ్ కేరళ Vs తంగప్పన్ | 31 |
| స్టేట్ ఆఫ్ తమిళనాడు Vs ఆర్. కృష్ణమూర్తి | 33, 145 |
| స్టేట్ Vs ఆర్. కృష్ణమూర్తి | 34 |
| స్టేట్ Vs వి. కె. కె. నంగియా | 46, 154 |
| స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర Vs రంజిత్‌భాయ్ | 50 |
| స్టేట్ ఆఫ్ యం. పి. Vs రాంఛోడ్ | 68 |
| స్టేట్ ఆఫ్ పంజాబ్ Vs కాశ్మీర్ సింగ్ | 69 |
| స్టేట్ ఆఫ్ గుజరాత్ Vs కేస్వలాల్ | 78 |
| స్టేట్ Vs మహ్మద్ ఇబ్రహిం | 79 |
| స్టేట్ ఆఫ్ రాజస్థాన్ Vs కవబ్ | 80 |
| స్టేట్ ఆఫ్ పంజాబ్ Vs దేవేంద్రకుమార్ | 81 |
| స్టేట్ ఆఫ్ అస్సాం Vs పురానమల్ అగర్వాల్ | 84 |
| స్టేట్ ఆఫ్ కేరళ Vs అలసరి మహమ్మద్ | 84 |
| స్టేట్ ఆఫ్ కేరళ Vs అలసేరి మహమ్మద్ వగైరా | 86 |
| స్టేట్ ఆఫ్ కేరళ Vs నారాయణ అయ్యర్ | 97 |

| | |
|---|---|
| వై. యం. కోలీ Vs డి. ఎ. కొకానీ | 101,104,107 |
| శత్రుఘ్న Vs పూరీ మునిసిపాలిటీ | 99 |
| శేషరావ్ తోపాజీ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర | 141 |
| శంభుదయాళ్ Vs " యు. పి. | 53 |
| శ్రీచంద్ Vs ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్ | 30 |
| షబీర్ Vs అబ్దుల రహమాన్ | 57 |
| సజ్జాప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ యు. పి. | 4,33,45,123 |
| సర్కులుదంగా రోలర్ ఫ్లోర్ మిల్సు Vs కలకత్తా కార్పోరేషను | 14 |
| సాధూరాం Vs స్టేట్ | 127 |
| సాధూసింగ్ Vs " | 84 |
| సోమశెట్టి నరసింగరావు Vs స్టేట్ | 70 |
| సుందర్‌సింగ్ Vs స్టేట్ | 65 |
| స్టేట్ (ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్) Vs పురాన్‌మల్ | 14 |
| స్టేట్ Vs ఉమాచరణ్‌రాయ్ | 23 |
| స్టేట్ ఆఫ్ కేరళ Vs తంగప్పన్ | 31 |
| స్టేట్ ఆఫ్ తమిళనాడు Vs ఆర్. కృష్ణమూర్తి | 33, 145 |
| స్టేట్ Vs ఆర్. కృష్ణమూర్తి | 34 |
| స్టేట్ Vs వి. కె. కె. నంగియా | 46, 154 |
| స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర Vs రంజిత్‌భాయ్ | 50 |
| స్టేట్ ఆఫ్ యం. పి. Vs రాంభోడ్ | 68 |
| స్టేట్ ఆఫ్ పంజాబ్ Vs కాశ్మీర్ సింగ్ | 69 |
| స్టేట్ ఆఫ్ గుజరాత్ Vs కేస్వలాల్ | 78 |
| స్టేట్ Vs మహ్మద్ ఇబ్రహీం | 79 |
| స్టేట్ ఆఫ్ రాజస్థాన్ Vs కరవ్ | 80 |
| స్టేట్ ఆఫ్ పంజాబ్ Vs దేవేంద్రకుమార్ | 81 |
| స్టేట్ ఆఫ్ అస్సాం Vs పురానమల్ అగర్వాల్ | 84 |
| స్టేట్ ఆఫ్ కేరళ Vs అలసరి మహమ్మద్ | 84 |
| స్టేట్ ఆఫ్ కేరళ Vs అలసేరి మహమ్మద్ వగైరా | 86 |
| స్టేట్ ఆఫ్ కేరళ Vs నారాయణ అయ్యర్ | 97 |

# విషయసూచిక

సెక్షను | పేజి సంఖ్య

ప్రారంభిక

1. సంగ్రహనామము, విస్తృతి మరియు ప్రారంభము 1
2. నిర్వచనములు 2
2-ఎ. అన్వయ సూత్రము 36
కేంద్ర ఆహార ప్రమాణముల కమిటి మరియు కేంద్ర ఆహార పరిశోధన శాల.

—

3. ఆహార ప్రమాణముల కేంద్ర కమిటి 36
3.ఎ. సెక్రటరీ, మరితర సిబ్బంది నియామకం 39
4. కేంద్ర ఆహార పరిశోధనశాల 39

ఆహారములకు సంబంధించి సాధారణ నిబంధనలు

5. కొన్ని ఆహార వస్తువుల దిగుమతి నిషేధము 41
6. సముద్ర కస్టమ్స్‌కు సంబంధించిన శాసనము వర్తించుట మరియు కస్టమ్స్ అధికారుల అధికారములు 42
7. కొన్ని ఆహార వస్తువుల తయారీ, అమ్మకం, వగైరాల నిషేధము 43

ఆహార విశ్లేషణ

8. పబ్లిక్ ఎనలిస్టులు 53
9. ఫుడ్ ఇన్స్పెక్టర్లు 54
10. ఫుడ్ ఇన్స్పెక్టర్ల అధికారములు 57

ఆహార కల్తీ నివారణ చట్టము 1954

# విషయసూచిక

సెక్షను | పేజీ సంఖ్య


ప్రారంభిక

1. సంగ్రహనామము, విస్తృతి మరియు ప్రారంభము 1
2. నిర్వచనములు 2
2-ఎ. అన్వయ సూత్రము 36

కేంద్ర ఆహార ప్రమాణముల కమిటి మరియు కేంద్ర ఆహార పరిశోధన శాల.

---

3. ఆహార ప్రమాణముల కేంద్ర కమిటి 36
3.ఎ. సెక్రటరీ, మరితర సిబ్బంది నియామకం 39
4. కేంద్ర ఆహార పరిశోధనశాల 39

ఆహారములకు సంబంధించి సాధారణ నిబంధనలు

5. కొన్ని ఆహార వస్తువుల దిగుమతి నిషేధము 41
6. సముద్ర కస్టమ్స్‌కు సంబంధించిన శాసనము వర్తించుట మరియు కస్టమ్స్ అధికారుల అధికారములు 42
7. కొన్ని ఆహార వస్తువుల తయారీ, అమ్మకం, వగైరాల నిషేధము 43

ఆహార విశ్లేషణ

8. పబ్లిక్ ఎనలిస్టులు 53
9. ఫుడ్ ఇన్స్పెక్టర్లు 54
10. ఫుడ్ ఇన్స్పెక్టర్ల అధికారములు 57

# ఆహార కల్తీ నివారణ నియమావళి 1955

రూలు    పేజి

## భాగము - 1

### ప్రారంభిక


1. సంగ్రహ నామము, విస్తృతి మరియు ప్రారంభము    3
2. నిర్వచనములు.    3


## భాగము - II

### కేంద్ర ఆహార పరిశోధన శాల


3. విధులు    [illegible]
4. ఆహార శాంపిల్ యొక్క విశ్లేషణ    [illegible]


## భాగము - III

### నిర్వచనములు మరియు నాణ్యత ప్రమాణములు


5. నిర్వచనములు మరియు నాణ్యత ప్రమాణములు    9


## భాగము - IV

### పబ్లిక్ ఎనలిస్టులు మరియు ఫుడ్ ఇన్స్పెక్టర్లు


6. పబ్లిక్ ఎనలిస్టుల అర్హతలు    9
7. పబ్లిక్ ఎనలిస్టు యొక్క విధులు    10
8. ఫుడ్ ఇన్స్పెక్టరు యొక్క అర్హతలు    13
9. ఫుడ్ ఇన్స్పెక్టరు విధులు.    15
9- ఎ. లోకల్ హెల్త్ అథారిటీ, సంబంధించిన వ్యక్తికి రిపోర్టు పంపుట    17

# ఆహార కల్తీ నివారణ నియమావళి 19౫౫

రూలు | పేజి

## భాగము - 1

### ప్రారంభిక


1. సంగ్రహ నామము, విస్తృతి మరియు ప్రారంభము ౩

2. నిర్వచనములు. ౩


## భాగము - II

### కేంద్ర ఆహార పరిశోధన శాల


3. విధులు ౬

4. ఆహార శాంపిల్ యొక్క విశ్లేషణ ౭


## భాగము - III

### నిర్వచనములు మరియు నాణ్యత ప్రమాణములు


5. నిర్వచనములు మరియు నాణ్యత ప్రమాణములు 9


## భాగము - iv

### పబ్లిక్ ఎనలిస్టులు మరియు ఫుడ్ ఇన్స్పెక్టర్లు


6. పబ్లిక్ ఎనలిస్టుల అర్హతలు 9

7. పబ్లిక్ ఎనలిస్టు యొక్క విధులు 10

8. ఫుడ్ ఇన్స్పెక్టరు యొక్క అర్హతలు 13

9. ఫుడ్ ఇన్స్పెక్టరు విధులు. 15

9- ఎ. లోకల్ హెల్త్ అథారిటీ, సంబంధించిన వ్యక్తికి రిపోర్టు పంపుట 17

## భాగము VI

### రంగు పదార్థము


22. పబ్లిక్ ఎనలిస్టుకు పంపవలసిన శాంపిలు పరిమాణము 27

22. ఎ. ఒకే మాదిరి లేబిల్ యున్న ఒకటి లేక ఎక్కువ, సీలు వేసిన పాత్రలోనివి ఆహారము యొక్క ఒక శాంపిల్ పరిమాణం అగుట 30

22. బి. పంపబడిన శాంపిలు పరిమాణం సరిపోయినదని భావన 30

23. అనుమతింపబడని రంగు పదార్థము కలుపుట, నిషేధము 30

24. అన్య రంగు పదార్థము కలయిక నిషేధము 30

25. కారమెల్ ఉపయోగము అనుమతింపబడును 31

26. అనుమతింపబడిన సహజ రంగులు 31

27. కర్బనేతర పదార్థములు మరియు రంగు పదార్థములు కలుపుట నిషేధము 32

28. అనుమతింపబడిన కోల్‌టార్ ఆహార రంగులు 32

29. అనుమతింపబడిన కోల్‌టార్ ఆహార రంగుల నిషేధము 33

30. అనుమతింపబడిన రంగుల గరిష్ఠ పరిమితులు 34

31. రంగుల స్వచ్ఛత 35


## భాగము VII

### ఆహారముల ప్యాకింగు మరియు లేబిలింగ్


32. లేబిలు యొక్క అంశములు 35

32- ఎ. పోషకాహారము 38

33. లేబిలుపై వివరముల లేక ప్రకటనల భాషలు 38

34. ప్రకటన పట్టు గీత 38

45. శుద్ధమైన తేనెను పోలియుండి శుద్ధమైనది కాని తేనెను, తేనెగా గుర్తు వేయకుండుట 58

46. నేయి, వెన్న మిశ్రమములు అమ్ముట లేక అమ్ముటకు ఉపయోగించు నిషేధము 58

47. కలిపిన కృత్రిమ తీపిచేయు పదార్థము లేబిల్సుపై సూచించబడుట 59

48. సహజముగా చనిపోయిన జంతువుల లేక కోళ్ళ మాంసము వాడకము నిషేధము 59

48-ఎ. అనుమతింపబడిన ఆహార రంగుల అమ్మకము 60

48-బి. కీటకములచే దెబ్బతినిన శుష్కఫలాల మరియు పిక్కల [నట్స్] అమ్మకం 61

48-సి. ఆహార సంకలనాత్మకముల అమ్మకము 61


భాగము — IX

విక్రయ మరియు లైసెన్సుకు షరతులు


49. విక్రయమునకు షరతులు 63

50. లైసెన్సుకు షరతులు 68

51. లైసెన్సు కాల పరిమితి 72

51-ఎ. కొన్ని లోకలు ఏరియాలలో లైసెన్సు యిచ్చు విధానము 72


భాగము — X

పరిరక్షక పదార్థములు


52. పరిరక్షక పదార్థముయొక్క నిర్వచనము 73

53. పరిరక్షక పదార్థముల వర్గీకరణ 73

54. ఒకటికంటే యెక్కువ రెండవ తరగతి పరిరక్షక పదార్థముల వాడకము నిషేధము 75

55. రెండవ తరగతి పరిరక్షక పదార్థముల వాడకము పరిమితము 76

45. శుద్ధమైన తేనెను పోలియుండి శుద్ధమైనది కాని తేనెను, తేనెగా గుర్తు వేయకుండుట 58

46. నేయి, వెన్న మిశ్రమములు అమ్ముట లేక అమ్ముటకు ఉపయోగించు నిషేధము 58

47. కలిపిన కృత్రిమ తీపిచేయు పదార్థము లేబిలుపై సూచించబడుట 59

48. సహజముగా చనిపోయిన జంతువుల లేక కోళ్ళ మాంసము వాడకము నిషేధము 59

48-ఎ. అనుమతింపబడిన ఆహార రంగుల అమ్మకము 60

48-బి. కీటకములచే దెబ్బతినిన శుష్కఫలాల మరియు పిక్కల [నట్స్] అమ్మకం 61

48-సి. ఆహార సంకలనాత్మకముల అమ్మకము 61

భాగము — IX

విక్రయ మరియు లైసెన్సుకు షరతులు

49. విక్రయమునకు షరతులు 63

50. లైసెన్సుకు షరతులు 68

51. లైసెన్సు కాల పరిమితి 72

51-ఎ. కొన్ని లోకలు ఏరియాలలో లైసెన్సు యిచ్చు విధానము 72

భాగము — X

పరిరక్షక పదార్థములు

52. పరిరక్షక పదార్థముయొక్క నిర్వచనము 73

53. పరిరక్షక పదార్థముల వర్గీకరణ 73

54. ఒకటికంటే యెక్కువ రెండవ తరగతి పరిరక్షక పదార్థముల వాడకము నిషేధము 75

55. రెండవ తరగతి పరిరక్షక పదార్థముల వాడకము పరిమితము 76

69. సాల్వెంటు ఎక్స్ట్రాక్టెడ్ తినదగు పిండి తయారీ, నిల్వ అమ్మకముల షరతులు 102

భాగము — xvi

సెక్వెస్టరింగ్ మరియు బఫరింగ్ ఏజెంట్లు

(అమ్లములు, క్షారములు, లవణములు)

70. సెక్వెస్టరింగ్ ఏజంట్లు నిర్వచనము 102

71. బఫరింగ్ ఏజంట్లు నిర్వచనము 103

72. సెక్వెస్టరింగ్ మరియు బఫరింగ్ ఏజంట్ల వాడకంపై పరిమితులు 103

అనుబంధం — ఎ.

ఫారములు 105

అనుబంధం — బి

నిర్వచనములు మరియు నాణ్యత ప్రమాణములు

ఎ. 01 పానీయములు - ఆల్కహాలేతర 115

ఎ. 02 బేకింగ్ పౌడర్ 115

ఎ. 03 స్టార్చ్ ఆహారములు 116

ఎ. 04 ఇంగువ 117

ఎ. 05 సుగంధ ద్రవ్యములు 118

ఎ. 06 చిక్కుడు 136

ఎ. 07 తీపి చేయు పదార్థములు 137

ఎ. 08 కాఫీ 142

ఎ. 09 × × ×

ఎ. 10 తినదగు కొవ్వు 145

69. సాల్వెంటు ఎక్స్ట్రాక్టెడ్ తినదగు పిండి తయారీ, నిల్వ అమ్మకముల షరతులు 102

భాగము — xvi

సెక్వెస్టరింగ్ మరియు బఫరింగ్ ఏజెంట్లు

(అమ్లములు, క్షారములు, లవణములు)

70. సెక్వెస్టరింగ్ ఏజంట్లు నిర్వచనము 102

71. బఫరింగ్ ఏజంట్లు నిర్వచనము 103

72. సెక్వెస్టరింగ్ మరియు బఫరింగ్ ఏజంట్ల వాడకంపై పరిమితులు 103

అనుబంధం — ఎ.

ఫారములు 105

అనుబంధం — బి

నిర్వచనములు మరియు నాణ్యత ప్రమాణములు

ఎ. 01 పానీయములు - ఆల్కహాలేతర 115

ఎ. 02 బేకింగ్ పౌడర్ 115

ఎ. 03 స్టార్చ్ ఆహారములు 116

ఎ. 04 ఇంగువ 117

ఎ. 05 సుగంధ ద్రవ్యములు 118

ఎ. 06 చిక్కుడు 136

ఎ. 07 తీపి చేయు పదార్థములు 137

ఎ. 08 కాఫీ 142

ఎ. 09 × × ×

ఎ. 10 తినదగు కొవ్వు 145

ఎ. 11 పాలు మరియు పాల ఉత్పత్తులు 148
ఎ. 12 మార్గరీన్ 169
ఎ. 13 × × ×
ఎ. 14 టీ 170
ఎ. 15 తినదగు ఉప్పు 173
ఎ. 16 ఫల ఉత్పత్తులు 176
ఎ. 17 తినదగు నూనెలు 183
ఎ. 18 ధాన్యాలు 193
ఎ. 19 వనస్పతి 211
ఎ. 20 వెనిగార్ 213
ఎ. 21 కాసు 214
ఎ. 22 జిలాటిన్ 214
ఎ. 23 × × ×
ఎ. 24 × × ×
ఎ. 25 తీపి పదార్థములు 215
ఎ. 26 ఆహార రంగులు 218
ఎ. 27 వెండి ఆకు 236
ఎ. 28 వేరుశనగ పప్పు 236
ఎ. 29 పానీయములు [ఆల్కాహాలిక్] 237
ఆంధ్ర ప్రదేశ్ ఆహార కల్తీ నివారణ నియమములు, 1957 239
కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ అధి సూచనలు — 264-I
అంశానుక్రమ సూచి 264-XVI



# ఆహారకల్తీ నివారణ చట్టము

# 1954

[1954 యొక్క 37వ చట్టము]

(29 సెప్టెంబరు 1954)

ఆహార కల్తీ నివారణ ఏర్పాటు చేయుట కొరకు ఒక చట్టము.

భారత రిపబ్లిక్ యొక్క 5వ సంవత్సరములో కేంద్ర శాసన మండలిచే ఈ క్రింది విధముగా శాసనము చేయడమైనది:—

## ప్రారంభిక

**1.** సంగ్రహ నామము, విస్తృతి మరియు ప్రారంభము:—

1) ఈ శాసనము ఆహార కల్తీ నివారణ చట్టము 1954 అని పిలువబడును.

2) ఇది భారత దేశమంతటికి వర్తించును,

3) ఇది రాజపత్రములో ప్రకటన ద్వారా కేంద్ర ప్రభుత్వము నిర్ణయించిన తేదీనుండి అమలులోనికి వచ్చును.

### వ్యాఖ్య

1. శాసన చరిత్ర

2. అమలు తేది

3. సవరణ చట్టములు

4. రాజ్యాంగ క్రమబద్ధత
5. శిక్షాస్మృతుల అన్వయము
6. సవరణ చట్టముల అన్వయము
7. ఈ చట్టము క్రింద బాధ్యత
8. అతి స్వల్ప అతిక్రమణ

1. శాసన చరిత్ర :-

ఆహారకల్తీ నిరోధక చట్టము 1954కు పూర్వము దేశములోని వివిధ రాష్ట్రములలో వేరు వేరు శాసనములు అమలులో ఉండినవి. 1937వ సంవత్సరములో కేంద్ర ఆహార సలహా సంస్థ నియమించిన కమిటీ దేశమంతటా వర్తించు ఒకే కేంద్ర శాసనము ఉండవలసిన ఆవశ్యకత గురించి వక్కాణించినది. 1950లో భారత సంవిధానములో 'ఆహార పదార్థముల కల్తీ' 'ఉభయ సామాన్య సూచి' (Concurrent list)లో చేర్చబడినందువలన కేంద్ర ప్రభుత్వమునకు ఈ విషయమై, శాసనము చేయ వీలుకలిగినది. 1952లో పార్లమెంటులో బిల్లు 101 ప్రవేశపెట్టగా బిల్లు సెలక్టు కమిటీకి నివేదించబడినది. సెలక్టు కమిటీ సమగ్రముగా చర్చించి సమర్పించిన నివేదిక 1953 ఫిబ్రవరి 19న భారత ప్రభుత్వ రాజపత్రములో ప్రకటించబడినది. 1954లో పార్లమెంటు ఈ చట్టము చేసినది.

2. అమలు తేది :—

ఈ చట్టమునకు 29-9-1954 న రాష్ట్రపతి ఆమోదము లభించినది. ఈ శాసనము 1-6-1955 న అమలులోనికి వచ్చినది.

3. సవరణ చట్టములు :-

ఈ చట్టమునకు ఇప్పటికి 4 సవరణలు జరిగినవి. ఆ సవరణలు ఏవి అనగా :—

1. ఆహారకల్తీ నివారణ సవరణ చట్టము 1964. ఇది 1-3-65 న అమలులోనికి వచ్చినది.

2. ఆహారకల్తీ నివారణ సవరణ చట్టము 1971. ఇది 26-1-72 న అమలులోనికి వచ్చినది.

3. ఆహారకల్తీ నివారణ సవరణ చట్టము 1972, ఇది 1-4-72 న అమలులోనికి వచ్చినది.

4. ఆహారకల్తీ నివారణ సవరణ చట్టము 1976. ఇది 1-4-76 న అమలులోనికి వచ్చినది.

1964 యొక్క 49 వ చట్టము, 1976 యొక్క 34 వ చట్టము ముఖ్యమైనవి. ఇందులో విస్తారమైన సవరణలు జరిగినవి.

**4. రాజ్యాంగ క్రమబద్ధత :-**

ఈ చట్టము రాజ్యాంగ పరముగా చెల్లును అని సుప్రీంకోర్టు నిర్ణయించెను.

ఎ. కె. గోపాలన్ Vs స్టేట్ ఆఫ్ మద్రాసు
ఎ. ఐ. ఆర్. 1962 యస్. సి. 543

**5. శిక్షాస్మృతుల అన్వయము :-**

శిక్షాస్మృతిని అన్వయించు సందర్భములలో ముద్దాయికి లాభదాయకమైన అన్వయము చేయవలెను.

నెక్సారియా కాటన్ మిల్స్ Vs స్టేట్ ఆఫ్ బోంబే
ఎ. ఐ. ఆర్. 1953 యస్. సి. 273.

**6. సవరణ చట్టముల అన్వయము :-**

సవరణ చట్టము అమలులోనికి వచ్చిన తేదీనాటికి చట్టములో విధించిన శిక్షకు మాత్రమే ముద్దాయి బాధ్యుడు. సవరణ చట్టములో శిక్ష ఎక్కువ చేసిన యెడల తీర్పు తేదీ నాటికి సవరణ చట్టము అమలులోనికి వచ్చినంత మాత్రమున యెక్కువ శిక్ష విధించరాదు. ఒకవేళ సవరణ చట్టములో శిక్ష తగ్గించబడిన యెడల నేరస్తునకు ఆ లాభము కలుగ చేయవలెను.

నాని గోపాల్ Vs స్టేట్ ఆఫ్ బీహార్
ఎ. ఐ. ఆర్. 1970 యస్. సి. 1936

సవరణ చట్టములు గత తేదీనుండి అమలు చేయవలెనన్నచో శాసనములో భాష స్పష్టముగా ఉండవలెను. కార్య నిర్వహణ విధానము (Procedure) నకు చేయబడిన సవరణలు గత తేదీనుండి అమలు చేయవచ్చును.

ఢిల్లీ క్లాత్ అండ్ జనరల్ మిల్స్ Vs ఇన్‌కమ్ టాక్సు కమీషనర్
ఎ. ఐ. ఆర్, 1927 పి. సి. 242

7. ఈ చట్టము క్రింద బాధ్యత :-

సాధారణముగా ప్రతి నేరమునకు "మెన్స్‌రియా" (Mensrea) అనగా నేరము చేయవలెననే మానసిక స్థితి అత్యంత ప్రాధమిక భాగము. కాని కొన్ని చిన్న చిన్న నేరములకు అట్టి 'అపరాధ చింత' లేకుండగనే శిక్షించడము జరుగును. అటులనే ఆర్థిక నేరములు, ఆహారకల్తీ నేరములకు కూడ అపరాధ చింత లేక పోయినా నేరము చేసినట్లుగానే నిర్ధారించబడును. ఇది ప్రజా శ్రేయస్సు దృష్ట్యా చేసిన ముఖ్యమైన మార్పు. ఈ శాసనములోని సెక్షన్ 7 క్రింద అపరాధియొక్క బాధ్యత సంపూర్ణమైనది. (Absolute) సెక్షన్ 7, 16 ల క్రింద శిక్షించుటకు అపరాధ చింత నిరూపించనవసరములేదు.

మానవ జీవితానికి, ఆరోగ్యానికి, కల్తీ ఆహారముయొక్క అమ్మకము, పంపిణీ అత్యంత హానికరము. ఇవి అతి ప్రమాదకరమైన పనులు. అందువలన అమ్మకము, పంపిణీ, వగైరా - చర్యనుబట్టియే నేర నిర్ధారణ చేయవలెను. కల్తీ జరిగినదనే విషయము తెలియకపోవడము గాని, మంచి నమ్మికగాని ఆ చర్యను ప్రమాద రహితము చేయజాలవు. తెలిసి చేసినా, తెలియక చేసినా, ఆ చర్యవలన ప్రజలకు కలిగే హాని ఒకటే. అందువలన ఆహారవస్తువు నిర్ణీత ప్రమాణములలో ఉన్నదా, లేదా, కల్తీ జరిగినదా అనే విషయము తెలిసికొని అమ్మవలసిన బాధ్యత విక్రయదారునిపై యున్నది.

ప్యారీలాల్. కె. తేజాని Vs మహాదేవ రామచంద్ర డాంగే
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 228

"మెన్స్‌రియా" నిరూపణ కాకుండానే విక్రయదారు, అతని గుమాస్తా మరియు ఏజెంట్లు కూడా కల్తీ ఆహార విక్రయానికి శిక్షింపబడుదురు.

సర్జూ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ యు. పి.
ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 631

౭. అతిస్వల్ప అతిక్రమణ :-

నిర్ణీత ప్రమాణానికి ఎంత స్వల్పంగా వ్యత్యాసమున్నా ఈ చట్టము క్రింద బాధ్యత తప్పదు. ఐ. పి. సి. సె. 95 క్రింద మినహాయింపు లభించదు.

అమృత్‌సర్ మునిసిపల్ కమిటీ Vs అజారా సింగ్

ఎ. ఐ. ఆర్. 1978 యస్. సి. సి. 794

**2.** నిర్వచనములు :—

ఈ శాసనములో సందర్భమును బట్టి వేరు విధముగా కావలసి నప్పుడు తప్ప -

**1.** 'కల్తీ చేయు పదార్థము' :- అనగా కల్తీ చేయుటకు ఉపయోగించిన, ఉపయోగించతగు పదార్థము.

వ్యాఖ్య

ఈ పదము ఈ చట్టములో మొట్టమొదటిసారిగా 1976 సవరణ చట్టముద్వారా ప్రవేశపెట్టబడినది. కేవలము కల్తీ చేయడానికి పనికివచ్చే పదార్థాలు, తయారుచేసే ఫ్యాక్టరీలు, అమ్మే వ్యాపారులు ఉద్భవించడంతో అటువంటి పదార్థాల తయారీ, అమ్మకము, పంపిణీ, బహిష్కరించుటకు శాసనము చేయవలసిన అవసరము గమనించి శాసనమండలి చట్టములో కొన్ని సవరణలు చేసినది. అందువలన ఈ పదానికి కూడా నిర్వచనము ఇవ్వబడినది.

ఈ పదము సెక్షన్ 7 (vi), 10, 11, 16 (1) (బి), 16 (i ఎ) (ii) మొదలయిన సెక్షనులలో వచ్చును.

సాధారణంగా ఆహారవస్తువులలో కల్తీ చేయడానికి ఉపయోగించే పదార్థాలు - ఇసుక, రాళ్ళు, సుద్ద, సున్నము, స్టార్చ్, తవుడు, రంపపుపొట్టు, ఆకులు, బెరడు, వగైరా.

**2** (1 ఎ) 'కల్తీ చేయబడిన' :—

ఎ) విక్రయించబడిన వస్తువు, కొనుగోలుదారు కోరిన స్వభావము, పదార్థము, నాణ్యత లేనిదియు, కొనుగోలుదారుకు నష్టదాయకము అయినదియు, లేక తెలియపరచిన లేక ప్రకటించబడిన స్వభావము, పదార్థము, నాణ్యత లేనిది అయిన యెడల,

బి) స్వభావము, పదార్థము, నాణ్యతకు హాని కలుగచేయు ఇతర పదార్థము అందులో కలిగియున్నచో లేక తయారీ విధానములో హాని కలుగునట్లు తయారీ చేసినదయిన యెడల,

సి) స్వభావము, పదార్థము, నాణ్యత చెడునట్లుగా కొంతగా గాని, పూర్తిగా గాని తక్కువ నాణ్యతగల లేక చవక రకమైన పదార్థము వస్తువులో ప్రత్యామ్నాయము చేసిన ఎడల,

డి) స్వభావము, పదార్థము, లేక నాణ్యత చెడునట్లుగా వస్తువు యొక్క ఏదేని అంతర్గత భాగ పదార్థమును పూర్తిగా గాని, కొంతగాని తీసివేసిన యెడల,

ఇ) వస్తువు అపరిశుద్ధ పరిస్థితులలో తయారీ, ప్యాకింగ్ లేక నిల్వ చేసినందువలన అట్టి వస్తువు కలుషితమై, ఆరోగ్యమునకు హాని కలిగించు నట్టిదైన యెడల,

ఎఫ్) వస్తువు పూర్తిగాగాని, కొంతగాని, అశుద్ధమైన, కుళ్ళిన, శిథిలమైన, లేక రోగ గ్రస్తమైన వృక్ష లేక జంతు పదార్థము కలిగియున్న లేక కీటకములతో నిండియున్న, లేక ఇతర కారణములవలన, మానవ భోజ్యము కాకున్న యెడల,

జి) వస్తువు చచ్చిన జంతువు నుండి సంపాదించినదయిన ఎడల,

హెచ్) వస్తువు విషపూరితమైన లేక ఆరోగ్య హాని కల్గించే ఏదేని భాగ పదార్థము కలిగియున్న ఎడల,

ఐ) వస్తువు యొక్క పాత్ర, పూర్తిగా గాని, కొంత భాగము గాని విషపూరితమైన లేక అపరిశుద్ధమైన పదార్థములతో

తయారు చేయబడి ఆరోగ్యమునకు హాని కలుగ జేయు నట్టిదైన యెడల,

జె) వస్తువు నిర్దేశించబడినవి కాక ఏదేని ఇతర రంగు పదార్థము కలిగి యున్నచో, లేక నిర్దేశించబడిన రంగులు, నిర్దేశించ బడిన వ్యత్యాస పరిమితులలో లేని యెడల,

కె). వస్తువు నిషేధించబడిన పరిరక్షక ద్రవ్యమును లేక అనుమతించబడిన పరిరక్షక ద్రవ్యము నిర్ణయించబడిన పరిమితులు దాటి కల్గియున్న యెడల,

యల్) వస్తువు యొక్క నాణ్యత, శుద్ధత, నిర్దేశించబడిన ప్రమాణ ములకు తక్కువ అయిన, లేక అందులోని భాగ పదార్థ ములు నిర్దేశింపబడిన వ్యత్యాస పరిమితులకు లోబడి యుండక, ఆరోగ్యమునకు హాని కల్గించునట్టిదైన యెడల,

యమ్) వస్తువు యొక్క నాణ్యత, శుద్ధత నిర్దేశించబడిన ప్రమాణ ములకు తక్కువ అయిన లేక అందులోని భాగ పదార్థ ములు నిర్దేశించబడిన వ్యత్యాస పరిమితులలో లేకుండి, కాని ఆరోగ్యమునకు హాని కల్గించని యెడల,

ఆహార పదార్థము కల్తీ చేయబడినదిగా పరిగణించవలెను.

అయితే పూర్తిగా స్వాభావికమైన, మరియు మానవ నియంత్ర ణకు లోబడని పరిస్థితులవలన ఏదేని ప్రాథమిక ఆహారము యొక్క నాణ్యత, శుద్ధత నిర్దేశించబడిన పరిమాణములకు తక్కువ అయినచో, లేక అంతర్గత భావపదార్థములు నిర్దేశించబడిన వ్యత్యాస పరిమితు లను దాటిన యెడల, ఆ పదార్థముపై ఉపఖండము యొక్క అర్థములో కల్తీ చేయబడినట్లు పరిగణించరాదు,

**వివరణ :-**

రెండుగాని, ఎక్కువగాని ప్రాథమిక ఆహార పదార్థములు కలుపగా తయారైన మిశ్రమ ఆహార పదార్థము -

ఏ) అంతర్గత భాగ పదార్థములు తెలియునట్టి పేరుతో నిల్వ అమ్మకము, పంపిణీ చేసినచో, మరియు

బి) ఆహారమునకు హాని కల్గించనిది అయినచో -
అట్టి మిశ్రమము ఈ ఖండము యొక్క అర్థములో కల్తీ చేయబడినదిగా పరిగణించరాదు.

## వ్యాఖ్య

1. చరిత్ర
2. సె. **2** (1ఏ) (ఏ)
3. ,, ,, (బి)
4. ,, ,, (సి)
5. ,, ,, (డి)
6. ,, ,, (ఇ)
7. ,, ,, (యఫ్)
8. ,, ,, (జి)
9. ,, ,, (కె)
10. అంతర్జాతీయ ప్రమాణములు
11. భారతదేశ ప్రమాణములు
12 నిర్ణయించబడిన ప్రమాణముల నుండి మార్పు

13. ప్రమాణములు నిర్ణయించనిచో

14. ఉపఖండములు (యల్) మరియు (యమ్)ల తేడా

15. ప్రతి కల్పన

1. చరిత్ర :-

1954 శాసనములో ఇది సె. 2 (1) (ఎ). 54వ చట్టంలోని సె. 2 లో క్లాజ్ (జె) క్లాజ్ (యల్) లు, 1976 సవరణ చట్టము ద్వారా మార్పుచేయబడినవి.

"కల్తీ చేయబడిన" అను పదముయొక్క నిర్వచనము ఇప్పుడు 13 క్లాజ్ లలో వివరముగా చెప్పబడినది. సె. 16 లో కల్తీ ఆహార వస్తువు, సె. 2 లోని ఏ ఖండములోని నిర్వచనము క్రిందకు వచ్చునో దానినిబట్టి శిక్ష చెప్పబడినది. అందువలన ఆహార వస్తువు సె. 2 లోని ఏ ఖండము ప్రకారము కల్తీ పదార్థముగా నిర్ణయించబడినది న్యాయస్థానము విశదీకరించవలెను.

2. సె. 2 (1ఎ) (ఎ) :-

ఈ ఉప ఖండము 3 భాగములు కలిగియున్నది. మొదటి భాగము - కొనుగోలుదారు కోరిన పదార్థము, స్వభావము, నాణ్యత లేనిదియు. కొనుగోలుదారునకు నష్టదాయకమైనట్టిదియు అయిన ఆహార విక్రయమునకు సంబంధించినది. 2 వ భాగము తెలుపబడిన పదార్థము, స్వభావము, నాణ్యత లేనిదియు అయిన ఆహార విక్రయమునకును, 3 వ భాగము ప్రకటించబడిన పదార్థము, స్వభావము, నాణ్యతలేని ఆహారమునకు సంబంధించినవి అనగా మొదటి భాగము కొనుగోలుదారు కోరిన స్వభావము, పదార్థము, నాణ్యతలకు సంబంధించినది, 2, 3, భాగములు విక్రయదారు తెలియపరచిన, ప్రకటించిన స్వభావము,పదార్థము, నాణ్యతలకు సంబంధించినవి.

కోరిన పదార్థము, స్వభావము, నాణ్యత :-

కొనుగోలుదారు కోరిన స్వభావము గల పదార్థము ఉండవలెనని శాసనముయొక్క ఉద్దేశ్యము.

ఎ. ఐ. ఆర్. 1954 బొంబే 306.

విక్రయించిన ఆహార వస్తువు కొనుగోలుదారు కోరిన స్వభావము, పదార్థము, నాణ్యత లేనిదైనను, విక్రయదారు ప్రకటించిన, స్వభావము, పదార్థము, నాణ్యత లేనిదైననూ, సె. 2 (1ఎ) (ఎ) ప్రకారము కల్తీ ఆహారమగును. కొనుగోలుదారు యొక్క ఆరోగ్యమునకు హాని కలిగించనవసరములేదు.

పి. పి. Vs కనుమర్ల పూడి రామలింగయ్య
ఎ. ఐ. ఆర్. 1969 ఎ. సి. 445

క్లాజ్ (ఎ) లోని 'నష్టదాయకము' పదము విస్తారమయిన అర్థము కలిగి యున్నది. ఈ పదమునకు కొనుగోలుదారు యొక్క ఆరోగ్యమునకు హాని కలిగించుట అని పరిమితమైన అర్థము మాత్రమే కాదు. అట్టి కొనుగోలువలన ధన నష్టము కలిగిననూ ఈ క్లాజు వర్తించును.

పి. పి. Vs ఎ. వి. గోపాల్.
1976 ఎ. యెల్. టి. 665

ప్రకటించబడిన, తెలుపబడిన వెన్నకాచిన నేతితో కాకుండా ఇతరమయిన నేతితో తయారుచేసిన జిలేబీ అమ్మిన విక్రయదారు ఈ విభాగము క్రింద కల్తీ ఆహారము అమ్మినవాడగును.

పి. పి. Vs పరమేశ్వర అయ్యర్
ఎ. ఐ. ఆర్ 1947 మద్రాసు 428.

(ఇదే విధమైన సబ్ క్లాజ్ కలిగిన మద్రాసు ఆహార కల్తీ నిరోధక చట్టము క్రింది తీర్పు)

చికోరి కలిగిన కాఫీ పౌడరు, అమ్ముట నేరము కాదు. కాని అదిపరిశుద్ధమైన కాఫీ అని చెప్పి అమ్మినప్పుడు, కొనుగోలుదారు పరిశుద్ధమైన కాఫీ కోరినప్పుడు చికోరీ కల్పిన కాఫీ పొడి అమ్మకమునకు ఈ సెక్షను వర్తించును.

ఆగస్టీన్ Vs స్టేట్ ఆఫ్ కేరళ
1973 యఫ్. ఎ, సి. 347.

3. సె. 2 (1ఎ) (బి) :-

కాఫీ పొడిలో ఈతగింజల పొడి కలిపి అమ్మిన అది కల్తీ ఆహారము.

పి. పి. Vs పార్థసారథి అయ్యంగార్

1955 (1) యం. యల్. జె. 306.

తేయాకులో పీచు అన్యపదార్థము కాదు. అందువలన పీచు కలిగియున్న తేయాకునకు ఈ విభాగము వర్తించదు.

గోపాల్‌పూర్ టీ కంపెనీ Vs కలకత్తా కార్పోరేషన్

ఎ. ఐ. ఆర్. 1966 కలకత్తా 51

4. సె. 2 (1ఎ) (సి) :-

70 శాతం నువ్వుల నూనెలో 30 శాతం కొబ్బరినూనె కలిపి కొబ్బరినూనెగా అమ్మినచో ఈ విభాగము వర్తించును.

పి. పి. Vs నాగళ్ళ శేషగిరిరావు

ఎ. ఐ. ఆర్. 1949 మద్రాసు 155

5. సె. 2 (1ఎ) (డి) :-

సాధారణముగా కల్తీ చేయుట అనగా ఏదో ఒక అన్య పదార్థము కలుపుట అని భావన. ఆహారములోని ఒక భాగ పదార్థము తీసివేసినప్పుడు కూడ ఈ విభాగము ప్రకారము ఆహారము కల్తీ చేయబడినదిగా పరిగణించబడును. అయితే ఒక అంశము తీసివేసినంత మాత్రమున అది కల్తీ ఆహారము అవదు. అటుల తీసివేసినందువలన ఆహారము యొక్క పదార్థము, స్వభావము, నాణ్యత చెడినప్పుడే ఈ భాగము వర్తించును.

6. సె. 2 (1ఎ) (ఇ) :-

అపరిశుద్ధ పరిస్థితులలో తయారుచేసిన, సీలు చేసిన, ప్యాక్ చేసిన, బ్యాక్టీరియా, ఫంగస్ వంటి వానివలన ఆహారము చెడి ఆరోగ్యమునకు హాని కలుగును. ఎలుకలు, బొద్దింకలు, తిరుగు ప్రదేశములలో నిల్వచేసిన ఆహారము కలుషితమే యగును.

ఆహార కల్తీ నివారణ నియమావళి 1955 లోని 49 వ నియమము ఈ సందర్భములలో చూడతగును.

7. సె. 2 (1ఎ) (యఫ్) ఆహారము :—

1. పూర్తిగా గాని, కొంతగా గాని అశుద్ధమైన, కుళ్ళిన, శిథిలమైన లేక రోగగ్రస్తమైన వృక్ష లేక జంతు పదార్థము కల్గియున్నచో, లేక

2. కీటకములతో నిండియున్నచో లేక,

3. ఇంకా యితర కారణములవలన - మానవ భోజనమునకయోగ్యమైనచో ఈ భాగము వర్తించును.

'మానవ భోజనమునకు అయోగ్యమైనచో' అను పదజాలము ఈ ఉపఖండము లోని అన్ని భాగములకు వర్తించును. ఏ భాగము క్రిందనయిననూ, 'మానవ భోజనమునకయోగ్యత' నిరూపించవలెను. ఈ విభాగములోని అన్ని విశేషణములు ఉదాహరణలు సంపూర్ణమైనవి కావు. కీటకములు కల్గియున్న ఆహార వస్తువులు భోజనమునకు అయోగ్యమయేటంతగా కీటకములతో నిండియున్నదా అనునది ఆయా కేసునుబట్టి నిశ్చయించవలసిన విషయము. ఆహారము యొక్క శాంపిల్‌ను పరీక్ష చేసిన ప్రభుత్వ నిపుణుల యొక్క నివేదిక పరిగణించవలసిన సాక్ష్యము.

ఢిల్లీ మునిసిపల్ కార్పొరేషన్ Vs కాచర్‌మల్

1976 యస్. సి. సి. 412.

అయితే సుప్రీం కోర్టు తరువాతి తీర్పులో ఈ అభిప్రాయంతో ఏకీభవించలేదు.

ఇంకా ఇతర కారణములవలన 'మానవ భోజనమునకయోగ్యము' అను పద జాలము ముందటి భాగములలో కలిపి చదువరాదు. ఈ భాగము పూర్తిగా ప్రత్యేక తరగతికి చెందిన ఆహార వస్తువులకు వర్తించును. ఈ భాగము, అవశిష్ట ఖండము, ముందటి భాగములో చెప్పబడిన ఆహార వస్తువులకు వర్తించదు. ఆహారవస్తువు, అపరిశుద్ధమైన, కుళ్ళిన, రోగగ్రస్తమైన, శిథిలమైన లేక కీటకములతో నిండియున్న పదార్థము అయితే, క్లాజు (యఫ్) క్రింద కల్తీ ఆహారమే. అట్టి పదార్థములు మానవ భోజనమునకయోగ్యము అని నిరూపించనక్కరలేదు, అని సుప్రీంకోర్టు తీర్పుయిచ్చెను.

మునిసిపల్ కార్పొరేషన్ ఢిల్లీ Vs టేక్‌చంద్ భాటియా

ఎ. ఐ. ఆర్. 1980 యస్. సి. 360.

1980 క్రి.లా.జ. 316

రెండు తీర్పులు గూడ ఇద్దరు న్యాయమూర్తులుగల ధర్మాసనము నిర్ణయించినవే.

సుప్రీం కోర్టులో మరల ఈ ప్రశ్న, స్టేట్ Vs పూరాన్‌మల్ ఎ. ఐ. ఆర్. 1985, యస్. సి. 741 లో ఇద్దరు న్యాయమూర్తుల ధర్మాసనం ముందు తలెత్తగా జస్టిస్ వరదరాజన్ రెండు తీర్పులలోని భిన్నాభిప్రాయములనుదహరించి, రెండు తీర్పులలో ఏది సరియైనది నిర్ణయించకుండా వదలివేసెను. జస్టిస్ రంగనాధమిశ్రా అటువంటి సందర్భములలో పదార్థము మానవ భోజ్యముకాదు అని నిరూపించనవసరములేదు అనే 'ఉక్ చంద్ కేసులోని' నిర్ణయం "సరియైన ప్రతిపాదన" అని తీర్పు చెప్పెను.

ఈ వివాదము అపరిష్కృతముగా ఉన్నట్లే, రెండు రకముల తీర్పులు క్రింద ఉదహరించబడినవి.

ఆహార వస్తువుయొక్క 'నాణ్యత' తో ప్రమేయం లేకుండా పబ్లిక్ ఎనలిస్టు నివేదికలో బ్రతికియున్న క్రిములున్నవని వ్రాసెను. అది ఈ క్లాజు ప్రకారం కల్తీ ఆహారమగును.

మునిసిపల్ కమిటీ ఢిల్లీ Vs రామస్వరూప్

ఎ. ఐ, ఆర్. 1980 యస్ సి. 174

శనగపిండి కీటకములతో నిండి మానవ భోజనమునకు అయోగ్యమయినదిగా యుండెను. కాబట్టి అదీ కల్తీ ఆహారమే.

మునిసిపల్ కార్పొరేషన్ ఢిల్లీ Vs మన్‌మోహన్‌లాల్.

1983 యస్. సి. 506

1983 క్రి. లా. జ 855

జీడిపప్పు 6.9 శాతం క్రిములతో నిండియుండెను. అది కల్తీ ఆహారమే.

ఎ. ఐ. ఆర్. 1982 యస్. సి. 1095

చింతపండులో 7.7 శాతం క్రిములతో నిండియుండెను. ఎనలిస్టు రిపోర్టులో ఆరోగ్యమునకు హాని కల్గునని వ్రాయలేదు. ముద్దాయి విమోచనార్హుడు.

1982 క్రి. లా. జ. 1370

శాంపిల్‌లో ఒక జీవించియున్న పురుగు, ఎలుక మలము ఇతర పదార్థము 0.2% కల్గియున్నచో (ప్రమాణము 5% మాత్రమే అయి వుండగా) ఆహారం కల్తీ ఆహారం అగును.

1984 క్రి. లా. జ. 690 (పంజాబ్)

200 గ్రాముల ఆహారంలో, చచ్చినవి, బ్రతికినవి కలిపి 50 క్రిములుండగ అది కల్తీ ఆహారం.

1983 క్రి. లా. జ. 900 (హిమాచల్ ప్రదేశ్)

'క్రిములతో నిండియున్న' అనగా చాల ఎక్కువ క్రిములతో గూడిన అని అర్థము.

1972 యఫ్. ఎ. సి. 739
1983 క్రి. లా. జ. 1933 (ఢిల్లీ.)

పై తీర్పులలో పురుగులకు కీటకములకు గూడ ఒకే పదము ఉపయోగించ బడెను.

పురుగులు, కీటకములు–

కొన్ని తీర్పులలో పురుగులకు కీటకములకు తేడా చూపబడెను.

నర్కుల్‌దంగా రోలర్ ఫ్లోర్ మిల్స్ Vs కలకత్తా కార్పొరేషన్

ఎ. ఐ. ఆర్. 1970 కలకత్తా 333

స్టేట్ 'ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్' Vs పురాన్‌మల్.

ఎ. ఐ. ఆర్. 1985 యస్. సి. 741.

ఎఱ్ఱ మిర్చితో శాంపిల్‌లో 9 మీల్ పురుగులు (Meal Worms) ఉండెను. పబ్లిక్ ఎనలిస్టు 'క్రిములతో నిండియుండినదని' గాని 'మానవ భోజ్యముకాదని' గాని చెప్పలేదు. ఆహారము కల్తీ అని వేరే సాక్ష్యములేదు, ముద్దాయి సె. 7, 16 ల క్రింద నేరము చేయలేదు.

స్టేట్ Vs పురానమల్.

ఎ. ఐ. ఆర్. 1985 యస్. సి. 741

1985 క్రి. లా. జ. 921.

8 సె. 2. (1. ఎ) (జె)

1955 శాసనములో ఈ ఉపఖండములోని రెండు భాగముల మధ్య 'మరియు' అన్న పదము యుండెను. అందువలన సెక్షన్ అర్థములో భేదము వచ్చినందువలన సుప్రీంకోర్టు ఆ పదమును 'లేక' అను పదముగా చదువుకొనవలెనని తీర్పు ఇచ్చినది. తదుపరి సెక్షన్ తగు విధముగా సవరణ చేయబడినది. కాబట్టి ఈ అంశము పై పాత తీర్పులు చదవ నవసరములేదు.

ఆహార కల్తీ నివారణ నిమాయవళి 1955 లోని 23 నుండి 31 వరకు గల నియమములు రంగులకు సంబంధించియున్నవి. ఈ నియమములలో ప్రత్యేకముగా అనుమతించబడిన రంగులు తప్ప మిగిలిన రంగులన్ని ఆహార వస్తువులలో నిషేధింప బడినవి. (రూల్ 23). 25 వ రూలులో ఆహారములలో ఉపయోగించుటకు అనుమతించబడిన రంగులు చెప్పబడినవి. రూలు 28 లో వాడతగిన కోల్‌టార్ రంగు పదార్థములు చెప్పబడినవి. రూల్ 29 లో ఉదహరించబడిన ఆహార వస్తువులలో తప్ప సదరు రంగు పదార్థములు ఇతర ఆహార వస్తువులలో ఉపయోగించుట నిషేధింపబడినది. రూలు 30 లో అవి యెంత పరిమాణములో వాడవచ్చునో చెప్పబడినది. ఆ రంగులు శుద్ధముగను, హాని కలుగచేయనివిగాను, ఉండవలెను. (రూలు 31) 24 వ రూలు ప్రకారము రంగులు కలిపినపుడు ఆహార వస్తువు యొక్క ప్యాకేజి పైన 'కృత్రిమ రంగు వేయబడినది' అని లేబిల్ ఉండవలెను.

పప్పులో 'మెటానిల్ పసుపు' రంగు కలిపినపుడు ఈ సెక్షను వర్తించును.

ఫుడ్ ఇన్‌స్పెక్టర్ Vs పూరి మునిసిపాలిటి

1966 క్రి. లా. జ. 333

పబ్లిక్ ఎనలిస్ట్ 'ఆహారములోని రంగు 26, 28, 30 నియమములలో అనుమతించబడిన రంగు కాదు'; అని అభిప్రాయపడిన చాలు, ఉపయోగించబడిన రంగు ఏమిటి అనేది, ఎంత ఉన్నది అనేది చెప్పనక్కరలేదు,

ఎ. నర్సప్ప Vs ఫుడ్ ఇన్‌స్పెక్టర్ రాయచూరు మున్సిపాలిటి

1973 క్రి. లా. జ. 723.

పురాన్‌మల్ Vs స్టేట్

1973 యఫ్. ఎ. సి. 47

9. సె. 2. (1ఎ) (కె)

"పరిరక్షక ద్రవ్యము అనగా పులియుట, ఆమ్లీకరణ మరియు ఇతర విధముగా ఆహార వస్తువు చెడుటను ఆటంకపరుచు లేక ఆ వేగమును తగ్గించు లేక నిలుపుచేయు పదార్థము. ఈ సందర్భములో ఆహార కల్తీ నిరోధక నియమావళి 1955, 52 నుండి56 నియమములు చదువవలెను. 53వ నియమము ఈ పరిరక్షక ద్రవ్యములను వర్గీకరించినది. 54వ నియమము ఒక వర్గమునకు చెందిన పరిరక్షక ద్రవ్యములను ఒకటికంటె యెక్కువ వాడుట నిషేధించినది. 55వ నియమములో కొన్ని ఆహార వస్తువులలో ఉపయోగించదగిన పరిరక్షక ద్రవ్యములను యెంత మోతాదులో వాడవచ్చునో చెప్పబడినది. 55(ఎ)వ నియమములో మిశ్రమ ఆహారములలో రెండవ తరగతి పరిరక్షక ద్రవ్యముల వాడకము గురించి చెప్పబడినది. 56వ నియమము ప్రకారము పరిరక్షక ద్రవ్యము వాడబడిన ఆహార వస్తువు లేబిల్ పైన 'పరిశుద్ధమైనది' అని వాడరాదు.

10. అంతర్జాతీయ ప్రమాణములు :—

ఆహార ప్రమాణములపై ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యములో పనిచేయుచున్న అంతర్జాతీయ సంస్థ, 'కోడెక్సు ఆలీ మెంటారిస్' అనే పేరుతో ప్రపంచములో వాడకములో ఉన్న ముఖ్యమైన ఆహార వస్తువులకు ఒక ప్రమాణ సూచిక తయారు చేసినది.

11. భారతదేశ ప్రమాణములు:—

ఈ అంతర్జాతీయ సంస్థ తయారుచేసిన కోడెక్సు ఆలీమెంటారిస్ ఆధారంగా మన దేశ పరిస్థితులకు అనుగుణంగా కొద్ది మార్పులతో భారత ఆహార వస్తువుల ప్రమాణములు తయారుచేయబడినవి.

ఇండియాలో అమలులో ఉన్న కొన్ని ప్రమాణములు

| | | |
|---|---|---|
| పి. యఫ్. ఎ. ప్రమాణములు | పి. యఫ్. ఎ. రూల్స్ | 1955 ప్రకారము |
| యఫ్. పి. జి. ప్రమాణములు | ఫ్రూట్స్ ప్రాడక్ట్స్ ఆర్డరు | 1946 ప్రకారము |
| అగ్ మార్క్ ప్రమాణములు | జి. యం. ఎ. పి. చట్టము | 1937 ప్రకారము |
| ఐ. యస్. ఐ. ప్రమాణములు | ఐ. ఎస్. ఐ. సర్టిఫికేషన్ మార్క్స్ చట్టము | 1952 ప్రకారము. |

మాత్రమే అని అమ్మినప్పటికీ అది నేరమే అని మద్రాసు హైకోర్టు తీర్పు ఇచ్చినది. (ఎ. ఐ. ఆర్. 1965 మద్రాసు 98).

కలకత్తా, అలహాబాద్ హైకోర్టులు వ్యతిరేకాభిప్రాయము వెలిబుచ్చినవి. ఆం. ప్ర. హైకోర్టు కూడా మొదటలో చట్టము వర్తించదని అభిప్రాయపడినా (1971(1) ఆం. ప్ర. రి, 261), తరువాత తీర్పులో అట్లు ప్రకటించి అమ్మిన నేరమేనని తీర్మానించినది.

పి. పి. Vs రామచంద్రరాజు
1976 ఎ. యల్. టి. 68 (యన్. ఆర్. సి)

సుప్రీంకోర్టు, మద్రాసు, బొంబాయి, ఆం. ప్ర. తీర్పులను సరి అయినవి అని నిశ్చయించినది. అనగా అమ్మినది, ఆహార వస్తువు అయినచో అమ్మకము జరిగినది అన్నది యే ముఖ్యము, మానవ ఆహారముగా అమ్మినాడా, ఇతర ఉపయోగముల కొరకు అమ్మినాడా అనే విషయము అనవసరము. 'ఆహారమునకు కాదు' అని ప్రకటించిన కల్తీ ఆహారపు అమ్మకము శిక్షార్హము.

స్టేట్ ఆఫ్ తమిళనాడు Vs ఆర్. కృష్ణమూర్తి
ఎ. ఐ. ఆర్ 1980 యస్. సి. 538.

3. విశ్లేషణము కొరకు అమ్ముట:-

ఫుడ్ ఇన్స్పెక్టర్ విశ్లేషణము కొరకు శాంపిలు తీసికొనినప్పుడు- ఈ క్లాజ్‌లో ఇవ్వబడిన ప్రత్యేక నిర్వచనము దృష్ట్యా అది అమ్మకమే అని సుప్రీంకోర్టు తీర్పు చెప్పినది.

సర్జూ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ యు. పి.
ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 631
యం. వి. జోషి Vs యం. యు. సింపి
ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 1494

ఇదే విషయము మరల, మరల చర్చకు రాగా సుప్రీంకోర్టు అదే అభిప్రాయమును ధృవీకరించినది.

ఫుడ్ ఇన్స్పెక్టర్ Vs గోపాలన్
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 1725

మహ్మద్ యామిన్ Vs స్టేట్ ఆఫ్ యు. పి.
(ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 1304)
ఓంప్రకాష్ Vs ఢిల్లీ ఎడ్మినిస్ట్రేషన్
ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 195
స్టేట్ Vs ఆర్. కృష్ణమూర్తి
ఏ. .ఐ ఆర్ 1980 యస్. పి .538

4. వెల :-

ఫుడ్ ఇన్స్పెక్టర్ ఒక వ్యక్తి స్వాధీనములోని ఆహార వస్తువు యొక్క శాంపిలు తీసుకొని దాని వెల ఇచ్చినప్పుడు ఆ వ్యక్తి వెల తీసుకొనుటకు నిరాకరించిన ఎడల అమ్మకము జరగలేదు అని ఆం. ప్ర. హైకోర్టు తీర్పు.

పి. పి. Vs కూసనపూడి నరసింహరాజు
1968 క్రి. లా. జ. 247.

ఫుడ్ ఇన్స్పెక్టర్ పాలు తీసుకొని పోవుచున్న వ్యక్తిని శాంపిలు అడుగగా ఆ వ్యక్తి సీసాలలో పాలు పోస్తూ పారిపోయెను. అందువలన ఫుడ్ ఇన్స్పెక్టర్ పాల యొక్క ధర ఇవ్వలేకపోయెను. కాని ఆ వ్యక్తి అమ్ముటకు ఒప్పుకొని సీసాలలో పాలు పోసినాడు. కాబట్టి అమ్మకము జరిగింది.

పి. పి. Vs భరతం పాపారావు
1968 క్రి. లా. జ. 278.

5. స్వంత ఉపయోగము :-

స్వంత ఉపయోగానికి ఆహార వస్తువు తీసుకొని పోవుచున్నప్పుడు ఫుడ్ ఇన్స్పెక్టర్ శాంపిల్ తీసుకొన్న సందర్భములో అది అమ్మకము అగునా కాదా ? "నేను పాల వ్యాపారిని కాదు. అమ్మకానికి తీసుకొని వెళ్ళడంలేదు. మా ఇంటిలో మా బంధువుల కొరకు తీసుకొనిపోవుచున్నాను." అని వాదించినపుడు అది నిరూపించుకొనే భారము ఆ వ్యక్తి పైన ఉన్నది. నిరూపించుకొనలేకపోయినచో, శాంపిల్ పరీక్షలలో కల్తీ అని తేలినచో అది అమ్మకమే. ఆ అమ్మకము నేరమే.

పి. పి. Vs గొట్టిపాటి పిచ్చయ్య
1972 (2) ఆం. ప్ర. 424

తాను అమ్మడానికి తీసుకొనిపోవునపుడు ఫుడ్ ఇన్స్పెక్టర్ శాంపిల్ అడిగినచో దాని ధర తీసుకొనుటకు నిరాకరించవచ్చును, అట్టి సందర్భములో అమ్మకము లేదు.

ఎ. ఐ. ఆర్. 1966 అలహాబాద్ 231

2 (xiv) శాంపిల్ :-

అనగా ఈ శాసనము ప్రకారము లేక ఈ శాసనముక్రింద చేయ బడిన నిబంధనల ప్రకారము తీసుకొనిన ఆహార వస్తువుయొక్క మాదిరి.

వ్యాఖ్య

ఒక ప్రదేశములో ఆహారము నిల్వ చేసినపుడు వేర్వేరు సంచులు లేక పాత్రల నుండి శాంపిల్ తీసుకొనినపుడు ఒకసారి తీసుకొన్న, వేరు వేరు సందర్భాలలో తీసు కొన్న, ఒక సంచి లేక పాత్రనుండి వేర్వేరు శాంపిల్స్ వేర్వేరు సందర్భములలో తీసుకొన్న, ప్రతియొక్క శాంపిల్ తీసుకొనుట ఒక అమ్మకము అగును.

ఓం ప్రకాష్ Vs ఢిల్లీ ఎడ్మినిస్ట్రేషన్
ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 195

అమ్మకముదారు శాంపిల్ అని లేబుల్ వేసినంత మాత్రమున అది ఈ చట్టము క్రింద శాంపిల్ అవదు.

ఆహార కల్తీ నివారణ నియమావళి 1955 లో నియమములు 12, 14 నుండి 22, 22 (ఎ) 22 (బి) ఇందుకు సంబంధించినవి.

శాంపిల్ కొరకు ఏ ఆహారము ఎంత పరిమాణము తీసుకొనవలసినది రూలు 22 లో చెప్పబడినది. సీలు చేసిన సీసాలు లేక ప్యాకెట్లలో అమ్ముచున్నప్పుడు ఏ ఒక్క సీసా, ప్యాకెట్టులోని పరిమాణము శాంపిల్‌కు కావలసిన పరిమాణము కంటె తక్కువ అయినచో అట్టి సీసాలు, ప్యాకెట్లు ఒకటి కంటె ఎక్కువ శాంపిల్సుకు కావ లసిన పరిమాణము లభించు కొరకు తీసుకొనవచ్చును.

[రూలు 22 ఎ]

సుప్రీంకోర్టు ఒకప్పుడు, యనాలిసిస్ కొరకు పంపిన శాంపిల్ రూలు 22 లో నిర్దేశించబడిన పరిమాణముకంటె తక్కువ ఉన్నచో ముద్దాయి శిక్షార్హుడు కాదు అని

తీర్పు చెప్పినది. కాని (రజాల్‌దాస్ పన్నాని Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 189) కాని 3 సం॥ల తరువాత ఈ తీర్పు సరి అయినది కాదు అని సుప్రీంకోర్టు తీర్మానించింది. 'సెక్షను' రూలు 22 ల యొక్క ఉద్దేశ్యము శాంపిల్ కల్తీ ఆహారమగునా, కాదా నిర్ణయించుటకు పబ్లిక్ ఎనలిస్ట్ తన పరీక్ష కొరకు శాంపిల్ సరిపోవునా, లేదా అని చూచుకొనవలెను. తక్కువ పరిమాణము గల శాంపిల్ పంపినందువలన విశ్లేషణములో ఎటువంటి ఆటంకము, ఇబ్బంది కలుగ నిచో ముద్దాయిని ఆ కారణముపై నిర్దోషిగా ప్రకటించుట ప్రజారోగ్యమునకు ప్రమాదము అని సుప్రీంకోర్టు చెప్పినది.

స్టేట్ ఆఫ్ కేరళ Vs ఆలశ్శరి మహమ్మద్ వగైరా
ఎ. ఐ. ఆర్. 1978 యస్. సి. 933

1977 లో ప్రభుత్వము రూలు 22 (టి) చేర్చినది. ఈ రూలు ప్రకారము పబ్లిక్ ఎనలిస్ట్ గాని సెంట్రల్ ఫుడ్ లేబొరేటరీ డైరక్టరుగాని వ్యతిరేకముగా ఫిర్యాదు చేసినప్పుడుతప్ప పరీక్ష కొరకు పంపిన శాంపిల్ పరిమాణము సరిపోయినదని భావించవలెను.

సె. 2 (xv) :–

'అహితమైన' మరియు 'హానికరమైన' పదములు ఆహార వస్తువునకు సంబంధించి ఉపయోగించినపుడు వరుసగా పదార్థము ఆరోగ్యమునకు హానికరమని లేక మానవ ఉపయోగమునకు ప్రతికూలమైనదని అర్థము.

సెక్షన్ 2 ఎ అన్వయసూత్రము :–

ఈ చట్టములో జమ్మూ అండ్ కాశ్మీర్ రాష్ట్రములో అమలులోని ఏ చట్టము గురించి అయిన ప్రస్తావించిన ఎడల, ఆ రాష్ట్రమునకు సంబంధించినంతవరకూ, అక్కడ అమలులో ఉన్న తదనురూపమైన చట్టమునకు ప్రస్తావనగా భావించవలెను.

కేంద్ర ఆహార ప్రమాణముల కమిటీ మరియు కేంద్ర
ఆహార పరిశోధన శాల.

సెక్షను **3.** ఆహార ప్రమాణముల కేంద్ర కమిటీ: –

1. ఈ శాసనము అమలులోనికి వచ్చిన తరువాత సాధ్యమైనంత త్వరలో కేంద్ర ప్రభుత్వము ఈ చట్టము అమలు పరచుటకు

సంబంధించిన పరిపాలనా వ్యవహారములలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వ ములకు సలహా ఇచ్చుటకు మరియు శాసనము క్రింద నిర్ణయించిన ఉద్యోగ కృత్యములను నిర్వర్తించుటకు 'ఆహార ప్రమాణముల కేంద్ర కమిటీ' అనే పేరుతో ఒక కమిటీని నియమించవలెను.

2. ఆ కమిటీ ఈ క్రింది సభ్యులను కలిగి యుండవలెను—

ఎ. ఆరోగ్య సర్వీసుల డైరక్టరు జనరలు, ఎక్సఫిషియో ఛైర్మన్ అగును.

బి. కేంద్ర ఆహార పరిశోధన శాల యొక్క డైరక్టరు - ఒకటి కంటే ఎక్కువ పరిశోధనశాలలున్నచో అట్టి డైరక్టర్లు, ఎక్సఫిషియో,

సి. కేంద్ర ప్రభుత్వముచే నామినేటు చేయబడిన ఇద్దరు నిపుణులు,

డి. ఫుడ్ అండ్ అగ్రికల్చర్ మినిస్ట్రీలో, ఫుడ్ డిపార్టుమెంటు నుండి అగ్రికల్చర్ డిపార్టుమెంటు నుండి ఒక్కొక్క ప్రతినిధి మరియు కామర్స్, డిఫెన్స్, ఇండస్ట్రీ, సప్లై, రైల్వే మినిస్ట్రీలనుండి ఒక్కొక్క ప్రతినిధి,

ఇ. ప్రతి రాష్ట్రముచే నామినేటు చేయబడిన ప్రతినిధి,

యఫ్. యూనియన్ ప్రాంతముల ప్రతినిధులుగా కేంద్ర ప్రభుత్వముచే నామినేటు చేయబడిన ఇద్దరు ప్రతినిధులు,

జి. వ్యవసాయ, వాణిజ్య, పారిశ్రామిక రంగముల ప్రతినిధులుగా కేంద్రప్రభుత్వం నామినేటు చేసిన ఒక్కొక్క ప్రతినిధి,

జి. జి. హోటల్ పరిశ్రమ తరపున ఒక ప్రతినిధిని కలుపుకొని వినియోగదారులు అవసరములు చూచు ప్రతినిధులుగా

కేంద్ర ప్రభుత్వముచే నామినేటు చేయబడిన ఐదుగురు ప్రతినిధులు,

హెచ్. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చిచే నామినేటు చేయబడిన వైద్య వృత్తినుండి ప్రతినిధి,

ఐ. ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్స్టిట్యూషన్ (సర్టిఫికేషను మార్క్సు ఆక్టు 1952) లోని సెక్షను 2 క్లాజు (ఇ) లో ప్రస్తావించబడిన ఇండియన్ స్టాండర్డ్సు ఇనిస్టిట్యూషన్ యొక్క ప్రతినిధి.

3. రాజీనామా, మృత్యువు లేక ఇతర కారణములవలన ఖాళీ అయినప్పుడు తప్ప సె. 2 (సి) (డి) (ఇ) (యఫ్) (జి) (జిజి) (హెచ్) (ఐ) లో చెప్పబడిన సభ్యులు 3 సం. ల పదవిలో ఉందురు. తిరిగి నామినేట్ చేయబడుటకు అర్హులు.

4. కమిటీలో ఖాళీలు ఉన్నప్పటికీ కమిటీ తన బాధ్యతల నిర్వర్తించవచ్చును.

5. ఈ కమిటీ అవసరమైనన్ని సబ్ కమిటీలను నియమించవచ్చును. కమిటీలు ఏర్పరచిన నిబంధనలకు లోబడి కమిటీచే దత్తము చేయబడిన అధికారములు చెలాయించుటకు, బాధ్యతలు నిర్వర్తించుటకు కమిటీలో మెంబర్లనుగాని, ఇతరులను గాని, సబ్ కమిటీలో మెంబర్లుగా కమిటి నియమించవచ్చును.

6. కేంద్ర ప్రభుత్వము యొక్క పూర్వ అనుమతితో కమిటి తన యొక్క విధి నిర్వహణకు ప్రొసిజరును రెగ్యులేట్ చేసుకొనుటకు బైలాలు చేసుకొనవచ్చును.

## వ్యాఖ్య

మొదటి కమిటీ 1-6-1955 వ తేదీన 30 మంది మెంబర్లతో ఏర్పాటు అయినది. ఈ కమిటీ సలహా సంప్రదింపులతో కేంద్ర ప్రభుత్వము వివిధ ఆహార పదార్ధములకు ఆహార ప్రమాణములు నిర్ణయించి 12-9-1955 నోటిఫికేషన్ 2106 ద్వారా ఆహార కల్తీ నివారణ నియమావళి ప్రకటించినది.

సె. 3 (ఎ): సెక్రటరీ మరియు ఇతర ఉద్యోగుల నియామకము :-

కేంద్ర కమిటీ యొక్క అధికారమునకు లోబడి కమిటీ ఉత్తర్వుల ప్రకారము కమిటీ నిర్ణయించిన లేక దత్తము చేసిన అధికారములను, బాధ్యతలను నిర్వర్తించుటకు కేంద్ర ప్రభుత్వము ఈ కమిటీకి ఒక కార్యదర్శిని నియమించవలెను.

సె. 4 కేంద్ర ఆహార పరిశోధనశాల :-

1. కేంద్ర ప్రభుత్వము రాజపత్రములో ప్రకటన ద్వారా ఒకటి గాని అంతకంటె ఎక్కువగాని కేంద్ర ఆహార పరిశోధన శాలలు ఈ చట్టము క్రిందగాని, నిబంధనల క్రిందగాని ఒప్పగించబడిన కార్యములు నిర్వర్తించుటకు స్థాపించవలెను.

అయితే, ఏదేని పరిశోధన శాలను గాని, సంస్థనుగాని ఈ చట్టము అవసరములకొరకు కేంద్ర ఆహార పరిశోధన శాలగా రాజ పత్రములో ప్రకటన ద్వారా పేర్కొన వచ్చును.

2. కమిటీని సంప్రదించిన తరువాత కేంద్ర ప్రభుత్వము

ఎ. కేంద్ర ఆహార పరిశోధన శాలల యొక్క విధులు మరియు ఆ విధులు నిర్వహించు స్థానిక ప్రదేశము లేక ప్రదేశములు,

బి. ఆ పరిశోధన శాలకు ఆహార వస్తువుల మచ్చులు పరిశోధనకు పంపుటకు పద్ధతులు, పరిశోధన శాలల నివేదికల నమూనాలు, అట్టి నివేదికల కొరకు చెల్లించవలసిన రుసుము,

సి. పరిశోధనశాలలు తమ విధి వ్యవహారములు నిర్వహించుటకు అవసరమైనటువంటి, ఉచితమైనటువంటి ఇతర విషయములు నిర్దేశించుచూ నిబంధనలు చేయవచ్చును.

వ్యాఖ్య

యస్. ఆర్. ఓ. 1234 పి. యఫ్. ఎ. సె. 4./యఫ్ - 11-455/1-6-55 ద్వారా 110, చిత్తరంజన్ ఎవెన్యూ కలకత్తాలో మొదటి కేంద్ర ఆహార పరిశోధన శాల స్థాపించబడినది.

ఆహార కల్తీ నివారణ నియమావళి 5 వ సవరణ ద్వారా 1950 లో కేంద్ర పరిశోధనశాల మైసూరు, ఆం, ప్ర., కేరళ, మహారాష్ట్ర, తమిళనాడు, కేంద్రపాలిత ప్రాంతాలైన లక్ష ద్వీపములు, పాండిచ్చేరిలకు కేంద్ర ఆహార పరిశోధనశాలగా నిర్దేశించబడినది.

రుసుము :

ఆహార కల్తీ నివారణ నియమావళి 1955 నియమము 4, (6) ప్రకారము అట్టి సర్టిఫికేట్ కొరకు పరిశోధన చేయబడిన శాంపిల్ ఒక్కొక్కటికి చెల్లించవలసిన రుసుము రూ. 40. ఈ రుసుము ప్రభుత్వ ఖజానాలో "పబ్లిక్ హెల్త్" సెంట్రల్ హెడ్ క్రింద జమ చేయవలెను. ఈ సందర్భములో సదరు నియమావళిలో రెండవ భాగములో 3, 4 నియమములు చూడతగును.

పరిశోధనశాల డైరక్టరుకు ఫుడ్ ఇన్స్పెక్టర్ ఆహార శాంపిల్‌తోపాటు అనుబంధము - ఎ లోని ఫారమ్ 1 నమూనాలో ఒక మెమొరాండమ్ కూడా పంపవలెను. ఈ మెమొరాండమ్ యొక్క కాపి శాంపిల్ కవరుపై వేసిన సీలు యొక్క నమూనా వేరే రిజిష్టర్ పోస్టులో డైరక్టరుకు పంపవలెను. శాంపిల్ ప్యాకెట్ డైరెక్టరు స్వయముగా గాని లేక ఆ డైరెక్టరుచే ఇందుకొరకు లిఖితపూర్వకముగా నియోగించబడిన ఇతర ఉద్యోగికాని తెరుగవలెను. అతడు సీలుయొక్క స్థితిని రికార్డు చేయవలెను.

విశ్లేషణము చేసిన తరువాత డైరెక్టరు తన సర్టిఫికేటును అనుబంధము 'ఎ' లోని ఫారమ్ 2 లో వెంటనే పంపవలెను. అది డైరెక్టరు స్వయముగా సంతకము చేయవలెను.

రూలు 4 లోని సబ్ రూల్ (2), (3) తప్పక అనుసరించవలసినవి. ఇవి అతిక్రమించిన న్యాయ విచారణమునకు భంగము కలుగును.

స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర Vs సయ్యద్ అఖలాక్
1980 యఫ్. ఎ. సి. 145

శాంపిల్‌ను కేంద్ర పరిశోధన శాల డైరక్టరుకు పరీక్షకు పంపవలెనని దరఖాస్తు చేయుటకు ముందు రూల్ 4 (6)లో నిర్దేశించిన రుసుము జమ చేయవలసిన బాధ్యత ముద్దాయిపై ఉన్నది.

అసగర్ Vs స్టేట్
1980 యఫ్. ఎ. సి. 254

## ఆహారములకు సంబంధించి సాధారణ నిబంధనలు

### సెక్షను 5 :–

కొన్ని ఆహార పదార్థముల దిగుమతి నిషేధం,

i) కల్తీ ఆహారము,

ii) మిస్‌బ్రాండ్ చేసిన ఆహారము,

iii) దిగుమతి చేసుకొనుటకు లైసెన్సు నిర్దేశించబడిన ఆహారము అట్టి లైసెన్సు నిబంధనల ననుసరించి తప్ప, మరియు

iv) ఈ శాసనము యొక్క నిబంధనలు లేక, ఈ శాసనము క్రింద చేయబడిన నియమావళికి వ్యతిరేకముగా ఎట్టి ఆహార వస్తువులను ఏ వ్యక్తి అయిన ఇండియాలోనికి దిగుమతి చేయరాదు,

## వ్యాఖ్య

ఈ సెక్షన్ దేశములోనికి ఆహార వస్తువుల దిగుమతికి వర్తించుచుండగా, సె. 7 దేశములో ఆహార వస్తువుల తయారీ, నిల్వ, అమ్మకములకు సంబంధించి యున్నది.

సెక్షను 5 వ్యతిరేకించిన వ్యక్తి సె. 16 క్రింద శిక్షార్హుడు
'వ్యక్తి' అనగా కంపెని కూడ

పి. పి. Vs నాలం సుబ్రహ్మణ్యం
ఎ. ఐ. ఆర్. 1960 ఎ. పి. 584

'వ్యక్తి' అనగా కోఆపరేటివ్ సొసైటీ కూడ
ఎ. ఐ. ఆర్. 1969 క్రి. లా. జ. 451

## సెక్షను 6 :-

సముద్ర కస్టమ్స్‌కు సంబంధించిన శాసనము వర్తించుట మరియు కస్టమ్స్ అధికారుల అధికారములు.

i) Sea Customs Act, 1878 లోని సె. 18 ప్రకారము దిగుమతి చేయుట నిషేధించబడిన వస్తువులకు, సముద్ర కస్టమ్స్‌కు సంబంధించి ప్రస్తుతం అమలులో ఉన్న న్యాయము, సె. 5 ప్రకారం దిగుమతి నిషేధించబడిన ఆహారపదార్థములకు, ఈ శాసనము సె. 16కు లోబడి వర్తించును, మరియు సదరు శాసనముల క్రింద కస్టమ్స్ ఆఫీసర్లు, కస్టమ్స్ కలెక్టర్ యొక్క బాధ్యతలు నిర్వర్తించుటకు అధికారములు పొందిన కస్టమ్స్ ఆఫీసర్లు మరియు ఇతర కస్టమ్ అధికారులు, పై చెప్పబడిన వస్తువులకు సంబంధించి తత్కాలంలో ఏ అధికారములు కల్గియున్నారో అవే అధికారములు సదరు ఆహార వస్తువులకు సంబంధించి కల్గియుందురు.

ii. సబ్ సెక్షన్ (i) లోని అంశములకు భంగం కల్గకుండ, కేంద్ర ప్రభుత్వంచే ప్రాధికారము ఒసగబడిన కస్టమ్ కలెక్టర్, లేక

ఇతర అధికారి, 6 వ సెక్షన్ క్రింద దిగుమతి నిషేధించబడిన ఆహార వస్తువు కలిగియున్నదని అనుమానించినచో, దిగుమతి చేయబడిన ఏ ప్యాకేజి అయినా నిర్బంధించవచ్చును. మరియు వెంటనే అట్టి నిర్బంధం గురించి సెంట్రల్ ఫుడ్ లేబొరేటరి డైరెక్టర్‌కు తెలియ పరచవలెను. మరియు అతడు కోరినచో ప్యాకేజి లేక అనుమానించిన ఆహార వస్తువు యొక్క శాంపిల్‌ను వెంటనే అట్టి లేబొరేటరీకి పంపవలెను.

సె. **7** :— కొన్ని ఆహార వస్తువుల తయారీ, అమ్మకం వగైరాల నిషేధం; తాను స్వయంగా గాని, తన తరపున వేరొక వ్యక్తి ద్వారాగాని ఏ వ్యక్తియు—

i) ఏదైన కల్తీ ఆహారము,

ii) ఏదైన 'మిస్‌బ్రాండెడ్ ఆహారము'

iii) అమ్ముటకు లైసెన్సు విధించబడిన ఏదైన ఆహారము, అట్టి లైసెన్సు షరతుల కనుగుణంగా తప్ప,

iv) ప్రజారోగ్యము దృష్ట్యా 'ఫుడ్ హెల్త్ అథారిటీ' చే తత్కాలము నకు నిషేధించబడిన ఏదైన ఆహార వస్తువు,

v) ఈ శాసనములోని ఏదేని ఇతర నిబంధనను గాని దానిక్రింద చేయబడిన ఏదైన నియమమునకుగాని వ్యతిరేకముగా ఏదేని ఆహార వస్తువు, లేక

vi) ఏదేని కల్తీచేయు వస్తువు—

అమ్ముటకు తయారు, నిల్వ, విక్రయం, లేక పంపిణీ చేయరాదు.

వివరణ :—

ఈ పరిచ్ఛేదము నిమిత్తము, ఒక వ్యక్తి కల్తీ ఆహారమును గాని మిస్ బ్రాండెడ్ ఆహారముగాని (3), (4), (5) ఖండములలో చెప్పబడిన ఏ ఆహార వస్తువుగాని, దాని నుండి అమ్ముటకు ఆహార వస్తువును తయారు చేయుటకు గాను, నిల్వ చేసినచో అట్టి కల్తీ ఆహారము మిస్ బ్రాండెడ్ ఆహారము లేక (3), (4), (5) ఖండములలో చెప్పబడిన ఆహారము 'నిల్వ' చేసినట్లుగా భావింపవలెను.

## వ్యాఖ్య

1. శాసన చరిత్ర, పరిధి
2. ప్రత్యామ్నాయ జవాబుదారి

   నౌకరు

   కుటుంబ సభ్యుడు

   డిస్ట్రిబ్యూటరు

   భాగస్తుడు.
3. అపరాధ చింత (మెన్సిరియా)
4. అమ్మకమునకు తయారి
5. నిల్వ
6. విక్రయం
7. క్లాజు (ii)
8. (4) (5) క్లాజులు
9. క్లాజు (6)
10. వివరణ :—

1. శాసన చరిత్ర పరిధి:-

ఈ సెక్షన్ ఈ శాసనములో ముఖ్యమైనది. ఈ సెక్షను ఉల్లంఘించినందుకు శిక్షలు సెక్షను 16 లో చెప్పబడినవి.

1) కల్తీ ఆహారము 2) మిస్‌బ్రాండెడ్ ఆహారము, 3) తత్కాలములో నిషేధించబడిన ఆహారము, 4) కల్తీ చేయు పదార్థముల— అమ్మకమునకు తయారీ, నిల్వ, అమ్మకం, పంపిణీ నిషేధించబడ్డాయి. అట్లే 5) అమ్మకమునకు లైసెన్సు కావలసిన ఆహార వస్తువు లైసెన్సు షరతులకు వ్యతిరేకంగా మరియు 6) ఏ ఆహార వస్తువు అయినను ఈ చట్టంలోని నిబంధనలకు వ్యతిరేకంగా, లేక ఈ చట్టం క్రింద చేయబడిన నియమములకు వ్యతిరేకంగా— అమ్మకమునకు తయారీ, నిల్వ, అమ్మకం, పంపిణీ చేయుట నిషిద్ధము.

ఈ సెక్షనులో క్లాజు vi), వివరణ మొదటిసారిగా 1976 సవరణ చట్టం ద్వారా చేర్చబడినవి,

2. ప్రత్యామ్నాయ జవాబుదారి :

నౌకరు కల్తీ ఆహారము అమ్మినప్పుడు— ప్రత్యక్షముగా అమ్మిన వ్యక్తి నౌకరు- ఏ వ్యక్తి తరపునయితే నౌకరు అమ్మినాడో ఆ వ్యక్తి- యజమాని యిద్దరూ బాధ్యులే, యజమానికి కల్తీ ఆహారము అమ్మినట్లు తెలియకపోయినప్పటికి ఈ శాసనము క్రింద బాధ్యుడే. ఈ చట్టములో 'మెన్సిరియా' తో నిమిత్తము లేకుండ, చర్యను నిషేధించి శాసనసభ, యజమానినిగూడ బాధ్యుడుగా నిర్ణయించినది.

హరిప్రసాదరావు Vs స్టేట్
ఎ. ఐ. ఆర్. 1951 యస్. సి. 204.

3. నౌకరు జవాబుదారి :-

కల్తీ ఆహార వస్తువు అమ్మిన నౌకరు కూడ శిక్షార్హుడా అన్న ప్రశ్నకు కొంత కాలం పూర్వం వివిధ హైకోర్టులు విభిన్నమైన తీర్పులు యిచ్చినవి.

సుప్రీంకోర్టు, నౌకరు ఏజెంటులు గూడ ఈ శాసనము క్రింద బాధ్యులే యని తీర్పు యిచ్చి ఈ వివాదమును పరిష్కరించినది.

సర్జూ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ యు. పి.
ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 631

'తన తరపున వేరొక వ్యక్తిద్వారా' అన్న పదజాలములో ఏజెంట్లు, నౌకర్లు వచ్చెదరు.

స్టేట్ Vs వి. కె. కె. నంగియా
ఎ. ఐ. ఆర్. 1979 యస్. సి. 1977

కుటుంబసభ్యుడు :—

ముద్దాయి షాపు యజమాని కొడుకు, అతడు షాపు యజమాని కాకపోయిననూ బాధ్యత తప్పదు.

పబ్బా ప్రేమ్‌కుమార్ Vs స్టేట్ ఆఫ్. ఎ. పి.
1979 క్రి. లా. జ. (యస్. ఓ. సి.) 76.

డిస్ట్రిబ్యూటరు

కల్తీ ఆహారము అయినప్పుడు టోకు వ్యాపారి పంపిణీదారు, వ్యాపారి అందరూ బాధ్యులే. వారంతా లేకుండా అమ్మినప్పుడు పంపిణీదారు మాత్రమే బాధ్యుడు అనే వాదన సరి అయినది కాదు. సెక్షను 14 హోల్ సేలర్‌కు, డిస్ట్రిబ్యూటరుకు మినహాయింపు చేయుటకుద్దేశింపబడలేదు.

భగవాన్ దాస్ Vs ఢిల్లీ పాలక సంస్థ
ఎ ఐ. ఆర్. 1975 యస్. సి. 1309.

భాగస్థుడు :—

వ్యాపారము ఒక భాగస్వామి సంస్థ నడుపుచున్నప్పుడు వేరొక భాగస్థుడు కల్తీ ఆహారము అమ్మినప్పుడు ముద్దాయి వ్యాపారమునకు ఇన్‌ఛార్జి అనియూ దుకాణములో నడుపుచున్న వ్యాపారమునకు బాధ్యుడని నిరూపించినప్పుడే శిక్షార్హుడగును. కేవలము లైసెన్సు అతని పేరున ఉన్నంత మాత్రమున శిక్షార్హుడు కాడు.

మనీభాయ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 434

అపరాధ చింత :-

మెన్సిరియా—ఈ శాసనము క్రింద 'అపరాధ చింత' ఉండనక్కరలేదు. ఈ చట్టము క్రింద బాధ్యత సమగ్రము, నిరంకుశము.

సర్జూప్రసాదు కేసు ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 631
నరసింహచెట్టి కేసు 1963 క్రి. లా. జ. 109

మంగళ్‌దాసు కేసు ఎ. ఐ. ఆర్. 1966 యస్. సి. 128
పి. కె. తేజాని కేసు ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 228

4. అమ్మకమునకు తయారీ :-

ప్రతి తయారీ ఈ శాసనము క్రిందకు రాదు. అమ్మటకు తయారు చేయుటయే ఈ శాసనము క్రిందకు వచ్చును, స్వంత ఉపయోగమునకు చేసిన తయారీ ఈ చట్టము క్రిందకు రాదు.

ఎ. ఐ. ఆర్. 1967 ఢిల్లీ 71

ఆహారవస్తువు తయారీ పూర్తిఅయి. అమ్మటకు సిద్ధముగా ఉంచినపుడే ఈ సెక్షను వర్తించును.

1971 యఫ్. ఏ. సి. 561

మామూలుగా ఆహార వస్తువులు తయారీచేయు లేక అమ్మటకు నిల్వచేయు వ్యక్తి స్వాధీనములో కల్తీ ఆహారవస్తువులున్నప్పుడు అమ్మటకొరకే తయారు చేసినాడు లేక నిల్వ చేసినాడు అని భావించవచ్చును.

యఫ్. ఐ. పాలఘాట్ మున్సిపాలిటి Vs సయ్యద్ ఖాసిం
ఐ. యల్. ఆర్. 1962 (1) కేరళ 351

5. నిల్వ చేయుట :-

అమ్మటకు నిల్వచేసి యుండవలెనా లేక ప్రతి ఆహార వస్తువు నిల్వ, ఈ శాసనము క్రిందకు వచ్చునా అన్న ప్రశ్నపై విభిన్న అభిప్రాయములుండెను. సుప్రీంకోర్టు 'నిల్వచేయుట' అనగా అమ్మటకొరకు నిల్వచేయుటని తీర్పు ఇచ్చినది.

ఓంప్రకాశ్ Vs ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్ ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 19 5
యం. సి. ఢిల్లీ Vs లక్ష్మినారాయణ టండన్ 1975 (2) యఫ్, ఎ. సి. 313
(సుప్రీంకోర్టు తీర్పు దృష్ట్యా వివిధ హైకోర్టుల తీర్పులుదహరించుట లేదు.)

శుభ్రపరచుటకు, వేరుపరచుటకు నిల్వచేయుట అమ్ముటకు నిల్వచేయుట కాదు.

ఢిల్లి అడ్మినిస్ట్రేషన్ Vs రాంనివాస్
1975 యఫ్. ఎ. సి. 305

ఇంటిలో నిల్వచేసినపుడు అమ్ముటకు నిల్వచేసినాడని చెప్పలేము.
దుకాణములలో నిల్వచేసినతో అమ్ముటకే అని భావించవచ్చును.

పి. పి. Vs స్వామి వెంకటరత్నం
ఏ. ఐ. ఆర్. 1958 మద్రాసు 382

ఒక ఎగుమతి వ్యాపారస్థుని ఆవరణలో 'కలకత్తా' పేరు వ్రాయబడిన బస్తాలలో మిరియాలు నింపబడి ఉన్నపుడు అమ్ముటకు నిల్వచేసినాడని కోర్టు భావించినది.

ఫుడ్ ఇన్‌స్పెక్టరు కోజికోడ్ Vs పూనవ్ దేశాయ్
ఎ. ఐ. ఆర్. 1959 కేరళ 190.

6, విక్రయం :– సెక్షను 2 (1ఎ)(viii) ప్రకారం—

i) రొఖ్ఖంగాని, అప్పుగాని, మార్పిడిగాని, టోకునగాని, చిల్లరగాని చేసిన అమ్మకం.
(ii) అమ్ముటకు ఒడంబడిక,
(iii) అమ్ముటకు ప్రతిపాదన,
(iv) అమ్ముటకు ప్రదర్శన,
(v) అమ్ముటకు స్వాధీనములో కలిగియుండుట,
(vi) అమ్ముటకు ప్రయత్నములకు ఈ సెక్షను వర్తించును.

విశ్లేషణం కొరకు ఫుడ్ ఇన్స్పెక్టరుకు అమ్ముట ఈ సెక్షన్ ప్రకారము అమ్మకమే.

మంగళదాస్ రాఘవ్‌జీ కేసు - ఎ. ఐ. ఆర్. 1966 యస్ సి 128
మహమ్మద్ యామీన్‌కేసు — ఐ. యల్. ఆర్. 1975 యస్. సి. 1308
ఓంప్రకాశ్ కేసు — ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 195.

మాత్రమే అని అమ్మినప్పటికీ అది నేరమే అని మద్రాసు హైకోర్టు తీర్పు ఇచ్చి నది. (ఎ. ఐ. ఆర్. 1965 మద్రాసు 98).

కలకత్తా, అలహాబాద్ హైకోర్టులు వ్యతిరేకాభిప్రాయము వెలిబుచ్చినవి. ఆం. ప్ర. హైకోర్టు కూడా మొదటలో చట్టము వర్తించదని అభిప్రాయపడినా (1971(1) ఆం. ప్ర. ౨, 261), తరువాత తీర్పులో అట్లు ప్రకటించి అమ్మిన నేరమేనని తీర్మా నించినది.

పి. పి. Vs రామచంద్రరాజు
1976 ఎ. యల్. టి. 68 (యన్. ఆర్. సి)

సుప్రీంకోర్టు, మద్రాసు, బొంబాయి, ఆం. ప్ర. తీర్పులను సరి అయినవి అని నిశ్చయించినది. అనగా అమ్మినది, ఆహార వస్తువు అయినచో అమ్మకము జరిగినది అన్నది యే ముఖ్యము, మానవ ఆహారముగా అమ్మినాడా, ఇతర ఉపయోగముల కొరకు అమ్మినాడా అనే విషయము అనవసరము. 'ఆహారమునకు కాదు' అని ప్రక టించిన కల్తీ ఆహారపు అమ్మకము శిక్షార్హము.

స్టేట్ ఆఫ్ తమిళనాడు Vs ఆర్. కృష్ణమూర్తి
ఎ. ఐ. ఆర్ 1980 యస్. సి. 538.

3. విశ్లేషణము కొరకు అమ్మకము:-

ఫుడ్ ఇన్స్పెక్టర్ విశ్లేషణము కొరకు శాంపిలు తీసికొనినప్పుడు- ఈ క్లాజులో ఇవ్వబడిన ప్రత్యేక నిర్వచనము దృష్ట్యా అది అమ్మకమే అని సుప్రీంకోర్టు తీర్పు చెప్పినది.

సర్జూ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ యు. పి.
ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 631
యం. వి. జోషి Vs యం. యు. సింపి
ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 1494

ఇదే విషయము మరల, మరల చర్చకు రాగా సుప్రీంకోర్టు అదే అభిప్రాయ మును ధృవీకరించినది.

ఫుడ్ ఇన్స్పెక్టర్ Vs గోపాలన్
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 1725

మహ్మద్ యామిన్ Vs స్టేట్ అఫ్ యు. పి.
(ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 1304)

ఓంప్రకాష్ Vs ఢిల్లీ ఎడ్మినిస్ట్రేషన్
ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 195

స్టేట్ Vs ఆర్. కృష్ణమూర్తి
ఎ. .ఐ ఆర్ 1980 యస్. సి .538

**4. వెల :-**

ఫుడ్ ఇన్స్పెక్టర్ ఒక వ్యక్తి స్వాధీనములోని ఆహార వస్తువు యొక్క శాంపిలు తీసుకొని దాని వెల ఇచ్చినప్పుడు ఆ వ్యక్తి వెల తీసుకొనుటకు నిరాకరించిన ఎడల అమ్మకము జరగలేదు అని ఆం. ప్ర. హైకోర్టు తీర్పు.

పి. పి. Vs కూసనపూడి నరసింహరాజు
1968 క్రి. లా. జ. 247.

ఫుడ్ ఇన్స్పెక్టర్ పాలు తీసుకొని పోవుచున్న వ్యక్తిని శాంపిలు అడుగగా ఆ వ్యక్తి సీసాలలో పాలు పోస్తూ పారిపోయెను. అందువలన ఫుడ్ ఇన్స్పెక్టర్ పాల యొక్క ధర ఇవ్వలేకపోయెను. కాని ఆ వ్యక్తి అమ్ముటకు ఒప్పుకొని సీసాలలో పాలు పోసినాడు. కాబట్టి అమ్మకము జరిగింది.

పి. పి. Vs భరతం పాపారావు
1968 క్రి. లా. జ. 278.

**5. స్వంత ఉపయోగము :-**

స్వంత ఉపయోగానికి ఆహార వస్తువు తీసుకొని పోవుచున్నప్పుడు ఫుడ్ ఇన్స్పెక్టర్ శాంపిల్ తీసుకొన్న సందర్భములో అది అమ్మకము అగునా కాదా ? "నేను పాల వ్యాపారినికాదు. అమ్మకానికి తీసుకొని వెళ్ళడంలేదు. మా ఇంటిలో మా బంధువుల కొరకు తీసుకొనిపోవుచున్నాను." అని వాదించినపుడు అది నిరూపించుకొనే భారము ఆ వ్యక్తి పైన ఉన్నది. నిరూపించుకొనలేకపోయినచో, శాంపిల్ పరీక్షలలో కల్తీ అని తేలినచో అది అమ్మకమే. ఆ అమ్మకము నేరమే.

పి. పి. Vs గొట్టిపాటి పిచ్చయ్య
1972 (2) ఆం. ప్ర. ఠి. 424

తాను అమ్మడానికి తీసుకొనిపోవునపుడు ఫుడ్ ఇన్స్పెక్టర్ శాంపిల్ అడిగినచో దాని ధర తీసుకొనుటకు నిరాకరించవచ్చును, అట్టి సందర్భములో అమ్మకము లేదు.

ఎ. ఐ. ఆర్. 1966 అలహాబాద్ 231

2 (xiv) శాంపిల్ :-

అనగా ఈ శాసనము ప్రకారము లేక ఈ శాసనము క్రింద చేయబడిన నిబంధనల ప్రకారము తీసుకొనిన ఆహార వస్తువుయొక్క మాదిరి.

## వ్యాఖ్య

ఒక ప్రదేశములో ఆహారము నిల్వ చేసినపుడు వేర్వేరు సంచులు లేక పాత్రల నుండి శాంపిల్ తీసుకొనినపుడు ఒకసారి తీసుకొన్న, వేరు వేరు సందర్భాలలో తీసుకొన్న, ఒక సంచి లేక పాత్రనుండి వేర్వేరు శాంపిల్స్ వేర్వేరు సందర్భములలో తీసుకొన్న, ప్రతియొక్క శాంపిల్ తీసుకొనుట ఒక అమ్మకము అగును.

ఓం ప్రకాష్ Vs ఢిల్లీ ఎడ్మినిస్ట్రేషన్

ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 195

అమ్మకముదారు శాంపిల్ అని లేబుల్ వేసినంత మాత్రమున అది ఈ చట్టము క్రింద శాంపిల్ అవదు.

ఆహార కల్తీ నివారణ నియమావళి 1955 లో నియమములు 12, 14 నుండి 22, 22 (ఎ) 22 (బి) ఇందుకు సంబంధించినవి.

శాంపిల్ కొరకు ఏ ఆహారము ఎంత పరిమాణము తీసుకొనవలసినది రూలు 22 లో చెప్పబడినది. సీలు చేసిన సీసాలు లేక ప్యాకెట్లలో అమ్ముచున్నప్పుడు ఏ ఒక్క సీసా, ప్యాకెట్టులోని పరిమాణము శాంపిల్‌కు కావలసిన పరిమాణము కంటె తక్కువ అయినచో అట్టి సీసాలు, ప్యాకెట్లు ఒకటి కంటె ఎక్కువ శాంపిల్సుకు కావలసిన పరిమాణము లభించు కొరకు తీసుకొనవచ్చును.

[రూలు 22 ఎ]

సుప్రీంకోర్టు ఒకప్పుడు, యనాలిసిస్ కొరకు పంపిన శాంపిల్ రూలు 22 లో నిర్దేశించబడిన పరిమాణముకంటె తక్కువ ఉన్నచో ముద్దాయి శిక్షార్హుడు కాదు అని

తీర్పు చెప్పినది. కాని (రజాల్‌దాస్ పన్నుని Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 189) కాని 3 సం॥ల తరువాత ఈ తీర్పు సరి అయినది కాదు అని సుప్రీంకోర్టు తీర్మానించింది. 'సెక్షను' రూలు 22 ల యొక్క ఉద్దేశ్యము శాంపిల్ కల్తీ ఆహారమగునా, కాదా నిర్ణయించుటకు పబ్లిక్ ఎనలిస్ట్ తన పరీక్ష కొరకు శాంపిల్ సరిపోవునా, లేదా అని చూచుకొనవలెను. తక్కువ పరిమాణము గల శాంపిల్ పంపినందువలన విశ్లేషణములో ఎటువంటి ఆటంకము, ఇబ్బంది కలుగనిచో ముద్దాయిని ఆ కారణముపై నిర్దోషిగా ప్రకటించుట ప్రజారోగ్యమునకు ప్రమాదము అని సుప్రీంకోర్టు చెప్పినది.

స్టేట్ ఆఫ్ కేరళ Vs ఆలశ్శరి మహమ్మద్ వగైరా
ఎ. ఐ. ఆర్. 1978 యస్. సి. 933

1977 లో ప్రభుత్వము రూలు 22 (టి) చేర్చినది. ఈ రూలు ప్రకారము పబ్లిక్ ఎనలిస్ట్ గాని సెంట్రల్ ఫుడ్ లేబొరేటరీ డైరక్టరుగాని వ్యతిరేకముగా ఫిర్యాదు చేసినప్పుడుతప్ప పరీక్ష కొరకు పంపిన శాంపిల్ పరిమాణము సరిపోయినదని భావించవలెను.

సె. 2 (xv) :—

'అహితమైన' మరియు 'హానికరమైన' పదములు ఆహార వస్తువునకు సంబంధించి ఉపయోగించినపుడు వరుసగా పదార్థము ఆరోగ్యమునకు హానికరమని లేక మానవ ఉపయోగమునకు ప్రతికూలమైనదని అర్థము.

సెక్షన్ 2 ఎ అన్వయసూత్రము :—

ఈ చట్టములో జమ్మూ అండ్ కాశ్మీర్ రాష్ట్రములో అమలులోని ఏ చట్టము గురించి అయిన ప్రస్తావించిన ఎడల, ఆ రాష్ట్రమునకు సంబంధించినంతవరకూ, అక్కడ అమలులో ఉన్న తదనురూపమైన చట్టమునకు ప్రస్తావనగా భావించవలెను.

కేంద్ర ఆహార ప్రమాణముల కమిటీ మరియు కేంద్ర
ఆహార పరిశోధన శాల.

సెక్షను **3.** ఆహార ప్రమాణముల కేంద్ర కమిటీ: —

1. ఈ శాసనము అమలులోనికి వచ్చిన తరువాత సాధ్యమైనంత త్వరలో కేంద్ర ప్రభుత్వము ఈ చట్టము అమలు పరచుటకు

సంబంధించిన పరిపాలనా వ్యవహారములలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వములకు సలహా ఇచ్చుటకు మరియు శాసనము క్రింద నిర్ణయించిన ఉద్యోగ కృత్యములను నిర్వర్తించుటకు 'ఆహార ప్రమాణముల కేంద్ర కమిటీ' అనే పేరుతో ఒక కమిటీని నియమించవలెను.

2. ఆ కమిటీ ఈ క్రింది సభ్యులను కలిగి యుండవలెను—

ఎ. ఆరోగ్య సర్వీసుల డైరక్టరు జనరలు, ఎక్స్‌ఫిషియో ఛైర్మన్ అగును.

బి. కేంద్ర ఆహార పరిశోధన శాల యొక్క డైరక్టరు – ఒకటి కంటె ఎక్కువ పరిశోధనశాలలున్నచో అట్టి డైరక్టర్లు, ఎక్స్‌ఫిషియో,

సి. కేంద్ర ప్రభుత్వముచే నామినేటు చేయబడిన ఇద్దరు నిపుణులు,

డి. ఫుడ్ అండ్ అగ్రికల్చర్ మినిస్ట్రీలో, ఫుడ్ డిపార్టుమెంటు నుండి అగ్రికల్చర్ డిపార్టుమెంటు నుండి ఒక్కొక్క ప్రతినిధి మరియు కామర్స్, డిఫెన్స్, ఇండస్ట్రీ, సప్లై, రైల్వే మినిస్ట్రీలనుండి ఒక్కొక్క ప్రతినిధి,

ఇ. ప్రతి రాష్ట్రముచే నామినేటు చేయబడిన ప్రతినిధి,

యఫ్. యూనియన్ ప్రాంతముల ప్రతినిధులుగా కేంద్ర ప్రభుత్వముచే నామినేటు చేయబడిన ఇద్దరు ప్రతినిధులు,

జి. వ్యవసాయ, వాణిజ్య, పారిశ్రామిక రంగముల ప్రతినిధులుగా కేంద్రప్రభుత్వం నామినేటు చేసిన ఒక్కొక్క ప్రతినిధి,

జి. జి. హోటల్ పరిశ్రమ తరపున ఒక ప్రతినిధిని కలుపుకొని వినియోగదారులు అవసరములు చూచు ప్రతినిధులుగా

కేంద్ర ప్రభుత్వముచే నామినేటు చేయబడిన ఐదుగురు ప్రతినిధులు,

హెచ్. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చిచే నామినేటు చేయబడిన వైద్య వృత్తినుండి ప్రతినిధి,

ఐ. ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్స్టిట్యూషన్ (సర్టిఫికేషను మార్క్సు ఆక్టు 1952) లోని సెక్షను 2 క్లాజు (ఇ) లో ప్రస్తావించబడిన ఇండియన్ స్టాండర్డ్సు ఇనిస్టిట్యూషన్ యొక్క ప్రతినిధి.

3. రాజీనామా, మృత్యువు లేక ఇతర కారణములవలన ఖాళీ అయినప్పుడు తప్ప సె. 2 (సి) (డి) (ఇ) (యఫ్) (జి) (జిజి) (హెచ్) (ఐ) లో చెప్పబడిన సభ్యులు 3 సం. ల పదవిలో ఉందురు. తిరిగి నామినేట్ చేయబడుటకు అర్హులు.

4. కమిటీలో ఖాళీలు ఉన్నప్పటికీ కమిటీ తన బాధ్యతల నిర్వర్తించవచ్చును.

5. ఈ కమిటీ అవసరమైనన్ని సబ్ కమిటీలను నియమించవచ్చును. కమిటీలు ఏర్పరచిన నిబంధనలకు లోబడి కమిటీచే దత్తము చేయబడిన అధికారములు చెలాయించుటకు, బాధ్యతలు నిర్వర్తించుటకు కమిటీలో మెంబర్లనుగాని, ఇతరులను గాని, సబ్ కమిటీలో మెంబర్లుగా కమిటి నియమించవచ్చును.

6. కేంద్ర ప్రభుత్వము యొక్క పూర్వ అనుమతితో కమిటి తన యొక్క విధి నిర్వహణకు ప్రొసీజరును రెగ్యులేట్ చేసుకొనుటకు బైలాలు చేసుకొనవచ్చును.

## వ్యాఖ్య

మొదటి కమిటీ 1-6-1955 వ తేదీన 30 మంది మెంబర్లతో ఏర్పాటు అయినది. ఈ కమిటీ సలహా సంప్రదింపులతో కేంద్ర ప్రభుత్వము వివిధ ఆహార పదార్థములకు ఆహార ప్రమాణములు నిర్ణయించి 12-9-1955 నోటిఫికేషన్ 2106 ద్వారా ఆహార కల్తీ నివారణ నియమావళి ప్రకటించినది.

సె. 3 (ఎ): సెక్రటరీ మరియు ఇతర ఉద్యోగుల నియామకము :-

కేంద్ర కమిటీ యొక్క అధికారమునకు లోబడి కమిటీ ఉత్తర్వుల ప్రకారము కమిటీ నిర్ణయించిన లేక దత్తము చేసిన అధికారములను, బాధ్యతలను నిర్వర్తించుటకు కేంద్ర ప్రభుత్వము ఈ కమిటీకి ఒక కార్యదర్శిని నియమించవలెను.

సె. **4** కేంద్ర ఆహార పరిశోధన శాల :-

1. కేంద్ర ప్రభుత్వము రాజపత్రములో ప్రకటన ద్వారా ఒకటి గాని అంతకంటె ఎక్కువగాని కేంద్ర ఆహార పరిశోధన శాలలు ఈ చట్టము క్రిందగాని, నిబంధనల క్రిందగాని ఒప్పగించబడిన కార్యములు నిర్వర్తించుటకు స్థాపించవలెను.

అయితే, ఏదేని పరిశోధన శాలను గాని, సంస్థనుగాని ఈ చట్టము అవసరములకొరకు కేంద్ర ఆహార పరిశోధన శాలగా రాజ పత్రములో ప్రకటన ద్వారా పేర్కొన వచ్చును.

2. కమిటీని సంప్రదించిన తరువాత కేంద్ర ప్రభుత్వము

ఎ. కేంద్ర ఆహార పరిశోధన శాలల యొక్క విధులు మరియు ఆ విధులు నిర్వహించు స్థానిక ప్రదేశము లేక ప్రదేశములు,

బి. ఆ పరిశోధన శాలకు ఆహార వస్తువుల మచ్చులు పరిశోధనకు పంపుటకు పద్ధతులు, పరిశోధన శాలల నివేదికల నమూనాలు, అట్టి నివేదికల కొరకు చెల్లించవలసిన రుసుము,

సి. పరిశోధనశాలలు తమ విధి వ్యవహారములు నిర్వహించుటకు అవసరమైనటువంటి, ఉచితమైనటువంటి ఇతర విషయములు నిర్దేశించుచూ నిబంధనలు చేయవచ్చును.

## వ్యాఖ్య

యస్. ఆర్. ఓ. 1234 పి. యఫ్. ఎ. సె. 4./యఫ్ - 11-455/1-6-55 ద్వారా 110, చిత్తరంజన్ ఎవెన్యూ కలకత్తాలో మొదటి కేంద్ర ఆహార పరిశోధన శాల స్థాపించబడినది.

ఆహార కల్తీ నివారణ నియమావళి 5 వ సవరణ ద్వారా 1950 లో కేంద్ర పరిశోధనశాల మైసూరు, ఆం, ప్ర., కేరళ, మహారాష్ట్ర, తమిళనాడు, కేంద్రపాలిత ప్రాంతాలైన లక్ష ద్వీపములు, పాండిచ్చేరిలకు కేంద్ర ఆహార పరిశోధనశాలగా నిర్దేశించబడినది.

రుసుము :

ఆహార కల్తీ నివారణ నియమావళి 1955 నియమము 4, (6) ప్రకారము అట్టి సర్టిఫికేట్ కొరకు పరిశోధన చేయబడిన శాంపిల్ ఒక్కొక్కటికి చెల్లించవలసిన రుసుము రూ. 40. ఈ రుసుము ప్రభుత్వ ఖజానాలో "పబ్లిక్ హెల్త్" సెంట్రల్ హెడ్ క్రింద జమ చేయవలెను. ఈ సందర్భములో సదరు నియమావళిలో రెండవ భాగములో 3, 4 నియమములు చూడతగును.

పరిశోధనశాల డైరక్టరుకు ఫుడ్ ఇన్స్పెక్టర్ ఆహార శాంపిల్‌తోపాటు అనుబంధము - ఎ లోని ఫారమ్ 1 నమూనాలో ఒక మెమొరాండమ్ కూడా పంపవలెను. ఈ మెమొరాండమ్ యొక్క కాపి శాంపిల్ కవరుపై వేసిన సీలు యొక్క నమూనా వేరే రిజిష్టర్ పోస్టులో డైరక్టరుకు పంపవలెను. శాంపిల్ ప్యాకెట్ డైరెక్టరు స్వయముగా గాని లేక ఆ డైరెక్టరుచే ఇందుకొరకు లిఖితపూర్వకముగా నియోగించబడిన ఇతర ఉద్యోగికాని తిరుగవలెను. అతడు సీలుయొక్క స్థితిని రికార్డు చేయవలెను.

విశ్లేషణము చేసిన తరువాత డైరెక్టరు తన సర్టిఫికేటును అనుబంధము 'ఎ' లోని ఫారమ్ 2 లో వెంటనే పంపవలెను. అది డైరెక్టరు స్వయముగా సంతకము చేయవలెను.

రూలు 4 లోని సబ్ రూల్ (2), (3) తప్పక అనుసరించవలసినవి. ఇవి అతిక్రమించిన న్యాయ విచారణమునకు భంగము కలుగును.

స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర Vs సయ్యద్ అఖలాక్
1980 యఫ్. ఎ. సి. 145

శాంపిల్‌ను కేంద్ర పరిశోధన శాల డైరక్టరుకు పరీక్షకు పంపవలెనని దరఖాస్తు చేయుటకు ముందు రూల్ 4 (6)లో నిర్దేశించిన రుసుము జమ చేయవలసిన బాధ్యత ముద్దాయిపై ఉన్నది.

అసగర్ Vs స్టేట్
1980 యఫ్. ఎ. సి. 254

## ఆహారములకు సంబంధించి సాధారణ నిబంధనలు

### సెక్షను 5 :-

కొన్ని ఆహార పదార్థముల దిగుమతి నిషేధం,

i) కల్తీ ఆహారము,

ii) మిస్ బ్రాండ్ చేసిన ఆహారము,

iii) దిగుమతి చేసుకొనుటకు లైసెన్సు నిర్దేశించబడిన ఆహారము అట్టి లైసెన్సు నిబంధనల ననుసరించి తప్ప, మరియు

iv) ఈ శాసనము యొక్క నిబంధనలు లేక, ఈ శాసనము క్రింద చేయబడిన నియమావళికి వ్యతిరేకముగా ఎట్టి ఆహార వస్తువులను ఏ వ్యక్తి అయిన ఇండియాలోనికి దిగుమతి చేయరాదు,

## వ్యాఖ్య

ఈ సెక్షన్ దేశములోనికి ఆహార వస్తువుల దిగుమతికి వర్తించుచుండగా, సె. 7 దేశములో ఆహార వస్తువుల తయారీ, నిల్వ, అమ్మకములకు సంబంధించి యున్నది.

సెక్షను 5 వ్యతిరేకించిన వ్యక్తి సె. 16 క్రింద శిక్షార్హుడు
'వ్యక్తి' అనగా కంపెని కూడ

పి. పి. Vs నాలం సుబ్రహ్మణ్యం
ఎ. ఐ. ఆర్. 1960 ఎ. పి. 584

'వ్యక్తి' అనగా కో ఆపరేటివ్ సొసైటీ కూడ
ఎ. ఐ. ఆర్. 1969 క్రి. లా. జ. 451

## సెక్షను 6 :-

సముద్ర కస్టమ్స్‌కు సంబంధించిన శాసనము వర్తించుట మరియు కస్టమ్స్ అధికారుల అధికారములు.

i) Sea Customs Act, 1878 లోని సె. 18 ప్రకారము దిగుమతి చేయుట నిషేధించబడిన వస్తువులకు, సముద్ర కస్టమ్స్‌కు సంబంధించి ప్రస్తుతం అమలులో ఉన్న న్యాయము, సె. 5 ప్రకారం దిగుమతి నిషేధించబడిన ఆహారపదార్థములకు, ఈ శాసనము సె. 16కు లోబడి వర్తించును, మరియు సదరు శాసనముల క్రింద కస్టమ్స్ ఆఫీసర్లు, కస్టమ్స్ కలెక్టర్ యొక్క బాధ్యతలు నిర్వర్తించుటకు అధికారములు పొందిన కస్టమ్స్ ఆఫీసర్లు మరియు ఇతర కస్టమ్ అధికారులు, పై చెప్పబడిన వస్తువులకు సంబంధించి తత్కాలంలో ఏ అధికారములు కల్గియున్నారో అవే అధికారములు సదరు ఆహార వస్తువులకు సంబంధించి కల్గియుందురు.

ii. సబ్ సెక్షన్ (i) లోని అంశములకు భంగం కల్గకుండ, కేంద్ర ప్రభుత్వంచే ప్రాధికారము ఒసగబడిన కస్టమ్ కలెక్టర్, లేక

ఇతర అధికారి, 5 వ సెక్షన్ క్రింద దిగుమతి నిషేధించబడిన ఆహార వస్తువు కలిగియున్నరని అనుమానించినచో, దిగుమతి చేయబడిన ఏ ప్యాకేజి అయినా నిర్బంధించవచ్చును. మరియు వెంటనే అట్టి నిర్బంధం గురించి సెంట్రల్ ఫుడ్ లేబొరేటరి డైరెక్టర్‌కు తెలియ పరచవలెను. మరియు అతడు కోరినచో ప్యాకేజి లేక అనుమానించిన ఆహార వస్తువు యొక్క శాంపిల్‌ను వెంటనే అట్టి లేబొరేటరీకి పంపవలెను.

సె. **7** :— కొన్ని ఆహార వస్తువుల తయారీ, అమ్మకం వగైరాల నిషేధం; తాను స్వయంగా గాని, తన తరపున వేరొక వ్యక్తి ద్వారాగాని ఏ వ్యక్తియు—

i) ఏదైన కల్తీ ఆహారము,

ii) ఏదైన 'మిస్‌బ్రాండెడ్ ఆహారము'

iii) అమ్ముటకు లైసెన్సు విధించబడిన ఏదైన ఆహారము, అట్టి లైసెన్సు షరతుల కనుగుణంగా తప్ప,

iv) ప్రజారోగ్యము దృష్ట్యా 'ఫుడ్ హెల్త్ అథారిటీ'చే తత్కాలమునకు నిషేధించబడిన ఏదైన ఆహార వస్తువు,

v) ఈ శాసనములోని ఏదేని ఇతర నిబంధననుగాని దానిక్రింద చేయబడిన ఏదైన నియమమునకుగాని వ్యతిరేకముగా ఏదేని ఆహార వస్తువు, లేక

vi) ఏదేని కల్తీచేయు వస్తువు—

అమ్ముటకు తయారు, నిల్వ, విక్రయం, లేక పంపిణీ చేయరాదు.

వివరణ :—

ఈ పరిచ్ఛేదము నిమిత్తము, ఒక వ్యక్తి కల్తీ ఆహారమును గాని మిస్ బ్రాండెడ్ ఆహారముగాని (3), (4), (5) ఖండములలో చెప్పబడిన ఏ ఆహార వస్తువుగాని, దాని నుండి అమ్ముటకు ఆహార వస్తువును తయారు చేయుటకు గాను, నిల్వ చేసినచో అట్టి కల్తీ ఆహారము మిస్ బ్రాండెడ్ ఆహారము లేక (3), (4), (5) ఖండములలో చెప్పబడిన ఆహారము 'నిల్వ' చేసినట్లుగా భావింపవలెను.

## వ్యాఖ్య

1. శాసన చరిత్ర, పరిధి
2. ప్రత్యామ్నాయ జవాబుదారి
   నౌకరు
   కుటుంబ సభ్యుడు
   డిస్ట్రిబ్యూటరు
   భాగస్థుడు.
3. అపరాధ చింత (మెన్సిరియా)
4. అమ్మకమునకు తయారి
5. నిల్వ
6. విక్రయం
7. క్లాజు (ii)
8. (4) (5) క్లాజులు
9. క్లాజు (6)
10. వివరణ :—

1. శాసన చరిత్ర పరిధి:-

ఈ సెక్షన్ ఈ శాసనములో ముఖ్యమైనది. ఈ సెక్షను ఉల్లంఘించినందుకు శిక్షలు సెక్షను 16 లో చెప్పబడినవి.

1) కల్తీ ఆహారము 2) మిస్‌బ్రాండెడ్ ఆహారము, 3) తత్కాలములో నిషేధించబడిన ఆహారము, 4) కల్తీ చేయు పదార్థముల— అమ్మకమునకు తయారీ, నిల్వ, అమ్మకం, పంపిణీ నిషేధించబడ్డాయి. అట్లే 5) అమ్మకమునకు లైసెన్సు కావలసిన ఆహార వస్తువు లైసెన్సు షరతులకు వ్యతిరేకంగా మరియు 6) ఏ ఆహార వస్తువు అయినను ఈ చట్టంలోని నిబంధనలకు వ్యతిరేకంగా, లేక ఈ చట్టం క్రింద చేయబడిన నియమములకు వ్యతిరేకంగా— అమ్మకమునకు తయారీ, నిల్వ, అమ్మకం, పంపిణీ చేయుట నిషిద్ధము.

ఈ సెక్షనులో క్లాజు vi), వివరణ మొదటిసారిగా 1976 సవరణ చట్టం ద్వారా చేర్చబడినవి,

2. ప్రత్యామ్నాయ జవాబుదారి :

నౌకరు కల్తీ ఆహారము అమ్మినప్పుడు— ప్రత్యక్షముగా అమ్మిన వ్యక్తి నౌకరు- ఏ వ్యక్తి తరపునయితే నౌకరు అమ్మినాడో ఆ వ్యక్తి- యజమాని యిద్దరూ బాధ్యులే, యజమానికి కల్తీ ఆహారము అమ్మినట్లు తెలియకపోయినప్పటికి ఈ శాసనము క్రింద బాధ్యుడే ఈ చట్టములో 'మెన్సిరియా' తో నిమిత్తము లేకుండ, చర్యను నిషేధించి శాసనసభ, యజమానినిగూడ బాధ్యుడుగా నిర్ణయించినది.

హరిప్రసాదరావు Vs స్టేట్
ఎ. ఐ. ఆర్. 1951 యస్. సి. 204.

3. నౌకరు జవాబుదారి :-

కల్తీ ఆహార వస్తువు అమ్మిన నౌకరు కూడ శిక్షార్హుడా అన్న ప్రశ్నకు కొంత కాలం పూర్వం వివిధ హైకోర్టులు విభిన్నమైన తీర్పులు యిచ్చినవి.

సుప్రీంకోర్టు, నౌకరు ఏజెంటులు గూడ ఈ శాసనము క్రింద బాధ్యులే యని తీర్పు యిచ్చి ఈ వివాదమును పరిష్కరించినది.

సర్జూ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ యు. పి.
ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 631

'తన తరపున వేరొక వ్యక్తిద్వారా' అన్న పదజాలములో ఏజెంట్లు, నౌకర్లు వచ్చెదరు.

స్టేట్ Vs వి. కె. కె. నంగియా
ఎ. ఐ. ఆర్. 1979 యస్. సి. 1977

కుటుంబసభ్యుడు :—

ముద్దాయి షాపు యజమాని కొడుకు, అతడు షాపు యజమాని కాకపోయిననూ బాధ్యత తప్పదు.

పబ్బా ప్రేమ్‌కుమార్ Vs స్టేట్ ఆఫ్. ఎ. పి.
1979 క్రి. లా. జ. (యస్. ఓ. సి.) 76.

డిస్ట్రిబ్యూటరు

కల్తీ ఆహారము అయినప్పుడు టోకు వ్యాపారి పంపిణీదారు, వ్యాపారి అందరూ బాధ్యులే. వారంతా లేకుండా అమ్మినప్పుడు పంపిణీదారు మాత్రమే బాధ్యుడు అనే వాదన సరి అయినది కాదు. సెక్షను 14 హోల్ సేలర్‌కు, డిస్ట్రిబ్యూటరుకు మినహాయింపు చేయుటకుద్దేశింపబడలేదు.

భగవాన్ దాస్ Vs ఢిల్లీ పాలక సంస్థ
ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 1309.

భాగస్థుడు :—

వ్యాపారము ఒక భాగస్వామి సంస్థ నడుపుచున్నప్పుడు వేరొక భాగస్థుడు కల్తీ ఆహారము అమ్మినప్పుడు ముద్దాయి వ్యాపారమునకు ఇన్‌ఛార్జి అనియూ దుకాణములో నడుపుచున్న వ్యాపారమునకు బాధ్యుడని నిరూపించినప్పుడే శిక్షార్హుడగును. కేవలము లైసెన్సు అతని పేరున ఉన్నంత మాత్రమున శిక్షార్హుడు కాడు.

మనీభాయ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 434

అపరాధ చింత :—

మెన్సిరియా—ఈ శాసనము క్రింద 'అపరాధ చింత' ఉండనక్కరలేదు. ఈ చట్టము క్రింద బాధ్యత సమగ్రము, నిరంకుశము.

సర్జూప్రసాదు కేసు ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 631
నరసింహచెట్టి కేసు 1963 క్రి. లా. జ. 109

మంగళ్ దాసు కేసు ఎ. ఐ. ఆర్. 1966 యస్. సి. 128
పి. కె. తేజాని కేసు ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 228

4. అమ్మకమునకు తయారీ :—

ప్రతి తయారీ ఈ శాసనము క్రిందకు రాదు. అమ్ముటకు తయారు చేయుటయే ఈ శాసనము క్రిందకు వచ్చును, స్వంత ఉపయోగమునకు చేసిన తయారీ ఈ చట్టము క్రిందకు రాదు.

ఎ. ఐ. ఆర్. 1967 ఢిల్లీ 71

ఆహారవస్తువు తయారీ పూర్తిఅయి. అమ్ముటకు సిద్ధముగా ఉంచినపుడే ఈ సెక్షను వర్తించును.

1971 యఫ్. ఏ. సి. 561

మామూలుగా ఆహార వస్తువులు తయారీచేయు లేక అమ్ముటకు నిల్వచేయు వ్యక్తి స్వాధీనములో కల్తీ ఆహారవస్తువులున్నప్పుడు అమ్ముటకొరకే తయారు చేసినాడు లేక నిల్వ చేసినాడు అని భావించవచ్చును.

యఫ్. ఐ. పాలఘాట్ మున్సిపాలిటి Vs సయ్యద్ ఖాసిం
ఐ. యల్. ఆర్. 1962 (1) కేరళ 351

5. నిల్వ చేయుట :—

అమ్ముటకు నిల్వచేసి యుండవలెనా లేక ప్రతి ఆహార వస్తువు నిల్వ, ఈ శాసనము క్రిందకు వచ్చునా అన్న ప్రశ్నపై విభిన్న అభిప్రాయములుండెను. సుప్రీంకోర్టు 'నిల్వచేయుట' అనగా అమ్ముటకొరకు నిల్వచేయుటని తీర్పు ఇచ్చినది.

ఓంప్రకాశ్ Vs ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్ ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 19 5
యం. పి. ఢిల్లీ Vs లక్ష్మీనారాయణ టండన్ 1975 (2) యఫ్, ఎ. పి. 313
(సుప్రీంకోర్టు తీర్పు దృష్ట్యా వివిధ హైకోర్టుల తీర్పులుదహరించుట లేదు.)

శుభ్రపరచుటకు, వేరుపరచుటకు నిల్వచేయుట అమ్ముటకు నిల్వచేయుట కాదు

ఢిల్లి అడ్మినిస్ట్రేషన్ Vs రాంనివాస్
1975 యఫ్. ఎ. సి. 305

ఇంటిలో నిల్వచేసినపుడు అమ్ముటకు నిల్వచేసినాడని చెప్పలేము.
దుకాణములలో నిల్వచేసినతో అమ్ముటకే అని భావించవచ్చును.

పి. పి. Vs స్వామి వెంకటరత్నం
ఏ. ఐ. ఆర్. 1958 మద్రాసు 382

ఒక ఎగుమతి వ్యాపారస్థుని ఆవరణలో 'కలకత్తా' పేరు వ్రాయబడిన బస్తాలలో మిరియాలు నింపబడి ఉన్నపుడు అమ్ముటకు నిల్వచేసినాడని కోర్టు భావించినది.

ఫుడ్ ఇన్‌స్పెక్టరు కోజికోడ్ Vs పూనవ్ దేశాయ్
ఎ. ఐ. ఆర్. 1959 కేరళ 190.

6. విక్రయం:— సెక్షను 2 (1ఎ)(viii) ప్రకారం—

i) రొఖ్ఖంగాని, అప్పుగాని, మార్పిడిగాని, టోకునగాని, చిల్లరగాని చేసిన అమ్మకం.
(ii) అమ్ముటకు ఒడంబడిక,
(iii) అమ్ముటకు ప్రతిపాదన,
(iv) అమ్ముటకు ప్రదర్శన,
(v) అమ్ముటకు స్వాధీనములో కలిగియుండుట,
(vi) అమ్ముటకు ప్రయత్నములకు ఈ సెక్షను వర్తించును.

విశ్లేషణం కొరకు ఫుడ్ ఇన్స్పెక్టరుకు అమ్ముట ఈ సెక్షన్ ప్రకారము అమ్మకమే.

మంగళదాస్ రాఘవ్‌జీ కేసు - ఎ. ఐ. ఆర్. 1966 యస్ సి 128
మహమ్మద్ యామీన్‌కేసు — ఐ. యల్. ఆర్. 1975 యస్. సి. 1308
ఓంప్రకాశ్ కేసు — ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 195.

హోటలులో ఉంచబడిన పాలు, వెన్న, టమాట కెచెప్ వగైరా ఖాతాదార్లకు భోజనములో వడ్డించుటకేగాని, అమ్మకమునకు కాదని అందువలన ఫుడ్ ఇన్స్పెక్టర్‌కు ఇచ్చిన 'శాంపిల్' అమ్మకం అవదు అని వాదించగా, సుప్రీంకోర్టు ఆ వాదనను త్రోసిపుచ్చి కల్తీ ఆహారము అమ్మినందున సె. 7, 16 లు వర్తించునని తీర్పు యిచ్చినది.

హోటలు, రెష్టారెంటు అసోసియేషను ఆఫ్ కలకత్తా వగైరా
Vs సోమయ్య చికాష్ బోస్ వగైరా
1971 క్రి. లా. జ. 1277 (యస్. సి.)

చట్టం క్రింద బలవంతపు అమ్మకం అయినప్పటికి, అది 2 (viii) ప్రకారం అమ్మకమే. సెక్షను 7 వర్తించును.

1981 క్రి. లా. జ. 1565 (మద్రాసు)

విశ్లేషణం కొరకు శాంపిల్ తీసికొనిన అది అమ్మకమే. మూల్యం చెల్లింప లేదనే కారణంచే సె. 7 వర్తించకపోదు.

1982 క్రి. లా జ. 113 (ఒరిస్సా)

ముద్దాయి వ్యాపారి కాకుండా తన యజమాని పెళ్ళికొరకు పాలు తీసికొని పోవుచుండగా శాంపిల్ తీసికొన్నట్లు నమ్మకమైన డిఫెన్సు సాక్ష్యం ఉన్నప్పుడు శిక్ష చెల్లదు.

ధాన్‌సింగ్ Vs స్టేట్ ఆఫ్ హర్యానా 1985 యఫ్. ఎ. జె.

కల్తీ చేసిన —

ఒక ఆహార వస్తువులో రంగు కలుపుట నిషేధించినపుడు శాంపిల్‌లో రంగు కలిపినట్లుగా కనుగొన్నప్పుడు సెక్షను 2 వర్తించును. ఆ వ్యక్తి సె. 7 (1) క్రింద బాధ్యుడగును.

ప్రేమ్ వల్లభ్ Vs స్టేట్—1976 యఫ్. ఎ. సి. 53 (యస్. సి.)
=1977 (1) యస్. సి. సి. 173

ఖుర్యానీ నూనె అడిగినప్పుడు 70% ఖుర్యానీ నూనె 30% వేరుశనగ నూనె కలిపిన నూనె అమ్మినప్పుడు అది అమ్ముతున్నట్లు చెప్పబడిన, స్వభావము, నాణ్యత

కలిగిన ఖుర్యానీనూనె కాదు. కాబట్టి 2 (1 ఎ)(ఎ) వర్తించును. అమ్మకందారు సె. 7 ప్రకారం బాధ్యుడే.

మురళీధర్ మేషురామ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1976 (2) యఫ్. ఎ. సి. 38 (యస్. సి.)

కల్తీ ఆహారము అమ్మినందుకు శిక్షించుచున్నప్పుడు, లైసెన్సు లేకుండ అమ్మినందుకు కూడా శిక్షంచుట తగదు.

ఢిల్లీ మున్సిపల్ కార్పొరేషన్ Vs జ్వాలాప్రసాద్
1985- క్రి. లా. జ. 1455

7. క్లాజు (2) - 'మిస్‌బ్రాండెడ్' :-

ఫుడ్ ఇన్స్పెక్టరు అడిగినప్పుడు 'ఆవుపాలు' అని చెప్పిన పాలు, 'గేదె' పాలుగా గుర్తింపబడిన సందర్భంలో సె. 2 (ix) వర్తించును. ఆ వ్యక్తి సె. 7 క్రింద బాధ్యుడగును.

కిషన్ త్రయంబక్ కోతూలె Vs మహారాష్ట్ర స్టేట్
1977 (1) యస్. సి. సి. 300

8. క్లాజు (iv), (v) :-

స్టార్చి కలిగిన 'హండీ' అమ్మకం ఈ 'ఖండము' క్రింద నేరం.

రామలాభ్యా Vs ఢిల్లీ మునిసిపాలిటి.
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 789

ఆహారములో శాకరీన్ కలుపుట పూర్తిగా నిషేధించబడలేదు,

సుపారీలో శాకరీన్ కలిపినపుడు, శాకరీన్ నిర్ణీత ప్రమాణములకు లోబడి యున్నపుడు, రూలు 47 అతిక్రమించినట్లుగాదు. సె. 7/16 క్రింద నేరం కాదు.

స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర Vs రంజిత్‌భాయ్
1979 యఫ్. ఎ జె. 231

అట్లే పాన్‌కామసాలాలో శాకరీన్ కలిపినపుడు కూడా శాకరీన్ 'అపెండెక్స్ 'బి' లోని ప్రమాణమునకు లోబడి ఉండిన నేరం చేయబడలేదు.

కైలాస్ Vs స్టేట్ ఆఫ్ రాజస్థాన్
1985 యఫ్. ఎ. జె. 302

9. క్లాజు (vi) :-

1976 సం. 34 వ శాసనముద్వారా ఈ ఖండము 7 వ పరిచ్ఛేదములో చొప్పించబడింది.

దేశంలో కల్తీచేయుటకు పనికివచ్చే పదార్థములు తయారుచేయుటకు ప్రత్యేక వ్యాపార సంస్థలున్నవన్న విషయం తెలిసికొని, 'జాయింటు కమిటీ' అటువంటి కల్తీ చేయుటకు పనికివచ్చే పదార్థముల తయారీ, నిల్వ, అమ్మకములు, గూడ ఈ చట్టము క్రింద శిక్షార్హములు చేయవలెనని భావించి ఈ సవరణ చేసింది.

కల్తీచేయుటకు పనికివచ్చే పదార్థము, 'ఆహారం' అయివుండవచ్చును లేక ఇతర పదార్థము అయివుండవచ్చును.

సాధారణంగా—

ఇసుక, రాళ్ళు, చెత్త వగైరా—ధాన్యాలలో, పప్పులలో

సుద్ద, వగైరా—పిండిలో

స్టార్చి, గోధుమపిండి—ఇంగువలో

చింతపిక్కల పొడి—కాఫీ పొడిలో

రంపపుపొట్టు, తవుడు, బెరడు—టీ లో

రంగులు—టాపీలలో

చవుక నూనెలు—ఖరీదయిన నూనెలలో

నీళ్ళు, పిండి—పాలలో

పంచదార—తేనెలో

కల్తీ చేయుటకు ఉపయోగించుచున్నట్లు తెలియుచున్నది.

ఒక ఆహారవస్తువు యొక్క తయారీ కాని, పంపిణీగాని, లేక వ్యాపారము గాని చేసే వ్యక్తి స్వాధీనంలో, లేక అతని స్వాధీనంలోని ఆవరణలోగాని, కల్తీ చేయు పదార్థము ఉన్నయెడల, అట్టి వ్యక్తి ఫుడ్ యిన్స్పెక్టరుకు సంతృప్తికరముగా జవాబు చెప్పలేని పక్షంలో, ఫుడ్ ఇన్స్పెక్టరు అట్టి కల్తీకి పనికివచ్చే పదార్థముల నిల్వలను స్వాధీనంచేసికొని, శాంపిల్ తీసికొని పబ్లిక్ ఎనలిస్టుకు పరీక్ష కొరకు పంపవచ్చును.

అట్టి పదార్థమును ఫుడ్ ఇన్స్పెక్టరు స్వాధీనం చేసికొన్నప్పుడు ఆ పదార్థము ఆహారం కల్తీచేయుటకు నిల్వచేయబడలేదు అని నిరూపించుకొనవలసిన బాధ్యత ఆ వ్యక్తిపైన ఉన్నది.

10. వివరణ :—

ఇతర ఆహారములో కల్పుటకు నిల్వ చేసినప్పుడు, అది ఈ సెక్షను క్రింద నిల్వ అగునా అన్న విషయం పై తీర్పులవలన లేచిన వివాదము పరిష్కరించుటకు న్యాయం స్పష్టం చేయుటకు, 1976 చట్టంద్వారా ఈ సెక్షను చివర 'వివరణ' చేర్చ బడినది. దీని ప్రకారం, ఒక వ్యక్తి తాను అమ్మేడి ఆహార వస్తువు తయారు చేయుటకుగాను, క్లాజు (i) నుండి (v) లలో చెప్పబడిన ఆహారమును నిల్వ చేసినచో, ఈ సెక్షను యొక్క అర్థములో ఆహారవస్తువు 'నిల్వ' చేసినట్లు పరి గణింపబడును.

[ఇతర తీర్పులకు సె. 16 క్రింద వ్యాఖ్య చూడదగును.]

## ఆహార విశ్లేషణ

సెక్షను 8 :—

కేంద్ర ప్రభుత్వము గాని, రాష్ట్ర ప్రభుత్వం గాని, నిర్దేశించ బడిన అర్హతలు గలిగి, సదరు ప్రభుత్వము అర్హులని అనుకొనిన వ్యక్తులను, రాజపత్రంలో ప్రకటనద్వారా ప్రత్యేకించబడిన 'లోకల్ ఏరియా' లకు పబ్లిక్ ఎనలిస్టులుగా నియమించవచ్చును.

అయితే ఆహార వస్తువుల తయారీ, దిగుమతి అమ్మకములో ఆర్థిక ప్రయోజనము కలిగియున్న వ్యక్తి ఈ సెక్షను క్రింద పబ్లిక్ ఎనలిస్టుగా నియమించబడరాదు. అయితే వేర్వేరు ఆహార వస్తువులకు వేర్వేరు ఎనలిస్టులను నియమించవచ్చును.

## వ్యాఖ్య

ఒకటి లేక యెక్కువ 'లోకల్' ఏరియాలకు ఒకే పబ్లిక్ ఎనలిస్టును నియమించవచ్చును.

నియామకం పేరుమీదగాని హోదా నుదహరించిగాని చేయవచ్చును అయితే ఆ వ్యక్తికి నిర్దేశించబడిన అర్హతలుండవలెను.

యం. సి. రాజపూర్ Vs బిషేన్ దాస్
ఎ. ఐ. ఆర్. 1969 యం. పి. 147

సవరణ చట్టమునకంటే ముందు నియమించబడిన పబ్లిక్ ఎనలిస్టు ఈ చట్టం క్రింద నియమించబడినట్లుగా పరిగణించబడును.

శంభుదయాల్ Vs స్టేట్ ఆఫ్ యు. పి.
ఎ. ఐ. ఆర్. 1979 యస్. సి. 310.

వ్యక్తి :-

ఈ సెక్షనులో వ్యక్తి నిర్వచనములో, కంపెనీ, వగైరాలు రావు.

పబ్లిక్ ఎనలిస్టులు నియామకమునకు అర్హతలు ఆహార వస్తువుల కల్తీ నివారణ నియమావళి 1955, రూలు 6 లో నిర్దేశించబడినవి.

రూలు 7 లో పబ్లిక్ ఎనలిస్టు విధులు నిర్దేశించబడివున్నవి.

రిపోర్టు :-

ఎనలిస్టు రిపోర్టులో విశ్లేషణం యొక్క పద్ధతియొక్క ఫలితం వ్రాస్తే చాలు.

ఎ. ఐ. ఆర్. 1970 యస్. సి. 318
ఎ. ఐ. ఆర్. 1966 యస్. సి. 128
1972 (2) ఎ. పి. యల్. జె. 108.

పబ్లిక్ ఎనలిస్టులు అసిస్టెంట్ద్వారా పరీక్ష చేయించవచ్చును.కాని రిపోర్టు తాను ఇవ్వవలెను.

1964 క్రి. లా. జ. 262

పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు యిచ్చిన తర్వాత పక్షపాతంతో యిచ్చినదనిగాని, అసలు విషయాలను తప్పుగా చదువుకొని యిచ్చినదనిగాని, నిరూపించేవరకు— అది రద్దయితే తప్ప, ఆ రిపోర్టును అంగీకరించవలెను.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ Vs కనుమర్లపూడి రామలింగయ్య
ఎ. ఐ. ఆర్. 1969 ఎ. పి. 445

ఆంధ్ర ప్రదేశ్ ఆహార కల్తీ నియమావళి రూలు 12 :—

రాష్ట్రప్రభుత్వము రాజపత్రాలలో ప్రకటనద్వారా, నిర్దేశించబడిన అర్హతలు గలిగిన ఒకడు లేక ఎక్కువ వ్యక్తులను, లోకల్ అథారిటీ తన ప్రత్యేక పబ్లిక్ ఎనలిస్టును నియమించగలిగిన ప్రాంతం తప్ప, మిగతా రాష్ట్రమంతటా అధికార పరిధి గలిగిన పబ్లిక్ ఎనలిస్టుగా నియమించవచ్చును.

## సెక్షను 9:—

ఫుడ్ ఇన్స్పెక్టరు :— కేంద్ర ప్రభుత్వము గాని, రాష్ట్ర ప్రభుత్వము గాని, ప్రభుత్వ గజెట్ ప్రకటన ద్వారా, నిర్దేశించబడిన అర్హతలు గలిగిన అట్టి ప్రభుత్వము అర్హుడుగా భావించిన తగువ్యక్తిని నిర్ణయించిన "ప్రాంతీయప్రదేశములకు" 'ఫుడ్ ఇన్స్పెక్టరు'గా నియమించవచ్చును.

ఆహార తయారీలో గాని, దిగుమతులలో గాని, అమ్మకంలో గాని ఆర్థిక ప్రయోజనములు కల్గి ఉన్న వ్యక్తిని, ఈ సెక్షను క్రింద ఫుడ్ ఇన్స్పెక్టరుగా నియమించరాదు.

ఫుడ్ ఇన్స్పెక్టరుగా నియమించబడిన వ్యక్తి, సె. 21 ఇండియన్ పీనల్ కోడ్ ప్రకారము పబ్లిక్ సర్వెంటుగా పరిగణింప బడును; మరియు వానిని నియమించిన ప్రభుత్వంచే ఇందుకొరకు ఉదహరించబడిన వ్యక్తికి లోబడిన అధికారిగా ఉండును.

## వ్యాఖ్య

ఆహార కల్తీ నిరోధక నియమావళి 1955 రూలు 8 లో ఫుడ్ ఇన్స్పెక్టరు నియామకమునకు అర్హతలు పేర్కొనబడినవి.

ఫుడ్ ఇన్స్పెక్టరు యొక్క అధికారములు, విధులు 10వ సెక్షనులో చెప్ప బడినది.

రాష్ట్రములలో కొంత మంది శానిటరీ ఇన్స్పెక్టరులను ఫుడ్ యిన్స్పెక్టరు లగా నియమించుటయే జరుగుచున్నదిగాని, ప్రత్యేకముగా ఫుడ్ యిన్స్పెక్టర్లు నియ మించిన సందర్భములు బహు స్వల్పం.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, జి. ఓ. యం. యస్. 313 హెల్త్ 23.2.56లో ఈ క్రింది వ్యక్తులను ఫుడ్ యిన్స్పెక్టర్లుగా నియమించి 2వ కాలంలో చూపబడిన ప్రాంతముల (Local area) లో వారి అధికారములను చలాయించవలెనని ఆజ్ఞా పించినది.

| వ్యక్తులు | లోకల్ ఏరియా |
|---|---|
| 1. మునిసిపల్ హెల్తు ఆఫీసరు, మరియు అతని అధికారమునకు లోబడియున్న శానిటరీ ఇన్స్పెక్టర్లు | హెల్తు ఆఫీసర్లు ఉన్న మునిసిపాలిటీలు |
| 2. మునిసిపల్ కమీషనరు, అతని అధి కారములకు లోబడియున్న శానిటరీ ఇన్స్పెక్టర్లు | హెల్తు ఆఫీసరు లేని మునిసిపాలిటీలు |
| 3. శానిటరీ ఇన్స్పెక్టర్లు | శానిటరీ ఇన్స్పెక్టరు కలిగి యున్న పంచాయతీలు. |
| 4. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు ఆ రేంజి హెల్తు ఇన్స్పెక్టరు | శానిటరీ ఇన్స్పెక్టరులేని పంచాయతీలు |

జి. ఓ. యం. యస్. నం. 1776 తేదీ 27. 6. 60 ద్వారా సవరించబడిన జి. ఓ. 305 హెల్తు 6. 2. 58 ప్రకారము హైదారాబాద్ మునిసిపల్ కార్పోరేషను పరిధిలోని ప్రాంతమంతా ఒక లోకల్ యేరియా.

సికిందారాబాదు మునిసిపల్ కార్పోరేషను మరియు సె. 3 లో ఉదహరించిన ప్రాంతమంతా (హైదరాబాదు మునిసిపల్ కార్పోరేషను ప్రాంతం తప్ప) ఒక లోకల్ ఏరియా.

తెలంగాణాలో ఉన్న జిల్లాలలో శానిటరీ ఇన్‌స్పెక్టర్లు, సెక్షను 9 ప్రకారం అధికార బాధ్యతలను నిర్వహించుటకు ఫుడ్ ఇన్‌స్పెక్టర్లుగా జి. ఓ. 1940 హెల్తు 22-7-60 ద్వారా నియమింపబడ్డారు. (గమనిక ఈ ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించి ఈ చట్టం క్రింద జి. ఓ. ల నంబర్లు ఇప్పుడు మార్కెటులో ఉన్న చాలా గ్రంథము లలో కొన్ని తప్పులున్నవి. నంబర్లు పరీక్షచేసి సరియైన నంబర్లు ఇందు ఉదహరించ బడినవి.)

నియామకముల ప్రకటన :—

ఫుడ్ ఇన్‌స్పెక్టరు నియామకం రాజపత్రంలో ప్రకటన అయితే తప్ప; ఈ చట్టం క్రింద అధికారములు పొందడు.

పరమేశ్వర ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ బీహార్
1964 క్రి. లా. జ. 605

పేరుపైగాని, అధికారహోదా ఉదహరించిగాని, నియామకము చేయవచ్చును.

పి. పి. Vs రామభద్రయ్య
ఎ. ఐ. ఆర్. 1960 ఎ. పి. 282

మునిసిపల్ కౌన్సిల్ అకోలా Vs శ్రీపత్ గణేశ్‌లాల్
ఎ. ఐ. ఆర్. 1968 యస్. సి. 432

ఆహార తయారీ ప్రయోజనము :—

ఆహార వస్తువుల తయారీ ప్రయోజనము కలిగియున్నప్పటికి ఫుడ్ యిన్‌స్పెక్టరు విశ్లేషణం కొరకు శాంపిల్ తీసుకొనుటకు అభ్యంతరములేదు.

మునిసిపల్ కార్పోరేషను ఢిల్లీ Vs షోఈలాల్
1975 యఫ్. ఎ. సి. 192

నియామకముల క్రమబద్ధత :—

ఒక ఫుడ్ యిన్‌స్పెక్టరు సక్రమంగా నియమింపబడెనా అనేది వాస్తవాంశ విషయము. మొదటిసారిగా అప్పీల్‌లో వాదించిన చెల్లదు.

మంకా హరి Vs స్టేట్—ఎ. ఐ. ఆర్. 1968 గుజరాత్ 88.

అర్హతలు లేని ఫుడ్ యిన్‌స్పెక్టరు, శాంపిల్ తీసికొనిన తదుపరి ప్రత్యేక పరీక్షలు ప్యాసయి, అర్హతలు సంపాదించినా, పూర్వం తీసికొనిన శాంపిల్ పై పెట్టబడిన కేసులోని ముద్దాయి విమోచనార్హుడు.

షబీర్ Vs అబ్దుల్ రహిమాన్ - ఎ. ఐ. ఆర్. 1969 అలహాబాదు 478.

సెక్షన్ **10**: ఫుడ్ యిన్స్పెక్టరు అధికారములు :—

(ఫుడ్ యిన్స్పెక్టర్ ఈ అధికారములు కలిగి యుండును)

ఎ. i) ఆహార వస్తువు అమ్ముచున్న ఏ వ్యక్తి నుండయినా,

ii) కొనుగోలు దారునకు లేక గ్రాహకునకు రవాణా చేయు, లేక ఇచ్చు లేక బట్వాడా చేయు, లేక ప్రయత్నంచేయు క్రమములో ఉన్న ఏ వ్యక్తి నుండయినా,

iii) బట్వాడా చేసిన తరువాత గ్రాహకునుండయినా— ఆహార వస్తువుల శాంపిల్ తీసుకొనుటకు,

బి. అట్టి శాంపిల్‌ను ఆ ప్రాంతీయ పబ్లిక్ ఎనలిస్టుకు పరీక్ష కొరకు పంపుటకు,

సి. ఫుడ్ హెల్త్ అథారిటీ యొక్క పూర్వ అనుమతితో గాని ఆ ప్రాంతములో అధికారములు గలిగిన లోకల్ హెల్త్ అథారిటీ యొక్క పూర్వానుమతితో గాని ఏ ఆహార వస్తువుల యొక్క అమ్మకము అయినా ప్రజారోగ్య దృష్ట్యా నిషేధించుటకు—

(ఫుడ్ యిన్‌స్పెక్టరు అధికారము కలిగియుండును.)

క్లాజు (ఎ) సబ్ క్లాజు (iii) నిమిత్తము, 'గ్రాహకుడు' అను పదము తన స్వంత ఉపయోగం నిమిత్తం, ఆహారం కొనుగోలు చేసిన, లేక పొందిన వ్యక్తికి వర్తించదు.

(2) ఆహార వస్తువులు, అమ్మకమునకు తయారీ చేయుచున్న, లేక నిల్వ చేసియున్న లేక అమ్మకమునకు ఆహార వస్తువులు తయారీ చేయుట కొరకు నిల్వ చేసిన, అమ్మకమునకు పెట్టిన లేక ప్రదర్శించినట్టి ఏ ప్రదేశమయినా లేక 'కల్తీ చేయు పదార్థము' తయారీ చేయుట లేక నిల్వ చేసినట్టి ఏ ప్రదేశమయినా ఫుడ్ యిన్‌స్పెక్టరు ప్రవేశించ వచ్చును, తనిఖీ చేయవచ్చును. మరియు అట్టి ఆహార వస్తువునుండి గాని కల్తీచేయు పదార్థము నుండి గాని విశ్లేషణం నిమిత్తము శాంపిల్ తీసికొనవచ్చును.

కాని ఏ ఆహార వస్తువు అయినా, అది ప్రాథమిక ఆహారము అయి యుండిన అది అమ్మకమునకు ఉద్దేశించినది కానిచో, శాంపిల్ తీసికొనరాదు.

(3) సబ్ సెక్షను (1) క్లాజు (ఎ) ప్రకారంగాని, సబ్ సెక్షను (2) ప్రకారంగాని శాంపిల్ తీసికొన్నప్పుడు ఏ వ్యక్తినుండి అయితే శాంపిల్ తీసికొనబడెనో అట్టి వ్యక్తికి, మార్కెట్టులో సదరు పదార్థము ప్రజలకు అమ్ము వెల ప్రకారం ఆ శాంపిల్ యొక్క మూల్యం చెల్లించవలెను.

(4) ఫుడ్ యిన్‌స్పెక్టరు ఏ ఆహార వస్తువయినా కల్తీ చేయ బడినది అనిగాని 'మిస్ బ్రాండ్' చేయబడినది గాని అనిపించినప్పుడు ఆహార వస్తువును స్వాధీనము చేసికొనవచ్చును లేక తీసికొని పోవ చ్చును లేక తర్వాత చెప్పబడిన విధంగా చేయగలందులకు అమ్మకం ధారు యొక్క స్వాధీనంలోనే ఉంచవచ్చును. ఏ విధంగా చేసినప్ప

టికి, తప్పక శాంపిల్ తీసికొనవలెను మరియు పబ్లిక్ ఎనలిస్టుకు విశ్లేషణం నిమిత్తం పంపవలెను.

అయితే అమ్మకందారు స్వాధీనములో ఉంచినప్పుడు ఫుడ్ ఇన్‌స్పెక్టరుకు సముచితమని తోచిన రీతిన, ఒకరుగాని ఎక్కువ జామీనుదారులతోగాని ఆహార వస్తువు యొక్క విలువకు సమానమయిన మొత్తమునకు అమ్మకందారునుండి బాండు వ్రాసి యివ్వమని కోరవచ్చును. అమ్మకందారు తప్పనిసరిగా ఆ విధంగా బాండు వ్రాసి యివ్వవలెను.

(4-ఎ) సబ్ సెక్షన్ (4) క్రింద స్వాధీనం చేసికొనిన ఎట్టి ఆహార వస్తువు అయినా త్వరగా నశించునట్టి స్వభావము కలదయినచో, లోకల్ హెల్త్ అథారిటీ అట్టి ఆహార వస్తువు మానవాహారముగా పనికిరానంత క్షీణించినదని సంతృప్తి చెందినచో, సదరు అథారిటీ విక్రయదారుకు లిఖితపూర్వకమైన నోటీసు యిచ్చి, దానిని నాశనము చేయించవచ్చును.

5) ఈ సెక్షను క్రింది అధికారములలో, ఆహార వస్తువు కలిగియుండు ఏ ప్యాకేజి అయినా పగలగొట్టించుటకు, అమ్మకమునకు ఆహార వస్తువులు యుండు ఆవరణయొక్క తలుపులు పగలగొట్టించు అధికారములు కలిగియున్నవి.

అయితే ప్యాకేజిగాని తలుపులుగాని పగులగొట్టు అధికారం, అట్టి ప్యాకేజి లేక ఆవరణయొక్క స్వంతదారుగాని, ప్యాకేజీ స్వాధీనం కల్గిన వ్యక్తి, లేక సందర్భానుసారంగా, అట్టి ఆవరణ భుక్తదారుగాని కోరబడినప్పుడు, ప్యాకేజి లేక తలుపులు తెరచుటకు నిరాకరించిన తర్వాత మాత్రమే చలాయించవలెను. మరియు ఏ సందర్భములోనయినా, అట్లు చలాయించుటకు గల కారణములు ముందుగా నమోదు చేసిన తర్వాతనే చలాయించవలెను. మరయితే ఒక

ప్రదేశములోనికి ప్రవేశించు తనిఖీచేయు అధికారములు చలాయించు నప్పుడు ఫుడ్ యిన్స్పెక్టరు, క్రిమినల్ ప్రొసీజరు కోడు 1973 లో పోలీసు అధికారి, సోదా వారంటు అమలుచేయునపుడు సోదా లేక తనిఖీలకు సంబంధించి అనుసరించవలసిన నిబంధనలన్నిటినీ సాధ్యమయినంతవరకు అనుసరించవలెను.

6) ఆహారము తయారీ చేయు, పంపిణీ లేక వ్యాపారముచేయు వ్యక్తి యొక్క స్వాధీనములో గాని, అట్టి వ్యక్తి స్వాధీనములో ఉన్న ఆవరణలో గాని కల్తీచేయు పదార్థము కనుగొనబడినప్పుడు అట్లు కలిగియున్నందుకు ఫుడ్ యిన్స్పెక్టరు సంతృప్తి అగునట్లు జవాబు చెప్పలేనప్పుడు, సదరు కల్తీచేయు పదార్థమును మరియు ఆ వ్యక్తి స్వాధీనములో, లేక కంట్రోలులో కనుగొనబడిన ఖాతా పుస్తకములు, మరియు ఇతర పత్రములు ఈ శాసనము క్రింద ప్రొసీడింగ్సుకు లేక పరిశోధనకు, కార్యకలాపములకు ఉపయోగకరములు లేక సంగతములైన వయినచో ఫుడ్ యిన్స్పెక్టరు స్వాధీనం చేసికొనవచ్చును. కల్తీ పదార్థము యొక్క శాంపిల్ విశ్లేషణ కొరకు పబ్లిక్ ఎనలిస్టుకు పంపవచ్చును. అయితే అకౌంటు పుస్తకములు లేక యితర పత్రములు తన పై అధికారి యొక్క పూర్వానుమతితో తప్ప స్వాధీనం చేసుకొనరాదు. (జప్తు చేయరాదు).

7. ఫుడ్ ఇన్స్పెక్టరు సబ్ సెక్షను 1 ఎ సబ్ సెక్షను 2 సబ్ సెక్షను 4 సబ్ సెక్షను 6 క్రింద చర్యతీసికొనునప్పుడు ఒకరు లేక యెక్కువ వ్యక్తులను అట్టి చర్య తీసికొను సమయములో హాజరు ఉండుటకు పిలువవలెను. మరియు ఆ వ్యక్తి లేక వ్యక్తుల యొక్క సంతకములు తీసికొనవలెను.

(7 ఎ) సబ్ సెక్షను (6) క్రింద అకౌంటు పుస్తకములు పత్రములు స్వాధీనం చేసికొన్నప్పుడు 30 రోజులకు మించని గడువులోగా ఫ

వ్యక్తి నుండి అవి తీసికొనబడెనో నిర్ణయించబడిన పద్ధతిలో ఆ వ్యక్తి సర్టిఫై చేసిన నకళ్ళు లేక సంక్షిప్త సమాచారము తీసికొని, వానిని అట్టి వ్యక్తికి వాపసు చేయవలెను.

కాని, ఆ వ్యక్తి అట్లు ధృవీకరించుటకు నిరాకరించినప్పుడు మరియు ఈ చట్టము క్రింద వానిపై ప్రాసీడింగ్సు ప్రారంభించినచో, కోర్టు ధృవీకరించిన కాపీలు లేక సంక్షిప్త సమాచారము తీసికొన్న తర్వాత మాత్రమే, సదరు ఖాతాలు లేక పత్రములు వాపసు చేయవలెను.

(7. బి) సబ్ సెక్షను (6) క్రింద కల్తీ చేయు పదార్థము ఒక వ్యక్తి స్వాధీనములో నుండి జప్తు చేసినప్పుడు సదరు పదార్థము ఆహారము కల్తీ చేయుటకు ఉద్దేశించబడినది గాదు అని నిరూపించుకొనే భారం ఆ వ్యక్తిపైన ఉండును.

(8) ఏ వ్యక్తినుండయితే ఆహారం స్వాధీనంచేసికొనబడెనో, లేక శాంపిల్ తీసికొనబడెనో ఆ వ్యక్తి యొక్క నిజమైన పేరు విలాసము తెలిసికొనుటకు క్రిమినల్ ప్రొసీజరు కోడు సె. 42 ప్రకారం పోలీసు అధికారికి గల అధికారములు, ఫుడ్ యిన్‌స్పెక్టరు చలాయించవచ్చును.

(9) ఈ చట్టం క్రింద కాని దీని క్రింద చేయబడిన నియమముల క్రింద గాని అధికారములు చలాయించు ఏ ఫుడ్ యిన్‌స్పెక్టరు అయినా

ఎ) క్షోభ కలిగించునట్లుగా, అనుమానించుటకు సమంజసమైన కారణములు లేకుండ, ఏ ఆహారమునయినా, కల్తీ చేయు పదార్థము నయినా జప్తు చేసినా, లేక

బి) తన విధి నిర్వహణకు అవసరమని భావించుటకు కారణములు లేకనే ఇతరులకు కష్టము కలిగించే ఏ పని చేసినా,

ఈ శాసనము క్రింద నేరస్థుడగును. మరియు అట్టి నేరమునకు రూ. 500/- లకు తక్కువ లేకుండా, రూ 1000/- వరకు జరిమానాకు బాధ్యుడగును.

## వ్యాఖ్య

1. శాసన చరిత్ర, పరిధి.
2. సబ్ సెక్షను 1-శాంపిల్ తీసుకొను అధికారం.
3. ,, 2-ప్రవేశ హక్కు.
4. ,, 3-మూల్యం చెల్లింపు.
5. ,, 4-జప్తు తాత్కాలిక స్వాధీనం.
6. ,, 5-సోదా చేయు అధికారం.
7. సాక్షులను పిలుచుట.
8. ఫుడ్ ఇన్స్పెక్టరు సాక్ష్యము.
9. ఋజువు బాధ్యత.
10. అరెస్టు అధికారం.
11. అధికార దుర్వినియోగం.
12. రాజ్యాంగ బద్ధత.

1. శాసన చరిత్ర, పరిధి :—

ఈ శాసనములోని నిబంధనలు అమలుపరచి ఆహార కల్తీ రాక్షసిని నిర్మూలన చేయుటకు ఫుడ్ యిన్స్పెక్టర్లకు ఈ సెక్షను ద్వారా విస్తారమైన అధికారములీయ బడినవి.

శాంపిల్ తీసికొనుట, సోదా చేయుట, ఆస్తి జప్తు చేయుట, బాండు కోరుట, కొన్ని పరిస్థితులలో అరెస్టు చేయుట, మొదలయిన అధికారములు ఈ సెక్షన్ ద్వారా సంక్రమించినవి. 1964 సవరణ తర్వాత అనుభవాన్ని పురస్కరించుకొని జాయింటు సెలక్టు కమిటీ సిఫారసులను దృష్టిలో ఉంచుకొని, 1976 లో సెక్షను

లోని కాఠిన్యము కొంత సడలించబడినది. అమాయకులను ఫుడ్ యిన్‌స్పెక్టర్లు విసిగించకుండా సె, 10 (1) సబ్ క్లాజు (సి) తర్వాత ఒక వివరణ, చేర్చబడింది. క్లాజు (2), (4), (5), (6) లు సవరించబడినవి. అకౌంటు పుస్తకముల స్వాధీనం, వాపసుకు సంబంధించి (7 ఎ), కల్తీ చేయు పదార్థము స్వాధీనంలో ఉన్నప్పుడు నిర్దోషిత్వం నిరూపించుకొను బాధ్యత ముద్దాయిపై పెట్టుచు సబ్ క్లాజు (7 బి) చేర్చబడినది.

2 శాంపిల్ తీసుకొనుట :—

కేవలం తాత్కాలిక కస్టడీ కలిగియున్న రవాణాదారు నుండి శాంపిల్ తీసికొనుటకు ఫుడ్ యిన్‌స్పెక్టరుకు అధికారంలేదు.

పి. పి. Vs పుల్లారెడ్డి

ఎ. ఐ. ఆర్. 1966 ఎ. పి. 302.

ఫుడ్ ఇన్‌స్పెక్టరుకు, టీలో కలుపుటకు ఉంచిన చక్కెర నుండి శాంపిల్ తీసుకొను అధికారము కలదు.

ఫుడ్ ఇన్‌స్పెక్టరు కాలికట్ Vs గోపాలన్

ఎ. ఐ. ఆర్. 1971 యస్. సి. 1725.

3. సబ్ సెక్షను 2 ప్రవేశ హక్కు :—

(సబ్ సెక్షను 5 క్రింది వ్యాఖ్య చూడుడు.)

4. సబ్ సెక్షను 3 మూల్యం చెల్లింపు :—

ఫుడ్ ఇన్‌స్పెక్టరు ఆహార పదార్థము యొక్క మార్కెటు వెల చెల్లించవలెను. అమ్మకందారు కోరిన మూల్యం చెల్లించనవసరంలేదు.

పి. కె. కనే Vs యఫ్. కె. ఇరాని.

1974 యఫ్. ఎ. సి. 510

ఫుడ్ యిన్‌స్పెక్టరు శాంపిల్ తీసికొనినప్పుడు స్వంతదారు మూల్యము నిరాకరించవచ్చును. అప్పుడు 'అమ్మకం' లేదు. కాని, మూల్యం తీసికొన్నచో, అమ్మకం పూర్తి అయినట్లే.

పి. పి. Vs కుసనపల్లి నరసింహారాజు

1970 (2) ఎ. పి. యల్. జె. 9

5. సబ్ సెక్షను 4 జప్తు :—

ఫుడ్ యిన్స్పెక్టరు జప్తుచేసి తీసికొనిపోయినచో, దానిని సె. 10 (4-ఎ) ప్రకారము నశింపచేయనిచో,

సె. 11 (4) ప్రకారం కోర్టులో తప్పనిసరిగా హాజరు పరచవలెను.

శాంపిల్ తీసికొనిన ప్రతి సందర్భములోనూ పూర్తి నిల్వలను జప్తుచేయుట తప్పనిసరిగాదు.

పి. పి. Vs విశ్వనాథం చెట్టి
ఎ. ఐ. ఆర్. 1960 ఎ. పి. 96

శాంపిల్ తీసికొనుటకు ముఖ్యావసరమైనది ఫుడ్ యిన్స్పెక్టరు యొక్క అనుమానము కాదు. అట్లు అనుమానపడుటకు తగిన కారణములుండుట ముఖ్యము.

పి. పి. Vs శేషయ్య - 1963 (1) ఆం. వీ. రి. 296.

తాత్కాలిక స్వాధీనము :—

ఏ వ్యక్తికయినా, సె. 10 (4) ప్రకారం జప్తుచేసిన నిల్వలు తాత్కాలిక స్వాధీనపరచినప్పుడు, ఆ పదార్థములు అట్లనే ఉంచే బాధ్యత వానిపైగలదు. అతడు ఏ విధముగానయినా నిల్వలో జోక్యం కల్గించుకున్నట్లయితే 16 1 (ఎ ఎ) క్రింద శిక్షార్హుడగును.

ఆ యాహారమును అమ్మినా పంపిణీచేసినా, 16 (1-బి) క్రింద శిక్షింపబడును. అట్లు తాత్కాలిక స్వాధీనము తీసికొన్నప్పుడు ఫుడ్ యిన్స్పెక్టరు అమ్మకందారును ఆహార కల్తీ నిరోధక నిబంధనలు 1955 నిబంధనల ప్రకారం అనుసూచి (ఎ) లోని (iv) ఫారంలో బాండు యివ్వమని కోరవచ్చును.

అట్టి బాండు జామీనుదారు లేక జామీనుదార్లతో యిప్పించవలెను. అమ్మకందారు యొక్క స్వంత బాండు చాలదు.

6. సోదాచేయు అధికారం :—

సబ్ సెక్షను (2) క్రింద ఫుడ్ యిన్స్పెక్టరుకు సోదాచేయు అధికారం యివ్వబడినది. సబ్ సెక్షను (5) క్రింద ఆ ప్రదేశంలోనికి తలుపులు పగులగొట్టుకొని పోవు అధికారం యివ్వబడినది. అయితే స్వంతదారు లేక భుక్తదారు ప్యాకేజిగాని,

ఆవరణ తలుపులుగాని తెరచుటకు నిరాకరించినప్పుడే, యీ అధికారం చెలాయించవలెను. సాధ్యమయినంతవరకు క్రిమినల్ ప్రొసిజరుకోడ్ సె 47, 100 లు అనుసరించవలెను.

సోదా చేయుటలో ఆస్తి స్వాధీనం చేసుకొనుటలో నిబంధనలు పొందింపడములో అపసవ్యములు జరిగినంత మాత్రాన ప్రొసీడింగ్సు యొక్క న్యాయతచెడదు.

సుందర్‌సింగ్ Vs స్టేట్ - ఎ. ఐ. ఆర్. 1956 యస్. పి 111

సోదా పట్టీయొక్క నకలు ఆస్తిదారుకు యివ్వవలెను. సోదాలో జరిగిన ప్రతి అడుగూ ఏం జరిగినదో ఫుడ్ ఇన్‌స్పెక్టర్ వ్రాయనక్కరలేదు. కాని, సోదా జరుగుతున్నంతసేపు ప్రతిక్షణం ఎఫ్. ఐ. వెంట సాక్షులు ఉన్నట్లు నిరూపించవలెను.

రాందాస్ Vs స్టేట్ - ఎ. ఐ. ఆర్. 1979 అలహాబాద్ 109

సోదా జరుగుచున్న ఆహారం యొక్క స్వంతదారు సోదా అప్పుడు ఉండనవసరములేదు.

ఫుడ్ యిన్‌స్పెక్టరు శాంపిల్ తీసికొన్నప్పుడు తయారుచేసిన మహజరుపై విక్రయదారుయొక్క సంతకం కోరుట రాజ్యాంగం 20 వ సూత్రమునకు భంగకరం కాదు.

సెక్షను. 100 [4] క్రిమినల్ ప్రొసీజరు కోడ్‌కు సెక్షను 10 [7]కు గల సారూప్య విభేదములు —

| సెక్షను 10 [7] పి. యఫ్. ఆక్ట్ | 100 [4] క్రిమినల్ ప్రొసీజరు కోడు |
|---|---|
| 1. ఫుడ్ యిన్‌స్పెక్టరు కనీసం ఒక సాక్షిని పిలువవలెను. | పోలీసు ఆఫీసరు కనీసం ఇద్దరు సాక్షులను పిలువవలెను. |
| 2. సాక్షులు ఆ ప్రాంతంవారై ఉండనవసరములేదు. | ఆ ప్రాంతంవారై యుండవలెను, |

| | |
|---|---|
| 3. సాక్షుల సంతకం తీసికొనవలెను. | సాక్షుల సంతకం తీసికొనవలెను. |
| 4. సోదా జాబితా తయారుచేయవలెను. | పోలీసు మాన్యువల్‌లో యిచ్చిన సోదా జాబితా మాదిరి ప్రకారం తయారు చేయవలెను. |
| 5. సాక్షులు ఫుడ్ యిన్‌స్పెక్టరు ప్రభావమునకు లోబడిన వారు కాకూడదు. | పోలీసు ఆఫీసరుకు లోబడి యుండరాదు. |
| 6. ఈ నిబంధనలు పాటించిన కారణం చేత విచారణ చెల్లకపోదు. ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 789. | సోదాలో అవకతవకలు జరిగిన కారణం చేత విచారణ చెల్లకపోదు. ఎ. ఐ. ఆర్. 1956 యస్. సి. 411 |

7. సాక్షులను పిలుచుట :—

1955 చట్టంలో 'సాధ్యమయినంతవరకు ఇద్దరికి తక్కువ కాకుండా,' అని ఉండెడిది. 1964 లో సవరణ ద్వారా 'ఒకరు లేక యెక్కువ మంది' అని మార్చబడినది.

సాక్షులు ఆహార వస్తువుల వ్యాపారముతో సంబంధము లేనివారై యుండవలెను. శాసనము ఒక సాక్షి యుండవలెనని శాసించుటలోని భావము ఆ సాక్షి స్వతంత్రుడు, ఫుడ్ యిన్స్పెక్టరుకులోబడని వాడయి ఉండవలెను. సాక్షము అనుమాన రహితముగా ఉండవలెను.

రామ లాభ్య Vs మునిసిపల్ కార్పొరేషన్ ఢిల్లీ,
[ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 789.]

సెక్షను 10 (7) ప్రకారము ఫుడ్ యిన్స్పెక్టరు ఒకరుగాని ఎక్కువగాని సాక్షులను పిలువవలెను. ప్రక్క దుకాణం వారిని పిలిచినప్పుడు ఎవరూ సాక్షిగా ఉండుటకు నిరాకరించవచ్చును. శాసనం యొక్క కట్టుబాట్లను అతిక్రమించటలో తోటి వ్యాపారులు ఒకరికొకరు సానుభూతితో వ్యవహరించి, గూడుపుఠాణి చేసి, సాక్షి రాకుండా చేయు సందర్భాలుండుట సహజమే. ఫుడ్ యిన్స్పెక్టరు సాధ్యమయిన ప్రయత్నములు చేసినప్పటికీ సాక్షులు రాని సందర్భాలలో కాని, ఇతరమైన అమోకర

మైన కారణములున్న సందర్భాలలో కాని, ఇన్స్పెక్టరు యొక్క సాక్ష్యం ఇతరసాక్ష్యం పరిశీలించి, ఆహార వస్తువుల స్వాధీనమునకు తగిన రుజువుగా పరిగణించవచ్చును.

రామలాభ్య Vs మునిసిపల్ కార్పొరేషన్ ఢిల్లీ,
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 789.
పి. పి. Vs సుబ్బమ్మ - 1969 క్రి. లా. జ. 1004 ఎ. పి.

సె. 10 (7) యొక్క నిబంధనలు అతిక్రమించినప్పుడు నేర విచారణ చెల్లునా, చెల్లదా అను ప్రశ్నపై యొకప్పుడు భేదాభిప్రాయములున్నవి. సుప్రీం కోర్టు, సె. 10 (7) వ్యతిరేకించినంత మాత్రాన నేరవిచారణ చెల్లదనుట సమంజసం కాదని తీర్పు యిచ్చింది.

బాబులాల్ హరగోవిందదాస్ Vs గుజరాత్ స్టేట్,
ఎ. ఐ. ఆర్. 1971 యస్. సి. 1277.

సాక్షులను పిలిచినప్పటికి వారు తిరస్కరించినప్పుడు సె. 10 (7) అనుసరించ బడినట్లే.

బాబూఖాన్ Vs స్టేట్ ఆఫ్ యు. పి.
1980 (2) యఫ్. ఎ. సి. 330

మురళీలాల్ Vs స్టేట్
1981 (1) యఫ్. ఎ. సి. 157 అలహాబాదు.

శాంపిలు తీసికొనినప్పుడు చాలా మంది ప్రజలున్నప్పటికి, సాక్షులుగా పిలచుటకు ఫుడ్ యిన్స్పెక్టరు ఎటువంటి ప్రయత్నము చేయనప్పుడు సె. 10 (7) అమలు జరుగలేదు.

మూల్‌చంద్ Vs స్టేట్ ఆఫ్ పంజాబ్
1982 క్రి. లా. జ. 201 [పి. & హెచ్.]

సాక్షులు స్వతంత్రులై యుండవలెను. కార్యక్రమము న్యాయమైన పద్ధతిలో జరుగునట్లు చూచుట ముఖ్యోద్దేశ్యము. అయితే ఎటువంటి వ్యక్తులు స్వతంత్రులు

అని చెప్పుట కష్టం. ఆహార పదార్థముల వ్యాపారము చేసే వారందరూ ఫుడ్ ఇన్స్పెక్టరుకు లోబడినవారే అనుట తగదు.

ఫుడ్ యిన్స్పెక్టరు Vs జాయ్ మరియు తదితరులు
1982 క్రి. లా. జ. 676 (కేరళ)

ఫుడ్ ఇన్స్పెక్టరుగా నియమితుడయిన ఒక డాక్టరు శాంపిల్ తీసికొనుచుండగా, మరియొక డాక్టరు— అతడు గూడ ఫుడ్ యిన్స్పెక్టరుగా నియమించబడినవాడే— సాక్షిగా పిలువబడెను. ఆ కారణంచేత విచారణ యొక్క న్యాయతకు భంగము లేదు.

1984 క్రి. లా. జ. 198, (పంజాబ్) (యన్. ఒ. సి.)

సె. 10 (7) ఆదేశకంగాదు, ముద్దాయి వాదన అసంభవం కానప్పుడు, విముక్తికి అర్హుడు.

స్టేట్ ఆఫ్ యం. పి. Vs రాంఛోడ్
1985 యఫ్. ఏ. జె. 393 (యం. పి.)

8. ఫుడ్ యిన్స్పెక్టరు సాక్ష్యం :—

ఇతర సాక్ష్యాలు లేకుండా, ఫుడ్ యిన్స్పెక్టరు సాక్షం అంగీకరించరాదనుట సమంజసం కాదని సుప్రీంకోర్టు స్పష్టపరిచింది.

i) సాక్షం లభించకపోయినా, ii) సాక్షి అప్పుడు ఉండి కోర్టులో సాక్షం చెప్పడానికి లేకపోయినా, iii) కోర్టుకు వచ్చి వ్యతిరేక సాక్ష్యం ఇచ్చినా, ఆయాసందర్భాలు క్షుణ్ణంగా పరిశీలించి, ఫుడ్ యిన్స్పెక్టరు వాఙ్మూలం ఆమోద యోగ్యంగా ఉంటే అంగీకరించవచ్చును.

హరగోవిందలాల్ కేసు- ఎ. ఐ. ఆర్. 1971 యస్. సి. 1277
రామలాభ్యా కేసు— ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 789.

(ఈ రెండు తీర్పులలో ఫుడ్ యిన్స్పెక్టరు వాఙ్మూలం యొక్క విలువ గురించి వివరంగా చర్చించబడినది.)

అయితే ఫుడ్ యిన్స్పెక్టరు నిజమైన ప్రయత్నము చేసియూ, సాక్షులనూ పొందలేక పోయినట్లు నిరూపించవలెను.

స్టేట్ ఆఫ్ పంజాబ్ Vs కాశ్మీర్ సింగ్
1980 1 యఫ్. ఎ. సి. 54
1980 క్రి. లా. జ. 334.

9. ఋజువు బాధ్యత :—

(7. బి.) ఒక వ్యక్తి స్వాధీనములో కల్తీ చేయు పదార్థము కనుగొన్నప్పుడు అది కల్తీ చేయుటకు కాదని నిరూపించుకొనే బాధ్యత ఆ వ్యక్తి పైనే ఉండును.

10. అరెస్టుచేయు అధికారము :—

ఈ సెక్షను క్రింద, ఫుడ్ యిన్స్పెక్టరు పోలీసు అధికారికి సె. 42 క్రిమినల్ ప్రొసిజరు కోడు క్రింద ఉన్న అధికారాలు చెలాయించవచ్చును. సరియైన పేరు, విలాసము ఇవ్వనప్పుడు, సదరు సెక్షనులో చెప్పబడిన ఇతర పరిస్థితులలో, అరెస్టు చేయు అధికారం యివ్వబడినది.

11. అధికార దుర్వినియోగము :—

ఫుడ్ యిన్స్పెక్టరు తన అధికారములను దుర్వినియోగం చేయకుండా, అరికట్టు ఉద్దేశ్యంతో ఈ సబ్ సెక్షను రూపొందించబడినది.

ఫుడ్ యిన్స్పెక్టర్ యొక్క అనుమానం సమంజసమైన కారణములపై ఆధారపడియుండవలెను.

ఫుడ్ యిన్స్పెక్టరు సివిల్ న్యాయం క్రింద బాధ్యుడగును. రాజాజ్ఞ లేక గవర్నమెంటు ఉత్తర్వుల ప్రకారం నడుచుకొన్నానని అనుట సరియైన జవాబు కాదు. ఈ సబ్ సెక్షను క్రింద క్రిమినల్ న్యాయం ప్రకారం కూడ బాధ్యుడగును.

సమంజసమైన కారణములున్నవా అనునది ఆయా కేసుల యొక్క ప్రత్యేక అంశముల బట్టి నిర్ణయించవలెను.

కొమ్మలపాటి వెంకట్రాడి Vs తెన్నేటి చంద్రయ్య
ఎ. ఐ. ఆర్. 1956 ఎ. పి. 174.

12. రాజ్యాంగ బద్ధత :-

సబ్ సెక్షను (9) వగైరాలలో పేర్కొనబడిన వివిధములైన రక్షణల దృష్ట్యా, ఫుడ్ యిన్స్పెక్టర్లుకు అపరిమితములయిన అధికారములివ్వబడినవవనుట, అందుచే సెక్షను రాజ్యాంగ విరుద్ధమనుట సరిగాదు.

సోమసెట్టి నరసింగరావు Vs స్టేట్
ఎ. ఐ. ఆర్. 1964 ఎ. పి. 501.

సెక్షను 11 :- ఫుడ్ యిన్స్పెక్టరు అనుసరించవలసిన విధానము :-

(1) ఫుడ్ ఇన్స్పెక్టరు ఆహార వస్తువుయొక్క శాంపిల్ తీసికొను నప్పుడు అతడు తప్పని సరిగా—

ఎ. ఎవరినుండి అయితే శాంపిల్ తీసికొన్నాడో ఆ వ్యక్తికి, ఆ శాంపిల్‌ను విశ్లేషణముకొరకు పంప తలచుకొన్న విషయం,

ఎవరినుండయితే శాంపిల్ తీసికొన్నాడో ఆ వ్యక్తికి అప్పటి కప్పుడే, మరియు సె. 14-ఎ క్రింద పేరు, అడ్రసు, ఇతర వివరములు తెలియబరచ బడినచో, ఆ వ్యక్తికి, లిఖితపూర్వకంగా నోటీసు ఇవ్వ వలెను.

బి. ఈ శాసనం క్రింద నిబంధనలద్వారా మినహాయింపు చేసిన సందర్భాలలో తప్ప, శాంపిల్‌ను అప్పటికప్పుడే మూడు భాగములుగా విభజించి, గుర్తులు వేసి, సీలు చేసి, తగిన రీతిలో ప్రతిభాగమును కట్టి నిర్ణీతమైన పద్ధతిలో, స్థలంలో, ఏ వ్యక్తినుండి అయితే శాంపిల్ తీసికొన్నాడో ఆ వ్యక్తి యొక్క సంతకం లేక వేలి ముద్ర, తీసికొనవలెను.

అయితే, ఆ వ్యక్తి సంతకం చేయుట లేక వేలి ముద్ర వేయు టకు నిరాకరించినచో, ఫుడ్ యిన్స్పెక్టరు వాని సంతకం/ వేలిముద్ర

బదులుగా ఒకరుగాని ఎక్కువ మందిగాని సాక్షులను పిలిచి, వాని లేక వారి సంతకములు లేక వేలిముద్రలు తీసికొనవలెను.

సి. i) శాంపిల్ యొక్క ఒక భాగమును, లోకల్ హెల్త్ అథారిటీకి తెలియపరచుచూ, విశ్లేషణము కొరకు పబ్లిక్ ఎనలిస్టుకు పంపవలెను.

ii) మిగిలిన రెండు భాగములను ఈ సెక్షనులోని సబ్ సెక్షను 2 నిమిత్తం మరియు సెక్షను 13, సబ్ సెక్షను 2-ఎ, 2-ఇ ల నిమిత్తం లోకల్ హెల్త్ అథారిటీకి పంపవలెను.

(2) సబ్ సెక్షను (i) క్లాజు (సి) సబ్ క్లాజు (i) క్రింద పబ్లిక్ ఎనలిస్టుకు పంపబడిన శాంపిల్ భాగము పోయినచో లేక పాడయినచో పబ్లిక్ ఎనలిస్టు లేక ఫుడ్ ఇన్‌స్పెక్టరు అభ్యర్థనపై లోకల్ హెల్త్ అథారిటీ క్లాజు (సి) సబ్ క్లాజు (ii) ప్రకారం తనకు పంపబడిన శాంపిల్ భాగములలో ఒక దానిని విశ్లేషణం కొరకు, పబ్లిక్ ఎనలిస్టుకు పంపవలెను.

(3) సెక్షను 10, సబ్ సెక్షను (1) లేక (2) ప్రకారం శాంపిల్ తీసికొన్నప్పుడు ఫుడ్ ఇన్‌స్పెక్టరు వెంటనే గాని, తరువాత ఆఫీసులు పని చేయు దినమునగాని, పబ్లిక్ ఎనలిస్టుకు, ఆయా ఆహార వస్తువు లేక కల్తీ చేయు పదార్థము యొక్క శాంపిల్‌ను, శాంపిల్ తీయుటకు నిర్దేశించబడిన నియమముల ప్రకారం లోకల్ ఏరియాకు సంబంధించిన పబ్లిక్ ఎనలిస్టుకు పంపవలెను.

(4) సెక్షను 10 (4) ప్రకారం స్వాధీనంచేసికోబడిన ఆహార వస్తువును సెక్షను 10, సబ్ సెక్షను (4-ఎ) ప్రకారం నాశనం చేసియుంటే తప్ప, మరియు సబ్ సెక్షను (6) ప్రకారం స్వాధీనం చేసుకోబడిన కల్తీ చేయు పదార్థమును, సాధ్యమయినంత వెంటనే, ఎట్టి

పరిస్థితులలోను పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు అందిన తర్వాత 7 దినాలు దాటకుండా, ఒక మేజిస్ట్రేటు ముందు హాజరు పరచవలెను.

అయితే ఎవరి నుండి ఆహార వస్తువు జప్తు చేయబడినదో ఆ వ్యక్తి ఇందు గురించి మేజిస్ట్రేటుకు దరఖాస్తు చేసికొనినచో, ఉత్తర్వులో ఉదహరించిన గడువులోగా హాజరు పరచమని మేజిస్ట్రేటు, లిఖిత పూర్వకమైన ఉత్తర్వు ద్వారా ఫుడ్ యిన్‌స్పెక్టరును ఆదేశించవలెను.

(5) అవసరమైన సాక్ష్యమును తీసికొనిన తర్వాత మేజిస్ట్రేటుకు—

ఎ. సబ్ సెక్షను 4 క్రింద తన ముందు హాజరు పర్చబడిన ఆహార వస్తువు కల్తీ చేయబడినది లేక మిస్ బ్రాండ్ చేయబడినది; అని అనిపించినచో అతడు దానిని సందర్భాను సారముగా,

i) కేంద్ర లేక రాష్ట్ర ప్రభుత్వముకు లేక లోకల్ అథారిటికీ ఆయత్తము చేయుచు; లేక

ii) సొంతదారు లేక ఏ వ్యక్తి వద్దనుండి స్వాధీనము చేసికొనబడినదో ఆ వ్యక్తి ఖర్చుపై అది మానవాహారముగా ఉపయోగించబడకుండా, నాశనము చేయబడవలెనని; లేక

iii) అమ్మకమునకు పెట్టబడకుండ, లేక దానియొక్క, మోసపు పేరుతో ఆహారమునకు ఉపయోగించబడకుండ వినియోగము చేయుటకు,

iv) జామీను దార్లతోగాని జామీనుదార్లు లేకుండగాని హామీ పత్రము వ్రాసినచో దాని యొక్క సరైన పేరుతో అమ్ముటకుగాను, లేక ఆహార పదార్థము పునః ప్రక్రియ (Re-processing) ద్వారా మానవ వినియోగమునకు

నిర్దేశించబడిన ప్రమాణములకు అనువర్తింప చేయ దగునని, మేజిస్ట్రేటు సంతృప్తి పడినచో, ఉత్తర్వులో ఉదహరించ బడిన అధికారి యొక్క పర్యవేక్షణలో పునః ప్రక్రియ చేసిన తర్వాత అమ్మకటకు సొంతదారునకు తిరిగి ఇప్పించుచూ —ఆజ్ఞాపించవచ్చును.

బి. సెక్షన్ 10 (6) ప్రకారం స్వాధీనం చేసికొనబడి తనముందు హాజరు పర్చబడిన కల్తీ చేయు పదార్థము, కల్తీ చేయుటకు ఉపయోగించబడు రకమునకు చెందినదిగా స్పష్టమైనచో, తయారీదారు, పంపిణీదారు, లేక అమ్మకందారు అట్టి పదార్థము తన స్వాధీనములో నుండుటకు సంతృప్తికరమైన జవాబుదారీ చెప్పలేక పోయినచో, దానిని కేంద్ర ప్రభుత్వము లేక రాష్ట్ర ప్రభుత్వము లేక లోకల్ అథారిటీకు ఆయత్తము చేయుచు ఉత్తర్వు చేయవచ్చును.

సి. (ఎ) ఆహార వస్తువు కల్తీ చేయబడలేదు; లేక

(బి) కల్తీ చేయు పదార్థముగా అభిప్రాయపడిన (కల్తీ చేయు) పదార్థము కల్తీ చేయు పదార్థము గాదు—అని మేజిస్ట్రేటుకు అనిపించిన యెడల ఏ వ్యక్తి స్వాధీనము నుండి ఆహార వస్తువు లేక కల్తీ చేయు పదార్థము తీసికొనబడినదో ఆ వ్యక్తి ఆ పదార్థము తిరిగి పొందుటకు హక్కు దారగును; మరియు ఆ వ్యక్తికి కలిగిన, నష్టమునకు మించకుండ, సమంజసముగా భావించిన నష్ట పరిహారము ఇచ్చుటకు మేజిస్ట్రేటుకు విచక్షణాధికారము కలదు.

## వ్యాఖ్య

1. శాసన చరిత్ర- పరిధి
2. విక్రయదారుకు తెలియ పరచుట
3. శాంపిల్ యిచ్చుటకు తిరస్కరించుట
4. శాంపిల్ తీసుకొని పంపు విధానము
5. పరిరక్షక పదార్థము
6. శాంపిల్ పరిమాణము
7. సబ్ సెక్షను (2)
8. సబ్ సెక్షను (3)
9. సబ్ సెక్షను(4)
10. సబ్ సెక్షను (5)
11. సబ్ సెక్షను (6)
12. నష్ట పరిహారము

1. శాసన చరిత్ర పరిధి :—

1976 సవరణ చట్టము ద్వారా ఈ సెక్షను విస్తారంగా సవరించబడింది. సబ్ సెక్షను (1) క్లాజు ఎ లో సె. 14-ఎ ప్రకారం 'పేరు, చిరునామా, తెలుపబడిన వ్యక్తి కూడ, ఒకవేళ ఉన్నట్లయితే,' అని చేర్చబడింది. సదరు సెక్షను క్రింద, ఫుడ్ యిన్‌స్పెక్టరు కోరిన యెడల, ప్రతి విక్రయదారు, తాను ఎవరినుండి అయితే ఆహార వస్తువును కొన్నాడో ఆ వ్యక్తి పేరు, చిరునామా తెలియపరచవలెను.

ఈ సబ్ క్లాజు క్రింద, ఫుడ్ యిన్‌స్పెక్టరు శాంపిల్ తీసికొనినప్పుడు ఒకవేళ సె. 14 ఎ ప్రకారము వ్యక్తి పేరు, చిరునామా తెలియపరిచితే విక్రయదారునకేకాక అట్టివ్యక్తికి గూడ నోటీసు యివ్వవలెను.

1976 సవరణకు పూర్వం శాంపిల్ యిచ్చిన వ్యక్తియొక్క పేరుగాని, వేలి ముద్రగాని తీసికొనవలెనని నిబంధనలేదు. సవరణ తర్వాత, ఫుడ్ యిన్‌స్పెక్టరు, శాంపిల్ పైన నిర్దేశించబడిన ప్రదేశంలో, నిర్దేశించబడిన పద్ధతిలో, అట్టి వ్యక్తియొక్క

సంతకం కాని వేలి ముద్రగాని తీసికొనవలెను. అతడు నిరాకరించినచో, వానికి బదులుగా, ఒకరుగాని ఎక్కువమందిగాని సాక్షులను పిలిచి వారి సంతకం లేక వేలి ముద్ర తీసికొనవలెను.

1976 కు పూర్వం 3 శాంపిళ్ళలో, ఒకటి శాంపిల్ యిచ్చిన వ్యక్తికి యివ్వవలెను. ఈ పద్ధతికి స్వస్తి చెప్పబడినది. సవరణ చేసిన సెక్షను ప్రకారం, ఫుడ్ యిన్‌స్పెక్టరు మరుసటి రోజుననే ఒక శాంపిల్ భాగం పబ్లిక్ 'ఎనలిస్టు' కు పంపవలెను. మిగతా రెండు శాంపిళ్ళు లోకల్ హెల్త్ అథారిటీకి పంపవలెను.

సబ్ సెక్షను (2) కొత్తది ఎనలిస్టుకు పంపిన శాంపిల్ పోయినా, చెడిపోయినా లోకల్ హెల్త్ అథారిటీ వద్ద ఉన్న రెండవ శాంపిల్ పంపమని ఎనలిస్టు కోరవచ్చును.

సబ్ సెక్షను 3 లో కొద్ది మార్పు చేయబడెను. సె. 10 (1), (2)ల క్రింద కల్తీ ఆహార వస్తువు, కల్తీచేయు పదార్థములు జప్తు చేసినప్పుడు, ఫుడ్ యిన్‌స్పెక్టరు రెండవ రోజుకే పబ్లిక్ ఎనలిస్టుకు శాంపిల్ పంపవలెను.

సబ్ సెక్షను 4-ఎ లో "నాశనం చేసినట్లయితే" తప్ప, "కల్తీచేయు పదార్థము" చేర్చబడినది. మొదటి ప్రతి కల్పన చేసి రద్దుచేసి సబ్ క్లాజులోనే "పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు పొందిన తర్వాత ఏడు రోజులకు మించకుండా" అని చేర్చబడినది. రెండవ ప్రతికల్పనలో మార్పులేదు. అనగా ఆ సవరణ తర్వాత ఈ సెక్షను ప్రకారం ఆహార వస్తువుగాని, కల్తీచేయు పదార్థంగాని జప్తు చేసినప్పుడు, అట్టి పదార్థము వెంటనే, ఎట్టి పరిస్థితుల్లోనైనా ఎనలిస్టు రిపోర్టు వచ్చిన 7 రోజులలోగా, మేజిస్ట్రేటు ముందు హాజరు పర్చవలెను. దరఖాస్తు పెట్టబడినచో కోర్టు నిర్ణయించిన వ్యవధిలో హాజరు పర్చవలెను.

సబ్ సెక్షను 5 లో క్లాజు [బి] కొత్తది. సె. 10 [6] క్రింద స్వాధీనం చేసికోబడిన కల్తీచేయు పదార్థము మేజిస్ట్రేటు ముందు హాజరు పరచినప్పుడు అది ప్రత్యక్షముగా ఆహార కల్తీ చేయుటకుపయోగించు పదార్థమని మేజిస్ట్రేటు నిర్ణయించినచో అట్టి స్వాధీనమునకు సదరు తయారీదారు, విక్రయదారు లేక వ్యాపారి సంతృప్తికరమయిన జవాబు చెప్పలేకపోయినచో, అతడు అట్టి పదార్థమును, ప్రభుత్వమునకు లేక లోకల్ అథారిటీకి జప్తు చేయవచ్చును.

**2. విక్రయదారుకు తెలియపరచుట :**

ఈ సెక్షను క్రింద విక్రయదారుకు నోటీసు యిచ్చుటలో ఉద్దేశ్యం అతను ఒక శాంపిల్‌ను ఫుడ్ యిన్‌స్పెక్టరు నుండి పొందగల హక్కు కల్గియున్నాడని తెలియ పరచుట.

మంగళ్ దాస్ రాఘవజీ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1966 యస్. సి. 128

గమనిక : 1976 సవరణలో శాంపిల్ విక్రయదారుకు యిచ్చు పద్ధతికి స్వస్తి చెప్ప బడినది.

(ఆహార కల్తీ నివారణ నియమావళి 1955 రూలు 12 నమూనా....లు చూడుడు.)

నమూనా VI

................ కు

నేను ఈ రోజున..........................................................లోని యొక్క ఆవరణ నుండి క్రింద ఉదహరించిన ఆహారముయొక్క శాంపిళ్ల....... పబ్లిక్ ఎనలిస్టుచే విశ్లేషణం చేయించుటకు తీసికొన్నాను.

స్థలం ఫుడ్ యిన్‌స్పెక్టరు,
తేది. ఏరియా.

రూలు 12 ప్రకారం ఎవరినుండి అయితే శాంపిల్ తీసికొన్నారో అట్టి వ్యక్తికి అప్పటికప్పుడే, మరియు సె. 14-ఎ క్రింద తెలియపరచబడిన వ్యక్తికి, ఏకకాలంలో పై నమూనాలో నోటీసు తగినట్టి రీతిలో యివ్వవలెను.

**3. శాంపిల్ యిచ్చుటకు తిరస్కరించుట :-**

ఆహార విక్రయదారు ఫుడ్ యిన్‌స్పెక్టరుకు శాంపిల్ యివ్వవలసిన బాధ్యత లేదు.

మునిసిపల్ బోర్డు Vs మలుక్ దాస్ గుప్త. - 1971 క్రి.లా.జ. - 705.

రేవతీ రామన శర్మ Vs జంషెడ్‌పూరు యన్. ఎ. - ఎ. ఐ. ఆర్. 1970- పాట్నా 104

ఫుడ్ యిన్‌స్పెక్టరు యిచ్చిన మూల్యం తీసికొనకుండ ఫుడ్ యిన్‌స్పెక్టరును శాంపిల్ తీసికొనుటను నివారించకుండా, తాను ఆహార వస్తువును అమ్ముటలేదని తెలియపరచినప్పుడు, ఆహారం యొక్క అమ్మకం జరుగలేదు.

పి. పి. Vs మట్టా సత్యం 1970 (I) ఆం. పీ. రి. 133
పి. పి. Vs కూసంపూరి నరసింహరాజు - 1970 (I) ఆం. పీ. రి. 238.
(ఇంకను తీర్పులకై సె. 16 (I) (సి) క్రింది వ్యాఖ్య చూడుడు.)

4. శాంపిల్ తీసికొను విధానము :-

ఆహార కల్తీ నివారణ నియమావళి 1955నియమములు 14 నుండి 22 వరకు చూడదగును. శాంపిల్ సీలు వేయుట, కట్టుట, ఎనలిస్టుకు పంపుటలో అనుసరించవలసిన పద్ధతులు 14 నుండి 18 వరకుగల నియమములలో చెప్పబడినవి.

19 వ నియమము ప్రకారం శాంపిల్‌లో నిర్దేశించబడిన పరిరక్షక పదార్థము కలుపవచ్చును. 20 వ నియమములో 'ఫార్మాలిన్' (Formalin) పాలు, క్రీమ్ వగైరాలలో కలుపదగిన పరిరక్షక పదార్థముగా నిర్దేశించబడింది.

22 వ నియమములో ఏ ఆహార వస్తువు యొక్క శాంపిల్ ఎంత పరిమాణములో పబ్లిక్ ఎనలిస్టుకు పంపవలెనో చెప్పబడింది. అనగా ఫుడ్ యిన్‌స్పెక్టరు రూలు 22 లో చెప్పబడిన పరిమాణమును 3 రెట్లు పరిమాణంలో ఆహార వస్తువు విక్రయదారునుండి తీసికొనవలెను.

ఒకేమాదిరి లేబిల్ కల్గిన సీలు వేసిన పాత్రలు లేక సీసాలలో ఆహారము అమ్ముచున్నప్పుడు లేక అమ్మకం కొరకు లేక పంపిణీకొరకు నిల్వచేసినపుడు శాంపిల్ కొరకు కావలసిన పరిమాణమునకు సరిపోవునన్ని పాత్రలు / సీసాలు కొనవచ్చును.

వ్యాఖ్య

రూలు 14 ఆదేశకము శుభ్రమైన పొడి సీసాలలో శాంపిల్ తీసికొనవలెను. అట్టి సాక్ష్యం ప్రవేశపెట్టవలెను.

1985 ఎఫ్. ఎ. జె. 314

పెరుగు శాంపిల్ తీసికొనినప్పుడు ఏదైనా పరికరంతో కలుపవలెననే నియమంలేదు. చేతిలో కలిపిన చాలును.

ఫుడ్ యిన్‌స్పెక్టరు బరోడా Vs యం. సి. శర్మా
ఎ. ఐ. ఆర్. 1983 యస్. సి. 176

శాంపిల్ తీసికొనేముందు పాలు కలుపలేదు. చట్ట విరుద్ధం కాదు.

1983 క్రి. లా. జ. 1565 [మద్రాసు]

శాంపిల్ తీసికొనే ముందు నేయి కలుపలేదు. చట్ట విరుద్ధం కాదు.

1983 క్రి. లా. జ. 137 [రాజస్థాన్ 1 యన్. ఒ. సి]

రూలు 16 :-

ఆహార కల్తీ నివారణ నియమావళి 1955, నియమము 16 (సి) [ఇప్పుడు 16 (డి).] ఆదేశకము ఈ నియమము ప్రకారము పేపరు కవరు గట్టి దారముతో బంధించి సీలింగు లక్కతో యిన్‌స్పెక్టరు యొక్క సీలు కనీసం 4 చోట్ల ప్రస్ఫుటమైన ముద్రలు వేయవలెను. ట్వైన్ దారము యొక్క ముడులు సీలు ముద్ర కలిగిన లక్కతో మూయబడవలెను. ఈ నియమము ఉల్లంఘించినచో ముద్దాయి విమోచనార్హుడు.

స్టేట్ ఆఫ్ గుజరాత్ Vs కేశవలాల్
1981 క్రి. లా. జ. 551

రూలు 16 ఆదేశకము

రామ్ శర్మ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1983 క్రి. లా. జ. 1251

కుట్టన్ పనికర్ Vs ఫుడ్ యిన్‌స్పెక్టర్ [నేయాతింకారా మున్సిపాలిటి]
1981 క్రి. లా. జ. [యస్. ఒ. సి.] 108

నిజాముద్దీన్ సిద్దిక్ భాయ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1985 [2] యఫ్. ఎ. సి. 88 [బోంబే]

పబ్లిక్ ఎనలిస్టు యొక్క రిపోర్టు సీళ్ళ పరిస్థితి పోల్చి చూచుట గురించి మాత్రమే మూల సాక్ష్యము [Substantive evidence] సె. 114 ఇండియన్ ఎవిడెన్సు ఆక్టు క్రింద రూలు 7 ననుసరించబడినట్లు భావన ఏమీలేదు. రూలు 7 ఖచ్చితముగా అనుసరించబడినట్లు సాక్ష్యము లేనప్పుడు ముద్దాయిని శిక్షించుట క్షేమము కాదు.

ఫుడ్ యిన్‌స్పెక్టరు మంగుళూరు కార్పొరేషన్ Vs ఎ. జి. సువర్ణ
1985 క్రి. లా. జ. 709

రూలు 17

ఆదేశకము మెమోరాండం ప్యాకెటులో పంపని యెడల ప్రాసిక్యూషను చెల్లదు.

రాజారాం Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1981 క్రి. లా. జ. 1603 [బొంబాయి]

పై కవరుపై సీలు వేయనిచో రూలుకు భంగము కలిగినది.

మహమ్మద్ ఇస్మాయిల్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1978 [2] యఫ్. ఎ. సి. 281

5. పరిరక్షక పదార్థము కలుపుట :

కలుపబడిన ఫార్మలిన్ యొక్క సాంద్రత గురించి సాక్ష్యంలేదు. శిక్ష రద్దు చేయబడెను.

1982 క్రి. లా. జ. 387 [అలహాబాదు]

సాంపిల్ తీసికొనుటకు నిర్దేశించబడిన పద్ధతి ఖచ్చితంగా పాటించవలెను. శాంపిల్ శుద్ధియైన సీసాలో తీసికొనని యెడల నిబంధనలు తీవ్రముగా ఉల్లంఘించినట్లు.

స్టేట్ Vs మహ్మద్ ఇబ్రహిం
ఎ. ఐ. ఆర్. 1959 కేరళ 351

శుభ్రమైన సీసాలో శాంపిల్ తీసికోబడనప్పుడు విశ్లేషణ ఫలితములు ఆధార పడతగినవి కావు.

1963 క్రి. లా. జ. 448.

పదార్థమంతా ఒక సాంద్రత కల్గియున్నప్పుడు శాంపిల్ తీసికొనుటకుముందు కలుపనక్కరలేదు.

1982 క్రి. లా. జ. 588 [కేరళ]

పబ్లిక్ ఎనలిస్టు విశ్లేషణం స్వయంగా నిర్వర్తించిన మంచిదే. అతడే చేయుట తప్పని సరిగాదు. అతని ఆధ్వర్యంలో క్రింది అధికారులు చేయవచ్చును.

అడ్మినిస్ట్రేటర్ జబల్‌పూర్ కార్పొరేషన్ Vs గిరిధరలాల్ భారూమల్
1975 2 యఫ్. ఎ. సి. 371 [యం. పి.]

పాలు శాంపిల్ తీసికొనేముందు బాగుగా కలిపినట్లుగాని ఒక పాత్రనుండి వేరొక పాత్రలోకి తిరుగుబోసినట్లుగాని సాక్ష్యం లేనప్పుడు శాంపిల్ సరియైన రీతిలో కొనబడలేదు. అట్టి శాంపిల్ యొక్క విశ్లేషణంపై ఆధారపడుట క్షేమంగాదు.

స్టేట్ ఆఫ్ రాజస్థాన్ Vs కచబ్
1980 క్రి. లా. జ. 894 (రాజస్థాన్)

మద్రాసు హైకోర్టు పాలు శాంపిల్ తీసికొనేముందు కలుపనంత మాత్రాన, కేసు త్రోసి పుచ్చరాదని తీర్పు యిచ్చినది.

1983 క్రి. లా. జ. 1565 (మద్రాసు)

పెరుగు

శాంపిల్ తీసికొనునప్పుడు నిలువుగా కోయవలెను.

మునిసిపల్ కార్పోరేషన్ ఢిల్లీ Vs నానక్‌చంద్.
1974 యఫ్ ఏ. సి. 68

పెరుగు శాంపిల్ తీసికొనినప్పుడు యంత్రపరికరములతో కలుపనక్కరలేదు.

1983 క్రి. లా. జ. 337 (యస్ సి.)

నెయ్యి అడుగునుండి కలుపకుండా శాంపిల్ తీసికొనగా, సెక్షనుకు భంగం కలుగలేదు.

1983 క్రి. లా. జ. 137 రాజస్థాన్ (యన్. ఓ. సి.)

25 బస్తాల టీ అంతా కలిపి శాంపిల్ తీసికోనక్కరలేదు. ఒక బస్తా యాదృచ్ఛికంగా ఎన్నుకొని అందులో టీ నుండి శాంపిల్ తీసికొన్నప్పుడు శాంపిల్ ఎన్నుకొనుటలో దురుద్దేశము లేనంతవరకు, శాంపిల్ తీసికొనిన రీతికి అభ్యంతరంలేదు. ప్రతి ఒక్క బస్తా విడిగా అమ్మవచ్చును. ఏ ఒక్క బస్తాలో టీ కల్తీవయినా నేరమే. శాంపిల్ తీసికొన్న పద్ధతి నాధారంగా వాదించుటకు వీలులేదు.

గోపాలపూరు టీ కంపెనీ Vs కార్పొరేషన్ ఆఫ్ కలకత్తా
ఎ. ఐ. ఆర్. 1966 కలకత్తా 51.

వనస్పతి సీలు వేసిన డబ్బాలలో అమ్ముచున్నప్పుడు ఒక డబ్బానుండి శాంపిల్ తీసికొనవచ్చును. డబ్బా మొత్తము పంపనక్కరలేదు.

స్టేట్ ఆఫ్ పంజాబ్ Vs దేవేంద్రకుమార్
ఎ. ఐ. ఆర్. 1983 యస్. సి 545

6. శాంపిల్ పరిమాణం :–

రూలు 22 లో చెప్పబడిన పరిమాణమునకు 3 రెట్లు ఆహారవస్తువు శాంపిల్ కొరకు తీసికొనవలెను. ఏ పదార్థపు శాంపిల్ ఎంత పబ్లిక్ ఎనలిస్టుకు పంపవలెనో ఆహార కల్తీ నివారణ నియమము 22 లో నిర్ణయించబడెను.

అయితే శాంపిల్ రూలు 22 లో చెప్పిన పరిమాణంకంటె తక్కువ పంపినప్పుడు కేసు చెల్లదు అని సుప్రీంకోర్టు ఒకప్పుడు అభిప్రాయపడినది.

రజాల్‌దాస్ ప్రమ్నాని Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 189

రూలు 14 :- విశ్లేషణం కొరకు శాంపిల్స్ పంపు విధానము :–

విశ్లేషణంకొరకు శాంపిల్స్ శుభ్రమైన, పొడి, సీసాలు లేక జాడీలు లేక సముచితమైన యితర పాత్రలలో తీసికొనవలెను. కారిపోవుట, ఆవిరియగుట, లేక పొడి పదార్థము అయిన సందర్భములో, తేమ లోనికి ప్రవేశించుట నిరోధించుచూ తగినంత గట్టిగా మూత బిగించవలెను.

**15. సీసాలు లేక పాత్రలపై చిరునామా ఉండవలెను.**

శాంపిల్ కలిగియున్న అన్ని సీసాలు జాడీలు లేక యితర పాత్రలు సరిగా లేబిల్ వేయబడవలెను. సరిగా చిరునామా వ్రాయబడవలెను. విశ్లేషణంకొరకు పంపబడిన ఏ శాంపిల్‌పై లేబిల్ అయినా—

ఎ. సీరియల్ నం.

బి. పంపువాని పేరు, అధికార హోదా.

సి. విక్రయదారు పేరు,

డి. తేది తీసికొనబడిన తేది, ప్రదేశం,

ఇ. విశ్లేషణకొరకు పంపబడిన పదార్థము యొక్క స్వభావము

యఫ్. ఒకవేళ శాంపిల్ కలిపినట్లయితే, పరిరక్షక పదార్థము యొక్క పేరు కలిగియుండవలెను.

అయితే అగ్‌మార్క్ లేబిల్‌యున్న పాత్రనుండి శాంపిల్ తీసికొనినప్పుడు లేబిల్ ఈ క్రింది అదనపు సమాచారము కలిగియుండవలెను.

ఎ. గ్రేడ్

బి. అగ్‌మార్క్ లేబిల్ నం/బ్యాచ్ నం.

సి. ప్యాకింగ్ స్టేషను పేరు

**16 శాంపిల్ ప్యాక్ చేయు, సీలుచేయు విధానము :-**

విశ్లేషణకొరకు పంపబడు ఆహార వస్తువుల శాంపిల్స్, అన్ని ఈ క్రింది పద్ధతిలో ప్యాకుచేసి, కట్టి సీలు వేయబడి ఉండవలెను. అనగా—

ఎ. రవాణాలో కారుట అరికట్టునట్లు ముందు మూత గట్టిగా కట్టవలెను.

బి. తరువాత గట్టి మందపాటి కాగితంతో సదరు సీసా, జాడీ లేక పాత్రకు పూర్తిగా కట్టవలెను. కాగితపు అంచులు శుభ్రంగా మడచి, బంకతోగాని యితర జిగురుతోగాని అంటించవలెను.

సి. లోకల్ హెల్త్ అథారిటీ సంతకం, కోడ్ నంబరు కల్గియున్న ఒక కాగితం స్లిప్ సీసాకు క్రిందనుండి పైవరకు, చుట్టూ పోగల సైజులో రేపర్‌పై అంటించవలెను. ఎవరినుండి అయితే శాంపిల్ తీసికొనబడెనో

అట్టి వ్యక్తియొక్క సంతకం లేక వేలిముద్ర స్లిప్‌మీద కొంత, రేపరు మీద కొంత వచ్చునట్లుగా తీసికొనవలెను.

అయితే అట్టి వ్యక్తి సంతకం లేక వేలిముద్ర వేయుటకు నిరాకరించినప్పుడు సాక్షియొక్క సంతకం లేక వేలిముద్ర అదే పద్ధతిలో తీసికొనవలెను.

డి. కాగితం కవరుపై ట్వైన్ దారంతో సీసా, జాడీ, లేక పాత్రపై అడ్డంగా కట్టవలెను. గట్టి ట్వైన్ దారము పేపరు కవరుపై సీలువేయు లక్కతో అంటించవలెను. దానిపై కనీసం నాలుగుచోట్ల—ఒకటి ప్యాకేజి పైన, ఒకటి క్రింద, మిగతా రెండు ప్యాకెటుపైన, స్పష్టంగా, ప్రస్ఫుటంగా పంపువాని సీలు ముద్రలు వేయవలెను. ట్వైన్ ముడులు ముద్రలు గల సీలు లక్కతో మూసివేయబడవలెను.

17. శాంపిల్ పంపు, బట్వాడా చేయు విధం :-

శాంపిల్ పాత్రలు ఈ క్రింది విధముగా డిస్పాచ్ చేయవలెను. అనగా—

ఎ. ఏదైన తగిన పద్ధతిలో సీలు వేసిన ఒక శాంపిల్ భాగం మరియు ఫారం vii లో మెమోరాండమ్, పబ్లిక్ ఎనలిస్టుకు వెంటనే, తరువాత పనిచేయు దినము కంటే ఆలస్యము కాకుండా, సీలువేసిన ప్యాకెటులో పంపవలెను.

బి. సీలు వేసిన మిగిలిన రెండు శాంపిల్ భాగములను, మరియు ఫారం viiలో మెమోరాండం కాపీలు రెండు లోకల్ హెల్త్ అథారిటీకి వెంటనే, తరువాత పనిచేయు దినం కంటే ఆలస్యం కాకుండా, ఏదేని తగిన పద్ధతిలో పంపవలెను.

సి. అయితే ఆగ్ మార్కు సీలు వేయబడిన పాత్రలోనుండి శాంపిల్ తీసి కొన్న సందర్భంలో ఫారం vii మెమోరాండం క్రింది అదనపు సమాచారము కల్గియుండవలెను.

ఎ. గ్రేడ్

బి. ఆగ్ మార్కు నం / బ్యాచ్ నం.

సి. ప్యాకింగ్ స్టేషను పేరు.

18 : మెమోరాండం సీలు ముద్ర వేరుగా పంపవలెను.

మెమోరాండం యొక్క ఒక కాపి మరియు ప్యాకెటు సీలు వేయుటకు వాడబడిన సీలు ముద్ర నమూనా పబ్లిక్ ఎనలిస్టుకు వేరుగా గాని అతనిచే అధికారము పొందిన వ్యక్తికి గాని రిజిష్టరు పోస్టుద్వారా పంపవలెను లేక చేర్చవలెను.

రూలు 14 ఆదేశకను శుభ్రమైన పొడి సీసాలలో శాంపిల్ తీసికొనవలెను. అట్టి సాక్ష్యం ప్రవేశ పెట్టవలెను.

స్టేట్ ఆఫ్ అస్సాం Vs పురానమల్ అగర్వాల్
1985 యఫ్. ఎ. జె. 314

లచన్‌దాస్ Vs స్టేట్ ఆఫ్ పంజాబ్
1972 యఫ్. ఎ. సి. 752.

సాదూ సింగ్ Vs స్టేట్
1972 యఫ్. ఎ. సి. 295

అయితే పుడ్ యిన్‌స్పెక్టరు తాను నియమముల ప్రకారం శాంపిల్ తీసికొన్నానని సాక్ష్యం చెప్పినప్పుడు, ఆ అంశంపై క్రాసు పరీక్ష లేనప్పుడు, నియమములనుసరించబడినట్లు సె 11, 114 ఎవిడెన్సు ఆక్టు ప్రకారం భావించవలెను.

కాశిం కుంజూ Vs కె కె. రామకృష్ణ పిళ్లె
1969 క్రి. అ. రి. (యస్. సి.) 15

స్టేట్ ఆఫ్ కేరళ Vs అలసరి మహ్మద్
1978 క్రి. లా. జ. 142

నగర పరిషత్ ఆల్వార్ Vs గంగాలహరి
1982 క్రి. లా. జ. 2325

బైద్యనాద్ Vs స్టేట్ ఆఫ్ అస్సాం
1980 క్రి. లా. జ. 142

శాంపిల్ తీసికొని 3 భాగములు చేయుటకు బదులు ఒకే పాత్రలోని పాలు 3 సీసాలలో తీసికొని సీలువేసి నిర్ణయించబడిన తదుపరి విధానము అవలంబించినప్పుడు నియమాతిక్రమణ జరుగలేదు,

1985 యఫ్. ఎ. జె. 460.
1979 (1) యఫ్. ఎ. సి. 230
1979 (1) యఫ్. ఎ. సి. 319

5. పరిరక్షక పదార్థము కలుపుట :-

ఆహారకల్తీ నివారణ నియమావళి నియమములు 19, 20, 21 చూడదగును.

రూలు 19:— శాంపిళ్ళకు పరిరక్షక పదార్థము కలుపుట :-

ఈ శాసనముక్రింద విశ్లేషణ కొరకు శాంపిల్ తీసికొను ఏ వ్యక్తి అయినా శాంపిల్‌ను విశ్లేషణకు తగిన స్థితిలో ఉంచగలందులకు తత్కాలమున నిర్దేశించబడిన పరిరక్షక పదార్థము కలుపవచ్చును.

రూలు 20 :-

మిల్క్ క్రీం, పెరుగు, కోవా, గుర్‌లలో పరిరక్షక పదార్థము పూర్తిగాకాక కొంత ద్రవరూపంలో యున్న టోన్డ్, సపరేటెడ్, స్కిమ్మడ్ పాలు స్టాండర్డ్‌జ్ మిల్క్‌కన్నా, స్కిమ్డ్‌మిల్క్ చన్నా, క్రీమ్, ఐస్‌క్రీమ్, మిక్స్‌డ్ ఐస్‌క్రీం, ఐస్‌కాండీ, దహీఖోవా మరియు గుర్‌లతో సహా ఏ పాలలోనయినా, వాడదగు పరిరక్షక పదార్థము ఫార్మాలిన్ అనగా—

40% ఫార్మాల్‌డిహైడ్, 25 యం. యల్. లేక 25 గ్రాములలో 0. 1. మి.ల. (2 బొట్లు) వంతున గలిగియున్న ద్రవపదార్థము.

రూలు 21 :-

పరిరక్షక పదార్థముయొక్క స్వభావం, పరిమాణం, లేబిల్‌పైన వ్రాయవలెను.

శాంపిల్‌కు పరిరక్షక పదార్థము ఎప్పుడు కలిపినా, పరిరక్షక పదార్థముయొక్క స్వభావం పరిమాణం పాత్రపై అంటించిన లేబిల్‌పై స్పష్టంగా వ్రాయవలెను.

అయితే ఈ తీర్పును ముద్దాయిలు తెలివిగా తప్పుకొనుటకు ఉపయోగించు కున్నారు. 1976 సవరణకు పూర్వం విక్రయదారుకు ఒక శాంపిల్ భాగము ఇవ్వ బడెడిది. శాంపిల్‌ను కోర్టులో తూచమని అప్లికేషను పెట్టెడివారు.

ఉదాహరణకు—200 గ్రాముల శాంపిల్‌కు బదులు 199 గ్రాములున్నచో ఫుడ్ యిన్‌స్పెక్టరు శాంపిల్సు సరియైన పరిమాణములో తీసికొనలేదనియు, 201 గ్రాములున్నచో మొత్తం 600 గ్రాములు మూడు భాగములు చేయిబడినవి గావున ఎనలిస్టుకు పంపబడిన శాంపిల్‌లో నిర్దేశించబడిన పరిమాణములకంటె తక్కువ ఉన్నదని వాదించి, ఈ తీర్పు ప్రకారము విమోచనము పొందెడివారు. కొన్ని వేల కేసులు కొట్టివేయబడినవి.

అందువలన రూలు 22 బి చేర్చబడింది. రూలు 22 లో పరిమాణంకంటె తక్కువ పంపినప్పుడు శాంపిల్ విశ్లేషణమునకు సరిపోయినదని పబ్లిక్ ఎనలిస్టుగాని డైరక్టరుగాని అభిప్రాయపడినప్పుడు తప్ప, పరిమాణం సరిపోయినదని భావించవలెను.

సుప్రీంకోర్టు ముందు రెండవ పర్యాయం ఈ ప్రశ్న వచ్చినప్పుడు పమ్మాని కేసు సరిగా నిర్ణయించబడలేదని తీర్పు చెప్పెను. రూలు 22 మార్గదర్శకమే గాని, ఆదేశకముగాదని పబ్లిక్ ఎనలిస్టుకు పంపబడిన శాంపిల్ విశ్లేషణంకొరకు సరి పోయినచో, రిపోర్టును తిరస్కరించరాదని తీర్పు యిచ్చెను.

స్టేట్ ఆఫ్ కేరళ Vs ఆలసేరి మహమ్మద్ వగైరా
ఏ. ఐ. ఆర్. 1978 యస్. సి. 933

7. సబ్ సెక్షను 2 :—

'పోయిన' లేక 'చెడిన' అన్న పదజాలము 'ఏ కారణంచేత చెడినా' వర్తిం చును. ఈ పదజాలము సె. 11 (2) లోనూ సె. 13 (2 సి) లోనూ కనిపించును. సెంట్రల్‌ఫుడ్ లేబరేటరీ డైరక్టరు శాంపిల్ డికంపోజ్ అయినదని వ్రాసినప్పుడు కోర్టు 13 (2 సి) క్రింద లోకల్ హెల్త్ అథారిటీ వద్దయున్న శాంపిల్ పంప వచ్చును. 'చెడుట' అనగా శాంపిల్ డైరెక్టరుకు పంపిన తర్వాత లేక పంపమని కోర్టు ఉత్తర్వు చేసిన తర్వాతనే చెడుట అని అర్థముగాదు. పోవుట కోర్టు ఉత్తర్వు చేసిన తర్వాత బట్వాడా చేయుటకు ముందు కూడా జరుగవచ్చును. అట్లే చెడుట

గూడ ఎప్పుడయినా జరుగవచ్చును. డికంపోజిషన్‌వల్ల చెడుటకుగూడా ఈ సెక్షను వర్తించును

చిరంజీవి లాల్ Vs స్టేట్ ఆఫ్ పంజాబ్
ఎ. ఐ. ఆర్. 1984 యస్. సి. 80=1984 క్రి. లా. జ. 15.

ఇది సె. 13 క్రింది తీర్పు, పద సారూప్యము వలన సె. 11 (2) కు గూడ అన్వయించవచ్చును.

8. సబ్ సెక్షను 3 :-

1976 సవరణ తర్వాత సబ్ సెక్షను 3 ప్రకారము శాంపిల్ తీసికొనిన మరుసటి దినమే శాంపిల్ పబ్లిక్ ఎనలిస్టుకు పంపవలెను.

సెక్షను 11 (3) మార్గదర్శకమేగాని తప్పని సరిగాదు. శాంపిల్‌ను మరుసటి దినమున పంపిన కారణంచేత కేసు కొట్టివేయతగదు. ఫుడ్ యిన్‌స్పెక్టరుపై డిపార్టుమెంటల్ చర్య తీసికొనవచ్చును.

జె. చంద్రమౌళి Vs స్టేట్ 1978 క్రి. లా జ. 540 (ఆం ప్ర.)
1982 క్రి. లా. జ. 726 (అలహాబాదు)

9. సబ్ సెక్షను 4 :-

ఇది సె. 10 (4) కు సె. 10 (6) కు తరువాయి భాగంగా చదువుకొనవలెను. ఫుడ్ ఇన్‌స్పెక్టరు సదరు సెక్షను క్రింద స్వాధీనం చేసికొన్న కల్తీ ఆహారంగాని, కల్తీచేయు పదార్థముగాని ఆలస్యం లేకుండ మేజిస్ట్రేట్ ముందు హాజరు పర్చవలెను. ఎట్టి సందర్భములోను పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు వచ్చిన తరువాత 7 రోజులు దాట కూడదు. అయితే ఏ వ్యక్తినుండయతే సదరు పదార్థము స్వాధీనం చేసికొనబడెనో అట్టి వ్యక్తి కోర్టుకు దరఖాస్తు పెట్టుకొన్నప్పుడు, కోర్టు కాలపరిమితి నిర్ణయించి సదరు పదార్థముకోర్టుముందు హాజరు పరచవలెనని ఉత్తర్వు చేయవలెను.

10. సబ్ సెక్షను 5 :-

తగిన విచారణ తర్వాత, సదరు ఆహార వస్తువులను జప్తు చేయుటకు, నాశనం చేయుటకు, కొన్ని షరతులతో స్వంతదారుకు వాపసు చేయుటకు, కోర్టుకు అధికారము లివ్వబడెను.

11. సబ్ సెక్షను 6 :-

స్వాధీనం చేసికొనబడిన ఆహారవస్తువు కల్తీ చేయబడినదిగాదనియు కల్తీ చేయు పదార్థము అనుకొనినది కల్తీచేయు పదార్థముకాదని కోర్టు అభిప్రాయపడినప్పుడు సదరు పదార్థము వాపసు పొందుటకు, ఏ వ్యక్తి నుండయితే సదరు ఆహార వస్తువు స్వాధీనం చేసికొనబడినదో అట్టి వ్యక్తి అధికారము కలిగియున్నాడు.

12. నష్టపరిహారము

సబ్ సెక్షను 6 క్రిందనే కోర్టు అట్టి వ్యక్తికి నష్ట పరిహారం ఇప్పించవచ్చును. నష్ట పరిహారం అసలు నష్టమును మించియుండరాదు.

సెక్షను **12** :- కొనుగోలుదారు ఆహారమును పరీక్ష చేయించగల్గుట :

ఈ శాసనములోని ఏదియు కూడ - ఫుడ్ ఇన్స్పెక్టరు కాని ఏ ఇతర కొనుగోలుదారైనా అట్టి ఆహార వస్తువును పబ్లిక్ ఎనలిస్టు చేత నిర్దేశించబడిన రుసుము చెల్లించి విశ్లేషణం చేయించుటను విశ్లేషణ నివేదిక పొందుటను నిరోధించునట్లుగా భావించరాదు.

అయితే అట్టి కొనుగోలుదారు కొనుగోలుచేయు సమయమున సదరు ఆహార వస్తువును విశ్లేషణ చేయించు ఉద్దేశ్యమును అమ్మకందారుకు తెలియపరచవలెను.

అంతేగాక విశ్లేషణకొరకు ఫుడ్ యిన్స్పెక్టరు శాంపిల్ తీసికొనునప్పుడు వర్తించు సెక్షన్ 11 (1), (2), (3) లోని నిబంధనలు సాధ్యమైనంత వరకు, సదరు ఆహార వస్తువును విశ్లేషణ చేయించుటకు ఉద్దేశించిన కొనుగోలుదారుకు కూడ వర్తించును.

అంతేగాక మరియు పబ్లిక్ ఎనలిస్టు యొక్క నివేదిక ఆహార వస్తువు కల్తీ ఐనదిగా తెలుపుచున్నచో, కొనుగోలుదారు ఈ సెక్షను క్రింద తనచే చెల్లించబడిన రుసుము తిరిగి పొందు అధికారము కలదు.

## వ్యాఖ్య

చట్టములోని ఈ విభాగము వ్యాపారులు, ఫుడ్ ఇన్‌స్పెక్టరులు, కుమ్మక్కై కల్తీ పదార్థములను మార్కెట్టులో అమ్ముటను నిరోధించును.

ఈ సెక్షను క్రింద కనుగోలు చేసిన వ్యక్తి అభియోగము తెచ్చుటకు సె. 20 లోని ప్రతి బంధనము వర్తించదు. ఈ సందర్భములలో ఏ అధికారినుంచియు అనుమతి అవసరము లేదు.

శాసనములోని ఈ విభాగము వినియోగదార్లు ఎక్కువగా ఉపయోగించుకొనినచో, ఈ శాసనము మరింత బాగుగా అమలు జరుగు అవకాశములున్నవి.

కాని వాస్తవములో ఈ సెక్షను క్రింద అభియోగములు అతి స్వల్పమని చెప్పవచ్చును. సెక్షను 11 లోని నిబంధనలు పాటించనవసరము లేనట్లుగా సవరణ చేసినచో ఎక్కువ ఉపయోగము ఉండవచ్చును.

సెక్షన్ **13** (1) పబ్లిక్ ఎనలిస్టు యొక్క నివేదిక :—

పబ్లిక్ ఎనలిస్టు తనకు విశ్లేషణం కొరకు పంపబడిన ఆహార వస్తువు యొక్క ఫలితము నివేదిక లోకల్ హెల్త్ అథారిటీకి నిర్దేశించబడిన నమూనా పత్రములో పంపవలెను.

(2) ఆహార వస్తువు కల్తీ చేయబడినదని సబ్ సెక్షను (1) క్రింద విశ్లేషణం యొక్క ఫలితం నివేదిక చేరగానే లోకల్ హెల్త్ అథారిటీ, ఏ వ్యక్తి నుండైతే ఆహార వస్తువు యొక్క శాంపిల్ తీసికొనబడినదో ఆ వ్యక్తి పై, మరియు ఒక వేళ సెక్షను 14 ఎ క్రింద పేరు, చిరునామా ఇతర వివరములు వెల్లడి చేయబడినచో, ఆ వ్యక్తి పై, అభియోగము దాఖలు చేసిన తర్వాత, ఆ వ్యక్తి లేక వ్యక్తులు తాము కోరినచో ఏ ఒక్కరు కాని, ఇద్దరికి కూడ నివేదిక నకల్లు, అందిన పదిరోజులులోగా, లోకల్ హెల్త్ అథారిటీ వద్ద ఉంచబడిన ఆహార వస్తువు శాంపిల్‌ను, సెంట్రల్ ఫుడ్ లాబరెటరీకి

విశ్లేషణం కొరకు పంపుటకు కోర్టులో దరఖాస్తు చేసుకొనవచ్చునని తెలియపరచుచూ, సదరు వ్యక్తికి లేక వ్యక్తులకు విశ్లేషణం ఫలితము యొక్క నివేదిక నకలు నిర్ణీత విధముగా పంపవలెను.

(2-ఎ) సబ్ సెక్షన్ క్రింద కోర్టుకు దరఖాస్తు చేయబడినప్పుడు కోర్టు లోకల్ హెల్త్ అథారిటీని సదరు అథారిటి వద్ద ఉంచబడిన శాంపిల్ యొక్క భాగము లేక భాగములను పంపవలెనని ఆదేశించవలెను. మరియు అట్టి అభ్యర్థన చేయబడినప్పుడు అట్టి అభ్యర్థన పత్రము చేరిన 5 రోజుల వ్యవధిలో శాంపిల్ యొక్క భాగము లేక భాగములను సదరు అథారిటీ కోర్టుకి పంపవలెను.

(2 బి) సబ్ సెక్షన్ (2-ఎ) క్రింద లోకల్ హెల్త్ అథారిటీ నుండి శాంపిల్ యొక్క భాగము చేరగానే, కోర్టు మొదట సెక్షను 11, సబ్ సెక్షను (1) క్లాజు (బి),లో పొందుపరచిన విధముగా గుర్తు, సీలు, బంధము సరిగా ఉన్నవని, మరియు సంతకము లేక వేలిముద్ర దిద్దబడలేదని అభినిశ్చితమైన తర్వాత మరియు సదరు భాగము లేక శాంపిల్‌లోని ఒక భాగమును కోర్టుయొక్క స్వంతసీలు వేసి సెంట్రల్ ఫుడ్ లాబరేటరీ డైరెక్టరుకు పంపవలెను. ఆ మీాదట సదరు డైరెక్టరు శాంపిల్ చేరిన ఒక నెలలోగా నిర్ణీత నమూనాలో విశ్లేషణం యొక్క ఫలితము ఉదహరించుచు ధృవ పత్రము పంపవలెను.

(2-సి) కోర్టుకు శాంపిల్ యొక్క రెండు భాగములు పంపబడి సెంట్రల్ ఫుడ్ లాబరేటరీ డైరెక్టరుకు సబ్ సెక్షను (2-బి) క్రింద ఒక భాగము మాత్రమే పంపబడినప్పుడు కోర్టు సాధ్యమైనంత వెంటనే మిగిలిన భాగమును లోకల్ హెల్త్ అథారిటీకి తిరిగి పంపవలెను. సదరు అథారిటీ సెంట్రల్ ఫుడ్ లాబరెటరీ డైరక్టరు నుండి కోర్టుకు సర్టిఫికేటు వచ్చిన తరువాత సదరు భాగమును నాశనము చేయవలెను.

అయితే సెంట్రల్ ఫుడ్ లాబరెటరీ డైరెక్టరుకు కోర్టు పంపిన శాంపిల్ భాగము పోయినచో లేక చెడిపోయినచో, కోర్టు, లోకల్ హెల్త్ అథారిటీని ఒకవేళ తన వద్ద ఉంచబడిన శాంపిల్ యొక్క భాగమును పంపమని కోరవచ్చును. మరియు అట్టి భాగము చేరగానే కోర్టు సబ్ సెక్షను (2-బి)లో పొందుపరిచిన విధముగా నడచుకొనవలెను.

(2-డి) సెంట్రల్ ఫుడ్ లాబరెటరీ డైరెక్టరు నుండి విశ్లేషణం యొక్క ఫలితము యొక్క ధృవీకరణ పత్రము చేరునంత వరకు, కోర్టు తన ముందు ఉన్న అభియోగమునకు సంబంధించిన కార్య వ్యవహారములు సాగించరాదు.

(2-ఇ) ఫుడ్ ఇన్‌స్పెక్టరు యొక్క నివేదిక పరిశీలించిన తర్వాత వేరే విధముగా గానీ, సబ్ సెక్షను (1) క్రింద పబ్లిక్ ఎనలిస్టు ఇచ్చిన నివేదిక తప్పు అని లోకల్ హెల్త్ అథారిటీ అభిప్రాయపడినప్పుడు, సదరు అథారిటీ తన దగ్గర ఉంచబడిన శాంపిల్ భాగములలో ఒక దానిని మరే ఇతర పబ్లిక్ ఎనలిస్టుకైనా పంపవలెను, మరియు సదరు ఇతర పబ్లిక్ ఎనలిస్టు శాంపిల్ భాగము యొక్క విశ్లేషణం నివేదిక సదరు ఆహార పదార్థము కల్తీ చేయబడినదనినచో, సబ్ సెక్షన్ 2 నుండి (2-డి) వరకుగల నిబంధనలు అయినంత మట్టుకు వర్తించును.

3) సబ్ సెక్షను (2-బి) క్రింద సెంట్రల్ ఫుడ్ లాబరెటరీ డైరెక్టరు ఇచ్చిన సర్టిఫికేటు సబ్ సెక్షను (1) క్రింద పబ్లిక్ ఎనలిస్టు ఇచ్చిన సర్టిఫికేటును రద్దుచేయును.

4) సబ్ సెక్షను (2-బి) క్రింద సెంట్రల్ డ్ లాబరెటరీ యొక్క డైరక్టరు నుండి సర్టిఫికేటు పొంది కోర్టులో దాఖలు చేసినప్పుడు, ఈ శాసనము క్రింది కార్య వ్యవహారములో కాని సెక్షన్ 272 నుండి 276 భారతశిక్షా స్మృతి క్రింద కార్య వ్యవహారములో

కాని దాఖలు చేసినప్పుడు, విశ్లేషణం కొరకు తీసికొనబడిన ఆహార వస్తువు యొక్క ఏ భాగమునూ సదరు కార్య వ్యవహారములలో హాజరు పరచనవసరము లేదు.

5) సబ్ సెక్షను 3 క్రింద రద్దయితే తప్ప పబ్లిక్ ఎనలిస్టు సంతకం చేసిన నివేదిక అని ఉద్దేశించిన ఏ పత్రమైనా, సెంట్రల్ ఫుడ్ లాబరెటరీ డైరక్టరు సంతకం చేసిన సర్టిఫికేటుగా ఉద్దేశించబడిన ఏ పత్రమైనా, ఈ శాసనము క్రింది లేక భారత శిక్షాస్మృతి సెక్షన్ 272 నుండి 276 వరకు క్రింద ఏ కార్య వ్యవహారములలోనైనా అందులో చెప్పబడిన విషయములకు దృష్టాంతముగా ఉపయోగించ వచ్చును.

అయితే సెక్షను 16 (1 ఎ) ప్రతి కల్పనలో ప్రస్తావించబడిన ఆహార వస్తువు యొక్క శాంపిల్ విశ్లేషణంకు సంబంధించిన సర్టిఫికేటుకు తప్ప, సెంట్రల్ ఫుడ్ లాబరెటరీ డైరక్టరు సంతకం చేసిన సర్టిఫికేటుగా ఉద్దేశించబడిన ఏ పత్రమైనా అందులో చెప్పబడిన అంశముల యొక్క తుది మరియు నిశ్చయకమైన రుజువు అయి వుండును.

వివరణ :—

ఈ సెక్షన్‌లో మరియు సెక్షను 16 (1ఎ)లో 'కేంద్ర ఆహార పరిశోధనశాల డైరక్టరు' అను పదము కేంద్ర ప్రభుత్వముచే ఈ సెక్షను నిమిత్తము గుర్తించబడిన ఇతర ఆహార పరిశోధనా శాల యొక్క ఇన్‌ఛార్జిగా ఉన్న ఎటువంటి ఉద్యోగినైన (ఏ హోదాతో పిలువ బడినా) కలుపుకొనును.

## వ్యాఖ్య

1. పరిధి

2. నివేదికలోని అంశములు

3. విశ్లేషణం తేది
4. సహాయకులచే విశ్లేషణం
5. నిరూపణ
6. నివేదిక యొక్క మాన్యత
7. నియమాతిక్రమణ ఫలితము
8. విశ్లేషణంలో ఆలస్యము
9. సబ్ సెక్షను 2 నోటీసు
సెంట్రల్ ఫుడ్ లేబొరెటరీకి శాంపిల్ పంపుకొను హక్కు
10. రెండవ పబ్లిక్ ఎనలిస్టుచే విశ్లేషణం
11. సెంట్రల్ ఫుడ్ లేబొరెటరీకి శాంపిల్ పంపు విధానము
12. దరఖాస్తు పెట్టని యెడల ఫలితము.
13. సెంట్రల్ ఫుడ్ లేబరెటరి డైరక్టరు యొక్క సర్టిఫికేటు
14. సెంట్రల్ ఫుడ్ లేబరెటరిచే పరిశోధనకు రెండవ దరఖాస్తు
15. పబ్లిక్ ఎనలిస్టును సాక్షిగా విచారించుట
16. రాజ్యాంగ బద్ధత

1. పరిధి :-

1976 సవరణ చట్టమునకు పూర్వము పబ్లిక్ ఎనలిస్టు తన నివేదికను ఫుడ్ ఇన్‌స్పెక్టరుకు పంపెడివాడు. ఇపుడు లోకల్ (హెల్త్) అథార్టికి పంపవలెను. సవరణకు పూర్వము శాంపిల్ తీసికొనబడిన వ్యక్తికి పబ్లిక్ ఎనలిస్ట్ నివేదిక ఎపుడు ఇవ్వవలెనో అన్న సంగతి వివరించబడలేదు. ఆహార వస్తువుల కల్తీ నిరోధక నియమావళి, 1955, నియమము (9) (జె) ప్రకారం పబ్లిక్ ఎనలిస్ట్‌యొక్క నివేదిక నకలు ఇవ్వవలసియున్నది. ఈ నియమము ఎన్నోసార్లు సవరించబడినది. జి. ఎస్. ఆర్. 1533 తేదీ 8-7-68 నోటిఫికేషన్ ప్రకారం పబ్లిక్ ఎనలిస్టుయొక్క నివేదిక నకలు కోర్టులో అభియోగము దాఖలు చేసిన వెంటనే, శాంపిల్ తీసికొనబడిన వ్యక్తికి చేతి ద్వారాగాని రిజిష్టర్డ్ పోస్టు ద్వారాగాని పంపవలసియున్నది. జి. ఎస్. ఆర్. 204 తేది 13-2-74 నోటిఫికేషన్ ప్రకారం పబ్లిక్ ఎనలిస్టు నివేదిక ఫుడ్ ఇన్

స్పెక్టరుకు చేరిన 10 రోజులలో దాని నకలును శాంపిల్ తీసికొనబడిన వ్యక్తికి పంప బడవలసియున్నది. 4-1-77 తేదిన రూ. 9 (జే) రద్దు అయినది. 1976 శాసనము 34 ద్వారా సెక్షన్ 13 లో సబ్ సెక్షన్ (2) చేర్చబడిన తర్వాత లోకల్ (హెల్త్) అథారిటిపై ఈ బాధ్యత ఉంచబడినది. ఇపుడు నకలుతోపాటు, నకలు చేరిన పది రోజులు లోగా అట్టి వ్యక్తి సెంట్రల్ ఫుడ్ లెబరెటరీద్వారా ఆహారం శాంపిల్ యొక్క భాగమును విశ్లేషణం కోరవచ్చును అని తెలియబరచవలసిన బాధ్యత కూడా ఉన్నది.

2. నివేదికలోని అంశములు :—

పబ్లిక్ ఎనలిస్టు యొక్క నివేదికలో ఏమి ఉండవలెను? పబ్లిక్ ఎనలిస్టు తన రిపోర్టులో తాను ఏమి చేసినది ఏమి పరీక్షలు చేసినది వ్రాయనక్కరలేదు.

మంగల్‌దాస్ రాఘవజీ Vs మహారాష్ట్ర స్టేట్
(ఎ. ఐ. ఆర్. 1966 యస్. సి. 128)
1985 యఫ్. ఎ. జె. 244

పబ్లిక్ ఎనలిస్ట్ తన నివేదికలో విశ్లేషణం యొక్క ఫలితం, ఆహార వస్తువు కల్తీ చేయబడినదని భావించుటకు అవసరమైన భోగట్టా ఉదహరించిన చాలు.

ధ్యాన్‌సింగు Vs షారన్‌పూర్ మునిసిపాలిటి
(ఎ. ఐ. ఆర్. 1970 యస్. సి. 318)
ఇన్‌రీ మీనాక్షి అఛి. 1973 క్రి. లా జ. 356 (మద్రాసు)

పబ్లిక్ ఎనలిస్టు తన నివేదికలో నూనె శాంపిల్‌లో కనబడిన ఫాట్టీ ఆసిడ్ (fatty acid) యొక్క పరిమాణము వ్రాసినప్పుడు, అతడు ఏ పద్ధతి అనుసరించి ఆ పరిమాణము ఉన్నదని తేల్చుకొన్నాడో ఉదహరించలేదు అనే కారణంగా రిపోర్టు అంగీకరించరాదు అనే వాదన చెల్లదు.

ఇన్‌రి నరిసిష్టా చెట్టి 1963 (1) క్రి. లా. జ. 109

ఆహార వస్తువులో కనుగొనబడిన బాహ్య పదార్థము ఆరోగ్యమునకు భంగ కరము కానిదైనా పూర్తిగా నిషేదించబడినదైన, ఆ బాహ్య పదార్థము యొక్క పరి మాణము ఎంత ఉన్నది. పబ్లిక్ ఎనలిస్ట్ యొక్క నివేదికలో వ్రాయనక్కరలేదు.

ఆ బాహ్య పదార్థము ఆరోగ్యమునకు భంగకరమైనదైన పూర్తిగా నిషేదించబడినదైనా దానియొక్క పరిమాణం సరిగ్గా ఉదహరించవలెను.

మునిసిపల్ కౌన్సిల్ అమృతసర్ Vs అర్జున్‌సింగ్
(1972 (74) పి. ఎల్. ఆర్. 793)

3. విశ్లేషణ తేది :—

నిర్ణీత నమూనాలో తేదీ వేయుటకు గడి ఉన్నా లేకపోయినా పబ్లిక్ అనలిస్టు విశ్లేషణ చేసిన తేదీ వ్రాయవలెను.

సోహన్ Vs స్టేట్ ఎ. ఐ. ఆర్. 1963 రాజస్థాన్ 17

పబ్లిక్ ఎనలిస్ట్‌కు చేరిన శాంపిల్ పాడుకానప్పుడు, విశ్లేషణకు తగినదిగా నున్నప్పుడు విశ్లేషణం చేయుటకు ఎంతకాలము పట్టినది ప్రాసిక్యూషన్ నిరూపించ నక్కరలేదు.

పి. పి. Vs తాతారావు
ఎ. ఐ. ఆర్. 1968 ఎ. పి. 17

విశ్లేషణం యొక్క ఫలితం రిజిస్టర్‌లో నమోదు చేసిన తర్వాత, పబ్లిక్ అనలిస్ట్ చిత్తు గణితం చేసిన కాగితములు దాచిపెట్టనక్కరలేదు.

1974 క్రి. లా. జ. 1753 [ఢిల్లీ]

4. సహాయకులచే విశ్లేషణం

1960 పూర్వము ఫారం III ఈ విధముగా నుండెడిది. "నేను సదరు శాంపిల్‌ను విశ్లేషణం జరిపినానని సర్టిఫై చేయుచున్నాను. మరియు విశ్లేషణం యొక్క ఫలితం ఈ విధముగా తెలియపరచుచున్నాను" జి. యస్. ఆర్. 425, తేదీ 16 ఏప్రిల్ 1960 ద్వారా ఫారం III ఈ క్రింది విధముగా సవరించబడినది, "నేను సదరు శాంపిల్‌ను విశ్లేషణ జరిపినాను / జరిపించినాను. అని సర్టిపై చేయుచున్నాను మరియు విశ్లేషణ యొక్క ఫలితం క్రింది విధముగానున్నదని ప్రకటించుచున్నాను." దీనితో విశ్లేషణం పబ్లిక్ ఎనలిస్ట్ స్వయముగా చేయవలెనా సహాయకుల ద్వారా చేయించ వచ్చునా అనే తగాయిదా యికలేదు.

పబ్లిక్ ఎనలిస్ట్ విశ్లేషణం తన సహాయకుల ద్వారా తన ఆధ్వర్యంలో చేయించవచ్చును.

మంగల్‌దాస్ రాఘవజీ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
(ఎ. ఐ. ఆర్. 1966 యస్. సి. 128)

అనగా సహాయకుడు కూడా విశ్లేషణం చేయవచ్చుగాని అతడు కూడా పబ్లిక్ ఎనలిస్టు వలెనే ఉన్నతమైన అర్హతలు కలిగి సమర్థుడై ఉండవలెను. ఈ విషయములో సుప్రీమ్ కోర్టు ఈ విధముగా చెప్పినది. పబ్లిక్ ఎనలిస్ట్ తన సహాయకుని ద్వారా శాంపిల్ విశ్లేషణం చేయించినా ఫలితమునకు తానే సంతకం పెట్టవలెను, తానే అభిప్రాయమును తెలియపరచవలెను. అందువలన ఏదో ఒక దశలో విశ్లేషణలో తాను కూడా పాత్ర తీసికొనును, లేదా సహాయకుల ప్రయోగమును తనిఖీ చేయును."

బాబులాల్ హరగోవింద దాస్ Vs స్టేట్ ఆఫ్ గుజరాత్
ఎ. ఐ. ఆర్. 1971 యస్. సి. 1277

5 నిరూపణ :-

నివేదిక అచ్చు నమూనాలో ఉండి, సంతకము ఉండి అధికారి పేరు, డిగ్రీలు, హోదా రబ్బరు స్టాంపు వేసి ఉన్న పత్రము పబ్లిక్ ఎనలిస్ట్ సంతకము చేసినట్లుగా భావించబడుచున్న నివేదిక అగును. అందువలన అది ఇతర రుజువు లేకుండానే సాక్ష్యంగా తీసికొనవచ్చును.

మునిసిపల్ బోర్డ్ షాహరాన్‌పుర్ Vs ధ్యాన్‌సింగ్
ఎ. ఐ. ఆర్. 1967 అలహాబాదు 941

నివేదిక సెక్షన్ 13 [5] క్రింద నిర్ణీతమైన నమూనాలో లేనప్పటికి అది పబ్లిక్ ఎనలిస్ట్ సంతకం చేసిన నివేదికగా ఉద్దేశించబడిన పత్రమే. అందులో చెప్పబడిన అంశములకు సాక్ష్యముగా అంగీకరించవచ్చును.

ఎ. ఐ. ఆర్. 1964 అలహాబాద్ 199

రూపగత రుజువు లేకుండనే నిపుణుని యొక్క నివేదిక సాక్ష్యంగా తీసికొన వచ్చును గాని అందులోని అంశములు నిజమని, సరియైనవని పురోభావన లేదు, ఏది ఎట్లైనా అందుకు వ్యతిరేకమైన సాక్ష్యమున్నప్పుడు నిపుణుని యొక్క సర్టిఫికేటుతో బాటు సదరు సాక్ష్యమును పరిశీలించి నిర్ణయము చేయవలసిన బాధ్యత కోర్టుపై ఉన్నది.

రామ్‌దయాల్ Vs మునిసిపల్ కార్పొరేషన్ ఆఫ్ ఢిల్లీ
ఎ. ఐ. ఆర్ 1970 యస్. సి. 366

6. నివేదిక యొక్క మాన్యత :-

పబ్లిక్ ఎనలిస్ట్ నివేదిక యొక్క మాన్యత సెక్షన్ [13] సబ్ సెక్షన్ (3) ప్రకారం అధిక్రాంతం చేయబడితే తప్ప, పబ్లిక్ ఎనలిస్ట్ యొక్క నివేదిక లేక సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ యొక్క సర్టిఫికేట్, అందులోని అంశముల యొక్క సాక్ష్యముగా, ఈ శాసనము క్రింది ఏ కార్య వ్యహారములోనైనా ఉపయోగించ వచ్చును. సబ్ సెక్షన్ (5) యొక్క ప్రతికల్పన క్రింద సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ డైరక్టరు సంతకం చేసిన సర్టిఫికేట్‌గా ఉద్దేశించబడిన పత్రము అందులోని అంశములకు ఆఖరి నిర్ణాయక సాక్ష్యము.

జగదీశ్ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ వెస్ట్ బెంగాల్
[ఎ. ఐ. ఆర్. 1972 యస్. సి. 204.]

ఏ కారణముచేతనైనా సెంట్రల్ ఫుడ్ లెబరేటరీ డైరక్టరు యొక్క సర్టిఫికేట్ పొందలేనప్పుడు పబ్లిక్ ఎనలిస్ట్ యొక్క రిపోర్టు సాక్ష్యం కాకుండాపోదు.

పి. పి. Vs వీరమెల్ల వీరరాజు
1972 (1) ఎ. పి. ఎల్. జె. 294.

సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ డైరెక్టరు యొక్క సర్టిఫికెట్ పొందినప్పుడు పబ్లిక్ ఎనలిస్ట్ యొక్క నివేదిక రద్దు అగునని ఎక్కడను చెప్పబడలేదు. సదరు సర్టిఫికేట్‌లో లేకుండా నివేదికలో ఉదహరించబడిన యితర అంశములు రద్దుకావు. అవి పరిశీలించవచ్చును.

స్టేట్ ఆఫ్ కేరళ Vs నారాయణ అయ్యర్
1969 యం. యల్. జె. (క్రి) 761

### 7. నియమములను అతిక్రమించిన ఫలితం:-

పరిరక్షక పదార్థము యెక్కువగా వాడినంతమాత్రమున పబ్లిక్ ఎనలిస్ట్ నివేదిక నిరాకరించనవసరంలేదు.

ఫుడ్ ఇన్‌స్పెక్టర్ కొట్టాయమ్ Vs టి. ఎన్. ఇత్యావీర
1972 కె. ఎల్. టి. 942

పబ్లిక్ ఎనలిస్ట్ ఆర్చిమోన్ ఆయిల్ కలిసినది లేనిది తెలిసికొనుటకు టి. ఎల్. సి. టెస్టుకు బదులు హెచ్. ఎల్. సి టెస్టు చేసినంత మాత్రమున పబ్లిక్ ఎనలిస్టుకు దురుద్దేశమున్నది అనుట సరిగాదు. 1974 క్రి. లా. జ. 1419 [ఎ. పి.]

నియమావళి క్రింద నిర్ణయించబడిన అన్ని ప్రమాణముల గురించి పబ్లిక్ ఎనలిస్టు తన అభిప్రాయము చెప్పవలసిన ఆవశ్యకత ఉన్నది. కొన్ని పరీక్షలు వదిలివేయరాదు. అతడు కొన్ని పరీక్షలు చేయని కారణమున పబ్లిక్ ఎనలిస్టు యొక్క నివేదిక అంగీకరించుట లేక తిరస్కరించుట సదరు కేసులోని ప్రత్యేక పరిస్థితులను బట్టి ఆధారపడి ఉండును.

మెసర్స్ నేతాజీ చంద్ర Vs కార్పొరేషన్ ఆఫ్ కలకత్తా
ఎ. ఐ. ఆర్. 1967 కలకత్తా 65.

నివేదికలో మూడు పరీక్షలలో రెండు పరీక్షలు చేసినందువలన ఆహారవస్తువు కల్తీ చేయబడునట్లుగా ప్రకటించబడినచో సదరు భోగట్టా చాలును.

మంగల్‌దాస్ రాఘవజీ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1966 యస్. సి. 128

### 8. విశ్లేషణంలో ఆలస్యము :-

ఇంతకాలము తర్వాత ఈ ఆహార వస్తువు శిధిలమైపోవునని నిర్ణయములేదు. అందువలన విశ్లేషణంలో ఆలస్యమైనంత మాత్రమున కేసు కొట్టివేయుట తగదు.

1971 యమ్. ఎల్. జె. [క్రి] 11

పబ్లిక్ ఎనలిస్టు శాంపిల్‌ను తక్షణమే పరీక్ష చేయవలెను. తాను చేసిన ఆలస్యము మరియు నిర్లక్ష్యం ప్రాసిక్యూషన్ కేసుకు నష్టముచేయు అవకాశమున్నదని

పబ్లిక్ ఎనలిస్టు గుర్తించవలెను. పబ్లిక్ ఎనలిస్ట్ అందుకొనిన శాంపిల్ చెడిపోనప్పుడు విశ్లేషణంకు ఎంతకాలము తీసికొన్నాడో అనేది నిరూపించనక్కరలేదు.

పి. పి. Vs తాతారావు
ఎ. ఐ. ఆర్. 1968 [ఎ. పి. ] 17.

శాంపిల్ తీసికొనిన 5 నెలల తర్వాత విశ్లేషణం చేసినచో సెక్షన్ 13 [2] క్రింది తన హక్కును ముద్దాయి వినియోగించకపోయినప్పటికి సంశయలాభము [బెనిఫిట్ ఆఫ్ డౌట్] ఇచ్చుట సమంజసము.

సత్రుఘ్న Vs పూరీ మునిసిపాలిటి
1968 క్రి, లా. జ. 123

ఆహార వస్తువు యొక్క స్వభావముబట్టి అది చాలా తక్కువ కాలములోనే శిధిలమగునదైనచో విశ్లేషణం చేయుటలో 2 నెలలు ఆలస్యం అయినప్పటికి ముద్దాయికి సంశయలాభము [బెనిఫిట్ ఆఫ్ డౌట్] యివ్వవలెను.

స్టేట్ ఆఫ్ కేరళ Vs మాథ్యూ
1973 క్రి. లా. జ. 721 [కేరళ]

9. సబ్ సెక్షన్ 2 :

పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు కాపీతో సె. 13 (2) క్రింది నోటీసు తప్పక ఇవ్వవలెను. ఇవ్వనిచో నియమోల్లంఘన జరిగినది.

1985 యఫ్ ఎ. జె, 133 (రాజస్థాన్)
1982 క్రి. లా, జ. 111 (మద్రాసు)

లోకల్ హెల్త్ అథారిటీయొక్క ఆదేశముపై ఫుడ్ ఇన్‌స్పెక్టరు సె. 13 (2) క్రింద నోటీసు ఇచ్చిన సందర్భంలో, నోటీసు సక్రమమైనదే.

1982 క్రి. లా. జ. 15 మద్రాస్ (యన్. ఓ. సి.)

కంప్లయింటు దాఖలు చేయకముందే నోటీసు ఇచ్చినచో సె. 13 (2) అనుసరించబడలేదు. విచారణ న్యాయసమ్మతంగాదు.

1982 క్రి. లా. జ. 15 మద్రాసు (యన్. ఓ .సి.)

సె. 13 (2) లో చెప్పబడిన కాలపరిమితి తగ్గించినప్పుడు ముద్దాయి హక్కుకు భంగం కలిగినది కావున విచారణ చెల్లదు.

1982 క్రి. లా. జ. 97 అలహాబాదు (యన్. ఒ. సి.)

శాంపిల్‌సీసా లోకల్ హెల్త్ ఆధారిటీకి పంపకుండా ఒక భాగం తనవద్ద ఉంచుకొని ఒక భాగం ముద్దాయికిచ్చుట చట్ట వ్యతిరేకము.

1982 క్రి. లా. జ. 104 (మద్రాసు)

పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు ఒక ముద్దాయికి మాత్రమే యిచ్చి, రెండవ ముద్దాయి కివ్వనప్పుడు ప్రాసిక్యూషన్ చెల్లదు.

1982 క్రి. లా. జ. 116 ఒరిస్సా (యన్. ఒ. సి.)
1985 యఫ్. ఎ. జె. 293 [కేరళ]

యజమానికి, నౌకరుకు, ఒకే నోటీసు యిచ్చిన, చెల్లదు.

మాన్‌సింగ్ ఛాదూరామ్ Vs స్టేట్ ఆఫ్ గుజరాత్
1985 యఫ్. ఎ. జె. 369

సె. 13 [2] క్రింది నియమములు ఆదేశకం.
1982 క్రి. లా. జ. 123 మద్రాసు (యన్. ఒ. సి.)

సె. 13 [2] నోటీసు కంప్లయింటు దాఖలు చేసిన తర్వాత 17 రోజులు ఆలస్యంగా యివ్వబడెను. జాప్యం క్షమార్హము.

1983 క్రి. లా. జ. 161 మద్రాసు (యన్. ఒ. సి.)

కంప్లయింటు దాఖలు చేయుటలో విపరీతమైన ఆలస్యం జరిగినది. కాని ముద్దాయి సె. 13 [2] క్రింద అప్లికేషను పెట్టుకొనలేదు. తరువాత అభ్యంతరం పెట్టలేదు.

ఎ. ఐ. ఆర్. 1971 యస్. సి. 1277
1983 క్రి. లా. జ. 188 అలహాబాదు.

ఇందుకు వ్యతిరేక తీర్పులు :—

శాంపిల్ తీసిన 3 సం॥ తర్వాత కంప్లయింటు దాఖలు చేయబడెను. అట్టి జాప్యము సహింపతగనిది.

దేవకీనందన్ Vs స్టేట్ ఆఫ్ రాజస్థాన్
యఫ్. ఎ. జె. 441

**శాంపిల్ తీసిన 5 సం॥** లకు కంప్లయింటు దాఖలయ్యెను. శాంపిల్ 2 వ భాగం విశ్లేషణక యోగ్యమయ్యెను. ముద్దాయి విమోచనార్హుడు.

వై. యం. కోలీ Vs డి. ఎ. కొకాని
1985 క్రి. లా. జ. 1255

సెంట్రల్ ఫుడ్ లేబరేటరి డైరక్టరు కల్తీ ఆహారమని సర్టిఫికేట్ ఇచ్చుచూ ఆహార పాత్రపై సీలు నమూనా సీలుతో సరిపోలేదని వ్రాసినప్పుడు, హైకోర్టు సర్టిఫికేటు తిరస్కరించి, పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు ఆధారంగా ముద్దాయికి శిక్ష విధించెను. సుప్రీంకోర్టు "సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ డైరక్టరు సర్టిఫికేటు, పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టును అధిక్రాంతము చేయును. డైరక్టరు రిపోర్టు చెల్లలేదు, అందువలన కల్తీ ఆహారమని న్యాయసమ్మతమైన సాక్ష్యం లేనట్లే కాబట్టి ముద్దాయి విమోచనార్హుడు" అని చెప్పెను.

చతూమన్ Vs స్టేట్ ఆఫ్ మధ్యప్రదేశ్
ఎ. ఐ ఆర్. యస్. సి. 1387 (జస్టిస్ చిన్నపరెడ్డి)

పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టుకు, డైరెక్టరు సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ సర్టిఫికేటుకు గల వైరుధ్యం ప్రాసిక్యూషను వివరించనక్కరలేదు. పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు అధిక్రాంతమగును.

1981 క్రి. లా. జ. 1009
1982 క్రి. లా. జ. 1964 (గుజరాత్)
1983 క్రి. లా. జ. 224 [కేరళ]

పిటీషనరును తోటి ముద్దాయిగా కలిపినప్పుడు, లోకల్ హెల్త్ అథారిటీ వద్ద ఉన్న శాంపిల్ సెంట్రల్ ఫుడ్ లేబరేటరీకి విశ్లేషణము కొరకు పంపమని కోరు హక్కు పిటీషనరుకు కలదు.

1983 క్రి. లా. జ. 423 [హిమాచల్ ప్రదేశ్]

సె. 13 [2] లో "పంపుట" అను పదము యొక్క అర్థము "తెలిసిన చిరునామాకు పంపుట" అని అర్థం. రిజష్టరు పోస్టులో పంపి, పోస్టలు రశీదు దాఖలు చేసినచో, అందుకు వ్యతిరేక సాక్ష్యం లేనప్పుడు, సె. 13 [2] అనుసరించబడినట్లే.

1985 ఎఫ్. ఎ. జె. 67 [పంజాబ్ & హర్యానా]

నివేదిక రిజష్టరు పోస్టులో పంపినప్పుడు, నివేదిక సముచిత కాలంలో అందినదని భావించవచ్చును.

అసరఫీ Vs స్టేట్ ఆఫ్ యు. పి.
1985 ఎఫ్. ఎ. జె. 88 [అలహాబాద్]

ఈ సందర్భంగా రూలు 9 - ఎ చదువదగును.

రూలు 9—ఎ.

ఈ నిబంధనలో ఉపయోగించిన పదము 'వెంటనే' అనగా 'తక్షణమే' అని అర్థమా? పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు సె. 13 [2] లో నోటీసు పంపుటలో ఆలస్యమయినచో ప్రాసిక్యూషను చెల్లదా అనే అంశంపై విభిన్న తీర్పులు ఇవ్వబడినవి.

ఈ నియమము ఉల్లంఘించినచో ముద్దాయిని విముక్తి చేయవలెను అని మద్రాసు హైకోర్టు 1982 (క్రి. లా. జ. 1359) లో, 1984 (క్రి. లా. జ. 1387) లో తీర్పు యిచ్చినది. కాల పరిమితి మార్గదర్శకమేగాని, తప్పని సరిగాదని, ఆలస్యము వలన ముద్దాయి నష్టము (Prejudice) కలిగినదని నిరూపించినప్పుడు తప్ప ప్రాసిక్యూషనుకు భంగము కల్గదని, కేరళ హైకోర్టు 1984 (క్రి. లా. జ. 225) లో, ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో జస్టిస్ జయచంద్రారెడ్డి 1984 [క్రి. లా. జ. 51] లో తీర్పు యిచ్చిరి.

సుప్రీంకోర్టు తులసీరామ్ కేసులో ఈ రెండవ రీతి తీర్పులను ఆమోదించి యిట్లు వక్కాణించినది:

రూలు 9-ఎ లోని 'వెంటనే' అను పదముల వలన, రిపోర్టు కాపీ యిచ్చుటలో ఆలస్యమయినదను కారణంచేత కేసుకొట్టి వేయుట తగదు. వెంట వెంట చేయవలసిన పనులు చెప్పుటయే ఈ పదము యొక్క ఉద్దేశ్యము. ఏ వ్యక్తి నుండయితే శాంపిల్ తీసుకొనబడెనో ఆ వ్యక్తి, ప్రాసిక్యూషను సాక్ష్యము మొదలగుటకు చాలినంత ముందుగా, సె. 13 [2] లో తనకు శాసనము ద్వారా సంక్రమించిన అధికారమును వినియోగించుటకు వీలుకలుగునట్లుగా, సాధ్యమైనంత అతి త్వరలో పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు యొక్క కాపీని ఇవ్వవలెను.

రూలు- 9 ఎ ।అతిక్రమించిన సందర్భమున ఆలస్యము వలన ముద్దాయికి నష్టము జరిగినదా అన్నది ప్రశ్న. కేవలం అతిక్రమణ వలన కేసుకు భంగం లేదు.

తులసీరామ్ Vs స్టేట్ ఆఫ్ మధ్యప్రదేశ్
1984 క్రి, లా. జ. 1731
ఏ. ఐ. ఆర్. 1985 యస్. సి. 299

పబ్లిక్ ప్రాసిక్యూటర్ Vs విజ్జపు మణికుమార్
1985 యఫ్. ఎ. జె. 398 [ఎ. పి]

సెంట్రల్ ఫుడ్ లేబరేటరికి శాంపిల్ పంపుకొను హక్కు :-

సె. 13 (2-ఎ) 1976 సవరణకు పూర్వము తన దగ్గర శాంపిల్‌గాని ఫుడ్ యిన్‌స్పెక్టరు వద్ద ఉన్న శాంపిల్‌ను గాని సెంట్రల్ ఫుడ్ లేబరేటరీకి పంపవలెనని కోరుతూ ముద్దాయి కోర్టుకు దరఖాస్తు పెట్టుకొను హక్కు ఉండినది. 1976 సవరణ చట్టము తర్వాత సెక్షన్ 11 క్రింద ముద్దాయికి శాంపిల్ యొక్క భాగము ఇచ్చు వసతి లేదు, అభియోగము దాఖలు చేసిన వెంటనే లోకల్ [హెల్త్] అథారిటీకి పబ్లిక్ ఎనలిస్టు యొక్క నివేదిక నకలును ముద్దాయికి పంపవలెను. అది అందిన పది రోజులలోగా లోకల్ [హెల్తు] అథారిటీ వద్ద ఉంచబడిన శాంపిల్ భాగమును సెంట్రల్ [హెల్తు] లేబరేటరీలో విశ్లేషణం చేయించవలెనని కోరుచూ ముద్దాయి కోర్టుకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును. ఈ విధముగా ముద్దాయి హక్కు రక్షించబడినది. ఇది ముద్దాయికి గల చాలా విలువయిన హక్కు. రిపోర్టు వచ్చిన ఎనిమిది నెలల

దాకా కోర్టులో అభియోగము దాఖలు చేయని కారణము చేత ముద్దాయికి సె (13) (2) క్రింద గల హక్కు నిరాకరించినట్లైనది.

ఫుడ్ ఇన్‌స్పెక్టర్ త్రిచుర్ Vs దేవదాస్
1968 యమ్. ఎల్. జె. [క్రి] 53

ఫుడ్ ఇన్‌స్పెక్టర్ (ఇప్పుడు లోకల్ హెల్తు అథారిటీ) హాజరు పర్చిన శాంపిల్ సీసా సరైన దశలో లేకుండ స్రవించునప్పుడు ఫుడ్ ఇన్‌స్పెక్టరు దాని స్థితిని రక్షించుటలో అజాగ్రత్త వలన సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ నుండి నివేదిక పొందునట్టి ముద్దాయి హక్కునకు భంగము వాటిల్లినది. అందువలన ముద్దాయి సంశయలాభమునకు అర్హుడు.

గురుబచ్చన్‌సింగ్ Vs స్టేట్ ఆఫ్ పంజాబ్ 1973 క్రి. లా. జ. 765.

ఫుడ్ ఇన్‌స్పెక్టరు వద్దనున్న శాంపిల్ సీసాలు వరదలలో కొట్టుకుపోయినపుడు సెంట్రల్ ఫుడ్ లేబరేటరీకి ముద్దాయి శాంపిల్ పొందు హక్కుపోయినందువలన ముద్దాయి విముక్తికి అర్హుడు.

కర్జందాస్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1975 యఫ్. ఎ. సి. 406

ప్రాసిక్యూషన్‌వారు అత్యాలశ్యం చేసినందువలన వెంటనే అభియోగము తెచ్చుటలో నిర్లక్ష్యము చేసినందువలన ఫుడ్ ఇన్‌స్పెక్టరు వద్దనున్న శాంపిల్ పాడై పోయి విశ్లేషణంకు ఉపయుక్తముగా లేనిచో ముద్దాయి హక్కునకు భంగము వాటిల్లినట్లు. ముద్దాయి విముక్తికి అర్హుడు.

వైయం. కోలీ Vs డి. ఎ. కొకాని
1985 క్రి. లా. జ. 1255

మునిసిపల్ బోర్డు చంద Vs లీలాధర్
1974 క్రి. లా. జ. 132 (అలహాబాద్)

స్టేట్ ఆఫ్ కేరళ Vs పి. కె. చాము
1975 యఫ్. ఎ. సి. 416 (కేరళ)

ఆలస్యమైనందువలన ముద్దాయికి గల హక్కునకు భంగము కలిగినదని నిరూపణ అయితే తప్ప కేవలం ఆలస్యం కారణము పైన కేసు కొట్టివేయరాదు.

ఎ. యన్. ఆప్టే Vs మహ్మద్ అమీర్
1974 యఫ్. ఎ. సి. 131 (మధ్యప్రదేశ్)

10 రెండవ పబ్లిక్ ఎనలిస్ట్‌చే పరిశోధన :-

సెక్షన్ (8) ద్వారా కేంద్ర లేక రాష్ట్ర ప్రభుత్వములు ఒకటి లేక ఎక్కువ పబ్లిక్ ఎనలిస్ట్‌లను నియమించు అధికారము పొందియున్నవి. సెక్షన్ 13, సబ్ సెక్షన్ (2-ఇ) పబ్లిక్ ఎనలిస్ట్‌యొక్క ఇష్టానుసార చర్యలను నిరోధించును. దుర్మార్గులైన వ్యాపారులు పబ్లిక్ ఎనలిస్టులను అవినీతి మార్గములకు త్రిప్పు చర్యలు లెజిస్లేచరు దృష్టికి వచ్చినట్లున్నది. అటువంటి చర్యలను అరికట్టు ఉద్దేశముతో ఈ సబ్ సెక్షన్ చేయబడినది. సబ్ సెక్షన్ (2-ఇ) లోని హక్కును లోకల్ (హెల్త్) అథారిటికి మొదటిసారిగా 1976 సవరణ చట్టముద్వారా సంక్రమించినది. ఒక పబ్లిక్ ఎనలిస్టుయొక్క నివేదిక తప్పని భావించినప్పుడు లోకల్ (హెల్త్) అథారిటి తనవద్ద ఉన్న శాంపిల్ యొక్క మరియొక భాగమును వేరొక పబ్లిక్ ఎనలిస్టుకు పంపవలెను. రెండవ పబ్లిక్ ఎనలిస్టు ఆహార వస్తువు కల్తీచేయబడినదని నివేదిక ఇచ్చినపుడు ఆ నివేదిక ఆధారముగా అభియోగము దాఖలు చేయవచ్చును ఆ నివేదికకు సబ్ సెక్షన్ (2) నుండి (2-డి) వర్తించును.

11. సెంట్రల్ ఫుడ్ లేబొరేటరికి శాంపిల్ పంపించు విధానము :-

సెంట్రల్ ఫుడ్ లేబొరేటరీ డైరక్టరుకు శాంపిల్ పంపించు కార్యక్రమము యొక్క దశలు, విధానము ఈ క్రింది విధముగా నున్నవి.

1. ఏ వ్యక్తినుండి యైతే శాంపిల్ తీసికొనబడినదో ఆ వ్యక్తిగాని లేక ఆ వ్యక్తికి అమ్మిన వ్యక్తిగాని (సెక్షన్ 14-ఎ క్రింద ప్రకటించబడిన వ్యక్తి) పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు అందిన పదిరోజుల లోగా కోర్టుకు దరఖాస్తు పెట్టుకొనవలెను.
2. లోకల్ [హెల్త్] అథారిటీవద్ద ఉంచబడిన శాంపిల్ యొక్క భాగములను పంపమని కోర్టు కోరును.

3. కోర్టునుండి అభ్యర్థన పత్రము చేరిన 5 రోజులలోగా లోకల్ [హెల్త్] అథారిటీ తమ రక్షణలోనున్న సదరు శాంపిల్ భాగములను కోర్టుకు పంపవలెను.

4. సెక్షన్ 11 [1-బి] ప్రకారం సదరు శాంపిల్ భాగముల పైని గుర్తు సీలు, బంధన సరిగా ఉన్నది లేనిది పరిశీలించవలెను.

5. శాంపిల్ పైని శాంపిల్ తీసికొనబడిన వ్యక్తియొక్క సంతకము లేక వేలుముద్ర దిద్దబడలేదని కోర్టు రూఢి చేసికొనవలెను.

6. అప్పుడు కోర్టు సదరు శాంపిల్ భాగమును కోర్టు సీలువేసి సెంట్రల్ ఫుడ్ లేబొరెటరీ డైరక్టరుకు పంపవలెను.

7. శాంపిల్ అందిన ఒక నెల రోజులలోగా సెంట్రల్ ఫుడ్ లేబొరెటరీ డైరక్టరు తన సర్టిఫికేట్‌ను పంపవలెను.

8. సెంట్రల్ ఫుడ్ లేబొరెటరీకి పంపబడని మూడో భాగము కోర్టు లోకల్ అథారిటీకి వాపసు పంపవలెను.

9. సర్టిఫికేటు వచ్చువరకు కోర్టు తన ముందు కార్య వ్యవహారములను నిలుపుదల చేయవలెను.

12. ముద్దాయి దరఖాస్తు పెట్టని యెడల ఫలితము :-

సెక్షను 13 (2) క్రింద దరఖాస్తు పెట్టుకోకుండ, తన హక్కునకు భంగము కలిగినదని ముద్దాయి వాదించుటకు వీలులేదు.

బాబులాల్ హర గోవిందదాస్ Vs స్టేట్ ఆఫ్ గుజరాత్
ఎ. ఐ. ఆర్. 1971 యస్. సి. 1277

జగదీశ్ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ వెస్టు బెంగాల్
1972 యస్. సి. 2044

అజిత్ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1972 యఫ్. ఎ. సి. 545

శాంపిల్ తీసికొనిన తర్వాత 5 సం॥లకు కంప్లయింటు దాఖలు చేసినప్పుడు శాంపిల్ విశ్లేషణకు పనికిరానప్పుడు సెక్షను 13 (2) క్రింద దరఖాస్తు పెటుకొన్న ప్పటికీ ముద్దాయి విమోచనార్హుడే.

వై. యం. కోలి Vs డి. ఎ. కొకానీ
1985 క్రి. లా. జ. 1255
(హర గోవిందదాస్ కేసు ప్రస్తావించబడెను)

13. సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ డైరక్టరు యొక్క సర్టిఫికేటు :-

సెంట్రల్ ఫుడ్ లేబొరేటరీ డైరక్టరు యొక్క సర్టిఫికేటు పబ్లిక్ ఎనలిస్టు యొక్క రిపోర్టును అతిక్రమించును. సదరు సర్టిఫికేటు అందులో చెప్పబడిన విషయము యొక్క నిర్ణాయక సాక్ష్యం.

జగదీష్ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ వెస్టు బెంగాల్
ఎ. ఐ. ఆర్. 1972 యస్. సి. 2044

సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ యొక్క సర్టిఫికేటు నిర్ణాయక సాక్ష్యమైనప్పటికి కొన్ని సందర్భములలో డైరక్టరు యొక్క సర్టిఫికేటును కోర్టు నిరాకరించవచ్చును.

మంగల్‌దాస్ రాఘవజీ Vs స్టేట్
ఎ. ఐ. ఆర్. 1966 యస్. సి. 128

సెక్షన్ 13 క్రింది రిపోర్టు సదరు లేబొరెటరీకి పంపిన శాంపిల్‌లోని పదార్ధ ముల స్వభావమును గూర్చి మాత్రమే ఆఖరు సాక్ష్యము. లేబొరెటరీకి పంపబడిన శాంపిల్ తన వద్దనున్న ఆహార వస్తువు శాంపిల్ కాదని ముద్దాయి వాదించవచ్చును. విశ్లేషణంలో ఆలస్యం గురించి వాదించవచ్చును.

మున్సిపల్ కార్పొరేషన్ Vs ఓం ప్రకాష్
1970 క్రి. లా. జ. 1047 ఢిల్లీ

పదార్థము యొక్క శాంపిల్ లోని అంశములు ఆవిరి అయిపోవునని సాక్ష్యము ముద్దాయి పెట్టుటకు అభ్యంతరంలేదు.

మోహన్‌లాల్ Vs బిపిన్ చంద్ర
ఎ. ఐ. ఆర్. 1962 గుజరాత్ 44

కోర్టు సర్టిఫికేటు యొక్క విలువ, నమ్మకము, ఇతర సాక్ష్యం వలెనే పరీక్షించ వచ్చును.

యం. ఎ. థామస్ Vs పి. టి. అబ్రహం

ఎ. ఐ. ఆర్. 1969 కేరళ 146

పబ్లిక్ ఎనలిస్టు నివేదిక సెంట్రల్ ఫుడ్ లేబొరెటరీ డైరెక్టరు యొక్క సర్టిఫికేటు విరుద్ధముగా ఉన్నవనే కారణం చేత ముద్దాయిని విముక్తి చేయుట సరికాదు.

1975 క్రి. లా. జ. 915

గోపినాథ నాయర్ Vs పలాని,

1971 యం. యల్. జె, (క్రి) 229

నమూనా:- సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ యొక్క సర్టిఫికేటు ఆహార కల్తీ నిరోధక నియమావళి 1955 నిబంధన 4 (5) ప్రకారం నమూనా IIలో ఉండవలెను,

14. సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ డైరక్టరుకు శాంపిల్ పంపుటకు రెండవ దరఖాస్తు:-

సెక్షను 13 (2) క్రింద దరఖాస్తు పెట్టుకొని సెంట్రల్ ఫుడ్ లేబరెటరీ నుండి సర్టిఫికేటు పొందిన తర్వాత ముద్దాయి రెండవ దరఖాస్తు చేసికొనుటకు హక్కులేదు.

రన్‌బీర్‌సింగ్ Vs స్టేట్

1970 క్రి. లా. జ. 82 (అలహాబాద్)

కడ సాంబమూర్తి ఇతని 1973 (I) ఆం. ప్ర. రి. 43

ప్రతికల్పన: 1976 సవరణ తర్వాత 13 (2-సి) ప్రతికల్పన వలన లేబరేటరీకి పంపిన శాంపిల్ పోయిన, చెడిపోయిన, లోకల్ (హెల్త్) అథారిటీ వద్ద ఉంచబడిన శాంపిల్ మరియొక భాగమును కోర్టుకు తెప్పించుకొని సదరు లేబరెటరీకి పంపవచ్చును

డైరక్టరు యొక్క సర్టిఫికేటు అసంపూర్ణముగా నున్నప్పుడు లోకల్ హెల్త్ అథారిటీవద్దయున్న శాంపిల్ 3వ భాగంను తిరిగి పరీక్షకు పంపుటకు మేజిస్ట్రేటుకు అధికారం గలదు.

రాజేంద్రచోప్రా Vs ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్

1985 ఎఫ్. ఎ. జ. 49

**15.** పబ్లిక్ ఎనలిస్ట్‌ను సాక్షిగా విచారించుట :-

పబ్లిక్ ఎనలిస్టును కోర్టులో సాక్షిగా విచారించ నవసరములేదు. ఆ కారణము చేత కేసు కొట్టివేయుట తగదు.

మంగల్‌దాస్ రాఘవజీ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1966 యస్. సి. 128

పబ్లిక్ ఎనలిస్టును సమన్ చేయవలసిన బాధ్యత లేదు.

1970 క్రి. లా. జ. 182,
1970 క్రి. లా. జ. 227

16. రాజ్యాంగ బద్ధత :-

సెక్షన్ 13 (5) రాజ్యాంగము యొక్క 14వ సూత్రముకు వ్యతిరేకము కాదు. సెక్షన్ 13 (5) ప్రోవిజో ప్రత్యేకమైన కార్యవర్తన నిర్ణయించదు. ఒక సాక్ష్య సూత్రమును మాత్రమునే చెప్పుచున్నది. సర్టిఫికేటు యొక్క విలువను ప్రశ్నించే హక్కు ముద్దాయికి తీసివేయబడలేదు. దీర్ఘమైన విచారణలు తగ్గించుట ఈ ప్రతికల్పన లోని అంతర్యుద్దేశ్యము. అందువలన ఈ వర్గీకరణ స్పష్టమైన భేదాత్మకము.

సెక్షను 13 (5) ప్రతికల్పన రాజ్యాంగము యొక్క 19 (1) సూత్రమునకు కూడ విరోధంకాదు. తన వృత్తి లేక వ్యాపారం చేసికొనే హక్కును అవరోధించదు.

మోహన్‌లాల్ ఛగన్‌లాల్ Vs బిపిన్ చంద్ర గాంధి
ఎ. ఐ. ఆర్. 1962 గుజరాత్ 44

సెక్షను **14** :- తయారీదార్లు, పంపిణీదార్లు, వ్యాపారులు వారంటీ ఇచ్చుట :-

ఆహార వస్తువు యొక్క స్వభావము, మరియు నాణ్యత గురించి నిర్ణీత నమూనాలో లిఖిత పూర్వకముగా వారంటీ ఇచ్చిన గాని ఆహార వస్తువుల యొక్క ఏ వ్యాపారస్తుడు, పంపిణీదారు, తయారీదారు ఆహార వస్తువును అమ్మకందారునకు అమ్మరాదు.

తయారీదారు, పంపిణీదారు లేక వ్యాపారి ఆహార వస్తువు యొక్క అమ్మకమునకు సంబంధించి అమ్మకందారునకు ఇచ్చిన బిల్, కాష్ మెమో లేక ఇన్‌వాయిస్ అట్టి తయారీదారు, పంపిణీదారు లేక వ్యాపారి ఈ సెక్షన్ క్రింద ఇచ్చిన వారంటీగా పరిగణింపబడును.

వివరణ :-

ఈ సెక్షన్‌లోను, సెక్షన్ 19 (2) మరియు సెక్షన్ 20-ఎ లోని 'పంపిణీదారు' అను వ్యక్తీకరణ కమీషను ఏజంట్‌కు కూడ వర్తించును.

## వ్యాఖ్య

వారంటీ లిఖిత పూర్వకముగా నుండవలెను. కంట్రాక్టు యొక్క ముఖ్యోద్దేశమునకు అనుషంగికను.

స్టేట్ Vs బాలముకుంద్
ఎ. ఐ. ఆర్. 1954 [అలహాబాద్] 97 లో

Invoiceలో అమ్మబడిన పదార్థము యొక్క వర్ణన మాత్రమే కాని ఈ సెక్షన్‌క్రింద వారంటీ కాదు అని చెప్పబడినది. 1976 సవరణ చట్టమునకు ప్రతికల్పన చేర్చిన తరువాత ఈ తీర్పు చెల్లదు. అదేమాదిరిగా—

పబ్లిక్ ప్రాసిక్యూటరు Vs వెంకటాద్రి
ఎ. ఐ ఆర్. 1946 మద్రాసు 414

కూడా చెల్లదు. ఈ సెక్షను ఉల్లంఘించిన వ్యక్తికి ఆరు నెలలు మించని జైలుశిక్ష మరియు 500 రూపాయలకు తగిన జరిమానా విధించవచ్చును.

నమూనా :-

వారంటీ ఆహార కల్తీ నిరోధక నియమావళి 1955 రూలు 12-ఎ లో ఇచ్చిన నమూనా పత్రము VI-ఎ ప్రకారము ఉండవలెను.

## వారంటీ నమూనా

ఇన్‌వాయిస్ నం. స్థలం.
.........నుండి తేది.
..............కు

| అమ్మిన తేది | ఆహార వస్తువు యొక్క స్వభావము నాణ్యత | పరిమాణము | విలువ |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| | | | |

నేను / మేము ఇందుమూలముగా, ఈ ఇన్‌వాయిస్‌లో ఉదహరించబడిన ఆహార వస్తువు, కొనుగోలుదారు కోరినటువంటి స్వభావము, పదార్థము, నాణ్యత కలిగి యున్నదని ధృవీకరించుచున్నాను [ము]."

ఈ నమూనాలోని, పదజాలము సంపూర్ణంగా అవలంబించకపోయినప్పటికి, సాధారణముగా వ్యాపారులు వాడుకొనే భాషలో 'వారంటి' ఇచ్చినా శాసనోద్దేశ్యము నెరవేర్చినట్లుగా భావించవచ్చును.

కె. రంగనాధ రెడ్డి Vs స్టేట్ ఆఫ్ కేరళ
ఎ. ఐ. ఆర్. 1970 యస్. సి. 520

ప్రకటనలోని భాష ఈ శాసనము క్రింద వారంటీగా భావించి అబద్ధపు వారంటీ ఇచ్చినందుకు ప్రాసిక్యూషను చెల్లదు.

నారాయణదాస్ Vs యఫ్. ఐ కోజీకోడ్
1965 యం. యల్. జె. [క్రి] 224

సెక్షను 14 - ఎ :—

అమ్మకందారు ఏ వ్యక్తి వద్దనుండి ఆహార వస్తువు కొనెనో ఆ వ్యక్తి యొక్క పేరు వగైరా తెలియ బర్చుట :-

ఆహార వస్తువు యొక్క ప్రతి అమ్మకందారు, ఫుడ్ ఇన్‌స్పెక్టరు కోరిన యెడల, ఏ వ్యక్తి నుండి అయితే తాను ఆహార వస్తువును పొందెనో ఆ వ్యక్తి యొక్క పేరు చిరునామా మరియు ఇతర వివరములు తెలియపర్చవలెను.

## వ్యాఖ్య

ఈ సెక్షను మొదటిసారిగా 1964 లో 49 వ శాసనము ద్వారా ఈ చట్టములో చేర్చబడినది. ఈ సెక్షన్ ప్రకారము అమ్మకందారు పైన తనకు అమ్మిన వ్యక్తి వివరములు తెలియపర్చవలసిన బాధ్యత ఏర్పడినది. ఇందువలన కల్తీ ఆహార వస్తువుల అమ్మకమునకు కారకులైన మూల వ్యక్తులను కూడా ప్రాసిక్యూట్ చేయుటకు వీలుకలిగినది. ఈ సెక్షన్‌ను వ్యతిరేకించిన వ్యక్తి సెక్షన్ 16 (1-సి) ప్రకారము శిక్షార్హుడు.

## సెక్షను 15 :-

కేంద్ర ప్రభుత్వము లేక రాష్ట్ర ప్రభుత్వము రాజ పత్రములో ప్రకటన ద్వారా సదరు ప్రకటనలో ఉదహరించిన ప్రాంతములోని వైద్యులను వారి గుర్తింపునకు వచ్చిన విషాహార (Food Poisoning) కేసులను ప్రకటనలో ఉదహరించబడిన అధికారికి తెలియబర్చవలెనని ఆదేశించవచ్చును.

## వ్యాఖ్య

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రకటనలు :-

జి. ఓ. యం. యస్. నం. 425 హెల్తు అండ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ ది. 12. 3. 56. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వముపై ప్రకటన ద్వారా అన్ని మున్సిపాలిటీలోని వైద్యులను కేసులను సంబంధించిన మున్సిపల్ హెల్తు ఆఫీసర్లకు, జిల్లా వైద్య అధికారులకు తెలియబరచవలెనని ఆదేశించినది.

జి. ఒ. యం. యస్. 305 హెల్తు ది. 6. 2. 58 :— ఈ ప్రకటన ద్వారా ప్రభుత్వము హైదరాబాదు మరియు సికిందరాబాదు మునిసిపల్ కార్పోరేషన్ పరిధి లోనే వైద్యులను సదరు పరిధిలో సంభవించిన ఫుడ్ పాయిజనింగ్ కేసులన్ని మున్సిపల్ కార్పోరేషన్ హెల్తు ఆఫీసర్లకు తెలియబర్చవలెనని ఆదేశించినది.

సెక్షను 16 శిక్షలు :-

1) సబ్ సెక్షను (1-ఎ) కు లోబడి ఏ వ్యక్తి అయిన-

(ఎ) తానుగాని, తన తరపున వేరే వ్యక్తి ద్వారా గాని

i) సెక్షను 2, క్లాజు (1 ఎ), సబ్ క్లాజు (యం) యొక్క అర్థములో కల్తీ చేయబడిన లేక సదరు సెక్షను క్లాజు (ix) ప్రకారము 'మిస్ బ్రాండ్ చేయబడిన, లేక ఈ శాసనము క్రిందగాని, ఈ శాసనము క్రింద చేయబడిన నియమముల క్రిందగాని, ఫుడ్ హెల్త్ అథారిటీ యొక్క ఉత్తర్వు ద్వారాగాని అమ్మకము నిషేధించబడిన ఏ ఆహార వస్తువునైనా,

ii) సబ్ సెక్షను i లో ప్రస్తావించిన ఆహారములు గాక మిగిలినవి, ఈ శాసనమును గాని దీని క్రింది నియమములగాని ఉల్లంఘించి, ఇండియాలోనికి దిగుమతి, అమ్మకంకొరకై తయారీ, నిల్వ చేసినచో, లేక అమ్మినచో, లేక పంపిణీ చేసినచో; లేక

(బి) తాను స్వయముగా గాని, తన తరపున ఇతర వ్యక్తి ద్వారా గాని, ఆరోగ్యమునకు భంగము కలిగించని కల్తీ చేయు వస్తువును ఇండియాలోనికి దిగుమతి, అమ్మకంకొరకు తయారీ లేక నిల్వ చేసినచో లేక అమ్మినచో లేక పంపిణీచేసినచో; లేక

(సి) ఈ శాసనము క్రింద అధికారము ప్రకారము శాంపిల్ తీసుకోకుండా ఫుడ్ ఇన్స్పెక్టరును అడ్డగించినచో; లేక

(డి) ఈ శాసనము ద్వారా లేక ఈ శాసనము క్రింద ఫుడ్ ఇన్స్పెక్టర్‌కు వప్పగించబడిన ఏ ఇతర అధికారమునైనా చలాయించకుండా అడ్డగించినచో; లేక

(ఇ) ఆహార వస్తువుల తయారీదారు అయి ఉండి, తన స్వాధీనములో, తన ఆక్రమణలో యున్న ఏ ఆవరణలోనైనా, ఆరోగ్యమునకు భంగము కల్గించని, కల్తీ చేయు పదార్థము కల్గి యున్నచో; లేక

(యఫ్) సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ యొక్క డైరెక్టరు లేక పబ్లిక్ ఎనలిస్టులు చేసిన విశ్లేషణ నివేదిక లేక ధృవ పత్రమును గాని అందు లోని కొంత భాగమును గాని ఆహార వస్తువు యొక్క ప్రచారమునకు ఉపయోగించినచో; లేక

(జి) తానుగాని తన తరపున వేరే వ్యక్తి గాని, తాను అమ్మిన ఆహారమునకు సంబంధించి అమ్మకము దారునకు లిఖిత పూర్వకమైన తప్పుడు వారంటీ ఇచ్చినచో; లేక

ఆ వ్యక్తి సెక్షను 6 ప్రకారము బద్ధుడగు అపరాధమునకు అదనంగా –

ఆరు నెలలు తక్కువగా నట్టి 6 సంవత్సరముల వరకు కారాగార శిక్ష మరియు రూ. 1000/–లు తక్కువ గాని జరిమానాచే శిక్షింప బడదగును.

అయితే –

(i) ఒక వేళ నేరం, క్లాజు (ఎ) సబ్ క్లాజు (i) క్రింద అయి ఉండి, ఆహారము ప్రాథమికాహారమైనచో, మానవులచే కల్తీ చేయబడిన దయినా, లేక సెక్షను 2 క్లాజు (ix) సబ్ క్లాజు (కె) యొక్క అర్థములో 'మిస్ బ్రాండెడ్' అయిన ఆహారమయినా, లేక

(ii) నేరము, క్లాజు (ఎ) సబ్ క్లాజు (ii) ప్రకారము అయి ఉండి, సెక్షను 23 (1—ఎ) యొక్క క్లాజు (ఎ) లేక క్లాజు (జి) లేక సె. 24 (2) యొక్క క్లాజు (బి) క్రింద చేయబడిన నియమోల్లంఘనము కానిచో,

తీర్పులో తగు, ప్రత్యేక కారణములున్నచో కోర్టు తన తీర్పులో ఉదహరించి 3 నెలలకు తక్కువ గాకుండా, 2 సం. ల వరకు జైలుశిక్ష మరియు రూ. 500/-లకు తక్కువగాని జరిమానా విధించ వచ్చును.

అంతేగాక—

నేరం క్లాజు (ఎ) సబ్ క్లాజు (ii) క్రింద అయి ఉండి, సెక్షను 23 (1 ఎ) క్లాజు (ఎ) లేక (జి) క్రింద లేక సెక్షను 24 (2) క్లాజు (బి) క్రింద చేయబడిన నియమోల్లంఘనమైనచో, కోర్టు తగు ప్రత్యేక కారణములున్నచో తీర్పులో నుదహరించి, 3 నెలలకు మించని శిక్ష మరియు రూ. 500/-లు దాటని జరిమానా విధించ వచ్చును.

(1—ఎ) ఏ వ్యక్తి అయినా తాను స్వయముగా గాని లేక తన తరపున వేరే వ్యక్తి ద్వారాగాని -

i) సెక్షను 2 క్లాజు (1-ఎ) యొక్క సబ్ క్లాజు (ఇ) నుండి (యల్) వరకు (రెంటితో సహా) సబ్ క్లాజుల క్రింది అర్థములో కల్తీ చేయబడిన ఏ ఆహార వస్తువు అయినా, లేక

ii) ఆరోగ్యమునకు భంగము కల్గించు ఏ కల్తీ చేయు పదార్థమైనా, ఇండియాలోనికి దిగుమతి చేసినచో, అమ్మకము కొరకు తయారీ, లేక నిల్వ చేసినచో, అమ్మినచో లేక పంపిణీ చేసినచో,

ఆ వ్యక్తి సెక్షను 6 ప్రకారము బద్ధుడగు, అపరాధమునకు అదనముగా ఒక సంవత్సరమునకు తక్కువ కానట్టి, 6 సం. ల వరకు కారాగార శిక్ష మరియు, రూ. 2000/-లు తక్కువగాని జరిమానాకు బద్ధుడగును.

అయితే సదరు ఆహారము లేక కల్తీ చేయు పదార్థము, తినినందువలన, తిన్న వ్యక్తికి మరణముగాని, ఐ. పి. సి. 320 సెక్షను యొక్క అర్థములో 'తీవ్ర ఘాత' గాని కల్గునట్టి అవకాశమున్న యెడల ఆ వ్యక్తి 3 సం. లకు తక్కువ గాకుండా, ఆజన్మ ఖైదు వరకు మరియు రూ. 5000/–ల వరకు తక్కువగాని, జరిమానాకు బాధ్యుడగును.

(1 ఎ ఎ): సెక్షను 10, (4) క్రింద ఏ వ్యక్తి యొక్క రక్షణలో నైనా ఆహార వస్తువు వుంచబడిన యెడల, ఒక వేళ ఆ వ్యక్తి ఆ పదార్థమును చెడ గొట్టినచో, లేక ఇంకే విధముగానయినా జోక్యము కలుగ జేసికొనినచో, 6 నెలలకు తక్కువ కాకుండా, 2 సం. ల వరకు మరియు రూ. 1000/– లకు తక్కువ గాని జరిమానాకు బాధ్యుడగును.

(1-బి) సెక్షను 10. (ఎ) ల క్రింద ఏ వ్యక్తికైనా ఆహార వస్తువు స్వాధీనం చేసినప్పుడు ఆ వ్యక్తి సదరు ఆహార వస్తువును అమ్మిన, పంపిణీ చేసిన, సదరు ఆహార వస్తువు సెక్షను 2 (1 ఎ) యొక్క సబ్ క్లాజు (h) యొక్క అర్థములో కల్తీ చేయబడిన ఆహారముగా, ఆహారం ఏ మేజిస్ట్రేటు ముందు హాజరు పరచబడినదో ఆ మేజిస్ట్రేటు నిర్ధారించినచో, సదరు ఆహారము తిన్న వ్యక్తికి మరణము లేక సెక్షను 320 ఐ. పి. సి. యొక్క అర్థములో తీవ్ర ఘాత కలుగు అవకాశమున్న ఎడల సబ్ సెక్షన్ (1 ఎఎ) లో ఏమి ఉన్నప్పటికీ – ఆ వ్యక్తి 3 సం. లకు తక్కువ గానట్టి ఆ జన్మ ఖైదు వరకు మరియు రూ. 5000/– లకు తక్కువ గాని జరిమానాకు బాధ్యుడగును.

(1 సి) ఏ వ్యక్తి అయినా సెక్షను 14 లేక 14 – ఎ ఉల్లంఘించినచో, 6 మాసముల వరకు జైలు శిక్ష మరియు రూ. 500/-లకు తక్కువ గాని జరిమానాకు బాధ్యుడగును.

(1. డి) ఈ శాసనము క్రింద శిక్షించ బడిన ఏ వ్యక్తి అయినా, మరల అటువంటి నేరము చేసిన యెడల, సబ్ సెక్షను (2) కు భంగము లేకుండా, రెండవ లేక తర్వాత శిక్ష విధించిన కోర్టు, ఈ చట్టము క్రింద ఏదేని లైసెన్సు ఇచ్చి యున్న, సదరు లైసెన్సును రద్దు చేయ వచ్చును. ఆపైన ఈ శాసనములోగాని నియమావళిలోగాని ఏమి యున్నప్పటికి, సదరు లైసెన్సు వెంటనే రద్దగును.

(2.) ఈ శాసనము క్రింద శిక్షించ బడిన వ్యక్తి మరల అటువంటి నేరముచేసిన యెడల, రెండవ లేక తదుపరి శిక్ష విధించిన కోర్టు ఆ వ్యక్తి పేరు, నివాసము, నేరం, విధించబడిన శిక్ష, నేరస్థుని ఖర్చుతో వార్తా పత్రికలోగాని, న్యాయస్థానం ఉత్తర్వు చేసిన మరి ఏ పద్ధతిలో నైనా ప్రకటించుట చట్టబద్ధమగును. ప్రకటన ఖర్చులు శిక్ష యొక్క భాగముగా భావించ బడును. మరియు జరిమానా వలెనే వసూలు చేయబడును.

## వ్యాఖ్య

1. శాసన చరిత్ర
2. శిక్షలు
   - ఎ) జీవిత ఖైదు
   - బి) ఇతర జైలు శిక్షలు
   - సి) జరిమానా
   - డి) లైసెన్సు రద్దు
   - ఇ) బహిరంగ ప్రకటన
   - ఎఫ్) కనిష్ట పరిమితి

3. నేరముల పట్టిక
4. కార్య నిర్వహణ విధానము
5. అపరాధ చింత

యజమాని

నౌకరు

భాగస్వామి

అసోసియేషన్ సభ్యుడు

కో ఆపరేటివ్ సంస్థ

గవర్నమెంట్ సంస్థ

కంపెనీ

6. శిక్షల కఠినత్వము

ఒప్పందల నేరము

7. జాప్యము – కనికరము
8. సె. 16 (1) (ఎ)

'అమ్మకము మానవ ఆహారమునకు కాదు.' అని ప్రకటన

9. సె. 16 (1) (ఎ) ప్రతికల్పన
10. సె. 16 (1) (బి)
11. సె. 16 (1) (సి)
12. సె. 16 (1సి) (1డి)
13. సె. 16 (2)
14. సి. ఆర్. పి. సి. సె. 110
15. ప్రొబేషను

16. ఋజువు బాధ్యత

17. ముద్దాయి స్టేట్ మెంట్

18. శిక్ష గురించి ముద్దాయి సంజాయిషీ

19. అప్పీలు

20. రివిజను

21. జాయింటు విచారణ

శాసన చరిత్ర :-

ఈ సెక్షను 2 సార్లు సవరించబడినది. 1964 యొక్క 49 వ చట్టముద్వారా సవరణ చేయకముందు 1 వ సబ్ సెక్షనులో 7 క్లాజులు మాత్రమే ఉండి అత్యధిక శిక్ష మొదటి నేరమునకు ఒక సంవత్సరము లేక 2000/- రూపాయలు జరిమానా మాత్రమే నిర్దేశింపబడి ఉండెను. రెండవసారి చేసిన నేరమునకు 2 సంవత్సరముల వరకు, 3 వ లేక తదుపరి నేరములకు 4 సంవత్సరముల వరకు శిక్ష నిర్దేశింపబడి ఉండెను. తగినంత లేక ప్రత్యేకమైన కారణములుండినప్పుడు తప్ప 2 వ, తదుపరి నేరములకు కనీస శిక్ష నిర్ణయించబడి యుండెను.

1964 వ సంవత్సరపు 49 వ చట్టము ద్వారా చేసిన సవరణలో ఈ సెక్షనులో (1 ఎ), (1 బి), (1 సి), (1 డి), సెక్షనులు చేర్చబడినవి సబ్ సెక్షన్ (1) సవరించబడినది. సబ్ సెక్షను (1)లోని 6 క్లాజుల క్రింద శిక్ష 6 సంవత్సరములు మరియు 1000/- రూ.లకు తక్కువగాని జరిమానాకు పెంచబడినది. కనీస శిక్ష 6 నెలలుగా నిర్ణయించబడినది. అయితే అందు చేర్చబడిన ప్రతికల్పనల ద్వారా తగు, లేక ప్రత్యేక కారణములున్నచో కొన్ని సందర్భములలో కనీస శిక్ష కంటే తక్కువ శిక్ష విధించుటకు వీలు కలిగించ బడినది, సెక్షను 10 (4) క్రింద స్వాధీనములో ఉంచ బడిన పదార్థముతో జోక్యము కల్గించుకొనిన కనీస శిక్ష 6 నెలలు మరియు 1000/- రూపాయలుగా నిర్ణయించుచూ (1 ఎ) చేర్చబడినది. అది విషపూరితము చేసి అమ్మినచో 6 సం.ల శిక్ష, రూ. 1000/-లు తక్కువగాని జరిమానా నిర్ణయించుచూ క్లాజు (1 బి) చేర్చబడినది. సెక్షను 14, 14 ఎ లను ఉల్లంఘించినచో 6 నెలలు శిక్ష మరియు రూ. 500/-లకు తక్కువగాని జరిమానా నిర్ణయించుచూ (1 సి) చేర్చ

డినది. క్లాజు (1 డి) ద్వారా 2వ సారి నేరము చేసిన వారియొక్క లైసెన్సు రద్దు చేయుటకు వీలు కలిగించబడినది.

1976 సవరణ చట్టము ద్వారా మరింత కఠినమైన శిక్షలు నిర్ణయించుచూ సెక్షను సవరించబడినది. ఆహార వస్తువు యొక్క వినియోగము ఆరోగ్యమునకు భంగకరము కలిగించుచూ మరణము లేక తీవ్రఘాత కల్గించు అవకాశమున్న యెడల శిక్ష యావజ్జీవ ఖైదు వరకూ పెంచబడినది. కనీస శిక్ష 3 సంవత్సరములుగా నిర్ణయించబడినది. కోర్టు యొక్క విచక్షణాధికారము చాలా వరకు తగ్గించబడినది. కల్తీ చేయు పదార్థము యొక్క తయారీ, పంపిణీ, నిల్వ, అమ్మకము కూడా నిషేధించుచూ సెక్షను 7 క్లాజు (6) చేర్చబడినందున తదనుగుణముగా శిక్ష నిర్ణయించుచూ 16 (1) (బి), (ఇ), 16 (1 ఎ) (ii) చేర్చబడినవి.

2. శిక్షలు :-

ఎ) జీవితఖైదు :—

ఈ సవరణ చట్టము ద్వారా మొదటిసారిగా ఆహార కల్తీ నేరములకు జీవిత ఖైదు నిర్దేశించబడినది. ఏ వ్యక్తి అయినా స్వయంగా గాని, వేరే వ్యక్తి ద్వారా గాని సెక్షను 2 క్లాజు (1 ఎ) యొక్క (ఇ) నుండి (యల్) వరకు గల సబ్ క్లాజుల అర్థములో కల్తీ చేయబడిన ఆహార వస్తువయినా లేక ఆరోగ్యమునకు భంగము కల్గించు ఏ కల్తీ చేయు పదార్థమయినా దేశంలోనికి దిగుమతిచేసినా లేక దేశంలో, అమ్మకం కొరకు తయారుచేసినా, నిల్వచేసినా, అమ్మినా లేక పంపిణీచేసినా, సదరు ఆహార వస్తువు తినినందువలన తిన్న వ్యక్తికి మరణంగాని, ఐ. పి. సి. 320 సె. యొక్క అర్థంలో తీవ్ర ఘాతం కల్గునట్టి అవకాశమున్న యెడల, ఆ వ్యక్తికి యావజ్జీవ ఖైదు విధించవచ్చును అని 16 (1ఎ) ప్రతికల్పనలో చెప్పబడింది. కనీస శిక్ష 3 సం.లు మరియు రూ. 5000/-ల జరిమానా, అలాగే సె. 10ఎ క్రింద ఏ వ్యక్తి అయినా ఆహార వస్తువు స్వాధీనము యిచ్చినప్పుడు ఆ వ్యక్తి సదరు ఆహార వస్తువు అమ్మినా, లేక పంపిణీ చేసినా, సదరు ఆహారము సెక్షను 2 [1ఎ ]యొక్క సబ్ క్లాజులు [హెచ్] యొక్క అర్థములో కల్తీ చేయబడిన ఆహారంగా మేజిస్ట్రేటు నిర్ధారించినచో, సదరు ఆహారం తిన్న వ్యక్తికి మరణం లేక తీవ్ర ఘాత కల్గు అవకాశం ఉన్న యెడల సబ్ సెక్షను [1 ఎ ఎ] లో ఏమి ఉన్నప్పటికి ఆ వ్యక్తికి జీవిత ఖైదు విధించవచ్చును అని 16 [1 బి] ద్వారా చెప్పబడింది. కనీస శిక్ష 3 సం.లు మరియు రూ. 5000/-లు జరిమానా నిర్ణయించబడింది.

బి) ఇతర జైలు శిక్షలు :-

సె. 16 [1ఎ] [i], [ii] ల క్రింద నేరమునకు శిక్ష 6 సం.ల వరకు సె. 16 [1] ఎ [i], 16 [i] [ఎ] [ii] 16 [1] [బి], 16[1] [సి], 16 [1][డి], 16 [1] [యఫ్], 16 [1] [జి]. ల క్రింద నేరములకు శిక్ష- 3 సం. వరకు, సె. 16 [1 ఎ ఎ] క్రింద నేరమునకు శిక్ష 2 సం-ల వరకు 16 [1][సి] క్రింది నేరమునకు శిక్ష - 6 నెలల వరకు.

సి. జరిమానా :-

సె. 16 క్రింది ఏ సబ్ సెక్షను ప్రకారము నేరమయినా జరిమానాకు గరిష్ఠ పరిమితిలేదు. మేజిస్ట్రేట్ ఆయా కేసు వివరములను బట్టి ఎంతైనా జరిమానా విధించవచ్చును.

డి. లైసెన్సు రద్దు :-

ఏ వ్యక్తి అయినా, ఈ శాసనం క్రింద రెండవసారి అటువంటి నేరం చేసిన యెడల, ఈ శాసనం క్రింద ఆ వ్యక్తికి మంజూరుచేయబడిన లైసెన్సు రద్దుచేయ వచ్చని 16 (1 డి)లో చెప్పబడినవి.

ఇ. బహిరంగ ప్రకటన :-

ఈ శాసనం క్రింది నేరములు ప్రజా శ్రేయస్సుకు తీవ్రభంగం కలిగించునవి. వ్యాపారులు మరల మరల ఈ చట్టం క్రింది నేరములు చేయకుండ అరికట్టుటలో ఫలానా వ్యక్తి నేరం చేసినట్లు బహిరంగ ప్రకటన చేసినట్లయిన ఆ వ్యక్తితో, ప్రజలు వ్యాపార సంబంధము పెట్టుకోకుండా వీలగును, ఆ వ్యక్తికి అవమానము, భయము కలుగును. సె. 16 (2) ద్వారా ఒక వ్యక్తి ఈ శాసనము క్రింద నేరం తిరిగి చేసిన యెడల, ఆ వ్యక్తి పేరు, వివరము, చేసిన నేరం, విధించబడిన శిక్ష వగైరాలు బహిరంగ ప్రకటన చేయించుటకు వార్తా పత్రికలలో ప్రకటించుటకు కోర్టుకు అధికారమీయబడినది,

యఫ్. కనిష్ఠ పరిమితి :-

ఈ సెక్షను క్రింది ప్రతి నేరమునకు కనీసశిక్ష నిర్దేశించబడినది. సె. 16 (1 ఎ) ప్రతికల్పన, సె 16 (1 బి) ల క్రింది నేరములకు కనీసశిక్ష 3 సం.లు, 5000/- రూ.లు జరిమానా.

సె. 16 (1 ఎ) క్రింది నేరములకు కనీసశిక్ష—1 సం. జైలు శిక్ష + రూ. 2,000/-లు జరిమానా.

సె. 16 (1) యొక్క (ఎ) నుండి (జి) వరకుగల క్లాజుల క్రింద నేరములకు-

సె. 16 (1 ఎ ఎ) i క్రింది నేరములకు, కనీసశిక్ష — 6 నెలలు జైలుశిక్ష + రూ. 1000/-లు జరిమానా

సె. 16 1 (ఎ) i ప్రతికల్పన క్రింది నేరములకు - కనీసశిక్ష -3 నెలలు + రు. 500/-ల జరిమానా.

సె, 16 (1 సి) క్రింది నేరమునకు కనీస జరిమానా 500/-లు.

3. నేరముల పట్టిక :-

సెక్షను 16లోని వేర్వేరు క్లాజుల క్రింద నిర్దేశించబడిన శిక్షలు గరిష్ఠ - కనిష్ఠ పరిమితులు కోర్టునకుగల విచక్షణాధికారము సులభంగా గ్రహించుటకు ఈ క్రింది పట్టిక సహాయపడగలదు.

శిక్షల పట్టిక

| వరుస సంఖ్య | నేరము | శిక్ష | | | |
|---|---|---|---|---|---|
| | | సాధారణంగా | | తగినట్టి ప్రత్యేకమైన కారణము ఉన్నచో మెజిస్ట్రేటు యొక్క విచక్షణాధికారము క్రింద. | |
| | | గరిష్ట పరిమితి | కనిష్ట పరిమితి | గరిష్ట పరిమితి | కనిష్ట పరిమితి |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. | 16 (1) ఎ (i) | 3 సం.లు జైలు శిక్ష + పరిమితి లేని జరిమాన | 6 నెలలు జైలు శిక్ష + 1000/- రు. లు జరిమానా | విచక్షణాధికారంలేదు. | |
| 2. | 16 (1) ఎ (ii) | డిటో | డిటో | | డిటో |
| 3. | 16 (1) బి | డిటో | డిటో | | డిటో |
| 4. | 16 (1) సి | డిటో | డిటో | | డిటో |
| 5. | 16 (1) డి | డిటో | డిటో | | డిటో |
| 6, | 16 (1) ఇ | డిజో | డిటో | | డిటో |
| 7. | 16 (1) ఎఫ్ | డిటో | డిటో | | డిటో |
| 8. | 16 (1) జి | డిటో | డిటో | | డిటో |
| 9. | 16 (1) ఎ 1 వ ప్రతికల్పన (i) మరియు (ii) | డిటో | డిటో | 2సం.ల జైలు శిక్ష + పరిమితి లేని జరిమాన | 3 నెలల జైలు శిక్ష + 500/ల జరిమాన |
| 10. | 16 (1) ఎ రెండవ ప్రతి కల్పన | డిటో | డిటో | 3 నెలలు జైలు శిక్ష + 500/-లు జరిమానా | — |
| 11. | 16 (1 ఎ) (i) | 6 సం.ల జైలు శిక్ష + పరిమితి లేని జరిమానా | 1 సం. జైలు శిక్ష + రు. 2000/- జరిమానా | | విచక్షణాధికారం లేదు. |
| 12. | 16 (1 ఎ) (ii) | 6 సం. ల జైలుశిక్ష + పరిమితిలేని జరిమానా | 1 సం. జైలు శిక్ష + రు. 2000/-లు జరిమానా | | డిటో |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 13. | 16 [1 ఎ] | ప్రతికల్పన యావజ్జీవ కారాగారశిక్ష + మితి లేని జరిమాన | 3 సం. జైలు శిక్ష + రూ 5000/- జరిమాన | | డిటో |
| 14. | 16 [1 ఎ ఎ] | 2 సం. ల జైలు శిక్ష వరకుండేది జరిమానా | 1 సం. జైలు శిక్ష + 2000/-లు జరిమానా | | డిటో |
| 15. | 16 [1 బి] | యావజ్జీవ కారాగారం + పరిమితి లేని జరిమానా | 3 సం. ల జైలు శిక్ష + 5000/- రూ. ల జరిమాన | | డిటో |
| 16. | 16 [1 సి] | 6 నెలల జైలు శిక్ష + పరిమితి లేని జరిమానా | [illegible] శిక్ష + 500/-లు జరిమానా | | డిటో |

4. కార్య నిర్వహణ విధానము :-

సె. 16 (1 ఎ) యొక్క ప్రతికల్పన క్రింది నేరములు, సె. 16 (1 బి) క్రింది నేరములు సెషన్సు కోర్టు విచారించవలెను, అనగా మెజిస్ట్రేట్ కోర్టులో సి. ఆం. పి. సి సెక్షను 208, 209 ల ప్రకారం ప్రాథమిక విచారణ మాత్రమే చేయవలెను. ఈ నేరములు జామీను ఇవ్వలగనివి. 16 (1 ఎ) క్రింది నేరములు పోలీసులు 'పట్టతగిన నేరములు' ఈ నేరములకు రిమిషేషను లేదు.

16 1 (ఎ) నుండి (టి) వరకుగల క్లాజుల క్రింద నేరములు మెజిస్ట్రేట్ 'వారంటుకేసు' పద్ధతిన సి. ఆర్. పి. సి. 244 నుండి 250 సెక్షనుల ప్రకారం విచారించవలెను. ప్రత్యేక అధికార మివ్వబడిన మేజిస్ట్రేట్ సంక్షిప్త విచారణ జరుపవలెను.

సె. 16 (1 ఎ ఎ) మరియు 16 (1 సి) ల క్రింది నేరములు 'సమన్సు కేసులు' కాలదోష పరిమితి సె 16 [1 ఎ ఎ] క్రింది నేరమునకు 3 సం.లు 16 [1 సి] క్రింది నేరమునకు 1 సంవత్సరము.

5 అపరాధ చింత :-

సాధారణంగా ఏదేని నేరమునకు బాధ్యునిచేయుటకు వ్యక్తికి 'అపరాధ చింత' ఉండవలెను. నేరం చేయవలెననే చింతన లేకున్నా, కల్తీ ఆహారమని తెలియకున్నా ఈ సెక్షను క్రింద శిక్ష తప్పదు. ఈ నేరములకు 'మెన్‌సీరియా' అవసరంలేదు. ఈ శాసనం క్రింది బాధ్యత సమగ్రము, నిరంకుశము.

సర్జూప్రసాద్ Vs స్టేట్ అఫ్ యు. పి.
ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 631=1961 ఎ ఎల్ టి 375 [ఎస్. సి]

మంగళ్‌దాస్, దర్యామల్‌కు అమ్మగా, దర్యామల్ యొక్క నౌకరు కోడూరు మల్ నుండి శాంపిల్ తీసుకోగా అది కల్తీ అని ఋజువయింది. మంగళ్‌దాస్ తనకు అపరాధచింత ఉన్నట్లు నిరూపించవలెనని వాదించగా సుప్రీం కోర్టు అతని వాదన తిరస్కరించినది.

మంగళ్‌దాస్ రాఘవజీ రూపేకిలాల్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1966 యస్. సి. 128 = 1966 క్రి. లా. జ. 1061

కల్తీ ఆహారం మానవ జీవానికి, ఆరోగ్యానికి హానికరము ప్రమాదకరం అయిన చర్య, కల్తీ అని తెలియకపోవుట, మంచి నమ్మిక కలిగియుండుట అటువంటి చర్యను ప్రమాద రహితము చేయజాలవు. నేరమును నిర్ణయించునది చర్యయేగాని ఉద్దేశ్యము కాదు. తెలిసిచేసినా తెలియకచేసినా, ప్రజలకు కల్గు నష్టం ఒకటే. అందువలన ఆహార పదార్థములు అమ్ము వ్యక్తి, ఆహార స్వభావమును తెలిసికొని, శాసనముల ద్వారా నిర్ణయించబడిన ప్రమాణముల కనుగుణముగా వున్నదా అనే విషయం తెలిసికొని ప్రవర్తించవలెను.

పి. కె. తేజాని Vs యం. ఆర్. డాంగే - ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 228

సెక్షను 7 క్రింది బాధ్యత నిరంకుశమైనది. సె. 7 లోని సబ్ సెక్షనులకు భంగము కల్గినట్లు ఆహారమును నీవు అమ్మినచో నీవు నేరస్థుడవు. వేరుమాట లేదు.

కొనుగోలుదారుయొక్క ఆరోగ్యానికి భంగం కల్గించే హక్కు వ్యాపారికి లేదు. అందువలన ఈ శాసనము క్రింది నేరములకు 'నేరచింత' అవసరంలేదు.

కిషన్‌లాల్ త్రయంబక్ కొతులే Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1977 యస్. సి. 435=1976 యఫ్. ఎ. సి. 188

శాసనములో ప్రత్యేకంగా 'అపరాధ చింత' అవసరంలేదని చెప్పివుంటే తప్ప ముద్దాయికి 'అపరాధ చింత' నిరూపించనిదే శిక్షించరాదు అని సుప్రీం కోర్టు రావుల హరిప్రసాద్ Vs స్టేట్ 1951 యస్. సి. 296 లో చెప్పినది. ఈ తీర్పు ఈ శాసనమునకు వర్తించదు.

తండ్రి తరపున కొడుకు అమ్మినప్పుడు శిక్షార్హుడే.
పి. పి. Vs పట్టు నరసింహులు
ఎ. ఐ. ఆర్. 1953 మద్రాసు 678

పబ్బ ప్రేం కుమార్ Vs స్టేట్ ఆఫ్ ఏ. పి.
1979 క్రి. లా. జ, [యస్. సి.] 76.

యజమాని :-

యజమాని లేనప్పుడు గుమస్తానుండి ఆహార శాంపిల్ తీసుకున్నప్పుడు యజమాని అప్పుడు అక్కడలేని కారణంచేత విమోచనార్హుడుకాదు.

స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర Vs లక్ష్మణకుమార్ 1977 యఫ్. ఎ. జె. 197
కల్తీ ఆహారము యజమాని స్వయముగా అమ్మినా, నౌకరు అమ్మినా శిక్షార్హుడే.
స్టేట్ Vs ఉడిపి కోఆపరేటివ్ మార్కెట్ సొసైటి ఎ. ఐ ఆర్. 1960 మైసూరు 80

షాపులో సాధారణంగా అమ్మేడి ఆహార వస్తువు నౌకరు అమ్మినప్పుడు, యజమాని అనుమతితో అమ్మినట్లు భావించవలెను.

ఐ, ఎల్. ఆర్. 1967 గుజరాత్ 189

అయితే, యజమాని. తాను తగినంత జాగ్రత్తలు తీసికొన్నట్లు తనకు తెలియకుండ, తన అనుమతి రహస్య సమ్మతిగాని లేకుండ నౌకరు సదరు పదార్థము అమ్మినట్లు ఋజువు చేసినచో, విమోచనార్హుడు.

ఎ. ఐ. ఆర్. 1953 మద్రాసు 862

యజమాని యొక్క వ్యాపారానికి సంబంధము లేని ఆహార వస్తువును యజమాని లేనప్పుడు నౌకరు అమ్మినచో యజమాని బాధ్యుడుకాడు.

1961 క్రి. లా. జ. 1092.

నౌకరు :-

క్యాంటీను మేనేజరు ఆదేశం మేరకు క్యాంటీనుకు కల్తీ పాలు తీసికొనిపోవు చున్న నౌకరు గూడ బాధ్యుడే.

మునిసిపాలిటి Vs సుకుమారన్ 1973 యం. యల్. జె, [క్రి] 170

స్టాల్ గుమస్తా, యజమానీ ఇద్దర్నీ శిక్షించవచ్చును.

స్టేట్ Vs మొహిబుల్లా 1977 యఫ్. ఎ. జే. 145 [అలహాబాద్]

ఒక హాస్టలుకు పాలు నౌకరు ద్వారా సప్లయి చేసినప్పుడు నిజమైన దోషి కాంట్రాక్టరేగాని, నౌకరుగాదు అని అలహాబాదు కోర్టు తీర్పు యిచ్చినది.

కిషన్ నారాయణ్ Vs స్టేట్ అఫ్ యం. పి. 1977 యఫ్. ఎ. జె, 90

భాగస్వామి :-

ఒక భాగస్వామ్య సంస్థ ఆహార వస్తువుల అమ్మకం వ్యాపారం చేస్తున్నప్పుడు, ప్రతి భాగస్థుడు ఇతర భాగస్థుని యొక్క ఏజంటు అగుటచే అమ్మకం జరిగినప్పుడు అక్కడలేని భాగస్థుడు కూడ శిక్షార్హుడే అని కొన్ని తీర్పులు.

గంగారామ్ Vs స్టేట్ 1961 [2] క్రి. లా. జ. 447

సాధూరామ్ Vs స్టేట్ 1967 యం. పి. 122

పాట్నా హైకోర్టు భిన్నంగా తీర్పు యిచ్చింది

రామచంద్రరామ్ Vs గయా మునిసిపాలిటి

ఎ. ఐ. ఆర్. 1941 పాట్నా 264

అయితే సుప్రీం కోర్టువివాదం పరిష్కరించి ఇట్లు వివరించినది.

భాగస్వామ్య సంస్థయొక్క లైసెన్సు తన పేరున ఉన్నంత మాత్రమున సదరు భాగస్వామి ఇతర భాగస్థుడు చేసిన అమ్మకమునకు బాధ్యుడు కాదు. వ్యాపారము ఒక భాగస్వామి స్వాధీనములోనున్నదని వ్యాపార నిర్వహణకు బాధ్య

డని నిరూపించినప్పుడే సదరు భాగస్వామి వేరే భాగస్వామి చేసిన కల్తీ ఆహార అమ్మకమునకు బాధ్యుడగును.

మనీభాయ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 434

అసోసియేషను సభ్యుడు :-

అట్లే ఒక సంస్థయొక్క ప్రతి సభ్యుడు సభ్యుడైన కారణంగానే బాధ్యుడు అవడు.

మనీభాయ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర

కోఆపరేటివ్ సంస్థ :—

ఈ సెక్షను క్రింద కో ఆపరేటివ్ సంస్థను శిక్షించవచ్చును. [అనగా జరిమానా విధించవచ్చును]

1963 (2) యం. యల్. జె. 451

గవర్నమెంటు సంస్థ :--

ఈ సెక్షను క్రింద గవర్నమెంటు సంస్థలకు మినహాయింపులేదు.
స్టేట్ ఆఫ్ యుపి, Vs కె. యల్. కె. ఆర్. ఎ. ఐ. ఆర్. 1956 అలహాబాదు 363

కంపెనీ :-

కంపెనీల చట్టము క్రింద రిజిష్టరయిన కంపెనీని గూడ శిక్షించవచ్చును.

[జనరల్ క్లాజెస్ ఏక్టు సె. 3 [43]

ఆహార కల్తీ నివారణ చట్టము సె. 17 చూడనగును]

[కంపెనీ నేరం చేసినప్పుడు, డైరక్టర్లు మేనేజర్లు బాధ్యత గురించి, సె. 17 క్రింది వ్యాఖ్య చూడవలెను.]

6. శిక్షల కఠినత్వము :-

ఆహార కల్తీ నివారణ చట్టము క్రింది నేరములు తీవ్రమైనవి. ఇవి కఠినమైన శిక్షలు విధించబడవలసిన నేరములు. సాధారణముగా జైలుశిక్ష సరిఅయినది.

1. పి. పి. Vs నాగభూషణం
ఎ. ఐ. ఆర్. 1965 ఎ. పి. 118

2. మహర్ చంద్ పోలారామ్ Vs స్టేట్
1964 1 క్రి. లా. జ. 606
ఎ ఐ ఆర్ 1977 యస్. సి. 435=1977 క్రి. లా. జ. 267

నేరము ఒప్పుకొనుట అనునది తేలిక శిక్ష విధించుటకు తగినంత లేక ప్రత్యేక కారణము కాదు.

1. మురళీధర్ మేఘరాజ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ ఐ. ఆర్. 1976 యస్. సి. 1929

2. స్టేట్ Vs జ్వాలాప్రసాద్
ఎ. ఐ. ఆర్. 1969 బొంబే 362

ఒప్పందల బేరము :—

చాలా సందర్భములలో ముద్దాయి తక్కువ శిక్ష విధించే యెడల నేరము ఒప్పుకొనెదనని బేరము పెట్టుచున్నాడు. అమెరికాలో ఈ పద్ధతి న్యాయ సమ్మతమైనప్పటికీ, మన దేశములో ఈ పద్ధతిని గుర్తించలేదు. నేరము ఒప్పుకొని సత్వర న్యాయ పరిష్కారమునకు ముద్దాయి దోహదము చేసినాడు, అందువలన శిక్ష తగ్గించవచ్చును, అనెడి సిద్ధాంతము సమర్ధనీయముకాదు. ఈ పద్ధతి కొన్ని న్యాయస్థానములు అవలంబించుచున్నట్లు తెలియుచున్నది ఈ పద్ధతిలో ప్రాసిక్యూషను వారికి సాక్షులను హాజరు పరుచుట వగైరా బాధలు తప్పును. అసంఖ్యాకములైన కేసుల భారముతో తలములకలగుచున్న కోర్టుకు కేసుల సంఖ్య తగ్గును. ముద్దాయికి శిక్ష తగ్గును. అందరూ

సంతోషించుచున్నారు. కాని అసలు బాధితుడు దూరముగా నున్న సమాజము. ఈ పద్ధతిని కోర్టులు వెంటనే ఆపవలెను అని సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చినది.

మురళీధర్ మేఘరాజ్ లోయ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 1929

7. కాలయాపన- కనికరము :—

నేరము జరిగిన తర్వాత చాలా కాలము గడిచినచో జైలుశిక్ష విధించ నవసరములేదని ఒరిస్సా హైకోర్టు, పంజాబ్ హైకోర్టులు అభిప్రాయపడినవి.

ఫుడ్ ఇన్స్పెక్టర్ పూరి Vs కె. సి. ఆంజనేయులు
ఎ. ఐ. ఆర్. 1966 ఒరిస్సా 144
1979 క్రి. లా. జ. యన్. ఓ. సి. 103

కోర్టు 3 నెలలు మరియు 500 రూపాయల జరిమానా విధించెను. ముద్దాయి 2 వారముల కంటె ఎక్కువ జైలులో ఉండెను. కేసు స్వభావము పరిస్థితులను బట్టి జైలు శిక్ష అనుభవించిన కాలమునకు తగ్గించబడెను,

లింగప్పశెట్టి Vs హుబ్లీ ధార్వార్ మున్సిపల్ కార్పొరేషన్
ఎ. ఐ. ఆర్. 1979 యస్. సి. 1838

2½ సంవత్సరముల క్రిందట నేరము జరిగినదనెడి విషయము శిక్ష తగ్గించుటకు కారణము కాజాలాదు.

మహర్‌చంద్ పోలారామ్ Vs స్టేట్
1964 [1] క్రి. లా. జ. 606

ముద్దాయి చిన్న గ్రామములో బహు చిన్న వ్యాపారి, ఆహార వస్తువు ఖరీదైనది కాదు అను విషయములు తక్కువ శిక్ష విధించుటకు కారణములు కావు.

విజయకుమార్ Vs స్టేట్ ఆఫ్ పంజాబ్
1974 (3) యస్. సి. సి. 769

ఆహార వస్తువులో క్రిములు 51. 3 % ఉండెను. ముద్దాయి 70 సంవత్స ముల ముదుసలి, చెవిటి, క్రింద కోర్టు విధించిన కోర్టు లేచువరకు శిక్ష +1000/- రూపాయల జరిమానాను హైకోర్టు సమర్థించినది.

మున్సిపల్ కార్పోరేషన్ ఢిల్లీ Vs లక్ష్మణదాస్
1976 యఫ్. ఎ. సి. 12

పాలలోని క్రొవ్వు పదార్థమును తీసివేయుటకు ఎటువంటి మెకానిజమ్ దుకాణ ములో ఉన్నట్లు సాక్ష్యము లేదు. నీరు కలిపినట్లు సాక్ష్యము లేదు. దుకాణము అజమా యిషి ముద్దాయి యొక్క మేనల్లునకు ఒప్పగించబడినది. ఈ పరిస్థితులలో సుప్రీం కోర్టు శిక్షను 3 నెలల జైలు మరియు 500/- రూపాయల జరిమానాకు తగ్గించెను.

అజితేప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1972 [2] యస్. సి. సి. 180.

ఒక చిన్న దుకాణముదారు కాలపరిమితి ముగిసిన తరువాత సాధ్యమైనంత వెంటనే లైసెన్సును పొడిగించుకొనలేదు. సుప్రీంకోర్టు ఆ పరిస్థితులలో తేలిన శిక్ష విధించవచ్చునని అభిప్రాయపడినది.

ఎ. ఐ. ఆర్. 1972 యస్. సి. 824.

ముద్దాయి 7 సంవత్సరములు జామీను మీద ఉండగా సుప్రీంకోర్టు ఈ శిక్షను 2 సంవత్సరములు మరియు రూ. 1000/- ల జరిమానాకు తగ్గించినది.

1972 [1] యఫ్. ఎ. సి. 326.

8. 16. 1 ఎ :—

పచ్చిపాలు వలెనే కాగిన పాలు అమ్మినప్పుడు అవి కల్తీ ఆహారమైనచో అమ్మకం నేరమే.

ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 1491

కల్తీ నూనెతో చేసిన జిలేబి అమ్మకం నేరమే.
ఎ. ఐ. ఆర్. 1947 మద్రాసు 428

టీ స్టాలులో కల్తీ చక్కెర టీలో కలుపుటకు నిల్వ చేసినప్పుడు చక్కెర శాంపిల్ ఫుడ్ ఇన్స్పెక్టరుకు అమ్మినప్పుడు అది నేరమే.

1971 క్రి. లా. జ. 127
[గోవిందరావు కేసు ఎ. ఐ. ఆర్. 1960 ఎ. పి. 366 వ్యతిరేకము.]

రబ్ తయారు చేయుటకు ముద్దాయి చక్కెర నిల్వ చేయగా, ఆ చక్కెర శాంపిల్ ఇన్స్పెక్టరుకు అమ్మగా, చక్కెర అమ్మకానికి నిల్వ చేయలేదనే విషయం అప్రస్తుతం. నేరం చేసినట్లుగానే పరిగణించవలెను.

మహ్మద్ యాస్మిన్ Vs స్టేట్ ఆఫ్. యు. పి.
1972 యస్. సి. సి. [క్రి] 655
ఎ. ఐ. ఆర్. 1973 యస్. సి. 484.

అయితే సుప్రీంకోర్టు ఓంప్రకాష్ Vs ఢిల్లీ అడ్మినిస్ట్రేషను ఎ. ఐ. ఆర్ 1976 యస్. సి. 195, మునిసిపల్ కార్పోరేషన్ ఢిల్లీ Vs లక్ష్మీనారాయణ ఢూండను ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 621 లలో అమ్మకానికి నిల్వ చేసినప్పుడే, కల్తీ ఆహారము నిల్వ చేసిన నేరం చేసినట్లు అగును, అని తీర్పు యిచ్చినది.

ఈ విషయంలో సంకులత నివారించుటకు పార్లమెంటు 1976 లో సె. 7కు ఒక వివరణ చేర్చెను. ఈ వివరణ ప్రకారము క్లాజు (i) నుండి (iv) లలో చెప్పబడిన ఆహార వస్తువును వేరొక ఆహార వస్తువు తయారు చేయుటలో ఉపయోగించుటకు నిల్వ చేసినచో, సదరు తయారీ అమ్మకం కొరకయినచో, సదరు పదార్థము అమ్మకానికి కానప్పటికి, సదరు నిల్వ ఈ సెక్షను 7 క్రిందకు వచ్చును. అది కల్తీ పదార్థము అయినచో సె. 16 క్రింద నేరమగును. ఈ సవరణ 1-4-76 లో అమలు లోనికి వచ్చినది.

[ఇందుకు వ్యతిరేకంగా వివిధ కోర్టులు ఇచ్చిన తీర్పులు 1-4-76 తర్వాత జరిగిన నేరములకు వర్తించవు. 1-4-76 కు ముందు జరిగిన నేరములు ఇంకా విచారణలో ఉండే అవకాశం లేనందున అట్టి ఇతర తీర్పులు ఉదహరించబడలేదు.]

ఒక పదార్థము సాధారణంగా తన వ్యాపారమునకు సంబంధించి అమ్మకానికి నిల్వ చేసెడిది కానప్పుడు- అది ఐచ్ఛికంగా అతడు అమ్మినప్పుడు, ఈ చట్టంకొరకు,

అమ్మవలెనని ఫుడ్ ఇన్స్పెక్టరు బలవంతం చేయరాదు. అది కల్తీ ఆహారమని రుజువయినా, అతడు శిక్షార్హుడు కాడు.

1976 క్రి. లా. జ. 547 (యస్. సి,)

విక్రయం :—

ఒక వ్యక్తి గరం మసాలా మరబట్టును కాని అమ్మడు. అతని వద్ద శాంపిల్ తీసికొని కేసు పెట్టుట న్యాయముగాదు.

నగర స్వాస్థ్య అధికారి ఆగ్రా Vs బంసీలాల్
1980 (1) యఫ్. ఎ. సి. 201.

అమ్మినవి గేదెపాలో, ఆవుపాలో, మేకపాలో తెలియపరచనప్పుడు గేదెపాలు ప్రమాణంల ప్రకారం పరీక్షించవలెను. గేదెపాలు, ఆవుపాలు, కలిసి యున్నవని చెప్పినప్పుడు గూడ గేదెపాలప్రమాణములకు సరిచూడవలెను.

పి. పి. Vs రామచంద్రన్
1964 (2) క్రి. లా. జ 243,

తానే ఇతరులవద్ద కొన్నానని, పాల కల్తీ గురించి తనకు తెలియదు అనే వాదన చెల్లదు.

జగదీశ్వర సేన్ గుప్త Vs అబ్దుల్ ముతలక్
ఎ. ఐ. ఆర్. 1964 త్రిపుర 48.

వేరొకరి నుండి పాల క్యాను తీసికొనిన వెంటనే, ఫుడ్ యిన్స్పెక్టరు కోరగా, సదరు వ్యక్తి తాను పాలు నాణ్యత కొరకు ఇంకనూ పరీక్ష చేయవలసి ఉన్నదని, అప్పటికి పాలు యింకా తనకు చెందలేదని వాదించినప్పుడు, నేరము జరుగలేదు.

స్టేట్ Vs రతనలాల్
ఎ. ఐ. ఆర్. 1964 హిమాచల్ప్రదేశ్ 10

పాలకు రెండు ప్రమాణములున్నవి. ఏ ఒక్క ప్రమాణమునకు సరిపోక పోయినప్పటికీ, రెండవ ప్రమాణములో ఉండవలసిన దానికంటే ఎక్కువగా ఉన్నప్పటికి, ఆ పాలు కల్తీ ఆహారములకు అమ్మిన వ్యక్తి శిక్షార్హుడే.

స్టేట్ Vs బద్రి
ఎ. ఐ. ఆర్. 1965 రాజస్థాన్ 152

కొబ్బరినూనె దేశంలో ఒక ప్రాంతంలో మాత్రమే, ఆహారమని. అమ్మకం జరిగిన ప్రాంతంలో ఆహారంగా వాడరని, అందువలన సదరు అమ్మకానికి, ఈ చట్టం వర్తించదనే వాదన సరికాదు. దేశంలో ఏ ప్రాంతంలో అది ఆహారమయినా ఈ శాసనం వర్తించును.

పి. పి. Vs వంకేటి నాగభూషణం
1965 యం. యల్. జె. (క్రి) 261

స్టేట్ Vs ఉమాచరణ్‌దాస్
ఎ. ఐ. ఆర్. 1966 ఒరిస్సా 81

ఫుడ్ యిన్‌స్పెక్టరు సూరత్ Vs అబ్దుల్ వాహెబ్
1967 (1) యఫ్. ఎ. సి. 179

అదే విధంగా ఉత్తర్‌ప్రదేశ్‌లో ఆహారంగా వాడే లిన్సిడాయిల్‌కు ఈ చట్టం వర్తించును.

నల్ల నువ్వులు పూజ కొరకు అమ్మబడెను అని ముద్దాయి వాదన. నల్లనువ్వులు ఆహారంగా వాడెదరని సాక్ష్యంలేదు. ముద్దాయికి సంశయ లాభము యివ్వబడెను.

ఆషూ జయవంత్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 2178

"మానవాహారమునకు కాదు——": అని ప్రకటన

శాసనంలో 'ఆహార పదార్ధము యొక్క అమ్మకం' అని వాడబడినది గాని ఆహారముగా ఉపయోగించుటకు అని వాడబడలేదు. అందువలన విక్రయదారు నువ్వుల నూనె 'ఆహారమునకు కాదు పైవాడకమునకు మాత్రమే' అని ప్రకటించి అమ్మినా, అది కల్తీ ఆహారమయితే, నేరమే, అది సామాన్యముగా ఆహారముగా ఉపయోగించు పదార్ధమయిన చాలు.

స్టేట్ ఆఫ్ తమిళనాడు Vs ఆర్. కృష్ణమూర్తి [జస్టిస్ చిన్నప్పరెడ్డి]
ఎ. ఐ. ఆర్. 1980 యస్. సి. 358=1980 క్రి. లా. జ. 402

సుప్రీంకోర్టు యొక్క పై తీర్పుతో విక్రయదారులు వత్రిక ప్రకటనల ద్వారా వినియోగదార్లను మోసంచేసి శాసన పరిధి నుండి తప్పించుకొను అవకాశములు పోయినవి.

[ఇంకను తీర్పులకై సె. 2(xii) క్రింద వ్యాఖ్య చూడుడు.]

సోయాబీన్ నూనెలో ప్రత్తినూనె కలిపి, సోయాబీన్ నూనెగా అమ్మగా, అట్టి మిశ్రమం ఆరోగ్యమునకు భంగం చేయునదయిననూ, కానిదయిననూ విక్రయదారుడు శిక్షార్హుడే.

తులసీరాం Vs స్టేట్ ఆఫ్ మధ్యప్రదేశ్
1984 క్రి. లా. జ. 173 యస్, సి.

ఆహార వస్తువులో అనుమతించబడని రంగు కలిపినప్పుడు తేలిక శిక్ష విధించుట న్యాయ సమ్మతము కాదు. కేవలము లాభార్జన కొరకు వ్యాపారి పౌరుల యొక్క ఆరోగ్యములతో ఆడుకొనుట అనుమతించరాదు.

అమరసింగ్ Vs స్టేట్
1979 క్రి. లా. జ. 1221.

ఆహార వస్తువునకు రంగు పదార్థము కలుపరాదు అని నియమములు నిర్దేశించు చుండగా నూనెలో కృత్రిమ రంగు కలిసినట్లు విశ్లేషణములో తెలిసినప్పుడు సదరు నూనె సెక్షన్ 2 1 జె ప్రకారము కల్తీ నూనె అగును. సె. 16 క్రింద నేరమగును.

ప్రేమవల్లభ్ Vs స్టేట్
1976 యఫ్. ఎ. జె. 390.

రవాణా :-

ఒక వ్యక్తి నుండి మరియొక వ్యక్తికి ఆహార వస్తువును కేవలము రవాణా చేయుటకు మాత్రమే అధికారము కల్గి, అమ్ముటకు అధికారములేని వ్యక్తి నుండి బలవంతముగా, ఇష్టము లేకుండశాంపిల్ తీసికొననప్పుడు ముద్దాయి విమోచనార్హుడు.

పి. పి. Vs పుల్లారావ్
ఎ. ఐ. ఆర్. 1960 ఆం. ప్ర. 302

కాని కేరళ హైకోర్టు అటువంటి సందర్భములో ముద్దాయి నేరస్థుడనే తీర్పు చెప్పెను.

అలెప్పి మున్సిపాలిటి Vs సుకుమారన్

ఒక బంధువు ఇంటిలో పెండ్లికి తన గేదేల పాలు తీసుకొని పోవుచున్నప్పుడు సెక్షను 16 క్రింద నేరస్థుడు కాడు.

నాజిర్ Vs స్టేట్ అఫ్ యు. పి.

1984 క్రి. లా. జ. 74 అలహాబాదు.

పాల చాక్లెట్‌కు పాల టాఫీ ప్రమాణములు వర్తించి, కల్తీ ఆహారమని పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు యిచ్చినప్పుడు అభియోగం చెల్లదు.

1983 క్రి. లా. జ. 876 బొంబె.

ఎగుమతి :—

ఎగుమతి కొరకు గోదాములో నిల్వ చేయబడిన టీకి, ఆహార కల్తీ నివారణ చట్టము వర్తించదు. టీ చట్టం 1953, ఎగుమతి చట్టం 1963 వర్తించును.

1982 క్రి. లా. జ. 707 కేరళ.

సె. 16 క్రింది నేరములు స్థూలంగా వర్గీకరింపబడినవి. సె. 2 లోని క్లాజుల లోని నిర్వచనములలో ఒకదానిలో ఒకటి కలియును. ఒకవేళ నేరం రెండు క్లాజుల క్రింది వచ్చినచో ఎక్కువ శిక్ష నిర్ణయించబడిన క్లాజు వర్తింపజేయవలెను.

కిషన్‌లాల్ త్రయంబక్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర

ఎ. ఐ. ఆర్. 1977 యస్. సి. 435 జస్టిస్ కృష్ణయ్యర్.

9. న్యాయస్థానము యొక్క విచక్షణాధికారము :-

సె. 16 (1) యొక్క (ఎ) నుండి (జి) వరకుగల క్లాజుల క్రింది నేరములు, సె. 16 (1 ఎ) క్లాజు (i) మరియు (ii)ల క్రింది నేరములు, సె. 16 (1ఎ ఎ) సె. 16 (1 బి), సె. 16 (1సి)ల క్రింది నేరములు నిరూపించబడినప్పుడు, శిక్ష విధించుటలో కోర్టుకు విచక్షణాధికారంలేదు. ఆయా క్లాజులలో నిర్దేశించబడిన కనీస శిక్ష తప్పక విధించవలెను.

సె. 16 1 ఎ మొదటి ప్రతికల్పన క్రింద మాత్రం కొంత విచక్షణాధికారం ఈయబడినది. తగు ప్రత్యేక కారణములున్నచో కోర్టు ఆ కారణములను తీర్పులో ఉదహరించి 3 నెలలు జైలు శిక్ష + 5000/- రూ. లు జరిమానాకు తగ్గకుండా 2 సం॥ ల శిక్ష + అపరిమితమైన జరిమానా విధించవచ్చును. రెండవ ప్రతికల్పన క్రింద 3 నెలల శిక్ష + 500/-ల వరకు విధించవచ్చును.

కేంద్ర ప్రభుత్వము, సెక్షను 23 (1ఎ) యొక్క క్లాజు (ఎ) క్రింద ఆహార దిగుమతి కొరకు లైసెన్సుకు, క్లాజు (జి) ఆహార అమ్మకమునకు లైసెన్సులకు సంబంధించిన నియమములు చేయును. ఆహార కల్తీ నివారణ నియమావళి నియమము 50 చూడుము. రాష్ట్రప్రభుత్వము సె. 24 (2) క్లాజు (బి) క్రింద ఆహార వస్తువుల తయారీ, నిల్వ, పంపిణీల లైసెన్సులకు సంబంధించి నియమములు చేయవచ్చును. ఇట్టి నియమములను ఉల్లంఘించినప్పుడు, కోర్టు 16 (1) (ఎ) రెండవ ప్రతికల్పన క్రింద తన విచక్షణాధికారం వినియోగించి 3 నెలల జైలు శిక్ష + రూ. 500/- జరిమానా విధించవచ్చును.

సె. 16 క్రింది నేరములు స్థూలంగా వర్గీకరింపబడినవి. సాధరణంగా ఈ శాసనము క్రింది నేరములన్ని తీవ్రముగా శిక్షింపబడవలసినవి. సాధరణంగా జైలు శిక్ష విధించబడవలసినవి. సె. 2 లోని క్లాజుల లోని నిర్వచనములలో ఒకదానిలో ఒకటి కలియును. ఒకవేళ నేరం రెండు క్లాజుల క్రింద వచ్చినచో ఎక్కువ శిక్ష నిర్ణయించబడిన క్లాజు వర్తింప జేయవలెను. ప్రొవిసో క్రింద లాభం పొందవలె నన్న ముద్దాయి ప్రొవిసో క్రింద తప్ప నేరం యితర క్లాజుల క్రిందకు రాదు అని చూపవలెను.

కిషన్‌లాల్ త్రయంబక్‌లాల్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1977 యస్. సి. 435 జస్టిస్ కృష్ణయ్యర్.

లైసెన్సు లేకుండ ఆహార వస్తువును అమ్మిన నేరమునకు రెండవ ప్రతికల్పన వర్తించును.

1982 క్రి. లా. జ. 1234 ఒరిస్సా

ప్రాథమికాహార విక్రయ సందర్భములో 16 [1] [ఎ] ప్రావిజో వర్తించిన ముద్దాయికి తక్కువ శిక్ష విధించవచ్చును. సె. 2 [1ఎ] [యం] ప్రావిజో

వర్తించిన నేరమే లేదు. సె. 2 [1ఎ] [యం] ప్రతికల్పన వర్తించునని నిరూపించవలసిన బాధ్యత ముద్దాయి పై నే ఉన్నది.

1983 క్రి. లా. జ. 709 [పంజాబ్]
1984 క్రి. లా. జ. 690 [పంజాబ్]

క్రిములతో కూడియున్న యాలకులు సెక్షను 2 1 ఎఫ్ ప్రకారము కల్తీ ఆహారము. సదరు అమ్మకము సె. 16 1 క్రింద శిక్షార్హము. విచక్షణాధికారము కలుగజేయు ప్రతి కల్పన వర్తించదు.

విజయకుమార్ Vs స్టేట్ ఆఫ్ పంజాబ్
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 687

కుర్సానీ నూనె 30% వేరుశనగ నూనెతో కలిపి అమ్మినప్పుడు విచక్షణాధికారం లేదు. అది రూలు 44 సి. ఉల్లంఘించినందకు, సె. 2 1 ఎ క్రింద కల్తీ ఆహారము అగును. అమ్మకం సె. 16 [1] [ఎ] క్రింద నేరము అగును. సె. 2 [1] [యల్] క్రింద కల్తీ ఆహారము అయినప్పుడే సె. 16 [1] [ఎ] క్రింద నేరమునకు ప్రొవిసో వర్తించును. సె. 16 [1] [ఎ] [ii] క్రింది నేరములకు అనగా కల్తీ ఆహారపు అమ్మకం కాకుండ చట్టం క్రింది ఇతర నిబంధనలు, నియమములు గాని ఉల్లంఘించిన నేరమునకే ప్రొవిసో వర్తించును.

మురళీధర్ మేఘజీ Vs స్టేట్
ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 1929.

సెక్షను 16 [1] [ఎ] [1] క్రింద, సెక్షను 2 [1] [యల్] ప్రకారము కల్తీ ఆహారమును అమ్మినందుకు శిక్ష విధించుచు, తగినట్టి మరియు ప్రత్యేకమైన కారణములు చూపుచూ కనీస శిక్షకంటె తక్కువ శిక్ష విధించవచ్చును. అప్పీలులో మేజిస్ట్రేట్ వ్రాసిన కారణములు అసంగతములు, బహు స్వల్పము, సాక్ష్యముల ఆధారమును బట్టి కానివియు అయినప్పుడు హైకోర్టు జోక్యము కలుగజేసుకొని శిక్ష పెంచవచ్చును.

ఏకనాథ శంకర్‌రావు ముఖ్వాలాల్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1977 యస్. సి. 1177.

ఒక చిన్న వ్యాపారి వద్ద 3 కె. జి. ల కారపుపొడి మాత్రమే ఉండెను. శాంపిల్ తీసికొనగా ఆరోగ్యమునకు భంగము కలుగజేయు పదార్థము లేకుండెను. కాని కల్తీ ఆహారమని తేలెను. సె. 16 [1] [ఎ] క్రింద కనీస శిక్షకంటె తక్కువ శిక్షను కోర్టు ప్రతికల్పన క్రింద విధించవచ్చును.

ఎ. ఐ. ఆర్. 1977 యస్. సి 1177

నూనె కృత్రిమమైన రంగుతో కలిసినప్పుడు 2 [1] [జె] క్రింద కల్తీ ఆహారమగును. సె. 16 [1] క్రింద ప్రతికల్పన వర్తించదు.

ప్రేమ వల్లబ్ Vs స్టేట్
ఎ. ఐ. ఆర్. 1977 యస్. సి 56

పాలలో క్రొవ్వు 0.4% తక్కువ యుండెను. ముద్దాయి ముదుసలి, రోగస్థుడు సుప్రీంకోర్టు కనీస శిక్షకంటె తక్కువ శిక్ష విధించెను.

ఉమ్రావు సింగ్ Vs స్టేట్ ఆఫ్ హర్యానా
1981 యస్. సి. 1723

[ 16 [1] ప్రతికల్పన 1976 సవరణ చట్టము ద్వారా సవరించబడినది. ]

ఐస్‌క్రీములో అపెండిక్స్ - బి, ఎ [11.02.08] లో నిర్దేశించబడిన ప్రమాణముల ప్రకారము పాల క్రొవ్వు కనీసం 10% ఉండవలెను. శాంపిల్‌లో 5% మాత్రమే ఉండెను. మేజిస్ట్రేటు కోర్టు, ముద్దాయి నేరంచేయలేదు అని తీర్పుచెప్పెను. హైకోర్టు కూడ కేసు కొట్టివేసెను. సుప్రీం కోర్టు సదరు ఐస్‌క్రీం 2 [1ఎ][యం] క్రింద కల్తీ ఆహారమనియు సె. 16 [1] [ఎ] క్రింద నేరమని తీర్పు చెప్పుచూ, నేరం జరిగి చాలకాలం గడిచింది అనే కారణంచేత ప్రతికల్పన క్రింద కనీస శిక్ష- 3 నెలల జైలు + రూ 2000/-లు జరిమానా విధించెను,

స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర Vs బాబూరావు
ఎ. ఐ. ఆర్ 1985 యస్. సి. 104

మేజిస్ట్రేటు ముద్దాయిని విమోచన చేయగా, హైకోర్టు నేరస్థుడని తీర్మానించెను. పాలు నాణ్యత పరిమాణములకు బహు స్వల్పముగా భేదించెను. నేరం జరిగి చాలా

కాలం గడిచెను. అలహాబాదు హైకోర్టు ఆ పరిస్థితులలో సె. 16 (1 ఎ i) ప్రతి కల్పన క్రింద జరిమానా మాత్రమే విధించెను.

1984 క్రి. లా. జ. 1509

కల్తీచేసిన కుల్ఫీ అమ్మగా అప్పీలులో సెషన్స్ కోర్టు సెక్షను 20 క్రింద సరి అయిన శాంక్షన్ లేదు అని ముద్దాయిని డిస్‌చార్జి చేసెను హైకోర్టు సదరు డిస్ చార్జి తప్పు అని తీర్పు చెప్పుతూ నేరము జరిగి 13 సంవత్సరములు గడిచి నందున ముద్దాయి చాలా చిన్న వ్యాపారి అయినందున డిస్‌చార్జి ఉత్తర్వును రద్దు చేయలేదు.

1984 క్రి. లా. జ. 1224

శాంపిల్‌కు పంపవలసిన ప్రమాణమునకు తక్కువగా అనగా 250 గ్రాములు బదులు 200 గ్రాములు పంపగా మేజిస్ట్రేటు ముద్దాయిని విడుదలచేసెను హైకోర్టుకూడా అప్పీలు కొట్టివేసెను. సుప్రీంకోర్టు పంపబడిన శాంపిల్ పరిమాణము విశ్లేషణము చేయుటకు సరిపోయినంతవరకు విశ్లేషణ నివేదికను తిరస్కరించరాదు. ముద్దాయిని శిక్షించుటకు యెట్టి ఆటంకము లేదు, క్రింది కోర్టుల తీర్పులు తప్పు అని నిర్ణయించియూ నేరము జరిగి చాలాకాలము గడిచినందున ఈ విషయములో పూర్వము భిన్నాభిప్రాయములున్నందున క్రింది కోర్టు తీర్పు రద్దు చేయలేదు.

మున్సిపల్ కార్పొరేషన్ ఢిల్లి Vs మ్యాక్వాలిటీ స్వీట్ హౌజ్
ఎ. ఐ. ఆర్. 1985 సుప్. సి. 829

10. సె. 16 1 (బి) :-

కల్తీచేయు పదార్థము ఆరోగ్యమునకు భంగం కలుగచేయదు అనే కారణాలపై ముద్దాయి విమోచన చేయుట తప్పు. 16 (1) (బి) వర్తించును.

1964 క్రి. లా. జ. 766 ఒరిస్సా

11. అడ్డగించుట 16 ( 1సి) :-

పాలు అమ్మే వ్యక్తి పాలు పారబోసి పరుగెత్తి పోగా, సె. 16 1 సి క్రింద (అప్పుడు 16 1 బి) నేరం చేసినట్లని మద్రాసు హైకోర్టు తీర్పు యిచ్చింది.

రాంగురు ఆసరే కేసు - ఎ ఐ. ఆర్. 1969 మద్రాసు 85

కాని పాలు శాంపిల్ ఇచ్చుటకు నోటితో తిరస్కరించినంతమాత్రన, ఫుడ్ ఇన్‌స్పెక్టరును శాంపిల్ తీసికొనకుండ నివారించినట్లు భావించదగదు. నివారించుట అనగా వాస్తవిక చర్య ద్వారా 'అడ్డగించుట' లేక ఒక బుద్ధిపూర్వకమైన వ్యతిరేక చర్య ద్వారా ఫుడ్ ఇన్‌స్పెక్టరు శాంపిల్ తీసికొనుటలో ఆపుటగాని అడ్డగించుట గాని, సాధించుట అని ఆంధ్ర హైకోర్టు ఒకసారి అభిప్రాయబడినది.

పి. పి. Vs టి. సాంబశివరావు

శాంపిల్ ఇచ్చుటకు తిరస్కరించినచో ఈ సెక్షను క్రింద నేరం చేసినట్లే అని వేరొక తీర్పులో చెప్పినది.

పబ్లిక్ ప్రాసిక్యూటరు Vs రామయ్య
1975 యఫ్. ఎ. సి. 284

పాలు శాంపిల్ తీసికొనుటకు వీలు లేకుండ పాలు పారబోసినచో ముద్దాయి సె 16 (1) (సి) క్రింద ఫుడ్ ఇన్‌స్పెక్టరును అడ్డగించినట్లే.

శేషరావు తోపాజి Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
1978 క్రి. లా. జ. 217

ప్రత్యక్ష చర్య ద్వారా అడ్డగించుటయేగాక, ఫుడ్ ఇన్‌స్పెక్టరును భయపెట్టి శాంపిల్ తీసికొనకుండా చేసినప్పుడుగూడ ఈ సెక్షను క్రింద నేరము జరిగినది. వ్యాపారి శాంపిల్ తీసికొనకుండ ప్రత్యక్ష చర్య ద్వారా అడ్డగించవచ్చును. ఒకచో పెద్ద రగడచేసి భయోత్పాతము కల్గించి, ఇన్‌స్పెక్టరును 'నివారించిన' నేరం చేయవచ్చును. కాని, కొన్నిసార్లు పెడసరంగా శాంపిల్ ఇచ్చుటకు నిరాకరించవచ్చును. అంతమాత్రంచేత అది 16 (1) (సి) క్రింద నేరం కాదు.

నారాయణ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ రాజస్థాన్
ఎ. ఐ. ఆర్. 1975 రాజస్థాన్ 162 (యఫ్. బి.)

పాలు అక్కడనే వదలి పారిపోయిన వ్యక్తి ఈ సబ్ క్లాజు క్రింద నేరం చేయలేదని బొంబాయి, గుజరాతు. మధ్యప్రదేశ్, పంజాబ్, రాజస్థాన్ హైకోర్టులు అభిప్రాయపడినవి.

1957 క్రి. లా. జ. 656 పంజాబ్; 1967 క్రి. లా. జ. 376 గుజరాత్
1979 క్రి. లా. జ. 264 బొంబే; 1977 క్రి] లా. జ. 974 మధ్యప్రదేశ్
ఎ. ఐ. ఆర్. 1978 రాజస్థాన్ 162

అయితే సుప్రీంకోర్టు తప్పుడు వంకతో ముద్దాయి షాపునుండి వదలిపోయి నప్పుడు, ఇంకేవిధమయిన ప్రత్యక్ష చర్య లేకుండగనే నేరం చేసినాడని తీర్పు చెప్పి నది.

ఎ. ఐ. ఆర్. 1983 యస్. సి. 878, 1983 క్రి. లా. జ. 1364 (యస్.సి.)

(పై చెప్పబడిన రాజస్థాన్, బొంబాయి కోర్టులు ప్రత్యేకంగా రద్దు చేయబడి నవి.

ఇందుకు వ్యతిరేకంగా యివ్వబడిన యితర హైకోర్టు తీర్పులు గూడ రద్దయి నట్లే.)

దౌర్జన్యము లేక బెదిరింపుల ద్వారా అడ్డగించనక్కరలేదు.—

ఫుడ్ యిన్‌స్పెక్టరు తనయొక్క అధికారములను వినియోగించుటకు అడ్డం కులు కల్గించు ఏ చర్య లేక చర్యలు అయినా బుద్ధిపూర్వకముగా చేసిన యెడల 16 (1) (సి) క్రింద నేరము చేసినట్లు భావించవలెను.

1984 క్రి. లా. జ, 556 యం. పి.

12 16 (1సి) :-

సె 14, లేక సె. 14 ఎ వ్యతిరేకించిన వ్యక్తి ఈ క్లాజు క్రింద శిక్షా ర్హుడు. 6 నెలల వరకు జైలుశిక్ష మరియు రు. 500/-లకు తక్కువగాని జరిమానా విధించవచ్చును, ఈ క్లాజు మొదటిసారిగా 1964 సవరణ చట్టముద్వారా ప్రవేశ పెట్టబడినది, 1976 సవరణలో ఏమీ మార్పు జరుగలేదు.

16 (1డి) :-

ఒకసారి శిక్షించబడిన వ్యక్తి, మరల అటువంటి నేరము చేసిన యెడల, కోర్టు అతని లైసెన్సు రద్దు చేయవచ్చును.

13. 16 (2) :-

ఆర్థిక నేరములు చేసే వ్యక్తులకు 'బహిరంగ అభిశంసన' (Public Cen- sure) ఎక్కువ ప్రయోజనకరమైనదని ఆధునిక నేరశాస్త్ర నిపుణులు అభిప్రాయ పడుచున్నారు ఈ క్లాజు ద్వారా, రెండవ లేక తదుపరి నేరం చేసిన వ్యక్తియొక్క

పేరు, వగైరా చేసిన నేరం వగైరా వార్తా పత్రికలలో బహిరంగ ప్రకటన చేయుటకు కోర్టుకు అధికారమివ్వబడినది. కోర్టు ఇంక ఏ ఇతర విధముగానయిననూ - (ఉదా - గ్రామచావడివద్ద నోటీసు, గ్రామంలో టముకు వేయించుట-) ప్రకటించవచ్చును. అందుకు ఆ ఖర్చులు గూడా ముద్దాయినుండి రాబట్టవచ్చును.

ఈ సబ్ సెక్షను 1955 చట్టంలోనే ఉన్నది. ఈ శాసనంయొక్క అమలు తీవ్రముగా లేనందువలన, రెండవ, మూడవ నేరములు ఆరోపించబడిన సందర్భములు అరుదు.

1955 శాసనంలో రెండవ, మూడవ నేరములకు అధిక శిక్షలు విధించుచున్న క్లాజులు 1964 సవరణలో తీసివేయబడినవి. మొదటి నేరమునకే 6 సం-ల శిక్ష నిర్ణయించిన కారణమున అయివుండవచ్చును.

14. సి. ఆర్. పి. సి. సె. 110 :

రెండవ మూడవ నేరములు చేసిన వ్యక్తి అలవాటు నేరస్థుడుగా సె. 110 సి. ఆర్. పి. సి. నిబంధన పరిధిలోనికి వచ్చును.

(సె. 110 సి. ఆర్. పి. సి. చూడదగును)

15. ప్రొబేషన్

కొన్ని కొన్ని పరిస్థితుల్లో ముద్దాయికి జైలుశిక్ష విధించుట క్రూరమని భావించి తేలిక శిక్ష విధించిగాని, ప్రొబేషనుపై వదలుటగాని చేయ వచ్చును.

1972 సుప్రీంకోర్టు, ఈ శాసనం క్రింద నేరములను గూడ ప్రొబేషను చట్టంయొక్క నిబంధనలు వర్తించునని తీర్పు యిచ్చినది.

ఈశ్వరదాస్ Vs స్టేట్ ఆఫ్ పంజాబ్
ఎ. ఐ. ఆర్. 1927 యస్ సి. 1295

మరియొక తీర్పులో 21 సం.ల కంటె ఎక్కువ వయస్సుగల వారి విషయములో ప్రొబేషను చట్టము తేలికగా వర్తింపజేయరాదు అని చెప్పినది.

రాం ప్రకాశ్ Vs స్టేట్ ఆఫ్ హిమాచలప్రదేశ్

ప్రొబేషను పద్ధతి వలన ఈ చట్టం క్రింద నేరస్థులు మారరని అందువలన ఈ నేరములు ప్రొబేషను చట్టంయొక్క లాభమునిచ్చుట సరియైనది కాదని మరియొక తీర్పు యిచ్చినది.

ప్యారీలాల్ కె. తేజనాని Vs యం. ఆర్. డాంగే
ఎ. ఐ. ఆర్- 1974 యస్. సి. 228

క్రిములతో నిండిన జీడిపప్పు అమ్మబడెను. నేరం జరిగి 13 సం.లు గడచినందున అప్పుడు తీర్పులయొక్క ధోరణిననుసరించి ముద్దాయి ప్రొబేషనుపై వదలబడెను.

1982 క్రి. లా. జ. 124 (యస్. సి.)
ఎ. ఐ. ఆర్. 1982 యస్. సి. 1095

1976 సవరణ చట్టంద్వారా సెక్షను 20. ఎ. ఎ చేర్చబడినది. దీని ప్రకారం నేరస్థుడు 18 సం.లలోపు వ్యక్తి అయితేతప్ప ప్రొబేషను ఆఫ్ అఫెండర్సు యాక్టు 1958 లోని నిబంధనలుగాని క్రి. ప్రొ. కో. సె. 360 గాని వర్తించవు.

1984 క్రి. లా. జ. (రి) ఎ. పి. (యన్. ఒ. సి.)
(సె. 20 ఎ. ఎ చూడదగును)

నేరము జరిగినప్పుడు వయస్సు బట్టికాక, తీర్పు చెప్పెడి రోజున ముద్దాయి వయస్సు పరిగణనలోనికి తీసికొనవలెను.

నగర మహాపాలిక, లక్నో Vs పెగుర్నానీ
1978 క్రి. లా. జ. 53

ఒక మైసూరు నివాసి బొంబాయి రాగా, ఒక రోజు హోటలు అజమాయిషీకి నియోగించబడెను. ఆ రోజు ఫుడ్ యిన్స్పెక్టరు శాంపిల్ తీసికొని కల్తీ ఆహారమైనందున అభియోగము దాఖలు చేసెను. అది ముద్దాయిని జైలుకు పంపవలసిన కేసు కాదు అని, సుప్రీంకోర్టు ప్రొబేషను పై వదలెను.

ఎ. ఐ. ఆర్. 1981 యస్. సి. 1776
1981 క్రి. లా. జ. 1282

1976 సవరణకు పూర్వం శాంపిల్ తీసికొనబడిన కేసులో అప్పటి శాసన నిబంధనం ప్రకారము ప్రొబేషను క్రింద వదలబడెను.

జగదీశ్ ప్రసాద్ Vs స్టేట్ ఆఫ్ ఢిల్లీ
ఎ. ఐ. ఆర్. 1982 యస్. సి 57
ఎ. ఐ. ఆర్. 1982 యస్. సి. 1095

16. ఋజువు బాధ్యత :-

నేరం రుజువు చేయవలసిన బాధ్యత ఎల్లప్పుడూ ప్రాసిక్యూషను పైన ఉండును. ముద్దాయి ప్రతివాదన సమంజసమైనదయిన చాలు. నేయి డబ్బా కోల్డ్ స్టొరేజిలో వుంచినప్పుడు గాలిలోని తేమ ఆకర్షితమగు అవకాశము గలదు. తేమ శాతం పెరిగిన, నేతిలోని ఓలిక్ యాసిడ్ శాతం గూడ పెరుగును. శాంపిల్‌లోని నాణ్య పరిమాణములకు గల వ్యత్యాసము సదరు కారణం వలన అయి ఉండు అవకాశమున్నప్పుడు, ప్రతివాదన సమంజసము, ముద్దాయిని శిక్షించుట తగదు.

మెసర్స్ ప్రాయిజన్ లిమిటెడ్ Vs కలకత్తా కార్పొరేషన్
ఎ. ఐ. ఆర్. 1969 కలకత్తా 247

నిల్వ చేయబడియున్న పదార్థము 'ఆహారం' అని ప్రాసిక్యూషను నిరూపించవలెను. నల్లనువ్వులు వ్రతం కొరకు అమ్మినానని ముద్దాయి వాదన. నల్లనువ్వులు ఆహారంగా వాడెదరని సాక్ష్యం లేదు. సంశయలాభము ముద్దాయి కివ్వబడెను.

ఆషూజయవంత్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 2178

కల్తీ నువ్వుల నూనె అమ్మినప్పుడు, నువ్వుల నూనె 'పైపూతకు' అమ్మిననూ నేరమేనని తీర్పు యివ్వబడెను.

స్టేట్ ఆఫ్ తమిళనాడు Vs కృష్ణమూర్తి
ఎ. ఐ. ఆర్. 1980 యస్. సి. 538.

పబ్లిక్ ఎనలిస్ట్ రిపోర్టు కేంద్ర పరిశోధనశాల డైరక్టరుల యొక్క నివేదికలు తుది సాక్ష్యమనుట, అది కోర్టుకు అవశ్యపాలనీయము అని కాదు. అట్లయినచో నేర

నిర్ధారణ ఎనలిస్టుకు/డైరెక్టరుకు వదలి వేసినట్లగును. సదరు సాక్ష్యంను పరిశీలించి నేర నిర్ధారణ చేయవలసిన బాధ్యత ఎప్పుడూ కోర్టుదే.

మునిసిపల్ కార్పోరేషన్ ఆఫ్ ఢిల్లీ Vs కచేరుమల్
ఎ. ఐ. ఆర్. 1976 యస్. సి. 394

సెక్షను 10 (6) క్రింద ఒక వ్యక్తి స్వాధీనము నుండి కల్తీ చేయు పదార్థము స్వాధీనము చేసికొన్నప్పుడు మాత్రం, సదరుపదార్థము ఆహార కల్తీ కొరకుద్దేశింప బడలేదు అని నిరూపించుకొనే బాధ్యత ఆ వ్యక్తి పైన ఉండును.

[సె. 10 (7)(బి)

17. ముద్దాయి స్టేటుమెంటు :—

క్రి. ప్రొ. కో. సె. 313 క్రింద ముద్దాయిని ప్రశ్నించవలసిన అవసరం ముద్దాయికి వ్యతిరేకంగా సాక్ష్యం ఉన్నప్పుడే. ఏ విధమయిన నేరమును సూచించు సాక్ష్యం లేకనే, ముద్దాయి ప్రశ్నించినప్పుడు, ముద్దాయి యిచ్చిన స్టేటుమెంటు ఆధారంగా నేరం చేసినట్లు నిర్ణయించుట తప్పు.

తారాసింగ్ Vs స్టేట్
ఎ. ఐ. ఆర్. 1951 యస్. సి. 411.

ముద్దాయిని 313 సె. క్రింద విచారించకపోవుట తీవ్రమైన పొరపాటు.

కేదారనాథ్ Vs స్టేట్ ఆఫ్ బెంగాల్
ఎ. ఐ. ఆర్. 1954 యస్. సి. 660.

కొంత సాక్ష్యము అయినతర్వాత ముద్దాయి ఒప్పుదల స్టేటుమెంటు తీసికొని, శిక్షించుట తప్పు.

కాశింభాయ్ Vs స్టేట్ ఆఫ్ గుజరాత్
ఎ ఐ ఆర్. 1980 యస్. సి. 854

సె. 313 సి. ఆర్. పి. సి. క్రింద స్టేటుమెంటులో నేరం ఒప్పుకొనిన, అట్టి ఒప్పుదలపై శిక్షించుట చట్టవిరుద్ధము. కేసు క్రింది కోర్టుకు పునర్విచారణకు పంపబడెను.

గణేష్‌మల్ Vs గవర్నమెంట్ ఆఫ్ గుజరాత్.
ఎ. ఐ. ఆర్. 1980 యస్. సి. 264

18. శిక్ష గురించి ముద్దాయి సంజాయిషీ :—

సె. 248 (2) సి. ఆర్, పి. సి. ప్రకారం, నేరం నిర్ణయం జరిగిన తర్వాత, విధించబోవు శిక్ష గురించి చెప్పుకొనుటకు ముద్దాయికి అవకాశం ఇవ్వవలెను. ఇది తప్పనిసరి. ఈ సెక్షను ఆహారకల్తీ నివారణ చట్టం క్రింది నేరములకు గూడ వర్తించును.

ప్రేమ్‌రాజ్ Vs స్టేట్
ఐయఫ్. ఎ. సి. 132 ఢిల్లీ

19. అప్పీలు :—

విమోచన తీర్పుపై అప్పీలు చేసినప్పుడు, జోక్యం కలిగించుకొనుటకు, కోర్టులు తొందరపడవు. కాని సాక్ష్యంపై రెండు విధములైన నిర్ణయములు సాధ్యము కానప్పుడు నేరం నిస్సందేహంగా రుజువయినప్పుడు, విమోచన తీర్పు రద్దుచేసి, శిక్ష విధించదగును.

మునిసిపల్ కమిటి అంబాల Vs పైసాకరామ్
ఎ. ఐ. ఆర్. 1963 పంజాబ్ 175

తిరిగి విచారణ ముద్దాయికి తీవ్రమయిన నష్టం కలిగించునని, చాలకాలం గతించినందున, తిరిగి విచారణ తగదని వాదించగా సుప్రీంకోర్టు, అటువంటి కుత్సితమైన సాంకేతిక వాదనలు, ఈ శాసనం క్రింది నేరముల విషయములో సహించరాదని ప్రజారోగ్యానికి భంగం కలిగించే ప్రమాదకరమయిన కార్యకలాపములు చేయు కల్తీ ఆహార తయారీదార్లు, విక్రయదార్లతో కోర్టులు తగు పద్ధతిలో వ్యవహరించవలెనని అభిప్రాయము వెలిబుచ్చినది.

మునిసిపల్ కార్పొరేషన్ ఢిల్లీ Vs గిరిధర్‌లాల్ సపూ
1981 క్రి. లా. జ. 632 (యస్. సి)

20. రివిజను :—

శిక్ష అధికము చేయుటకు రివిజను దాఖలు చేసినప్పుడు ముద్దాయిని వినవలెను. ముద్దాయి విమోచనకు గూడ వాదించుకొను హక్కు కలిగియుండును.

ఫుడ్ యిన్స్పెక్టరు, మంగుళూరు Vs కె. యస్. రాఫాల్
1981 క్రి. లా. జ. 1149 (కర్ణాటక)

21. జాయింటు విచారణ :—

విక్రయదారు, తయారుదారు, పంపిణీదారులపై ఒకే నేరంలో జాయింటు విచారణ చేయవచ్చును.

భగవాన్‌దాస్ జగదీశ్‌చందర్ Vs ఢిల్లీ అడ్మినిస్ట్రేషను
ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 1309

సె. 20 ఎ ప్రకారము విక్రయదారుపై పెట్టిన కేసులో, సరియైన ఆధారము ఉన్నచో, అట్టి పద్ధతికి సమర్థనీయమైన పరిస్థితులున్నచో తయారీదారును, లేక పంపిణీదారును ఒకే కేసులో ముద్దాయిలుగా సమను చేసి, జాయింటు విచారణ చేయవచ్చును.

1984 క్రి. లా. జ. 581 ఒరిస్సా
భగవాన్‌దాస్ Vs ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్
ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 1309
[ఇంకను తీర్పుల కొరకు సె. 20—ఎ క్రింది వ్యాఖ్య చూడదగును.]

## 16:– ఎ

క్రిమినల్ ప్రొసీజరు కోడ్ 1973 లో ఏమి ఉన్నప్పటికీ, రాష్ట్ర ప్రభుత్వంచే యిందు గురించి ప్రత్యేకంగా అధికారములు పొందిన మొదటి తరగతి జుడిషియల్ మెజిస్ట్రేటు లేక మెట్రోపాలిటన్ మెజిస్ట్రేట్ చే, సెక్షను 16 [1] క్రింది నేరములన్ని, సంక్షిప్త విచారణ చేయబడవలెను. మరియు అట్టి విచారణకు, సాధ్యమయినంత వరకు సదరు కోడ్‌లోని 262 నుండి 265 [రెంటితో సహా] సెక్షన్లు వర్తించును.

అయితే ఈ సెక్షన్లు క్రింద సంక్షిప్త విచారణాలో, దోషిగా నిర్ణయించబడినప్పుడు, మేజిస్ట్రేటు ఒక సంవత్సరము మించకుండా శిక్ష విధించుట న్యాయ సమ్మతమగును.

అంతేగాక సంక్షిప్త విచారణ ప్రారంభంలో, లేక సంక్షిప్త విచారణలో, కేసు స్వభావమును బట్టి ఒక సంవత్సరము కంటే ఎక్కువ శిక్ష విధించవలయునని లేక ఇంకే యితర కారణముల వలన నయినా, సంక్షిప్త విచారణ చేయుట కోరదగనిది కాదని అని పించినప్పుడు మేజిస్ట్రేటు, ఉభయ పక్షముల వాదన వినిన తర్వాత అట్టి విధముగా ఉత్తర్వు రికార్డు చేయవలెను. మరియు అప్పటికి పరీక్ష చేయబడిన సాక్షులను తిరిగి పిలిపించవలెను. మరియు సదరు కోడులో నిర్దేశించబడిన విధంగా కేసు పునర్విచారణ చేయవలెను

వ్యాఖ్య

రెండవ ప్రతికల్పనలో చెప్పబడిన పరిస్థితులలో తప్ప, మెట్రోపాలిటన్ మేజిస్ట్రేటు లందరూ, ప్రత్యేకముగా అధికారములు పొందిన జుడిషియల్ ఫస్ట్ క్లాస్ మెజిస్ట్రేటు లందరు సె. 16 [1] క్రింది నేరములకు తప్పని సరిగా సంక్షిప్త విచారణ చేయవలెను.

అనగా విచక్షణాధికారము లేని, ఒక సంవత్సరము కంటే ఎక్కువ కనీస శిక్ష నిర్దేశించిన నేరములలో సంక్షిప్త విచారణ సమంజసమవదు. ప్రతికల్పన వర్తింపచేసి వారంటు కేసు లేక కమిటల్ కేసు విచారణ అవలంభించవలసి యుండును. యితర కారణముల వలన గూడ సంక్షిప్త విచారణ చేయకుండ ఉండ వచ్చును అయితే అట్టి కారణముల నుదహరించుచూ ప్రత్యేక ఉత్తర్వు వ్రాయ వలెను.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఉత్తర్వు :-

సెక్షను 16-ఎ క్రింద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జివో. యం. యస్. నం. 414 [యం అండ్ హెచ్] తేది 29-7-85 ద్వారా రాష్ట్రంలోని మొదటి తగరతి జుడిషి యల్ మెజిస్ట్రేటులందరికీ సదరు సెక్షనులో ప్రస్తావించబడిన నేరములన్నిటినీ సంక్షిప్త విచారణ చేయుటకు అధికారమిచ్చినది.

సెక్షను **17** :-

కంపెనీల నేరములు.

1. ఈ శాసనము క్రింద ఒక కంపెనీ నేరము చేసిన యెడల—

(ఎ) i) సబ్ సెక్షన్ 2 క్రింద ఒక వేళ, కంపెనీ వ్యాపార నిర్వహణకు ఇన్‌ఛార్జిగా మరియు బాధ్యుడుగా నియమించబడినచో ఆ వ్యక్తి [ఈ సెక్షన్‌లో ఇటుతర్వాత 'బాధ్యుడైన వ్యక్తి'గా ప్రస్తావించబడిన] లేక

ii) అట్లు ఏ వ్యక్తి కూడా నియమించబడనప్పుడు, నేరము జరిగినప్పుడు కంపెనీ యొక్క వ్యాపార నిర్వహణకు యిన్‌ఛార్జిగా మరియు బాధ్యుడుగా ఉన్న వ్యక్తి మరియు

బి) సదరు కంపెనీ,

సదరు నేరమునకు దోషిగా భావించబడును. మరియు తదనుసారముగా శిక్షించబడును.

అయితే ఈ సబ్ సెక్షనులో ఉన్నదేదీ ఏ వ్యక్తియైనా తనకు తెలియకుండా నేరము జరిగినదని నిరూపించి సదరు నేరము జరుగకుండ అరికట్టుటకు తాను తగిన జాగ్రత్తలు తీసికొంటినని నిరూపించిన యెడల, సదరు వ్యక్తిని ఈ చట్టములో చెప్పబడిన ఏ శిక్షకూ బాధ్యునిగా చేయదు.

2 ఏ కంపెనీయైనా వ్రాత పూర్వకమైన ఉత్తర్వు ద్వారా తన యొక్క ఏ డైరక్టరునైనా, పర్యవేక్షక లేక మేనేజరు హోదాలో నియమించబడిన మేనేజరును, ఈ శాసనము క్రింద ఏ నేరమును కంపెనీ చేయకుండ నిరోధించుటకు అవసరమైన, ప్రయోజనావశ్యకమైన చర్యలన్నిటిని తీసికొనుటకు మరియు అన్ని అధికారములు చెలాయించుటకు ప్రాధికార మివ్వవచ్చును. మరియు అట్లు డైరక్టరును బాధ్యుడైన వ్యక్తిగా నియమించినట్లు లోకల్ హెల్త్ అథారిటీకి నిర్ణీత నమూనాలో నిర్ణయించిన విధముగా నోటీసు, అట్లు నియమించబడిన డైరక్టరు లేక మేనేజరు యొక్క లిఖిత పూర్వకమైన అంగీకారము, జతపరిచి పంపవలెను.

వివరణ :-

ఒక కంపెనీకి వేర్వేరు వ్యవస్థాపనలు లేక శాఖలు లేక వ్యవస్థాపన లేక శాఖలలో వేర్వేరు భాగములున్నప్పుడు ఈ సబ్ సెక్షను క్రింద వేర్వేరు వ్యక్తులను వేర్వేరు వ్యవస్థాపనలు లేక విభాగములకు నియమించవచ్చును. మరియు ఒక వ్యవస్థాపన, శాఖ, లేక శాఖలు లేక విభాగమునకు నియమించబడిన వ్యక్తి సదరు వ్యవస్థాపన, శాఖ లేక విభాగమునకు బాధ్యుడైన వ్యక్తిగా పరిగణించబడును.

3. సబ్ సెక్షన్ (2) క్రింద నియమించబడిన వ్యక్తి –

i. కంపెనీనుండి లోకల్ హెల్త్ అథారిటీకు సదరు నియామకము రద్దు చేయుచు తదుపరి నోటీసు అందువరకు, లేక

ii సదరు కంపెనీ యొక్క (సందర్భానుసారంగా) డైరక్టరు లేక మేనేజరుగా పదవి నుండి విరమించు వరకు, లేక

iii. అతడు కంపెనీకి తెలియ పరచుచూ, లోకల్ హెల్త్ అథారిటీకి లిఖిత పూర్వకముగా తన నియామకమును రద్దు చేయమని కోరునంత వరకు ఏది ముందైతే (ఆ తేదీ వరకు) బాధ్యుడైన వ్యక్తిగా కొనసాగును. అట్టి కోరికను లోకల్ హెల్త్ అథారిటీ ఆమోదించవలెను.

అయితే సదరు వ్యక్తి (సందర్భానుసారముగా) కంపెనీ యొక్క డైరక్టరు లేక మేనేజరుగా పదవి విరమించినప్పుడు సదరు పదవి విరమణ గురించి లోకల్ హెల్త్ అథారిటీకి తెలియ పర్చవలెను.

అంతేగాక సదరు వ్యక్తి ఖండము (3) క్రింద కోరినప్పుడు లోకల్ హెల్త్ అథారిటీ అట్లు కోరిన తేదీ కంటె ముందు తేదీ నుండి సదరు నియామకమును రద్దు చేయరాదు.

4. పైన చెప్పబడిన సబ్ సెక్షన్‌లలో ఏమి ఉన్నప్పటికి, ఈ శాసనము క్రింద ఏ కంపెనీ యైన నేరము చేసినప్పుడు సబ్ సెక్షన్ (2) క్రింద నియమించబడిన వ్యక్తి కాకుండ, కంపెనీ యొక్క డైరక్టరు, మేనేజరు, సెక్రటరీ లేక ఇతర అధికారి యొక్క ఆమోదము లేక రహస్య సమ్మతితో కాని, లేక అట్టి డైరక్టరు, మేనేజరు, సెక్రటరీ లేక అధికారి యొక్క అజాగ్రత్తకు సంబంధించిన దనదగినప్పుడు సదరు డైరక్టరు మేనేజరు సెక్రటరీ లేక ఇతర అధికారి కూడ ఆ నేరము చేసినట్లుగా పరిగణించబడును. మరియు తదనుసారంగా శిక్షించబడును.

వివరణ: ఈ సెక్షను నిమిత్తము –

ఎ. 'కంపెనీ' అనగా సంఘటిత సంస్థ. మరియు ఇందులో 'భాగస్వామ్య వ్యాపారము', 'సంఘము' కలిసి యున్నవి.

బి. భాగస్వామ్య వ్యాపారమునకు సంబంధించినప్పుడు 'డైరక్టరు' అనగా 'భాగస్వామి'.

సి. హోటల్ పరిశ్రమలో పాల్గొనిన కంపెనీకి సంబంధించి 'మేనేజరు' అనగా ఏ హోటలునైన నిర్వహించుచున్న లేక నడుపుచున్న ఆహార ఏర్పాటు విభాగమునకు ఇన్‌ఛార్జిగా ఉన్న వ్యక్తి కూడా.

## వ్యాఖ్య

1. నియామకము
2. ప్రభుత్వోద్యోగి బాధ్యత
3. డైరక్టరు యొక్క బాధ్యత
4. భాగస్వామ్య సంస్థ
5. నామనిర్దేశము – సబ్ సెక్షను – 2

1. నియామకము :-

సబ్ సెక్షన్ (2) మొదటిసారిగా 1976 సవరణ చట్టం ద్వారా ఈ శాసనములో చేర్చబడినది.

ఈ శాసనము క్రింద ఒక కంపెనీ నేరము చేసినప్పుడు వ్యాపార నిర్వహణకు బాధ్యుడైన వ్యక్తియే గాక 'కంపెనీ' కూడా దోషిగా పరిగణించబడును. అయితే కంపెనీని శిక్షించుటకు కంపెనీకి ఇన్‌ఛార్జిగా ఉన్న వ్యక్తి దోషి అని తీర్మానించుట తప్పని సరిగాదు.

పి. పి. Vs కల్లూరి రాయవరం కో ఆపరేటివ్ మిల్క్ సప్లై సొసైటీ లిమిటెడ్
ఎ. ఐ. ఆర్. 1964 మద్రాసు 301

2. కో ఆపరేటివ్ సొసైటిని నిర్వహించుచున్న ప్రభుత్వ ఉద్యోగి బాధ్యత.

ఇంటిగ్రేటెడ్ మిల్క్ ప్రాజెక్టు యొక్క మేనేజరుపై ప్రాసిక్యూషన్ పెట్టబడినప్పుడు రాష్ట్ర ప్రభుత్వము యొక్క అనుమతి లేనిదే (సెక్షను 197 క్రి. ప్రొ. కో.) క్రింద ప్రాసిక్యూషన్ చెల్లదని వాదించగా, ప్రాజెక్ట్ యొక్క ప్రధానాధికారిగా ఈ శాసనము క్రింద నిర్ణీతమైన ప్రమాణములకనుసారంగా పాలు అమ్మవలసిన బాధ్యత అతనిపై ఉన్నదని, అట్లుగాక కల్తీ పాలు అమ్మినప్పుడు ఈ చట్టము క్రింద నేరము చేసినట్లుగా పరిగణించబడవలెనని, సెక్షన్ 197 క్రి. ప్రొ. కో. క్రింద ప్రభుత్వ అనుమతి అవసరము లేదని తీర్పుచెప్పబడినది.

యం. సి. యస్. రెడ్డి Vs స్టేట్
1975 క్రి. లా. జ. 1015 (ఆం. ప్ర.)

3. డైరక్టరు యొక్క బాధ్యత :-

ఈ సెక్షను వలన కంపెనీ యొక్క బాధ్యత చెరిగిపోదు. తీసివేయబడలేదు. అయితే కంపెనీని ప్రాసిక్యూట్ చేసినప్పుడు కంపెనీ యొక్క మెన్సిరియా నిరూపించనక్కరలేదు. మెన్సిరియా ఈ నేరము యొక్క ముఖ్యభాగము కాదు, కంపెనీ, కంపెనీ యొక్క డైరక్టరును గూడ ప్రాసిక్యూట్ చేయవచ్చును.

పి. పి. Vs కరుప్పన్
[ఎ. ఐ. ఆర్. 1958 మద్రాసు 103]

కంపెనీ డైరక్టరును ప్రాసిక్యూట్ చేసినప్పుడు తాను నేరం చేయకుండ ఉండుటకు అవసరము అయిన అన్ని జాగ్రత్తలు తీసికున్నానని, ఆ నేరం తనకు తెలియకుండా జరిగిందని నిరూపించుకోవచ్చును.

యం యల్. అధికారి Vs ఫుడ్ యిన్స్పెక్టరు కున్నుక్కులం
ఎ. ఐ. ఆర్. 1965 కేరళ 295

4 భాగస్వామ్య సంస్థ :-

ముద్దాయి స్వయంగా వ్యాపారం నడపడం లేదని, వ్యాపారానికి ఇన్‌ఛార్జి కూడ కాదని నిరూపణ అయినప్పుడు, లైసన్సు ముద్దాయి పేరున ఉన్నంత మాత్రాన, దోషిగా నిర్ణయించరాదు.

మనీభాయ్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 434
ఎ. ఐ. ఆర్. 1977 యస్ సి. 435

సెక్షను 17 (2) నామ నిర్దేశము :-

'నామ నిర్దేశము చేయవచ్చును' అనగా 'చేయవలెను' అని అర్థము. సె. 17 (2) వివిధ సంస్థలు బ్రాంచీలు, యూనిట్లుకు సంబంధించి, వ్యక్తి నిర్దేశము చేయవలసిన బాధ్యత కంపెనీపై విధించినది. అది ప్రజావిధి.

స్టేట్ Vs ఐ. కే. నంగియా
ఎ. ఐ. ఆర్. 1979 యస్. సి. 1977

నామ నిర్దేశించబడిన వ్యక్తిపైన మరియు, డైరక్టరు, మేనేజరు, సెక్రటరి మరి ఇతర అధికారిపై గూడ 17 [4] క్రింద నేరము మోపవచ్చును. అయితే అది అట్టి వ్యక్తి యొక్క అనుమతి, రహస్య సమ్మతితో జరిగినదని లేక అతని నిర్లక్ష్యం వల్ల జరిగినదనిగాని ప్రాసిక్యూషను నిరూపించవలెను.

ఎ. ఐ. ఆర్. 1979 యస్. సి. 1977.

సెక్షను **18** :- ఆస్తి జప్తు

ఈ శాసనము క్రింద గాని, నిబంధనల క్రింద గాని ఎవరైనా వ్యక్తిని దోషిగా నిర్ణయించినప్పుడు ఏ ఆహార వస్తువు గురించి,

ఉల్లంఘన జరిగినదో సదరు ఆహార వస్తువును ప్రభుత్వమునకు జప్తు చేయ వచ్చును.

అయితే, తదుపరి ప్రాసెసింగ్ ద్వారా ఆహార వస్తువును నిర్ణీత ప్రమాణముల కనుసారంగా చేయ వచ్చునని కోర్టుకు సంతృప్తి కలిగినచో—

నియమించబడిన అధికారి పర్యవేక్షణ క్రింద రిప్రాసెసింగ్ చేసిన తరువాత అమ్మబడునట్లుగా జామీనుదారులతోగాని, లేకుండగాని, బాండు వ్రాసి యిచ్చిన తర్వాత ఆహార వస్తువును సొంతదారుకు వాపసు యివ్వమని ఉత్తర్వు చేయవచ్చును.

సెక్షను క్రింద ప్రావిజో 1976 సవరణ చట్టం ద్వారా చేర్చ బడినది.

## సెక్షను 19 :-

ఈ శాసనము క్రింద అనుమతించబడిన, అనుమతించ బడని ప్రతివాదనలు :

1. కల్తీ పదార్థముగాని, మిస్‌బ్రాండెడ్ ఆహార వస్తువునకు గాని సంబంధించిన నేరారోపణలో, అమ్మకందారు తాను అమ్మిన పదార్థము యొక్క స్వభావము, నాణ్యత, తనకు తెలియదనిగాని, కొనుగోలుదారు పరీక్ష కొరకు కొన్న కారణంచేత నష్టపోలేదని గాని చేసే వాదన చెల్లదు.

2. (ఎ) i) అమ్మకమునకు లైసెన్సు అవసరమయిన సందర్భము లలో లైసెన్సు పొందిన తయారీదారు లేక, పంపిణీదారు లేక వ్యాపారి వద్దనుండి;

ii) ఇతర సందర్భములలో, ఏ తయారీదారు, పంపిణీదారు, వ్యాపారి వద్దనుండి అయినా నిర్ణీత నమూనాలో లిఖిత

పూర్వకమైన 'వారంటీ' తోనూ, తాను ఆహార వస్తువును కొన్నట్లుగాను; మరియు

(బి) ఆహార వస్తువు తన స్వాధీనములో ఉండగా సరిగ నిల్వ చేసినట్లుగాను, తాను ఏ స్థితిలోనైతే కొన్నాడో అదే స్థితిలో అమ్మినట్లుగాను, నిరూపించినచో, అమ్మకముదారు కల్తీ ఆహార పదార్థముగాని, మిస్ బ్రాండెడ్ ఆహార వస్తువునకు సంబంధించిన నేరము చేసినట్లుగా భావించబడరాదు.

3. సెక్షను 14లో ప్రస్తావించిన 'వారంటీ' ఇచ్చినట్లుగా చెప్పబడిన ఏ వ్యక్తి అయినా, విచారణ కాలములో హాజరగుటకు, సాక్ష్యం యిచ్చుటకు హక్కు కల్గియుండును.

## వ్యాఖ్య

మంగళదాస్ ఒక పసుపు బస్తా దర్యానోమల్‌కు అమ్మెను. ఫుడ్ ఇన్‌స్పెక్టరు దర్యానోమల్ నౌకరు అయిన కోడుమల్‌వద్ద శాంపిల్ తీసికోగా అదీ కల్తీ అని తేలినది. మంగళదాస్ తనకు ఆహార పదార్థము కల్తీ అని తెలియదని సె. 19 [1] ప్రకారము తనకు ఆహారపదార్థముయొక్క స్వభావము, పదార్థము, నాణ్యత గురించి తెలియదనే వాదన అమ్మకందారుకు మాత్రమే లభించదని, ఈ కేసులో ఎవరివద్ద నుంచి అయితే శాంపిల్ తీసికొనబడెనో ఆ వ్యక్తికి [కోడూమల్‌కు] మాత్రమే ఆ వాదన లభించదని, సె. 19 [1] పరిధిలో తాను అమ్మకందారు కాదని, ప్రాసిక్యూషను తనకు సంబంధించినంతవరకు 'అపరాధ చింత' నిరూపించవలెనని, మంగళదాస్ వాదించేడు. సుప్రీంకోర్టు ఈ వాదనను తిరస్కరించినది.

మంగళదాస్ రాఘవజీ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1965 యస్. సి, 128

అమ్మకందారు ఆహారవస్తువు లేక 'మిస్ బ్రాండెడ్' ఆహారమును తయారీ ధారు లేక పంపిణీదారు లేక వ్యాపారి వద్దనుండి నిర్ణీత నమూనాలో లిఖితపూర్వకమైన

వారంటీ క్రింద కొన్నట్లు నిరూపించినచో సె. 19 (2) ప్రకారం ప్రతివాదము లభించును. అతడు శిక్షార్హుడు కాదు.

ఓంప్రకాశ్ Vs సేట్ ఆఫ్ పంజాబ్
1982 (1) యఫ్. ఎ. సి. 23

రాజల్‌దాస్ గురునామల్ పంనాని Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 189

వారంటీ ఆహారవస్తువు కొన్నప్పుడే పొందవలెను. ప్రకటన వారంటీగా పరిగణింపబడదు.

నారాయణ్‌దాస్ Vs ఫుడ్ ఇన్‌స్పెక్టరు కోజికోడ్
1965 యం. యల్, జె. (క్రి) 224

ఫుడ్ యిన్‌స్పెక్టరు శాంపిల్ తీసికొన్నప్పుడే వారంటీ చూపలేదు. తరువాత లోకల్ అథారిటీకి చూపలేదు. విచారణలో వారంటీపై ఆధారపడిన వాదనఅంగీకారం కాదు.

బాలకృష్ణ మాతృమల్ Vs స్టేట్
1965 (1) క్రి లా జ. 77

సీలువేసిన టిన్నులలో పదార్థము అమ్మెను. ఇన్‌వాయిస్‌లో 'బెస్ట్‌బోరమ్' అని వ్రాసియుండెను. టిన్నులపై 'గుడ్' అని వ్రాసియుండెను. అది అంతయు గొప్పలు చెప్పుకొనుట—లిఖిత పూర్వకమైన వారంటీ లేనందువలన సె. 19 (2) క్రింది రక్షణ విక్రయదారుకు లభించదు.

మునిసిపల్ కార్పోరేషన్ ఢిల్లీ Vs టేక్‌చంద్ భాటియా
ఎ. ఐ. ఆర్. 1980 యస్. సి. 360

## సెక్షన్:- **20**

సెక్షను 14, 14–ఎ క్రింది నేరములు కానీ ఈ చట్టము క్రింది ఏ ఇతర నేరమునకైన, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములుగాని, ఆ ప్రభుత్వముల లేక ఈ విషయములో సాధారణ ఉత్తర్వు ద్వారా అధికారము

పొందిన అధికారి యొక్క లిఖిత పూర్వకమైన అనుమతి లేనిదే ప్రాసిక్యూషను చేయరాదు.

అయితే: సెక్షను 12లో ప్రస్తావించబడిన కొనుగోలుదారు, కోర్టు ద్వారా పబ్లిక్ ఎనలిస్టు యొక్క రిపోర్టు దాఖలు చేసినట్లయితే, ఈ చట్టము క్రింద నేరములకు ప్రాసిక్యూషను చేయవచ్చును.

2. మెట్రోపాలిటన్ మేజిస్ట్రేటు మొదటి తరగతి జుడిషియల్ మేజిస్ట్రేటు తక్కువయిన ఏ కోర్టు, ఈ చట్టం క్రింద నేరములను విచారణ చేయరాదు.

3. క్రిమినల్ ప్రొసిజరు కోడు 1973లో ఏమి ఉన్నప్పటికీ, ఈ చట్టంలోని సెక్షను 16 (1ఎ) క్రింది నేరం, పట్టుతగినది మరియు జామీను యివ్వరానిది.

## వ్యాఖ్య

ప్రాసిక్యూషన్ చేయుటకు అనుమతి ప్రత్యేక అధికారిపేరుతో ఇవ్వనక్కర లేదు. ఎ. ఐ. ఆర్. 1960 కేరళ 356, ఎ. ఐ. ఆర్. 1960 ఆం. ప్ర. 282.

ప్రతి ఒక కేసుకు ప్రత్యేకముగా అనుమతి అక్కరలేదు.

ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 1
1962 (1) క్రి. లా. జ. 166

క్రిమినల్ ప్రొసిజర్ కోడ్‌లో సెక్షను 197కు, ఈ సెక్షనుకు సారూప్యం లేదు. అక్కడ ఉపయోగించిన పదం 'శాంక్షను' ఈ సెక్షనులోని పదము 'అనుమతి' సె. 197 క్రి. ప్రొ. కో. క్రింద ప్రత్యేకించి ఒక కేసులో రికార్డుచూసి ఆలోచించి శాంక్షను ఇవ్వవలెను. ఈ చట్టము సెక్షను 20 క్రింద అట్టి ప్రసక్తిరాదు. ఈ సెక్షనులోని కంప్లైంట్ సంతకం చేసిన వ్యక్తికి అధికారము దత్తత చేయబడినదా లేదా అనేదే ప్రశ్న.

ధ్యాన్‌సింగ్ Vs మునిసిపల్ బోర్డు షహరాన్‌పూర్
ఎ. ఐ. ఆర్. 1970 యస్. సి. 318

[క్రిమినల్ ప్రొసిజర్ కోడ్ సెక్షన్ 4 (2) 1, సె. 26 ఈ సందర్భములో చదువుకొనదగును.]

సెక్షను 20 లో చెప్పబడిన రెండు షరతులలో యే ఒక్కటి తృప్తిపరుచ బడినా చాలును. అర్హుడైన అధికారి యొక్క లిఖిత పూర్వకమయిన సమ్మతి పొందిన తర్వాత అభియోగం సెక్షనులో చెప్పబడిన 4 తరగతులలోని వ్యక్తియే చేయనవసరంలేదు.

ఎ. ఐ. ఆర్. 1961 యస్. సి. 1

కార్పొరేషన్ కలకత్తా Vs మహమ్మద్ అమర్ ఆలీ

ఎ. ఐ. ఆర్. 1971 యస్. సి. 912

బాబూలాల్ హర్‌గోవిందదాస్ Vs స్టేట్ ఆఫ్ గుజరాత్

ఎ. ఐ. ఆర్. 1971 యస్. సి. 1277

1976 సవరణకు పూర్వం, 'కేంద్ర ప్రభుత్వము' లేక 'రాష్ట్రప్రభుత్వము' తర్వాత 'లోకల్ అథారిటీ' అను పదముండెడిది. లోకల్ అథారిటీచే అధికార మివ్వ బడిన అధికారియొక్క లిఖిత పూర్వక సమ్మతి పొందిన ఏ అధికారి అయినా కంప్లయింటు దాఖలు చేయుటకు అధికారం కలదు. ఈ అధికారం 1-4-76 తర్వాత లేదు, సమ్మతి యిచ్చుటకు ఇతర అధికార్లను నియమించు అధికారము ప్రభుత్వమే ఉంచుకొనెను.

1976 సవరణ తర్వాత ఒక అథారిటీ మొదటిసారిగా శాంక్షను యిచ్చుటకు అధికారం పొందగా, అంతకు పూర్వం వేరొక అథారిటీ అట్టి అధికారం పొంది ఉన్నాడనే కారణంచేత శాంక్షను చెల్లకపోదు. సె, 20 ప్రాసిక్యూషను మొదలు పెట్టుటకు సంబంధించినది. అభియోగముచేయు తేదీనిబట్టి పరిశీలించవలెను. కాని నేరం చేసిన తేదీ ఈ విషయములో అసంగతము.

స్టేట్ ఆఫ్ గుజరాత్ Vs కుతుబుద్దిన్

1981 క్రి. లా. జ. 908 [గుజరాత్.]

సాంక్షను ఆర్డరు సైక్లోస్టయిల్ ఫారంలో ఉండి ఖాళీలు ఒక సిరాలో, సంతకము వేరొక సిరాలో ఉన్నంతమాత్రాన, వేరే సాక్ష్యం లేనప్పుడు, శాంక్షను ఇచ్చు అధికారి కేసు అంశములను మనస్సు గురిచేసి శాంక్షను యివ్వలేదనుట సరికాదు.

కేసరి సింగు Vs స్టేట్ — 1981 క్రి. లా. జ. 488

శాంక్షను ఆర్డరు పైపు చేయబడిన ప్రోఫార్మాలో ఉండెను. ఆర్డరులో ఫుడ్ ఇన్‌స్పెక్టరు రిపోర్టులో జత చేసిన కాగితములు పరిశీలించినట్లు ఉదహరించబడెను. శాంక్షను ఆర్డరు చెల్లదను వాదన తిరస్కరించబడెను.

1980 (1) యఫ్. ఎ. సి. 198

శాంక్షను ఆర్డరులో తప్పులున్నప్పుడు, మనస్సు గురిచేయలేదని భావించ వచ్చును. ఉదా. శాంపిలు ప్యాకెట్టులలో తీసికొనగా, శాంపిల్ సీసా అని ఉద హరించుట.

లక్ష్మణ్‌సింగ్ Vs స్టేట్ ఆఫ్ యు. పి. 1979 క్రి. లా. జ. 1 (యన్. ఒ. సి.)

కంప్లయింటు దాఖలుచేసిన వ్యక్తి, ఫుడ్ యిన్‌స్పెక్టరుగా చట్టప్రకారము నియమింపబడపోయినప్పటికి, సెక్షను 20 లోని షరతులు కనుకూలముగా ఉన్న ప్పుడు ప్రాసిక్యూషను త్రోసివేయుట తగదు.

స్టేట్ ఆఫ్ గుజరాత్ Vs నట్వరలాల్. 1978 క్రి. లా. జ. 1518

ఫుడ్ ఇన్‌స్పెక్టరు, మునిసిపల్ బోర్డు అనుమతితో కంప్లయింటు దాఖలు చేసి నప్పుడు మునిసిపల్ బోర్డు దాఖలు చేసిన అపీలు చెల్లును.

మునిసిపల్ బోర్డు Vs రాజారామ్
1977 క్రి. లా. జ. 122 (అలహాబాదు)

న్యాయ సమ్మతమైన శాంక్షను సమ్మతి లేనప్పుడు, కోర్టు కేసు విచారణ చేపట్టుట న్యాయ విరుద్ధము. సరియైన సమ్మతి, అధికారం లేక శాంక్షను పొంది క్రొత్తగా అభియోగము దాఖలు చేయవచ్చును.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము జి. ఓ. 656 మెడికల్ హెల్త్ ది. 22-6-77 లో గవర్నమెంటు ఉద్యోగి మరియు డిప్యూటేషనుపై ఉన్న గవర్నమెంటు ఉద్యోగిపై కాకుండ, యే యితర వ్యక్తి పై అయినా, ఈ శాసనము క్రింద కంప్లయింటు దాఖలు చేయుటకు సమ్మతి యిచ్చుటకు, ఈ చట్టము క్రింద నియమించబడిన ఫుడ్ ఇన్‌స్పెక్టర్లందరకీ అధికారమిచ్చినది

జీవిత ఖైదు శిక్షగా నిర్దేశించబడిన [సెక్షను 16] 1-ఎ (i) ప్రావిసో 16 (1-ఎ (ii) ప్రావిసో, 16 (1-బి) క్రింద నేరములు మేజిస్ట్రేటు, సెషన్సు కోర్టుకు కమిట్ చేయవలెను.

కాలపరిమితి :-

ఈ శాసనము క్రింద ప్రత్యేకముగా లిమిటేషను విషయం ప్రస్తావించబడ లేదు. కాని క్రిమినల్ ప్రొసిజరు కోడు సె. 468 ప్రకారము, కాలపరిమితి నిర్ణయించవలెను.

ఉదా : సె. 16 (1 ఎఎ) క్రింది నేరములకు 3 సంవత్సరములలోగా ప్రాసిక్యూషను దాఖలు చేయవలెను.

సెక్షను 20 — ఎ :—

తయారీదారు వగైరాల పై కేసు నడుపుటకు కోర్టు యొక్క అధికారము :—

తయారీదారు, పంపిణీదారు, వ్యాపారి కాని వానిపై ఈ చట్టము క్రింద నేరము చేసినట్లుగా ఆరోపణ చేసినప్పుడు విచారణ మధ్యలో ఎప్పుడైనా కోర్టు ఎదుట ఉంచబడిన సాక్ష్యంపై తయారీదారు, పంపిణీదారు, లేక వ్యాపారికి గూడ నేరంలో భాగముందని కోర్టు తృప్తి పడినచో, క్రిమినల్ ప్రొసిజరు కోడు సెక్షను 319 (3) లేక ఈ చట్టము సెక్షను 20 లో, ఏమి వ్రాసి యున్నప్పటికి, మొదట నుండే సెక్షను 20 క్రింద అట్టి వ్యక్తిపై కూడ ప్రాసిక్యూషను మొదలు పెట్టినట్టుగానే, కేసు నడుపవచ్చును.

## వ్యాఖ్య

విచారణ మధ్యలో చేర్చబడిన ముద్దాయిని గూర్చి సె. 20 క్రింద అనుమతి అక్కరలేదు, నిజమైన నేరస్తులను గూడ కేసులో కలపడానికి కోర్టుకు అధికారము కలిగించడము ఈ సెక్షను యొక్క ముఖ్యోద్దేశ్యము.

భగవాన్‌దాస్ జగదీశ్ చందర్ Vs ఢిల్లీ అడ్మినిస్ట్రేషన్
ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 1309

ఈ సెక్షను యొక్క భావము: తయారీదారు, పంపిణీదారులను మొదటనే అమ్మకము దార్లతో కలిపి ప్రాసిక్యూట్ చేయకూడదని కాదు. మొదటనే వారినికూడ కలిపే కేసు పెట్టవచ్చును. ఈ సెక్షను యొక్క పూర్తి ఉద్దేశ్యము, పరిమితి భగవాన్ దాస్ కేసులో సుప్రీంకోర్టుచే వివరముగా చర్చించబడినది.

సెక్షను 20 ఎ ఎ :-

ప్రొబేషన్ ఆఫ్ అఫెండర్సు యాక్టు 1958 మరియు క్రిమినల్ ప్రొసిజరు కోడు సె. 360 యొక్క వర్తింపు :-

ఈ చట్టము క్రింద నేరము చేసిన వ్యక్తి 18 సం. ల లోపు వయస్సు వాడు అయి ఉంటే తప్ప ప్రొబేషన్ ఆఫ్ అఫెండర్స్ ఆక్టు లోని అంశములు గాని, క్రిమినల్ ప్రొసీజరు కోడ్ సె. 360 గాని వర్తించదు.

<u>వ్యాఖ్య</u>

ఆధునిక ఆలోచనలు నేరస్థుని సాధారణ వ్యక్తిగా మార్చడానికి ప్రయత్నించే లక్ష్యం వైపుగా పయనిస్తున్నా, ఆహార కల్తీ నేరములు ఘోరమైన నేరములుగా పరిగణించి, ఈ నేరస్తులకు ప్రొబేషను చట్టము యొక్క సదుపాయములు లేకుండ చేయబడింది. దాదాపు 20 సంవత్సరములు ఈ శాసనము అమలు పర్చడంలోని అనుభవము పురస్కరించుకొని, ఈ నేరస్తుల మనఃప్రవృత్తి మార్చడం సాధ్యం కాదని నిర్ణయించి 1976 లో ఈ సెక్షను ప్రవేశ పెట్టబడింది. 1976 కు ముందు కూడ సుప్రీంకోర్టు పలుమార్లు ఈ శాసనము క్రింది నేరస్తులకు ప్రొబేషను చట్టముల లాభములను ఇవ్వడానికి నిరాకరించినది.

ఈశ్వరదాస్ Vs స్టేట్ ఆఫ్ పంజాబ్
ఎ. ఐ. ఆర్. 1972 యస్. సి. 1295

ప్యారీలాల్ తేజనాని Vs యం. ఆర్. డాంగే,
ఎ. ఐ. ఆర్. 1974 యస్. సి. 228

## సెక్షను 21 :-

అధికమైన శిక్షలు విధించుటకు మేజిస్ట్రేటుకు అధికారము :-

క్రిమినల్ ప్రొసిజరు కోడు 1973 సెక్షను 29లో ఏమి ఉన్నప్పటికీ, తన అధికారమున కంటే ఎక్కువగా, జీవిత ఖైదు గాని, లేక 6 సం లకు మించని శిక్ష కాకుండా, ఈ శాసనము క్రింద నిర్దేశించ బడిన ఏ శిక్ష అయిన, జుడిషియల్ మొదటి తరగతి మేజిస్ట్రేటు గాని, మెట్రోపాలిటన్ మేజిస్ట్రేటు గాని విధించవచ్చును.

## సెక్షను 22 :- సదుద్దేశ్యముతో చేసిన పనులకు రక్షణ :-

ఈ శాసనము క్రింద భావించి సదుద్దేశ్యముతో చేసినట్టి ఏ పని కారణంగానైనా ఏ వ్యక్తిపైన ఎటువంటి దావా, క్రిమినల్ కేసు మరి ఏ యితరమైన న్యాయ వ్యవహారము నడుప వీలులేదు.

సె. 52 ఐ. పి. సి. ప్రకారం, తగు జాగ్రత్త, శ్రద్ధ లేకుండ చేసిన పని, సదుద్దేశ్యంతో చేసిన పని అనబడదు.

## సెక్షను 22. ఎ :-

కేంద్ర ప్రభుత్వము యొక్క సూచనలిచ్చు అధికారము :-

ఈ శాసనములోని ఏదైనా కొన్ని సెక్షనులు లేక అన్ని సెక్షనుల నమలు పర్చుటకు తమకు అవసరమని భావించినట్టి సూచనలను రాష్ట్ర ప్రభుత్వమునకివ్వ వచ్చును. రాష్ట్ర ప్రభుత్వము ఆ సూచనలను తప్పక పాటించవలెను.

## సెక్షను 23 :-

కేంద్ర ప్రభుత్వముయొక్క నియమములుచేయు అధికారము :-

కేంద్ర ప్రభుత్వము ఈ శాసనము అమలు పరచుటకు, కమిటీని

సంప్రదించిన తర్వాత, రాజపత్రములో నోటిఫికేషను ముందుగా ప్రకటించిన తరువాత, రూల్సు చేయవచ్చును.

అయితే అట్టి సంప్రతింపు లేకుండానే రూలు చేయవల్సిన అవసర పరిస్థితులు ఏర్పడినవని భావించినచో, కేంద్ర ప్రభుత్వము అట్టి సంప్రతింపు చేయనవసరము లేదు. కాని అటువంటి సందర్భములలో రూల్సు చేసిన ఆరు నెలలో కమిటీని సంప్రదింపవలెను. మరియు కమిటీ సదరు నియమములకు సవరణ గురించి ఇచ్చే సలహాలను పరిగణించవలెను.

1-A ప్రత్యేకముగా, పై చెప్పబడిన సాధారణాధికారములకు భంగము లేకుండా, సదరు నిబంధనలు క్రింది విషయముల గురించి చేయవచ్చును.

(ఎ) దిగుమతి చేసుకొనుటకు లైసెన్సు కావలసిన ఆహార వస్తువులను, ఆహార వస్తువుల తరగతులను, అట్టి లైసెన్సు నమూనా మరియు షరతులను, లైసెన్సు ఇచ్చు అధికారిని, అందుకు కట్టవలసిన రుసుము, లైసెన్సులోని కండిషనుల అమలు పర్చుటకు సెక్యూరిటీగా కట్టవలసిన మొత్తము మరియు లైసెన్సు లేక సెక్యూరిటీ రద్దు చేయు లేక జప్తు చేయు సందర్భములను ఉదహరించుట.

(బి) ఆహారము యొక్క నాణ్యత, పరిమాణములు నిర్ణయించుట, మరియు ఏ ఆహార వస్తువునకైనా పరిమాణముల వ్యత్యాసములకు పరిమితి నిర్ణయించుట.

(సి) ఒక తరగతికి చెందిన ఒక ఆహార వస్తువు లేక ఆహార వస్తువుల, తయారీ పంపిణీ, అమ్మకములకు సంబంధించిన పనివారల ఆరోగ్యము రక్షించుటకు సదరు ఆవరణలను పరిశుభ్రముగా ఉంచుటకు తయారీ జరుగు ఆవరణల రిజిస్ట్రేషనులతో సహా,

కేంద్ర ప్రభుత్వము ఈ విషయము గురించి రాజపత్రములో ప్రకటన ద్వారా ఉదహరించబడిన ఆహారములు లేక ఆహార వస్తువుల తరగతుల తయారీ, పంపిణీ, అమ్మకములపై కఠినమైన కంట్రోలు విధించుటకు ప్రత్యేక సూత్రములు నిర్దేశించుట,

(డి) ప్రజలు లేక కొనుగోలుదారు ఆహారవస్తువు యొక్క స్వభావము నాణ్యత, పరిమాణముల గురించి మోసపోకుండ తప్పు దారిని బడకుండా, నిరోధించవలెననే ఉద్దేశ్యముతో, ఆహార వస్తువుల ప్యాకింగులను, వానిపై వేయు లేబిల్సును ప్యాకేజి లేక లేబిల్ యొక్క డిజైనులను పరిమితము చేయుట.

(ఇ) ఫుడ్ ఇన్స్పెక్టర్ల పబ్లిక్ ఎనలిస్టుల అర్హతలు, అధికార ములు, బాధ్యతలు నిర్వచించుట,

(ఇ ఇ) ఈ చట్టము క్రింద పబ్లిక్ ఎనలిస్టులచే ఆహార వస్తువుల శాంపిల్సును విశ్లేషణము చేయు లేబొరెటరీలను నిర్వచించుట,

(యఫ్) ఆహారముగా ఉపయోగించినచో ఆరోగ్యమునకు భంగము కల్గించే పదార్థము యొక్క అమ్మకము నిషేధించుట, లేక అమ్మకమునకు నిబంధనలను నిర్వచించుట లేక సదరు పదార్థములను ఏ ఆహార పదార్థములోనైనా భాగముగా వాడుటను ఏ విధంగానైనా పరిమితము చేయుట; లేక ఆహార పదార్థము యొక్క తయారీ అమ్మకములను లైసెన్సులు యిచ్చుట ద్వారా క్రమబద్ధము చేయుట.

(జి) ప్రజారోగ్యము దృష్ట్యా ఏ ఆహార పదార్థమునకయినా అమ్మకమునకు నిబంధనలు నిర్ణయించుట లేక అమ్మకము లైసెన్సుకు నిబంధనలను నిర్వచించుట,

(హెచ్) విశ్లేషణము కొరకు కొన్న ఆహార పదార్థముల శాంపిల్ యొక్క పాత్రలు లేక పాకెట్లను సీలు చేయు, కట్టు విధానములను నిర్దేశించుట,

(హెచ్ హెచ్) విశ్లేషణ విధానముల నిర్వచించుట,

(ఐ) పండ్లు, కూరగాయలు, లేక వానిచే తయారయిన ఆహారములలో ఉప్పు, చక్కెర కాక, యితర రక్షణ కొరకు వాడ దగిన పరిరక్షక పదార్థముల పట్టికను, అట్టి పరిరక్షక పదార్థముల గరిష్ట పరిమితులను, నిర్వచించుట,

(జె) ఏ ఆహారములలోనైనా వాడదగిన రంగు పదార్థములను, వాని గరిష్ట పరిమితులను నిర్వచించుట,

(కె) ఏ ఆహారములకైనా ఆహార పదార్థముల తరగతికైనా, ఏవైనా ఉదహరించబడిన నిబంధనలకు లోబడి ఈ శాసన పరిధిలో నుండి లేక ఈ శాసనములోని కొన్ని నిబంధనల పరిధిలో నుండి మినహాయింపు చేయుట,

(యల్) ఆహారములలో కల్తీ చేయుటకు ఉపయోగించు పదార్థముగా తెలిసికొనబడిన ఏ పదార్థమునకైనా తయారీ రవాణా అమ్మకము నిషేధించుట లేక రెగ్యులేటు చేయుట,

(యం) (i) ఏ ఆహార పదార్థములకైనా నీరు, లేక పలుచన చేయుటకు లేక కల్తీ చేయుటకు ఇతర పదార్థములు కలుపుట,

(ii) ఆహార పదార్థములోనుండి దాని యొక్క ఏదేని అంతర్గత పదార్థములను తీసి వేయుట.

(iii) అట్లు కలిపిన లేక తీసివేయబడిన ఆహార పదార్థము లేక ఇతర విధముగా అస్వాభావికంగా తయారు చేయబడిన ఆహార పదార్థము యొక్క అమ్మకము,

సారూప్యమైన, స్వభావము లేక ఆకారము కలిగిన రెండు లేక ఎక్కువ ఆహారపదార్థములను కలుపుట,

నిషేధించుట, లేక క్రమబద్ధము చేయుట

(యన్) ఈ చట్ట ప్రకారము లేక దీని క్రింద చేయబడిన నియమముల కనుసారముగా లేని ఆహార పదార్థములను నాశనము చేయుటకు ఏర్పాటు చేయుట,

(2) ఈ శాసనము క్రింద కేంద్ర ప్రభుత్వము చేయబడిన ప్రతి నియమము చేయబడిన తరువాత ఒకటిగాని రెండు సెషన్స్ కలిసి గాని 30 రోజులు సెషన్సులో ఉన్నప్పుడు, సాధ్యమైనంత త్వరగా, పార్లమెంటు ఉభయశాసన సభల ముందు ఉంచబడవలెను. మరియు ఆ సెషన్సులో గాని, తర్వాతి సెషన్సులో గాని ఉభయ సభలు, నియమమునకు ఏదైన మార్పుచేయవలెనని లేక ఆ నియమము చేయరాదనిగాని, అంగీకరించినచో, ఆ తర్వాత సదరు నియమము, సందర్భాను సారముగా అట్టి మార్పుచేసిన పద్ధతిలోనే చెలామణి అగును, లేక రద్దగును.

అయినప్పటికి, సదరు మార్పు, రద్దు అంతకుముందు సదరు నియమము ప్రకారము చేసిన ఏ పనియొక్కయినా క్రమబద్ధతను భంగము కలుగ చేయదు.

## వ్యాఖ్య

ఈ సెక్షను క్రింది అధికారములను పురస్కరించుకొని కేంద్ర ప్రభుత్వము ఆహార పదార్థముల కల్తీ నివారణ నియమావళి 1955 చేసినది. సదరు నియమములు **1-12-56** నుండి అమలులోకి వచ్చినవి.

ఈ నియమావళికి పలుమార్లు సవరణలు చేయబడినవి.

## సెక్షను **24** :-

నియమములు చేయుటలో రాష్ట్ర ప్రభుత్వఅధికారములు :-

(1) సెక్షను 23 పరిధిలోనికి రానట్టి విషయములలో, ఈ శాసనమునమలు పరచుటకు కమిటీని సంప్రదించి, మరియు

ముందుగా ప్రకటన చేసి, రాష్ట్ర ప్రభుత్వము నియమములు రూపొందించ వచ్చును.

(2) పై చెప్పబడిన సాధారణ అధికారమునకు భంగము లేకుండా ప్రత్యేకముగా సదరు నియమావళి—

(ఎ) ఈ శాసనము క్రింద, ఫుడ్ (హెల్త్) అథారిటీ, లోకల్ అథారిటీ, మరియు లోకల్ హెల్త్ అథారిటీల యొక్క అధికారములను, బాధ్యతలను నిర్వచించ వచ్చును.

(బి) ఆహార పదార్థముల, లేక ప్రత్యేకమయిన ఆహారముల లేక ఒక తరగతికి చెందిన ఆహార పదార్థముల అమ్మకమునకు, తయారీ, నిల్వ, అమ్మకం, పంపిణీలకు లైసెన్సుల నమూనాలు, లైసెన్సు పొందుటకు దరఖాస్తుల నమూనాలు, సదరు లైసెన్సు యిచ్చుటలో లోబడి ఉండవలసిన షరతులు అవి యిచ్చు అధికారులు, అందుకు కట్టవలసిన రుసుము, లైసెన్సు షరతులు అమలు పరచుటకు కట్టవలసిన సెక్యూరిటీ డిపాజిట్లు

సదరు లైసెన్సు తాత్కాలికముగా, పర్మినెంటుగా, రద్దు చేయు సెక్యూరిటీలు జప్తు చేయు పరిస్థితులు నిర్ణయించ వచ్చును.

(సి) ఆహార విశ్లేషణమునకు, లేక ఈ చట్టము క్రింద రుసుము విధించ తగిన ఏ యితర విషయములోనైనా రుసుము కట్టుటకు ఉత్తర్వు చేయ వచ్చును.

(డి) ఈ చట్టం క్రింద విధించ బడిన జరిమానా వసూలయిన తరువాత మొత్తం కాని, కొంత భాగం కాని లోకల్ అథారిటీకి చెల్లించ వలెనని ఉత్తర్వు చేయ వచ్చును.

(ఇ) ఈ చట్టము ద్వారా రాష్ట్ర ప్రభుత్వమునకు గాని ఫుడ్ (హెల్త్) అథారిటీకి గాని సంక్రమించిన అధికారములను, క్రింది అధికారులకుగాని, లోకల్ అథారిటీలకుగాని, అప్పగించ వచ్చును.

(3) రాష్ట్ర ప్రభుత్వములు ఈ చట్టము క్రింద చేసిన నియమములన్నిటిని సాధ్యమైనంత త్వరగా సంబంధించిన రాష్ట్ర శాసన సభల ముందుంచ వలెను.

ఈ సెక్షను క్రింద అధికారములను పురస్కరించుకొని ఆంధ్ర ప్రదేశ్ ఆహార కల్తీ నివారణ నియమావళి 1957, జి. ఒ. యం. యస్ నం. 597 పబ్లిక్ హెల్త్ తేది. 20-3-1959 ద్వారా చేయబడినది.

సెక్షను **25** :-

ఈ శాసనము అమలులోనికి వచ్చునాటికి ఈ శాసనము వర్తించు ఏ రాష్ట్రములోనైనా ఈ సంబంధమైన ఏదేని చట్టమున్నచో, ఈ శాసనము అమలులోనికి రాగానే సదరు చట్టము రద్దగును.

2. ఈ శాసనము వలన తత్సంబంధమైన శాసనము యొక్క రద్దుతో నిమిత్తము లేకుండ ఈ శాసనము అమలు రాకముందు అమలులో నున్న, అన్ని ఆహార కల్తీ నిరోధక నియమములు, రెగ్యులేషన్‌లు, బైలాలు ఈ శాసనములోని నిబంధనలకు భిన్నముగా వ్యతిరేకముగా నుండనంతవరకు తప్ప, ఈ శాసనము క్రింద చేయబడిన నియమముల ద్వారా మార్పు, సవరణ లేక రద్దుచేసేవరకు అమలులో ఉండును.

3. (ఎ) ఈ సెక్షనులో ఈ శాసనము యొక్క అమలు మొదలు యొక్క ప్రస్తావన, ఆహార కల్తీ నివారణ (సవరణ) చట్టము 1971 యొక్క మొదలుకు ప్రస్తావనగా పరిగణించవలెను.

(బి) అనుమాన నివృత్తికై, సబ్ సెక్షను (2) లోని అంశములు, జమ్ము, కాశ్మీరులో తదనుగుణమైన చట్టము యొక్క రద్దుకు గూడ వర్తించు జనరల్ క్లాజెస్ యాక్టు 1897 యొక్క సె. 60 నకు భంగము కాకుండా, అని ఇందుమూలముగా వివరించడమైనది.



# అంశానుక్రమసూచి




అపరాధచింత 47,125
అన్వయసూత్రము 36
అహితమయిన 36
అమ్మకం, నిర్వచనము 36
అమ్మకమునకు తయారీ 47
అమ్మకమునకు నిల్వ 32
——, విశ్లేషణ కొరకు 33
అనుమతి 157
అప్పీలు 147
ఆవరణ 30
ఆహారముల అమ్మకం 32, 43
—— దిగుమతి 41
ఆహారము, నిర్వచనము 20
ఆహారములు 22
—— గా ఉపయోగించు ఉద్దేశ్యము 22
ఎగుమతి కొరకు నిల్వ 136
కమిటీ 20, 36
కల్తీ చేయు పదార్థము 5
కల్తీ చేయబడిన, 5
కల్తీ ఆహారం, అమ్మకం 43
—— తయారీ, నిల్వ 43
కస్టమ్స్ అధికారులు 43
కంపెనీ, జవాబు దారి 108
—— నేరములు 149
—— డైరెక్టరు బాధ్యత 153
—— నామనిర్దేశము 154
కేంద్ర ఆహార పరిశోధనశాల
—— స్థాపన 39
—— నిర్వచనము 20
—— విధులు 46
—— సర్టిఫికేటు 90, 107
—— డైరెక్టరు నియామకం 20
కేంద్ర ప్రభుత్వం
—— అధికార ప్రధానము 163
—— చేయబడిన నియమములు 167
—— సూచనలిచ్చు అధికారము 163
కొనుగోలుదారు విశ్లేషణ చేయించుట 88
కోరిన పదార్థము స్వభావము 9
చట్టము అమలు తేది 2
—— అన్వయం 2

— రాజ్యాంగ బద్ధత 4
సవరణ చట్టములు 2
జవాబుదారీ, నౌకరు 45, 127
—, యజమాని 45, 126
—, కంపెనీ 108
—, భాగస్వామి 46, 127, 154
—, కో ఆపరేటివ్ సంస్థ 128
తయారీదారుపై కేసు నడుపుట 161
నామనిర్దేశము 150
న్యాయస్థానము, విచక్షణాధికారం 136
నిల్వ, అమ్మకం కొరకు 47
- , ఎగుమతి కొరకు 136
నిర్వచనములు 5
పబ్లిక్ ఎనలిస్టు, నియామకము 52
— నివేదిక 53,89
— నివేదికలో అంశములు 94
— సహాయకులచే విశ్లేషణం 95
—, చే విశ్లేషణలో ఆలస్యం 98
—, ను సాక్షిగా విచారించుట 108
ప్రతివాదనలు 155
ప్రత్యామ్నాయ వాబుదారీ 45
ప్రమాణములు 16
- , నిర్ణయించబడనిచో 18
ప్రమాణము లేక ప్రమాణములు 18
ప్రమాణముల కేంద్ర కమిటీ 36
ప్యాకేజీ, నిర్వచనము 30
ప్రభుత్వము, కేంద్ర 163
- , రాష్ట్ర 167
ప్రాథమిక ఆహారము 31
పురుగులు, కీటకములు 14
ప్రొబేషను చట్టం, వర్తింపు 162
మిస్ బ్రాండెడ్ 27, 50
ముద్దా యస్టేటుమెంటు 146
—కి నోటీసు 76
మూల్యం చెల్లింపు, శాంపిల్ యొక్క, 63
మేజిస్ట్రేటు-అధికారములు 163
—విచక్షణాధికారము 136
— సంక్షిప్తవిచారణ 148
యజమాని బాధ్యత 45, 126
రుజువు 22
లోకల్ అథారిటీ 26
లోకల్ హెల్తు అథారిటీ 27
వారంటి 108
—నమూనా 110
విక్రయము 48, 133
విక్రయదారుని ప్రకటన 24, 134
విక్రయదారు, శాంపిల్ కేంద్ర ఆహార పరిశోధనశాలకు పంపుకొనుహక్కు 103
—, దరఖాస్తు పెట్టనిచో 106
—, చే రెండవ దరఖాస్తు 108
విశ్లేషణము 52
—కొరకు అమ్ముట 33
—కొరకు శాంపిలుతీయు విధానము 70, 77
—పంపు విధానము 70, 81
— నివేదిక 89
— పబ్లిక్ ఎనలిస్టుచే 89
—సహాయకునిచే 95

— తేదీ 95

— నిరూపణ 96

— లో ఆలస్యం 98

— రెండవ 105

విషాహార కేసులు 112

శాంపిలు, నిర్వచనము 35

—పరిమాణము 81

—తీసికొను విధానము 77

—ఇచ్చుటకు తిరస్కరణ 76

—వెల చెల్లింపు 34

— , విశ్లేషణకొరకుపంపువిధానము 81

శిక్షలు 113

శిక్షలపట్టిక 123

— , జీవితఖైదు 120

— , కనిష్ఠపరిమితి 122

— , కనికరము 130

సదుద్దేశ్యము, రక్షణ 163

స్వంత ఉపయోగము 33

ఫుడ్ ఇన్‌స్పెక్టరు-అధికారములు 57

— నియామకము 54

— నియామకముల ప్రకటన 56

— నియామకముల క్రమబద్ధత 57

— శాంపిల్ తీసికొను అధికారము 63

— ప్రవేశ హక్కు 63

— సోదా చేయు అధికారము 64

— జప్తు చేయు అధికారము 64

— అరెస్టు చేయు అధికారము 69

— అధికార దుర్వినియోగము 68

— సాక్ష్యము 68

— సాక్షులను పిలుచుట 66

— అనుసరించవలసిన విధానము 70

— శాంపిల్ తీసికొను విధానము 77

— విక్రయదారుకు తెలియబర్చుట 76

— ను అడ్డగించుట 140

ఫుడ్ హెల్తు అథారిటీ 25


—o—

# ఆహార కల్తీ నివారణ

# నియమావళి

# 1955

# ఆహార కల్తీ నివారణ నియమావళి 1955

## భాగము - 1.

### ప్రారంభిక

1. 1) సంగ్రహ నామము, పరిధి, ప్రారంభము :- ఈ నియమములు ఆహార కల్తీ నివారణ నియమావళి, 1955 అని పిలువబడును.

2) అవి భారత దేశమంతటా వర్తించును.

3) భాగము iii, అనుబంధము 'బి' ఐటం ఎ-12 మార్గరీన్, భాగము vi, మరియు భాగము vii తప్ప మిగతా నియమములు, రాజపత్రములలో ప్రకటించిన తేదినుండి అమలులోకి వచ్చును. భాగం iii అనుబంధం-బి ఐటం 12-మార్గరీన్ 1 జులై 1956 తేదీనుండి, భాగం vi, vii లోని నియమములు 1 డిశెంబరు 1956 తేదినుండి అమలులోకి వచ్చును.

2. నిర్వచనములు :

ఎ. 'చట్టం', అనగా ఆహార కల్తీ నివారణ చట్టం (1954 యొక్క-37)

బి. 'డైరెక్టర్' అనగా పరిశోధనశాల యొక్క డైరెక్టరు

సి. 'పరిశోధనశాల' అనగా కేంద్ర ఆహార పరిశోధనశాల

డి. 'ఫారం' అనగా ఈ నియమావళికి అనుబంధంలో వివరించబడిన నమూనా

ఇ. 'లోకల్ అథారిటి' అనగా

i. సముద్ర రేవుల విషయంలో, రేవుల అధికార పరిధిలోని స్థానిక ప్రదేశమునకు సంబంధించి, భారత రేవుల ఆరోగ్య సూత్రములు, 1955 లో నిర్వచించబడిన హెల్త్ ఆఫీసరు.

ii. విమానాశ్రయముల విషయంలో, విమానాశ్రయ అధికార పరిధిలోని స్థానిక ప్రదేశమునకు సంబంధించిన, భారత విమానముల (ప్రజారోగ్య) సూత్రములు, 1954 లో నిర్వచించబడిన హెల్త్ ఆఫీసరు.

iii. రైల్వేస్టేషనుల లేక రైల్వేస్టేషన్‌ల సముదాయము, (రైల్వే కాలనీ, ఆఫీసు, యార్డు, గూడ్సు షెడ్లు, ట్రాన్‌షిప్‌మెంట్ షెడ్, వర్క్‌షాపు, రైల్వేల కొరకు లేక రైల్వేలకు సంబంధించి, రైల్వే అడ్మినిస్ట్రేషన్ చే నడపబడుచున్న ఇతర పనులతో సహా)ల విషయములో, సదరు రైల్వేస్టేషను లేక రైల్వేస్టేషనుల సముదాయము యొక్క అధికార పరిధిలోని స్థానిక ప్రదేశమునకు సంబంధించిన రైల్వే మెడికల్ ఆఫీసర్ లేక డివిజనల్ మెడికల్ ఆఫీసర్.

## భాగము II

## కేంద్ర ఆహార పరిశోధనశాల

3. విధులు :—

1) చట్టంలో పరిశోధనశాలకు అప్పగించబడిన విధులకు అదనంగా ఈ క్రింది విధులను నిర్వర్తించవలెను. అనగా—

ఎ. కేంద్ర ప్రభుత్వముచే అధికార మీయబడిన అధికారి లేక ప్రాధికారిచే పంపబడిన శాంపిళ్ళయొక్క విశ్లేషణం

మరియు సంబంధించిన అధికార్లకు విశేషణ ధృవపత్ర సమర్పణ.

బి. ఏ ఆహారపదార్థమునకైనా ప్రమాణములు నిర్ణయించుట కొరకు పరిశోధన.

సి. వివిధ రాష్ట్రములలోని పబ్లిక్ ఎనలిస్టులు, పరిశోధన శాలలు ఇందుకొరకై కేంద్రప్రభుత్వం ఆమోదించినట్టి ఇతర పరిశోధనశాలలు మరియు సంస్థల సహకారంతో విశ్లేషణ పద్ధతుల ప్రమాణీకరముకొరకు పరిశోధన.

(2) క్రింది పట్టికలో కాలం (1) లో పేర్కొనబడిన పరిశోధన శాల దాని కాలం 2 లో 'కు సంబంధిత నమోదులో పేర్కొనబడిన 'లోకల్ ఏరియాకు సంబంధించి దానికి చట్టం లేక ఈ నియమావళి క్రింద వప్పగించబడిన విధులను నిర్వర్తించవలెను.

పట్టిక - 1

| కేంద్ర ఆహార పరిశోధనశాల పేరు | 'లోకల్ ఏరియా' |
|---|---|
| 1. కేంద్ర పరిశోధనశాల, కలకత్తా 700016 | అస్సాం, బీహారు, జమ్ము, కాశ్మీర్, మణిపూర్, మేఘాలయ, నాగలాండ్, ఒరిస్సా. రాజస్థాన్, సిక్కిం, త్రిపుర మరియు ఉత్తర ప్రదేశ్ రాష్ట్రములు, మరియు కేంద్రపాలిత ప్రాంతములైన అండమాన్ నికోబార్ దీవులు అరుణాచల్ ప్రదేశ్ మరియు మిజోరామ్. |
| 2, కేంద్ర పరిశోధనశాల, ఘాజియాబాద్ 201001 | గుజరాత్, మధ్యప్రదేశ్, మరియు మహా రాష్ట్ర రాష్ట్రములు మరియు పాండిచేరి కేంద్ర పాలిత ప్రాంతములు. |

3. కేంద్ర పరిశోధనశాల, మైసూరు 570013 — హర్యానా హిమాచల్ ప్రదేశ్ మరియు పంజాబ్ రాష్ట్రములు మరియు కేంద్ర పాలిత ప్రాంతములయిన చండీగర్ మరియు ఢిల్లీ.

4. కేంద్ర పరిశోధనశాల, పూణె 411001 — ఆంధ్రప్రదేశ్, కేరళ, కర్నాటక, తమిళ నాడు మరియు పశ్చిమ బెంగాల్ రాష్ట్రములు మరియు కేంద్ర పాలిత ప్రాంతములు, గోవా, డయ్యూ, డామన్, దాద్రా మరియు నాగర్ హవేలీ, మరియు లక్ష్య దీవములు.

అయితే, పట్టిక – 2 లో పేర్కొనబడిన పరిశోధనశాల, దాని కాలం (2) లో సంబంధిత నమోదులో పేర్కొనబడిన లోకల్ ఏరియాలకు సంబంధించి చట్టం 16 సబ్ సెక్షన్ 2 క్రింద అందిన శాంపిళ్ళను విశ్లేషణం కూడ చేయవలయును.

పట్టిక – 2

| కేంద్ర ఆహార పరిశోధనశాల పేరు | లోకల్ ఏరియా |
|---|---|
| 1 | 2 |
| 1. కేంద్ర ఆహార పరిశోధనశాల కలకత్తా 700016 | కలకత్తా, పరదీప్, విశాఖపట్నం, ఓడ రేవులు పోర్టు బ్లెర్ మరియు కలకత్తా విమానాశ్రయం మరియు ఎయిర్‌కార్గో కాంప్లెక్స్, కలకత్తా. |
| 2. కేంద్ర ఆహార పరిశోధనశాల ఘాజియాబాద్ 201001 | ఢిల్లీ అట్టారీ సరిహద్దు, అమృత్‌సర్ విమానాశ్రయం. |

| | |
|---|---|
| 3. కేంద్ర ఆహార పరిశోధనశాల, మైసూరు 570013 | కొచిన్, మద్రాస్, ఓడరేవులు, మండపం క్యాంపు, న్యూటూటికోరిన్, పెరంబూరు న్యూమంగుళూర్ మరియు మద్రాసు, త్రిచినాపల్లి, త్రివేండ్రం, విమానాశ్రయములు, బెంగుళూరు ఇన్‌లాండ్ కంటైనర్ డిపో, బెంగుళూరు. |
| 4. కేంద్ర ఆహార పరిశోధనశాల, పూణె 411001 | బొంబాయి, కండ్లా మార్మగోవా, ఓడరేవులు మరియు బొంబాయి విమానాశ్రయం. |

4. ఆహార శాంపిల్ యొక్క విశ్లేషణం :—

1) సె. 13, సబ్‌సెక్షన్ (2) క్రిందగాని, రూలు 3 క్లాజు (ఎ) క్రిందగాని ఆహార శాంపిల్ విశ్లేషణ కొరకు, సీలు వేసిన ప్యాకెటు ఫారం 1 లో మెమోరాండమ్ జతచేసి, డైరెక్టరు చిరునామా వ్రాయబడిన పైకవరుతో వ్యక్తి ద్వారాగాని, రిజిష్టరు పోస్టులోగాని పంపవలెను.

2) ఆధార పాత్ర (Container లో) మరియు ప్యాకెటు యొక్క పైకవరు మీద ప్రత్యేక గుర్తింపు సంఖ్య వేయవలెను.

3. మెమోరాండం నకలు మరియు ఆధారపాత్రకు, పైకవరుకు సీలు వేయుటకు వాడిన సీలుయొక్క నమూనా ముద్రను విడిగా రిజిష్టరు పోస్టులో డైరక్టరుకు పంపవలెను.

---

జి. యస్. ఆర్. 745 (ఇ) తేది 20-9-85 ప్రకారం సవరించబడినది 20-3-86 నుండి అమలు.

4. ప్యాకెటు అందినప్పుడు, దానిని డైరక్టరు స్వయంగా గాని, డైరక్టరుచే లిఖితపూర్వకంగా అధికారము పొందిన ఆఫీసరుగాని విప్ప వలెను. అతడు ఆధారపాత్రపై సీలుయొక్క స్థితిని నమోదు చేయ వలెను.

5. పరీక్ష లేక విశ్లేషణం తర్వాత, దానియొక్క సర్టిఫికేటు ఫారం 2లో, పంపిన వ్యక్తికి తక్షణం సరఫరా చేయవలెను.

6. అట్టి సర్టిఫికేటుకు చెల్లించవలసిన రుసుము పరీక్షచేసిన శాంపిలు ఒక్కటికి రూ. 40/—లు.

7. ఈ నియమముల క్రింద, పరిశోధనశాలచే ఇవ్వబడిన సర్టిఫికేటు డైరక్టరుచే సంతకం చేయబడవలెను.

## వ్యాఖ్య

రూలు 4 [3] ఆదేశకము, మార్గదర్శకము కాదు. సీలు యొక్క నమూన మెమోరాండం కాపీ వేరే కవరులో పంపవలెను.

హరిచంద్ గోపాల్ Vs స్టేట్
1976 యఫ్. ఎ. జె. 64

రూలు 4 [3] వ్యతిరేకించినచో విచారణ చెల్లదు.

స్టేట్ ఆఫ్ మహరాష్ట్ర Vs సయ్యద్ అఖలాఖ్,
1980 (1) యఫ్. ఎ. సి. 224

రూలు 4 [3] మార్గదర్శకమేగాని ఆదేశముగాదు.

మెమోరాండం పోస్టులోగాక, వ్యక్తి ద్వారా పంపిన డైరక్టరు సర్టిఫికేటు యొక్క విలువకు భంగం లేదు.

లక్ష్మినివాస్ Vs కమీషనర్
1975 యఫ్. ఎ. జె. 383 (యస్. సి.)

## భాగం III

### నిర్వచనములు, నాణ్యత ప్రమాణములు

5. ఈ నియమావళి అనుబంధం—బి లో ఉదహరించబడిన వివిధములైన ఆహార పదార్థములకు నాణ్యత ప్రమాణములు, సదరు అనుబంధంలో నిర్వచించబడినవి.

**వ్యాఖ్య**

ప్రమాణములు చాల కఠినమయినవి అనే వాదన కోర్టు పరిశీలించదు.

స్టేట్ ఆఫ్ ఉత్తర ప్రదేశ్ Vs కర్తార్‌సింగ్
ఎ. ఐ. ఆర్. 1964 యస్. సి. 1135.

## భాగం IV

### పబ్లిక్ ఎనలిస్టులు మరియు / ఫుడ్ ఇన్‌స్పెక్టర్లు

6. పబ్లిక్ ఎనలిస్టు యొక్క అర్హతలు :—

'ఇండియాలో శాసనబద్ధంగా స్థాపించబడిన యూనివర్సిటీ నుండి కెమిస్ట్రీ, బయో కెమిస్ట్రీ ఫుడ్ టెక్నాలజీ లేక ఫుడ్ అండ్ డ్రగ్స్ లలో సైన్సు డిగ్రీ లేక ఇందుకొరకు కేంద్ర ప్రభుత్వముచే అందుకు సమానముగా గుర్తింపబడినట్లు ప్రకటించబడిన అర్హత కల్గియుండి, మరియు పట్టభద్రుడయిన తర్వాత 5 సం॥లకు తక్కువగాకుండ ఆహార పరీక్షలలో అనుభవము కల్గియున్న,

లేక

ఇండియాలో శాసనబద్ధంగా స్థాపించబడిన యూనివర్సిటీ నుండి కెమిస్ట్రీ, బయో కెమిస్ట్రీ లేక ఫుడ్ టెక్నాలజీ లేక ఫుడ్ అండ్ డ్రగ్స్‌లో యం. యస్.సి. పొంది లేక ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కెమిస్ట్సు (ఇండియా)చే నిర్వహించబడు ఆహార విశ్లేషణ విభాగములో పరీక్ష

ద్వారా ఇన్స్టిట్యూట్ ఆఫ్ కెమిస్ట్స్ (ఇండియా) అసోసియేటు మెంబరుగా అర్హతలు కల్గి యుండి, అందుకొరకు కేంద్ర ప్రభుత్వముచే అందుకు సమానంగా గుర్తించబడిన అధిసూచన చేయబడిన అర్హతలు కల్గి యుండి, ఆహార పదార్థములలో 3 సం. లకు తక్కువగాని అనుభవం కల్గియున్న,

బి. ఇందుకొరకు కేంద్రప్రభుత్వముచే నియమించబడిన, మరియు అధిసూచన చేయబడిన బోర్డుచే, నియామకమునకు అర్హుడుగా ప్రకటించ బడిన వ్యక్తి అయి ఉంటే తప్ప పబ్లిక్ ఎనలిస్టుగా నియమించబడుటకు అర్హుడు కాడు.

అయితే ఆహార కల్తీ నియమావళి 1980 సవరణ అమలులోనికి వచ్చిన తేదీన పబ్లిక్ ఎనలిస్టుగా ఉన్న వ్యక్తి, లేక అట్టి అమలుకు ముందు 3 సం. లు పబ్లిక్ ఎనలిస్టుగా పని చేసిన వ్యక్తి, క్లాజులు (ఎ) (బి) లలో విధించిన అర్హతలు లేనప్పటికి, సర్వీసు నిబంధనలకు లోబడి అట్లు అట్టి ఉద్యోగము చేయవచ్చును.

7. పబ్లిక్ ఎనలిస్టు యొక్క విధులు :-

1. ఫుడ్ ఇన్స్పెక్టరుగాని ఇతర వ్యక్తినుండి గాని ఆహార శాంపిల్ యొక్క ప్యాకేజి అందినప్పుడు, పబ్లిక్ ఎనలిస్టు లేక అతనిచే ప్రాధికారమీయబడిన వ్యక్తి ఆధార పాత్ర మరియు పై కవరు పై సీళ్ళను, విడిగా, అందిన సీలు నమూనాముద్రతో సరిపోల్చి చూడవలెను; మరియు వానిపైని సీళ్ళ యొక్క పరిస్థితి నమోదు చేయవలెను.

2. ఈ చట్టం క్రింద ఫుడ్ ఇన్స్పెక్టరు లేక ఇతర వ్యక్తిచే పంప బడిన శాంపిళ్ళను పబ్లిక్ ఎనలిస్టు విశ్లేషణం చేయించవలెను.

3. శాంపిల్ అందిన 40 రోజులలోగా పబ్లిక్ ఎనలిస్టు, విశ్లేషణం యొక్క నివేదిక ఫారం iii లో లోకల్ హెల్త్ అథారిటీకి

పంపవలెను. అయితే శాంపిల్ ఈ చట్టం క్రింద నిబంధనలకు లేక నియమములకు భంగకరంగా ఉన్నప్పుడు పబ్లిక్ ఎనలిస్టు అట్టి అథారిటీకి తన రిపోర్టుయొక్క కాపీలు 4 పంపవలెను. అంతేగాక ఆహార పదార్థమును కొని, సె. 12 క్రింద తనకు విశ్లేషణ కొరకు పంపిన వ్యక్తికిగూడ పబ్లిక్ ఎనలిస్టు అట్టి రిపోర్టు యొక్క నకలు పంపవలెను.

## వ్యాఖ్య

పబ్లిక్ ఎనలిస్టు యిన్ని దినములలో శాంపిల్ పరీక్ష చేయవలెనని నియమము లేదు. కాని, సాధారణంగ సాధ్యమైనంత త్వరగా శాంపిల్ విశ్లేషణం చేయ వలెను. రిపోర్టు ఆలస్యంగా పంపినప్పుడు విశ్లేషణ కూడ ఆలస్యంగా జగిరిందని భావించనక్కరలేదు.

పబ్లిక్ ప్రాసిక్యూటరు Vs ఈడిగ వెంకటస్వామి
ఎ. ఐ. ఆర్. 1967 ఎ. పి. 131

పబ్లిక్ ఎనలిస్టు పాత్రమీది పై కవరు మీది సీళ్ళను విడిగా మెమోరాండం తోపాటు పంపిన సీళ్ళతో పోల్చవలెను. అయితే ఆ విధంగా పోల్చినట్లు రిపోర్టులో నమోదు చేయనంతమాత్రాన ప్రాసిక్యూషను త్రోసిపుచ్చరాదు. ఎనలిస్టు సీళ్ళను సరిపోల్చినాడని భావించవలెను.

ఖాసింకుంజు Vs కె. కె. రామకృష్ణ పిల్లే
1976 [2] యఫ్ ఎ. సి. 68 (యస్. సి.)

ఎనలిస్టు సీళ్ళు సరిగా యున్నవని పేర్కొనినప్పుడు సీళ్ళను నమూనా సీలుతో సరిపోల్చినాడని భావించవలెను.

సుబ్బయ్యన్ Vs స్టేట్ ఆఫ్ కేరళ
ఎ. ఐ. ఆర్. 1968 కేరళ 330

గమనిక :—

ఫారం - III 1968 లో సవరించబడి 'ఆధార పాత్రపై సీలు విడిగా పంప బడిన సీలు ముద్ర నమూనాతో సరిపోయినది' అను వాక్యం కలుపబడినది. తరువాత 1976 లో 'పై కవరుపై' అను పదం కూడ చేర్చబడెను.

శాసన చరిత్ర గమనించినచో, ఫారంలో III లో ఆధార పాత్ర మరియు పై కవరు మీద సీళ్ళు శాంపిల్ సీలుతో సరిపోయినదని వాక్యం చేర్చుటలో శాసన సభ యొక్క ఉద్దేశ్యం ఈ నిబంధన ఆదేశకమని, తెలియుచున్నది. రిపోర్టులో "పై కవరు మీద సీలు" నమూనా సీలుతో సరిపోయినదని రిపోర్టులో ఉదహరించకపోయినచో, అట్టి రిపోర్టు అంగీకరించబడదు. ఆ కారణంచే ప్రాసిక్యూషను చట్ట వ్యతిరేక మగును అని కేరళ హైకోర్టు అభిప్రాయపడినది.

పి. పి. అజీజ్ Vs ఫుడ్ ఇన్‌స్పెక్టరు
1982 క్రి. లా. జ. 1125 కేరళ.

రూలు 7 [3] ఆదేశకం ఉల్లంఘించినచో ముద్దాయి విమోచనార్హుడు. (జస్టిస్ రామానుజుల నాయుడు) తీర్పు యిచ్చెను.

ఫుడ్ ఇన్‌స్పెక్టరు ఖమ్మం Vs షేక్‌సాబ్ అహ్మద్
1981 [I] ఎ. పి. యల్ జె. 392.

అయితే ఆంధ్రప్రదేశ్ హైకోర్టులోనే జస్టిస్ రామస్వామి క్రింది తీర్పులో రూ 7 [3] మార్గదర్శకమేగాని ఆదేశకముగాదని చెప్పెను,

పబ్లిక్ ప్రాసిక్యూటరు Vs సుబ్బరత్నం
1983 [I] ఎ. పి. యల్. జె. 392
=1983 క్రి. లా. జ. 1801 [ఎ. పి.]

మరల జస్టిస్ రామానుజుల నాయుడు రూలు 7 [3] ఆదేశకమని తీర్పు యిచ్చెను.

ఫుడ్ ఇన్‌స్పెక్టరు కొవ్వూరు Vs జలదంకి రాజమ్మ.
1984 [2] ఎ. పి. యల్, జె. 223

రూలు 7 ఆదేశకమని పాట్నా, బొంబాయి. కలకత్తా, కర్నాటక, మద్రాస్ కేరళ, గుజరాత్ కోర్టులు తీర్పు యిచ్చినవి.

| | |
|---|---|
| 1976 క్రి. లా. జ. | 421 [పాట్నా] |
| 1975 [2] యఫ్. ఎ. సి. | 420 [బొంబాయి] |

| | | |
|---|---|---|
| 1974 యఫ్. ఎ. సి. | 44 | [కలకత్తా] |
| 1981 క్రి. లా. జ. | 1149 | [కర్నాటక] |
| 1973 యఫ్. ఎ. సి. | 43 | [మద్రాసు] |
| 1973 యఫ్. ఎ. సి. | 298 | [గుజరాత్] |
| 1984 క్రి. లా. జ. | 563 | [కేరళ] |

గమనిక :- ఈ నియమము 9-7-84 న సవరించబడినది. "45" రోజులకు బదులు '40' రోజులు చేర్చబడినది.

రూలు 8 :—

ఫుడ్ ఇన్‌స్పెక్టరు అర్హతలు :—

ఎ. ఒక లోకల్ ఏరియా ఆరోగ్యశాఖకు బాధ్యత వహించు మెడికల్ ఆఫీసరు లేక

బి. వైద్యశాస్త్రంలో పట్టభద్రుడై యుండి కనీసం ఒక నెల ఆహార పరీక్షలో మరియు శాంపిళ్ళు తీయుటలో ఇందు కొరకు కేంద్ర లేక ఒక రాష్ట్ర ప్రభుత్వముచే గుర్తించ బడిన శిక్షణ పొందిన, లేక.

సి. ఇండియాలో శాసన బద్ధంగా స్థాపించబడిన యూనివర్సిటీ లేక ఇన్‌స్టిట్యూట్ నుండి 'రసాయన శాస్త్రం'. ('కెమిస్ట్రీ') పాఠ్య విషయముగా కలిగి సామాన్య శాస్త్ర ములో పట్టభద్రుడు లేక వ్యవసాయం లేక ప్రజారోగ్యం, లేక ఫార్మసీ లేక పశువైద్యం లేక ఫుడ్ టెక్నాలజి లేక డైరీ టెక్నాలజిలో పట్టభద్రుడు లేక ఫుడ్ టెక్నాలజీ కాని డైరి టెక్నాలజిలోగాని డిప్లొమా పొందియున్న, లేక ఇందుకొరకు సమానముగా కేంద్ర ప్రభుత్వముచే గుర్తించబడి, అది సూచన చేయబడిన అర్హతలు కలిగి యుండి ఫుడ్ హెల్త్ [అథారిటీ] క్రిందగాని, ఇందుకొరకు

కేంద్ర ప్రభుత్వంచే ఆమోదించబడిన సంస్థలోగాని, ఆహార పరీక్షలో, మరియు శాంపిళ్ళు తీయు పనిలో, 3 నెలలు తృప్తికరమయిన శిక్షణ పొందిన.

వ్యక్తి అయితే తప్ప ఫుడ్ యిన్స్పెక్టరుగా నియమింప బడుటకు అర్హుడుగాడు.

అయితే; ఆహార కల్తీ నివారణ [సవరణ] నియమములు 1977 ప్రారంభమునకు ముందు —

I. ఈ చట్టం క్రింద నియమించబడిన పబ్లిక్ ఎనలిస్టు; లేక

II. రాయల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కెమిస్ట్రీ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ (బ్రాంచ్ ఇ) యొక్క ఫెలో, లేక

III. సెంట్రల్ ఫుడ్ లేబరేటరీ యొక్క డైరక్టరుల కంట్రోలులో ఉన్న లేబరేటరీలలో ఆహార పరీక్ష మరియు శాంపిళ్ళు తీయుటలో పొందిన శిక్షణ

లేక

1980 ఆహార కల్తీ నివారణ (సవరణ) నియమములు 1980 కు పూర్వము ఆహార పరీక్ష మరియు శాంపిల్ తీయుటలో ఫుడ్ హెల్త్ అథారిటీ క్రింద పొందిన శిక్షణ ఈ నియమముల క్రింద కావల్సిన శిక్షణతో సమానంగా పరిగణించవలెను.

అంతేగాక,

ఆహార కల్తీ (సవరణ) నియమములు 1980 ప్రారంభమగు నాటికి అర్హత గల్గిన శానిటరీ ఇన్స్పెక్టరుగా ఒక సంవత్సరం అనుభవం కల్గి యుండి, ఆహార పరీక్షలలో శాంపిల్ తీయుటలో కనీసం 3 నెలల శిక్షణ పొంది యుండిన వ్యక్తి (ఎ) నుండి (సి) వరకు గల క్లాజులలోని అర్హతలు లేక పోయినప్పటికి అట్టి ప్రారంభం నుండి 2 సం. ల వరకు ఫుడ్ ఇన్స్పెక్టరుగా నియమించబడుటకు అర్హుడు

అంతేగాక

ఈ నియమములో ఉన్న ఏదియు గూడ ఆహార కల్తీ (సవరణ) నియమములు 1980 ప్రారంభమగు నాటికి ఫుడ్ ఇన్‌స్పెక్టరుగా ఉన్న వ్యక్తి సదరు ప్రారంభం తర్వాత అట్లు కొనసాగుటకు అనర్హుడగునని అన్వయింపబడరాదు.

వ్యాఖ్య

ఈ రూలులో చెప్పబడినవి కనీసార్హతలు, రాష్ట్ర ప్రభుత్వం ఎక్కువ అర్హతలు కోరుచూ నియామకము చేయవచ్చును. రూలు 23 (1) (ఇ) క్రింది కేంద్ర ప్రభుత్వముయొక్క అధికారములు లాగి కొనినట్లు పరిగణించరాదు.

1975 (2) యఫ్. ఎ. సి. 238

ఫుడ్ యిన్స్పెక్టరు నియామకము పేరుగాని, హోదాగాని ఉదహరించుచూ చేయవచ్చును.

1983 క్రి. లా. జ. 248 (ఎ. పి.)

9. ఫుడ్ యిన్‌స్పెక్టరు యొక్క విధులు :-

ఎ. తనకు కేటాయించ బడిన ప్రాంతంలో ఆహార పదార్థముల తయారీ, నిల్వ విక్రయములకు లైసెన్సు పొందియున్న అన్ని సంస్థలు. ఫుడ్ హెల్త్ అథారిటీ లేక లోకల్ అథారిటీ నిర్దేశించనంత తరచుగా తనిఖీ చేయుట,

బి. లైసెన్సు నిబంధనలు పాటించబడుచున్నట్లు తృప్తిచెందుట.

సి. ఈ చట్టం యొక్క నిబంధనలు లేక దీని క్రింద చేయబడిన నియమములు ఉల్లంఘించి తయారీ, నిల్వ, లేక విక్రయం లేక విక్రయించుటకు ప్రదర్శన చేయబడినట్లు అనుమానించుటకు కారణము లున్నప్పుడు, అవసరమయితే, సదరు ఆహార పదార్థము యొక్క శాంపిల్ తీసి కొనుట మరియు విశ్లేషణము కొరకు పంపుట,

డి. ఈ చట్టం యొక్క నిబంధనలు లేక దీని క్రింద చేయబడిన ఏదేని నియమముల నుల్లంఘించుట గురించి, తనకు చేయబడి లిఖిత పూర్వకమైన ఫిర్యాదుపై దర్యాప్తు చేయుట,

ఇ. శాంపిల్లు తీసికొనుట, నిల్వలు స్వాధీనం చేసికొనుటలతో సహా తన విధి నిర్వహణలో చేసిన తనిఖీలు ఇతర చర్యలు రికార్డు చేయుట, మరియు ఇందు గురించి ఆదేశించ బడిన విధంగా హెల్త్ ఆఫీసరు లేక ఫుడ్ హెల్త్ అథారిటీలకు సదరురికార్డు నకళ్లు పంపుట,

యఫ్. ఈ చట్టం క్రింద నిబంధనలు, లేక దీని క్రింద చేయబడిన నియమముల నుల్లంఘించి ఆహార పదార్థముల, తయారీ, నిల్వ విక్రయములు, సంబంధిచి అవసరమయిన విచారణలు, తనిఖీలు చేయుట,

జి. మానవాహారము కొరకు డెలివరీ చేయుటకు ఉద్దేశించబడిన ఆహార పదార్థము కల్గియున్నట్లు అనుమానింప బడిన వాహనమును ఆపుట,

హెచ్. సంబంధించిన లోకల్ ఏరియాలో అధికారము కల్గిన ఆరోగ్యాధికారి లేక ఫుడ్ హెల్త్ అథారిటీచే ప్రాధికారమివ్వబడినప్పుడు, దిగుమతి లేక అమ్మకం నిషేధించబడిన ఆహార పదార్థములు కల్గి యున్నవని భావించుటకు కారణములున్నచో, దిగుమతి చేయబడిన ప్యాకేజిలను నిలుపుదల చేయుటకు,

ఐ, సంబంధించిన లోకల్ ఏరియాలో అధికారము కల్గిన హెల్త్ ఆఫీసరు లేక ఫుడ్ హెల్త్ అథారిటీచే అప్పగించబడిన ఇతర విధులు నిర్వర్తించుట,

జె. (తొలగించబడినది.)

ఫుడ్ యిన్స్పెక్టరు యొక్క విధి అయి ఉండును.

## వ్యాఖ్య

రూలు 9 మార్గదర్శకము, ఈ రూలు కేవలం ఫుడ్ యిన్స్పెక్టరుయొక్క విధులను చెప్పుచున్నది.

నన్హే Vs స్టేట్ ఆఫ్ యు. పి.
1982 క్రి. లా. జ. 158 (అలహాబాద్)

రూలు 9 (జె) మార్గదర్శకమేగాని ఆదేశకము గాదు.

డాల్‌చంద్ Vs మునిసిపల్ కార్పోరేషన్, భోపాల్
ఎ. ఐ. ఆర్. 1983 యస్. సి. 303

(గమనిక :- 9- (జె) 4-1-77 నుండి తొలగించబడినది. దీనిపై ఇతర తీర్పులు అనవసరము)

**రూలు 9 - ఎ :-**

అభియోగము దాఖలు చేసిన 10 రోజులలోగా లోకల్ హెల్త్ అథారిటీ రూలు 7 (3) క్రింద తనకు ఫారం 3 లో పంపబడిన విశ్లేషణ నివేదిక నకలు, శాంపిల్ ఎవరి నుండైతే తీసికొనబడెనో అట్టి వ్యక్తికి మరియు సె. 14 - ఎ క్రింద ఎవరి పేరు, చిరునామా తెలియ పరచ బడెనో అట్టి వ్యక్తికి, రిజిష్టరు పోస్టుద్వారా గాని, చేతిద్వారాగాని సముచితమైన పద్ధతిలో అందించవలెను.

అయితే, శాంపిల్ ఈ చట్టం క్రింది నిబంధనలు, లేక దీని క్రింద చేయబడిన నియమముల కనుగుణంగా ఉన్నప్పుడు, సబ్ సెక్షను (2) క్రింద ప్రాసిక్యూషను దాఖలు చేయ దలచుకోనప్పుడు లేక సబ్ సెక్షన్ (2-ఇ) క్రింది చర్య తీసికోదలచనప్పుడు, రిపోర్టు అందిన 10 రోజులలోగా శాంపిల్ ఎవరినుండయితే తీసికొనబడెనో అట్టి వ్యక్తికి సె. 14 ఎ క్రింద పేరు, చిరునామా తెలియ పరచబడిన వ్యక్తికి లోకల్ హెల్త్ అథారిటీ విశ్లేషణ ఫలితము తెలియచేయవలెను.

## వ్యాఖ్య

రూలు 9- మార్గదర్శకమా, ఆదేశకమా అన్న అంశంపై భిన్నాభిప్రాయము ఉండెను. సుప్రీంకోర్టు, రూలు 9- ఎ మార్గదర్శకమేనని, రూలు అతిక్రమణ జరిగినంత మాత్రానా విచారణ చెల్లకపోదని తీర్పు యిచ్చినది. 'వెంటనే' అన్న పదము తరువాత చేయవలసిన పని గూర్చి చెప్పుచున్నది గాని 'తక్షణమే' అన్న భావము గాదని తీర్పు యిచ్చినది.

తులసీరావ్ Vs స్టేట్ ఆఫ్ మధ్య ప్రదేశ్.
ఎ. ఐ. ఆర్. 1985 యస్ సి 299
1984 క్రి. లా. జ. 1731 (యస్. సి)

గమనిక :- ఆహార కల్తీ నివారణ (మొదటి సవరణ) నియములు, 1984 (జి. యస్. ఆర్ 500 (ఇ) తేదీ 9-7-84 ద్వారా 'వెంటనే' అను పదమునకు బదులుగా "10 రోజులలోగా" అని ప్రత్యామ్నాయము చేయబడినది.

10. నిల్వ విక్రయించకుండ ఉత్తర్వు యొక్క, మరియు బాండు యొక్క నమూనాలు :-

సె. 10 (4) క్రింద, ఫుడ్ యిన్స్పెక్టరు విక్రయదారు యొక్క రక్షణలో ఆహారపదార్థము ఉంచినప్పుడు-

ఎ. అతడు అట్టి ఆహార పదార్థములు సీలు, వేసిన తర్వాత, ఫారం iv లో విక్రయదారుకు ఉత్తర్వు ఇవ్వవలెను; మరియు విక్రయదారు అట్టి ఉత్తర్వును పాటించవలెను.

బి. అతడు విక్రయదారును ఫారం iv- ఎ లో బాండు వ్రాయమని కోరవచ్చును.

11 ఫుడ్ ఇన్స్పెక్టరు స్వాధీనము చేసికొనిన ఆహారమునకు రశీదు నమూనా :-

సె. 10 (4) క్రింద ఫుడ్ యిన్‌స్పెక్టరుచే స్వాధీనం చేసికో బడిన, తీసికొని పోబడిన ప్రతి ఆహార పదార్థమునకు, ఎవరినుండి అయితే సదరు ఆహార పదార్థముల స్వాధీనం చేసికోబడెనో అట్టి వ్యక్తికి, ఫారం V లో ఫుడ్ యిన్‌స్పెక్టరు రశీదు ఇవ్వవలెను.

**12. విశ్లేషణము కొరకు శాంపిల్ తీసుకొను ఉద్దేశ్యము యొక్క నోటీసు :-**

ఫుడ్ యిన్‌స్పెక్టరు విశ్లేషణంకొరకు ఆహారపదార్థం శాంపిల్ తీసికొనినప్పుడు, అతడు, అప్పటికప్పుడే అక్కడే శాంపిల్ ఎవరినుండి తీసికోబడెనో ఆ వ్యక్తికి, ఈ చట్టం సె. 14 - A ప్రకారం పేరు, చిరునామా, యితర వివరములు తెలియపరచబడిన వ్యక్తికి, ఏక కాలంలో సముచిత రీతిలో ఫారం (vi) లో అట్లుచేయు తన ఉద్దేశ్య మును తెలియబరుచుచు నోటీసు యివ్వవలెను.

అయితే, ఫుడ్ ఇన్‌స్పెక్టరు తెరచి యుంచబడిన పాత్రలోనుండి శాంపిల్ తీసికొనినప్పుడు, అక్కడే ఉన్నట్లయితే, అదే ప్రకటన గల్గియున్న అసలు స్థితిలో యున్న పాత్రలోనుండి కూడ శాంపిల్ తీసికొనవలెను. మరియు ఆ విషయం పబ్లిక్ ఎనలిస్టుకు తెలియపరచ వలెను.

**12 - ఎ వారంటీ :-**

ఆహారపదార్థము అమ్ముచున్న ప్రతి తయారీదారు, పంపిణీ దారు, డీలరు ప్రత్యేకంగా గాని, బిల్లు క్యాష్ మెమో లేక లేబిల్ పైన గాని ఫారం vi - ఎ లో విక్రయదారుకు వారంటీ యివ్వ వలెను.

## వ్యాఖ్య

వారంటీ వ్యాపారులు సాధారణంగా వాడు భాషలో ఉండవచ్చును చట్టం యొక్క ఉద్దేశ్యంను భంగం కలుగదు. 'నాణ్యత', 'ప్రమాణంవరకు' అనగా ప్రమాణములననుసరించి అని భావన.

కె. రంగనాథ రెడ్డియార్ Vs స్టేట్ ఆఫ్ కేరళ
ఎ. ఐ. ఆర్. 1970 యస్. సి. 520

12. బి సె. 17 క్రింద డైరెక్టరు లేక మేనేజరు యొక్క నామనిర్దేశము మరియు సమ్మతి నమూనా :- కంపెనీ, లేక కంపెనీ యొక్క ఎస్టాబ్లిష్ మెంట్, బ్రాంచి, లేక యూనిట్ యొక్క వ్యాపార నిర్వహణకు ఇన్‌చార్జిగా యుండి, కంపెనీకి బాధ్యుడుగా ఉండునట్లు సె. 17 (2) క్రింద నామ నిర్దేశించబడిన డైరెక్టరు లేక మేనేజరు పేరు, చిరునామాలు కల్గియున్న ఫారం viii లో రెండు కాపీలలో నోటీసు పంపుట ద్వారా లోకల్ ఏరియాకు సంబంధించిన లోకల్ (హెల్త్) అథారిటీకి కంపెనీ తెలియపరచ వచ్చును.

అయితే అట్లు నామ నిర్దేశించబడిన డైరెక్టరు లేక మేనేజరు లిఖిత పూర్వకముగా తన సమ్మతి యిచ్చి అట్టి సమ్మతికి గుర్తుగా ఫారం (viii) లో రెండు కాపీలలో సంతకం చేసిన తప్ప, అట్టి నామ నిర్దేశము చెల్లదు.

2. లోకల్ (హెల్త్) అథారిటీ నామ నిర్దేశం అందినట్లు గుర్తుగా ఫారం viii లో నోటీసు ఒక కాపీపై సంతకం చేసి వాపసు చేయవలెను. రెండవ కాపీ రికార్డు కొరకు తన ఆఫీసులో ఉంచుకొనవలెను.

12-సి: సె. 12 క్రింద పబ్లిక్ ఎనలిస్టుచే విశ్లేషణం కొరకు పంపు ఉద్దేశ్యము తెలియ పరిచినప్పుడు ఆహార పదార్థము యొక్క ప్రతి విక్రయదారు రూలు 12-బి క్రింద నామ నిర్దేశము చేయబడిన

డైరక్టరు లేక మేనేజరు పేరు, చిరునామా కొనుగోలుదారుకు తెలియ పరచవలెను.

13. ఆహార పదార్థములకు తాకు వ్యాధి వ్యాపకులకు సంబంధించి ఫుడ్ యిన్‌స్పెక్టరు అధికారములు :-

1. ఆహారపదార్థముల అమ్మకం లేక తయారీలో పాల్గొను ఏ వ్యక్తి అయినా, అంటు వ్యాధితో బాధపడుచున్నట్లుగాని, అంటు వ్యాధి వ్యాపక రోగాణువులు కల్గియున్నాడని గాని ఫుడ్ యిన్‌స్పెక్టరు అభిప్రాయపడినచో, అట్టి వ్యక్తిని అతడు పరీక్ష చేయవచ్చును, లేక చేయించ వచ్చును.

అయితే అట్టి వ్యక్తి 8 సం లు దాటిన స్త్రీ అయినచో ఫుడ్ యిన్‌స్పెక్టరుచే నియోగించబడిన స్త్రీచే పరీక్ష చేయించ వలెను.

2. అట్టి పరీక్ష తర్వాత సదరు వ్యక్తి అట్టి రోగి అని ఫుడ్ యిన్‌స్పెక్టరు నిశ్చయించినచో, సదరు వ్యక్తి ఆహార తయారీ లేక విక్రయములలో పాల్గొనరాదని లిఖిత పూర్వకముగా ఉత్తర్వు చేయ వచ్చును.

## భాగం – V

## శాంపిల్లు సీలువేయుట, కట్టుట, పంపుట

**14 :-** విశ్లేషణం కొరకు శాంపిళ్ళు పంపు విధానము :-

విశ్లేషణం కొరకు శాంపిల్లు శుభ్రమైన, పొడి, సీసాలు లేక జాడీలు లేక సముచితమైన యితర పాత్రలలో తీసికొనవలెను. కారి పోవుట, ఆవిరి అగుట, లేక పొడి పదార్థము అయిన సందర్భములో, తేమ లోనికి ప్రవేశించుట, నిరోధించుచూ, తగినంత గట్టిగా మూత బిగించవలెను, మరియు జాగ్రత్తగా సీలు వేయబడవలెను.

15 : సీసాలు లేక పాత్రలపై లేబిల్, చిరునామా ఉండవలెను.

శాంపిల్ కల్గియున్న అన్ని సీసాలు జాడీలు లేక యితర పాత్రలు సరిగా లేబిల్ వేయబడవలెను. మరియు పార్శిల్‌పై సరిగా చిరునామా వ్రాయబడవలెను. విశ్లేషణం కొరకు పంపబడిన ఏ శాంపిల్‌పై లేబిల్ అయినా—

ఎ. సీరియల్ నం.

బి. పంపువాని పేరు, అధికార హోదా,

సి. విక్రయదారు పేరు,

డి. తీసికొనబడిన తేది, ప్రదేశం,

ఇ. విశ్లేషణ కొరకు పంపబడిన పదార్థము యొక్క స్వభావము

యఫ్. ఒక వేళ శాంపిల్ కలిపినట్లయితే, పరిరక్షక పదార్థము యొక్క స్వభావము, పరిమాణము
కల్గియుండవలెను,

అయితే ఆగ్ మార్క్ లేబిల్ యున్న పాత్రనుండి శాంపిల్ తీసికొనినప్పుడు లేబిల్ ఈ క్రింది అదనపు సమాచారము కల్గియుండవలెను.

ఎ. గ్రేడ్

బి. ఆగ్‌మార్క్ లేబిల్ నం/బ్యాచ్ నం.

సి. ప్యాకింగ్ స్టేషను పేరు

16 :— శాంపిల్ ప్యాక్ చేయు, సీలు చేయు విధానము.

విశ్లేషణ కొరకు పంపబడు ఆహార పదార్థముల శాంపిల్లు, అన్ని ఈ క్రింది పద్ధతిలో ప్యాకుచేసి, కట్టి సీలు వేయబడి ఉండవలెను - అనగా -

ఎ. రవాణాలో కారుట అరి కట్టునట్లు ముందు బిరడా గట్టిగా కట్టవలెను.

బి. తరువాత గట్టి మందపాటి కాగితంతో సదరు సీసా, జాడీ లేక పాత్రకు పూర్తిగా కట్టవలెను, కాగితపు అంచులు శుభ్రంగా మడచి, బంకతో గాని యిత్తర జిగురుతో గాని అంటించవలెను.

సి. లోకల్ హెల్త్ అథారిటీ సంతకం, కోడ్ నంబరు కల్గి యున్న ఒక కాగితం స్లిప్ పాత్రకు క్రింద నుండి పై వరకు, చుట్టూ పోగల సైజులో రేపర్ పై అంటించ వలెను. ఎవరినుండి అయితే శాంపిల్ తీసికొనబడెనో అట్టి వ్యక్తియొక్క సంతకం లేక వేలిముద్ర స్లిప్ మీద కొంత రేపర్ మీద కొంత వచ్చునట్లుగా తీసికొనవలెను.

అయితే అట్టి వ్యక్తి సంతకం లేక వేలిముద్ర వేయుటకు నిరాకరించినప్పుడు సాక్షియొక్క సంతకం లేక వేలిముద్ర అదే పద్ధతిలో తీసికొనవలెను.

డి. కాగితం కవరుపై గట్టి తాడుతో లేక ట్వైన్ దార ముతో సీసా, జాడీ లేక పాత్రపై అడ్డంగా కట్టవలెను. ట్వైన్ దారము పేపరు కవరుపై సీలు వేయు లక్కతో అంటించవలెను. దానిపై కనీసం నాలుగు చోట్ల - ఒకటి ప్యాకెట్ మీద, ఒకటి క్రింద, మిగతా రెండు ప్యాకెటుపైన, స్పష్టంగా ప్రస్ఫుటంగా పంపువాని సీలు ముద్రలు వేయవలెను. ట్వైన్ లేక తాడు ముడులు ముద్రలు గల సీలు లక్కతో మూసి వేయబడవలెను.

17. శాంపిల్ పంపు విధం :—

శాంపిల్ పాత్రలు ఈ క్రింద విధముగా పంపిణీ చేయవలెను. అనగా—

ఎ. ఏదైన తగిన పద్ధతిలో సీలు వేసిన ఒక శాంపిల్ భాగం మరియు ఫారం VII లో మెమోరాండమ్, పబ్లిక్ ఎనలిస్టుకు వెంటనే, తరువాత పని చేయు దినము కంటే ఆలస్యము కాకుండా, సీలు వేసిన ప్యాకెటులో పంపవలెను.

బి. సీలు వేసిన మిగిలిన రెండు శాంపిల్ భాగములను, మరియు ఫారం VII లో మెమోరాండం కాపీలు రెండు లోకల్ హెల్త్ అథారిటీకి, వెంటనే తరువాత పని చేయు దినం కంటే ఆలస్యం కాకుండా, ఏదేని తగిన పద్ధతిలో సీలువేయబడిన ప్యాకెటులో పంపవలెను.

సి. అయితే ఆగ్ మార్కు సీలు వేయబడిన పాత్రలోనుండి శాంపిల్ తీసికొన్న సందర్భంలో ఫారం VII మెమోరాండం క్రింది అదనపు సమాచారము కల్గియుండ వలెను.

ఎ. గ్రేడ్

బి. ఆగ్ మార్కు నం/బ్యాచ్ నం.

సి. ప్యాకింగ్ స్టేషను పేరు.

## వ్యాఖ్య

రూలు 17 ఆదేశకము, మెమోరాండం ప్యాకెటులో పంపనియెడల ప్రాసిక్యూషను చెల్లదు.

రాజారాం Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర

1981 క్రి. లా. జ.. 1603 (బొంబాయి)

పై కవరుపై సీలు వేయనిచో రూలుకు భంగము కలిగినది.

మహమ్మద్ ఇస్మాయిల్ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర

1978 (2) యఫ్ ఎ సి 281

రూలు 18 : మెమోరాండం సీలు ముద్ర వేరుగా పంపవలెను.

మెమోరాండం యొక్క ఒక కాపీ మరియు ప్యాకెటు సీలు చేయుటకు వాడబడిన సీలు ముద్ర నమూనా, పబ్లిక్ ఎనలిస్టుకు వేరుగా గాని అతనిచే అధికారం పొందిన వ్యక్తికిగాని రిజిష్టరు పోస్టు ద్వారా, పంపవలెను లేక చేర్చవలెను.

## వ్యాఖ్య

రూలు 17, రూలు 18 లు ఆదేశకములు

యఫ్. ఐ. మంగళూరు Vs కె. యస్. రాఫీల్

1981 క్రి. లా. జ. 1149 (కేరళ)

1986 యఫ్. ఎ. సి. 99

రూలు 18 క్రింద విడిగా పంపవలసిన మెమోరాండమ్, సీలు నమూనా కలిగిన ప్యాకెటు రూలు 17 క్రింద పంపిన శాంపిల్ ప్యాకెటు ఒక ప్యూన్ తీసి కొనిపోయినంత మాత్రాన రూలుకు భంగం కలుగదు,

ఇనాయత్ ఆలీ Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర

1976 (2) యఫ్. ఎ. సి. 61 (బొంబాయి)

రూలు 18 ఆదేశకంగాదు. అని ఈ క్రింది తీర్పులలో నిర్ణయించబడింది.

1978 (1) యఫ్ ఎ సి 125 (గుజరాత్)

1978 (2) యఫ్ ఎ సి 286

(ఈ సందర్భంలో రూలు 7 చూడదగును.) శాంపిల్‌పై సీలు, పై కవరు పై సీలు తనకు ప్రత్యేకంగా రూలు 18 ప్రకారం పంపబడిన సీలు నమూనాతో పోల్చి చూడవలసిన బాధ్యత పబ్లిక్ ఎనలిస్టు పై ఉన్నది. రూలు 7 (1) అతడు యిచ్చు ఫారం III లో నివేదికలో సీళ్ళు సరిపోయినవని ధృవీకరించవలెను.

19. శాంపిళ్ళకు పరిరక్షక పదార్థము కలుపుట :-

ఈ శాసనము క్రింద విశ్లేషణ కొరకు శాంపిల్ తీసుకొను ఏ వ్యక్తి అయినా, శాంపిల్‌ను విశ్లేషణకు తగిన స్థితిలో ఉంచగలందు లకు తత్కాలమున నిర్దేశించబడిన పరిరక్షక పదార్థము కలుపవచ్చును.

20. పాలు, మీగడ, పెరుగు, కోవా, గుర్ లలో పరిరక్షక పదార్థము :-

టోన్డ్, సెపరేటెడ్, మరియు స్కిమ్డ్ పాలతో సహా ఏ పాలలోనయినా, ద్రవరూపములో లేక కొంత ద్రవరూపములో యున్న స్టాండర్డైజ్డ్ పాలజున్ను స్కిమ్డ్ పాలజున్ను క్రీమ్, ఐస్‌క్రీమ్, మిల్క్ ఐస్‌క్రీం. ఐస్‌కాండీ, ఖోవా, మరియు గుర్ లలో వాడదగు పరిరక్షక పదార్థము 'ఫార్మాలిన్' అనగా—

జలద్రావణములో 40% ఫార్మాల్డిహైడ్, 25 యం. యల్ లేక 25 గ్రాములలో 0.1 మి. లీ (2 బొట్లు) వంతున గల్గి యున్న ద్రవ పదార్థము.

## వ్యాఖ్య

ఫార్మాలిన్ తక్కువ పరిమాణంలో కలిపిన ప్రాసిక్యూషను చెల్లదు.

1978 (2) యఫ్ ఎ సి 158 రాజస్థాన్

కాని, 20 బొట్లకు బదులు 16 బొట్లు ఫార్మాలిన్ కలిపినప్పుడు అభియోగము చెల్లును.

1978 (2) యఫ్. ఎ. సి. 160 (అలహాబాదు)

ఫార్మాలిన్ అసలు కలుపనప్పుడు రూలు అతిక్రమించినట్లే.

1979 క్రి. లా. జ. 1463

21. పరిరక్షక పదార్థం యొక్క స్వభావం, పరిమాణం, లేబిల్ పైన వ్రాయవలెను.

శాంపిల్ కు పరిరక్షక పదార్థం ఎప్పుడు కలిపినా, పరిరక్షక పదార్థం యొక్క స్వభావం పరిమాణం ఆధార పాత్రపై అంటించిన లేబిల్ పై స్పష్టంగా వ్రాయవలెను.

22. పబ్లిక్ ఎనలిస్టుకు పంపవలసిన శాంపిల్ పరిమాణం.

పబ్లిక్ ఎనలిస్టుకు డైరెక్టరుకు విశ్లేషణ కొరకు పంపవలసిన శాంపిల్ పరిమాణం ఈ క్రింద పేర్కొనబడిన విధంగా యుండవలెను.

| ఆహార పదార్థం | | అందించవలసిన పరిమాణము సుమారు |
|---|---|---|
| 1. | పాలు | 220 మి. లీ. |
| 2. | నెయ్యి | 150 గ్రాములు |
| 3. | వెన్న | 150 ” |
| 4. | ఖోవా | 250 ” |
| 5. | పెరుగు | 200 ” |
| 6. | వంటనూనెలు (తినదగినవి) | 125 ” |
| 7. | వంటక్రొవ్వు | 125 ” |
| 8. | టీ | 125 ” |
| 9. | అట్టా | 200 ” |
| 10. | గోధుమ పిండి | 200 ” |
| 11. | గర్ [బెల్లం] | 200 ” |
| 12. | చెరకు చక్కెర | 200 ” |
| 13. | తేనె | 250 ” |
| 14. | తయారు చేసిన ఆహారం | 500 ” |
| 15. | కార్బోనేటెడ్ నీరు [సోడా] | 600 ” |
| 16. | వనస్పతి | 500 ” |

| | | | |
|---|---|---|---|
| 17. | సుగంధ ద్రవ్యాలు | 150 | ” |
| 18. | పండ్లు, పండ్ల పదార్థములు జామ్‌లు, జెల్లీలు మరి అటువంటివి | 300 | ” |
| 19. | పప్పులు, పండ్లు, మరియు అటువంటివి | 250 | ” |
| 20. | 1. ఇంగువ | 100 | ” |
| | 2. ఇంగువ కాంపౌండు | 200 | ” |
| 21. | కుంకుమ పువ్వు | 15 | ” |
| 22. | ఐస్‌క్రీం, ఐస్‌క్రీం మిశ్రమం | 300 | ” |
| 22. ఎ. | వెండి ఆకు (ఆహార గ్రేడ్) | 1 | ” |
| 23. | రొట్టె, టోస్టు | 500 | ” |
| 24. | బిస్కట్లు, కేకులు, పేస్ట్రీలు మరియు సంబంధిత ఉత్పత్తులు | 500 | ” |
| 25. | టాఫీ, చాకోలేటు, హార్డు బాయిల్డు చక్కెర, మిఠాయి మరియు సంబంధిత ఆహార పదార్థములు | 300 | ” |
| 26. | కస్టర్డు పౌడరు | 250 | ” |
| 27. | కార్న్ ఫ్లేక్స్ | 200 | ” |
| 28. | [బేబీ ఫుడ్] పిల్లల ఆహారము | 450 | “ |
| 29. | శాకరీను, రంగులతో ముందుగా తయారు చేసిన టీ | 250 | మి. లీ. |
| 30. | శనగ పిండి | 200 | గ్రాములు |
| 31. | మీగడ | 250 | ” |
| 32. | డ్రైడ్ మిల్క్ | 250 | ” |
| 33. | కండెన్స్‌డ్ మిల్క్ | 250 | ” |
| 34. | కూరపొడి | 300 | ” |
| 35. | జున్ను | 200 | “ |
| 36. | సిరప్ | 250 | ” |
| 37. | పేర్కొనబడని ఆహారములు | 200 | ” |

## వ్యాఖ్య

శాంపిల్ పరిమాణం :

రూలు 22 లో చెప్పిన పరిమాణంకంటె తక్కువ ఉన్నయెడల పబ్లిక్ ఎనలిస్టు రిపోర్టు చెల్లదని, ప్రాసిక్యూషన్ త్రోసిపుచ్చవలెనని ఒకప్పుడు సుప్రీం కోర్టు అభిప్రాయపడినది.

రజాక్‌దాస్ పంనాని Vs స్టేట్ ఆఫ్ మహారాష్ట్ర
ఎ. ఐ. ఆర్. 1975 యస్. సి. 189

కాని తరువాత తీర్పులలో ఇది సరిగా నిర్ణయించబడలేదని, రూలు 22 లో చెప్పబడిన పరిమాణంకంటె తక్కువగా శాంపిల్ పంపినప్పుడు, పబ్లిక్ ఎనలిస్టు శాంపిల్ విశ్లేషణంకు సరిపోదని అభ్యంతరం పెట్టినప్పుడు తప్ప శాసన అతిక్రమణ జరుగలేదని, రూలు 22 ఆదేశకంగాదు మార్గదర్శకమే అని సుప్రీంకోర్టు తీర్మానించింది.

స్టేట్ ఆఫ్ కేరళ Vs అలసూరి మహరమ్మద్
ఎ. ఐ. ఆర్. 1978 యస్. సి. 833

మునిసిపల్ కార్పోరేషన్ ఢిల్లీ Vs న్యూ క్వాలిటీ స్వీట్‌హోమ్
ఎ. ఐ. ఆర్. 1985 యస్. సి. 329

పూర్వపు సుప్రీంకోర్టు తీర్పుననుసరించి హైకోర్టు కేసు త్రోసిపుచ్చగా, తరువాత సుప్రీంకోర్టు తీర్పువలన సదరు పూర్వపు తీర్పు రద్దయిన కారణంచేత, హైకోర్టు తీర్పురద్దుచేసి ముద్దాయిని శిక్షార్హుడుగా నిర్ణయించవచ్చును. భారత సంవిధానము లోని 141 అనుచ్ఛేదము వర్తించదు. సుప్రీంకోర్టు యొక్క తదుపరి తీర్పులో చెప్పబడిన న్యాయ సూత్రములననుసరించి కేసు నిర్ధారణ చేయవలెను. అయితే ఈ కేసులో ముద్దాయిని జైలుకు పంపలేదు.

రామదాస్ బకాజీ Vs సదానంద్
ఎ. ఐ. ఆర్. 1981 యస్. సి. 126

22-ఎ :—

ఒకే మాదిరి లేబిల్ కలిగి యున్న ఒకటి లేక యెక్కువ, సీలు వేసిన పాత్రలలో ఉండేవి ఆహారము యొక్క ఒక శాంపిల్ పరిమాణం అగుట:— ఆహార పదార్థము ఒకే మాదిరి లేబిల్ గల, సీలు వేసిన పాత్రలలో అమ్మిన లేక అమ్మకమునకు లేక పంపిణీకి నిల్వ చేసిన రూలు 22 లో విహిత పరచబడిన పరిమాణమునకు సరిపోవుటకు కావలసిన, ఒకటి గాని ఎక్కువగాని అట్టి పాత్రలలో ఉన్నవి శాంపిల్ ఒక భాగంగా పరిగణించవలెను.

22 బి :—

పంపబడిన శాంపిల్ పరిమాణం సరిపోయినదని భావించవలెను.

రూలు 22 లో ఏమి ఉన్నప్పటికి, పబ్లిక్ యెనలిస్టు లేక డైరక్టరు అందుకు భిన్నంగా తెలియపరచిన తప్ప విశ్లేషణ కొరకు పంపబడిన శాంపిల్ పరిమాణం, సరిపోయినట్లుగా భావించవలెను.

## భాగం VI

### రంగు పదార్థము

23. అనుమతించబడని రంగు పదార్థం కలుపుట నిషేధం.

ప్రత్యేకంగా, ఈ నియమముల ద్వారా అనుమతించబడిన విధంగా తప్ప, ఆహార పదార్థములకు రంగు, పదార్థము కలుపుట నిషేధించబడినది.

24. ఏదేని ఆహార వస్తువునకు ఇతర రంగు పదార్థం కలుపబడినప్పుడు అట్లు రంగు కలుపబడిన ఆహారము యొక్క ప్యాకెజి పై అంటించబడిన

లేబిల్ పైన పెద్ద అక్షరములలో (Capital letters) ఈ క్రింది విధంగా వ్రాయబడవలెను.

"కృత్రిమంగా రంగు వేయబడినది" (Artificially coloured) అయితే ఈ రూలు, జున్ను (అన్ని తరగతులు) ఐస్‌క్రీం, మిక్సు ఐస్‌క్రీం, ఐస్ కాండీ, ఐసింగ్ సుగర్, మరియు పేరుకొన్న ఫలహారములకు వర్తించదు.

25. కారమెల్ ఉపయోగం అనుమతించబడినది.

రూలు 24 మరియు రూలు 32 (సి) నిబంధనలో ఏమి ఉన్నప్పటికి లేబిల్ ప్రకటన లేకుండ 'కారమెల్' వాడవచ్చును.

26. అనుమతించబడిన సహజ రంగులు :—

నియమములో వేరే విధంగా చెప్పబడ్డి యుంటే తప్ప, ఈ క్రింది సహజ రంగు పదార్థములు సహజ రంగుల నుండి విడిచేసి గాని, సంశ్లేషణ పద్ధతిన తయారు చేసిగాని, ఏదేని ఆహార పదార్థములోగాని పైన గాని వాడవచ్చును.

ఎ. ......

బి. i. బీటా కారోటీన్

ii. బీటా, ఆపో-8, కారోటినాల్

iii. బీటా, ఆపో-8 కారోటీనోయిక్ ఆమ్లము యొక్క మిథైల్ ఎస్టరు

బీటా, ఆపో-8 కారోటీనోయిక్ ఆమ్లము యొక్క ఈథైల్ ఎస్టరు

కాంథక్సంథిన్

సి. క్లోరోఫిల్

డి. రిబోఫ్లోవిన్ (లా క్టోఫ్లోవన్)

ఇ. కారమెల్

యఫ్. అన్నాట్టో

జి. [......]

హెచ్. సాఫ్రన్

ఐ. కర్కుమిను (లేక పసుపు)

విశదీకరణ :

తయారీలో ఈ నియమముల అనుబంధం- బి లో చెప్పబడిన ఏ శాఖ నూనె అయినా, ఒకటిగాగాని సంయోగములోగాని వాడవచ్చును. మరియు వాడబడిన నూనె రూలు 42 (జడ్) నిబంధన ప్రకారం లేబిల్‌పైన పేర్కొనబడవలెను.

(జి. యస్. ఆర్. 764 (ఇ) తేదీ 15-11-84 ద్వారా క్లాజు (జి) తొలగించబడినది. విశదీకరణ సవరించబడినది.)

27. కర్బనేతర పదార్థములు మరియు రంగు పదార్థములు (Pigments) కలుపుట నిషేధము.

ఏ ఆహార వస్తువునకయినా కర్బనేతర పదార్థములు మరియు రంగు పదార్థములు కలుపరాదు.

అయితే నములు బంక (చ్యూయింగ్ గమ్) టిటానియమ్ డైయాక్సైడు (ఫుడ్ గ్రేడ్) 1 / వరకు కలిగి యుండవచ్చును.

28. అనుమతించ బడిన కోల్‌తార్ ఆహార రంగులు :-

క్రింద చెప్పబడినవి తప్ప ఇతర కోల్‌తారు ఆహార రంగులు లేక వాని మిశ్రమములు ఆహారములో వాడరాదు.

| రంగు | సాధారణ నామము | రంగు సూచిక | రసాయనిక తరగతి |
|---|---|---|---|
| 1. ఎరుపు | పోన్ క్యూ-4 ఆర్. | 16255 | అజో |
| | కార్మొసోయిన్ | 14720 | ,, |
| | ఫాస్ట్ రెడ్-ఇ | 16045 | ,, |
| | అమరాంత్ | 16185 | ,, |
| | ఇర్థోసైన్ | 45430 | క్సాంథీన్ |
| 2. పసుపు | టార్ట్రాజైన్ | 19140 | పైరాజోలోన్ |
| | సన్‌సెట్ ఎల్లో ఎఫ్ సి.ఎఫ్. | 15985 | అజో |
| 3. నీలం | ఇండిగో కారమైన్ | 73015 | ఇండి గోయిడ్ |
| | బ్రిలియంట్ బ్లూ ఎఫ్.సి.ఎఫ్ | 42090 | ట్రయారిల్ మేథేన్ |
| 4. ఆకుపచ్చ | గ్రీన్ - యస్ | 44090 | ట్రయారిల్ మేథేన్ |
| | ఫాస్ట్ గ్రీన్ యఫ్.సి.ఎఫ్. | 42053 | ,, |

29. అనుమతించ బడిన కోల్‌టారు ఆహార రంగులు (dyes) నిషేధం:-

క్రింద ఉదహరించబడిన వానిలో తప్ప ఇతర ఆహార పదార్థము లలో లేక పైన, అనుమతించబడిన కోల్‌తారు ఆహార రంగులు వాడుట నిషేధించబడినది.

ఎ. మిక్స్‌డ్ ఐస్ క్రీంతో సహా, ఐస్‌క్రీం,

బి. పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, జున్ను, ఛన్నా, కండెన్స్‌డ్ పాలు, క్రీమ్, స్కిమ్డ్ పాలు, మజ్జిగ, టోన్డ్ పాలు, డబుల్ టోన్డ్ పాలు, రికంబైన్డ్ పాలు, స్కిమ్డ్ పాలు ఛన్నా స్టాండర్డయిజ్డ్ పాలఛన్నా ఖోవా, డ్రైహోల్ పాలు, డ్రై స్కిమ్డ్‌పాలు, బేబీఫుడ్స్ తప్ప యితర పాడి.

సి. [× × ×]

డి. [× × ×]

ఇ. బిస్కట్లు, పేస్ట్రీ, మిఠాయి దాల్ మోట్, మోంగ్రా, ఫూల్ గులాబ్, వేఫర్, సాగో, సాదా దాల్ బాజీ, వేఫర్ వంటి ఖారాలు, మరియు తీపి పదార్థములు.

యఫ్. సీసాలలో, మరియు డబ్బాలో స్ట్రాబెర్రీలు మరియు చెర్రీలు, పీట, నిల్వ చేయబడిన లేక ప్రాసెస్ చేయబడిన బొప్పాయి, టమాటో రసం, పండ్ల సిరప్, స్క్వాష్, పండ్ల పానీయములు, ఫ్రూట్ డ్రింక్, జామ్ మరియు మార్మలేడ్.

[క్లాజు యఫ్ జి. యస్. ఆర్. 764 తేదీ 15-11-84 ద్వారా సవరించబడినది. క్లాజు (i) తొలగించబడినది.]

జి. టీ, కోకో, మాల్టెడ్ ఫుడ్స్, కాఫీ తప్ప, మత్తు కలిగించని పానీయములు,

జి. జి. మత్తు పానీయములు, (21 మే 1977 వరకు)

హెచ్. కస్టర్డ్ పౌడరు,

ఐ. [× × ×]

జె. సూప్ పౌడరు,

కె. [× × ×]

యల్. ప్రోసెస్డ్ లేక ప్రిసర్వ్డ్ కూరగాయలు

యం. రుచికారకములు

యన్. ఐస్ కాండీ

ఒ. తీపి చేయబడిన ఐస్, పీచు మిఠాయి, మరియు సదృశ పదార్థములు

30. అనుమతించబడిన రంగుల గరిష్ఠ పరిమితులు :-

రూలు 29లో ఉదహరించబడిన ఏ ఆహార పదార్థములోనయినా కలుపదగిన, అనుమతించబడిన కోల్ తారు రంగు లేక రంగుల మిశ్రమం

యొక్క గరిష్ట పరిమాణం వినియోగమగు ఆహారము లేక పానీయములో 1 కిలో గ్రాముకు 0.2 గ్రా. దాటి యుండ రాదు.

31. రంగుల స్వచ్ఛత :—

రూలు 28లో పేర్కొనబడిన రంగులు ఏదేని ఆహారపదార్థము యొక్క తయారీలో ఉపయోగించినప్పుడు, స్వచ్ఛమయినవిగను, ప్రమాదకరమయిన అపరిశుద్ధ పదార్థములు లేకుండగను యుండవలెను.

## భాగం VII - ఆహారముల ప్యాకింగు మరియు లేబిలింగ్.

32. లేబిల్ యొక్క అంశములు :—

ఈ నియమములలో వేరే విధంగా చెప్ప బడియుంటే తప్ప ప్రతి లేబిల్ పైన—

ఎ. ప్యాకేజిలో యున్న ఆహారము యొక్క పేరు, వ్యాపారనామము, లేక వర్ణన,

బి. తయారీదారు, లేక దిగుమతిదారు, లేక విక్రయదారు లేక ప్యాకర్ యొక్క పేరు, వ్యాపార చిరునామా,

సి. అనుమతించబడిన రెండవ శ్రేణి పరిరక్షక పదార్థము మరియు/లేక అనుమతించబడిన రంగు మరియు/లేక అనుమతించబడిన ఆక్సీకరణ నిరోధక పదార్థము (Anti-Oxidant) మరియు/లేక విటమిన్లు మరియు/లేక యాంటికేకింగ్ ఏజెంటు, మరియు/లేక స్థిరీకరణ కారకము మరియు/లేక ఎమల్సీకరణ కారకము మరియు/లేక ఖనిజము, కలిపినప్పుడు, అనుమతించబడిన రెండవ శ్రేణి పరిరక్షక పదార్థము మరియు/లేక అనుమతించబడిన రంగు మరియు/లేక అనుమతించబడిన ఆక్సీకరణ నిరోధక పదార్థము మరియు/లేక విటమిను, యాంటీకేకింగు ఏజెంటు మరియు/లేక

స్థిరీకరణ కారకము మరియు/లేక ఎమల్సీకరణకారకము మరియు/లేక ఖనిజము కలిగియున్నదని స్టేటుమెంటు;

డి. సందర్భమునుబట్టి నికర తూకం లేక సంఖ్య, లేక కొలత లేక పరిమాణము; మినహాయింపు – బిస్కట్లు, రొట్టె, మిఠాయి (కన్ ఫెక్షనరీ) మరియు తీపి పదార్థములకు సగటు తూకం, మరియు/లేక కనీస నికర తూకం తెలియ పరచవచ్చును.

ఇ. హిందీ లేక ఇంగ్లీషు అంకెలలో లేక అక్షరములలో లేక రెంటి కలయికలో బ్యాచ్ నంబరు లేక కోడ్ నంబరు

అయితే 60 గ్రాముల బరువుకు మించని ఆహార ప్యాకింగులకు క్లాజు (డి) మరియు (ఇ)లోని వివరములు పేర్కొనవసరం లేదు.

అంతేగాక

ఎ. కార్బనేటెడ్ పానీయముల పాత్రలు (సోడా సీసాలు) మరియు

బి. 60 గ్రాములకు మించిన మరియు 120 గ్రాములకు మించని బిస్కట్లు, మిఠాయిలు, తీపి పదార్థములు, ప్యాకేజీల విషయములో క్లాజు (డి) మరియు (ఇ)లోని వివరములు పేర్కొనవసరం లేదు.

అంతేగాక, రొట్టె ప్యాకేజీ మరియు స్టెరిలైజ్డ్ పాలతో సహా పాల సీసాల విషయంలో క్లాజు (ఇ)లోని వివరములు పేర్కొనవసరం లేదు.

విశదీకరణ 1 :-

లేబిల్ అనుపదము అర్థము ఆహారముగల పాత్ర, కవరు, మూత మరియు/లేక బిరడా మీద, చేవ్రాతలో, అచ్చులో, బొజ్జములలో, స్టెన్సిల్‌లో, ఎంబాస్‌లో, లేక ముద్ర వేయబడిన విషయ ప్రకటన.

విశదీకరణ 2 :-

బాచ్ నంబరు, లేక కోడ్ నంబరు, తయారీలో ఆహారము యొక్క జాడ తీయుటకు మరియు పంపిణీలో గుర్తించుటకు ఆనవాలు.

యఫ్. సరుకు తయారు చేయబడిన లేక ప్యాకింగు చేయబడిన నెల సంవత్సరము, అయితే-

i) తిరిగి నింపుటకు వాడకందారుచే వాపసు చేయబడు ఏదేని పాలద్రవము, పాలు భాగాంశము సంబారముగా గల మృదు పానీయము, మరియు వెంటనే వడ్డించబడు పానీయములు, తత్ సదృశములు గల సీసాలు,

ii) రొట్టె, డబ్బాలో పెట్టని కూరగాయలు, పండ్లు, ఐస్ క్రీమ్, వెన్న, జున్ను, చేప, మాంసం, లేక అటువంటి ఏ యితర పదార్థమయిన గల ప్యాకేజీ,

iii) తూకంపై లేక కొలతపై అమ్మినప్పుడు నికర తూకం 20 గ్రాములు లేక కొలత 20 మి. లీ. లేక అంతకు తక్కువ ఆహార పదార్థము గల ప్యాకేజీ,

—పైన ఆహారము తయారు చేయబడిన లేక ముందుగా ప్యాకింగు చేయబడిన నెల, సంవత్సరము గల ప్రకటన చేయనక్కర లేదు.

విశదీకరణ 1 :-

కండెన్సెడ్ మిల్క్, 'పాలద్రవము' లోనికి రాదు. తయారు చేయబడిన లేక ముందుగా ప్యాకింగు చేయబడిన నెల సంవత్సరము, అక్షరములలో గాని, నెల లేక సంవత్సరం తెలియపరచు ఏదేని అంకెలలోగాని రెంటిలోగాని ప్రకటించవచ్చును.

32. ఎ :- పోషకాహారము :-

ఖనిజములు, ప్రోటీన్లు, విటమిన్లు వంటి పోషక పదార్థములతో పుష్టి చెందించబడిన ఆహార పదార్థముగా చెప్పబడినప్పుడు అట్లు కలుపబడిన పోషక పదార్థముల పరిమాణములను లేబిల్‌పై తెలియపరచవలెను.

33. లేబిల్‌పై వివరముల లేక ప్రకటనల భాషలు :-

ఈ నియమముల ద్వారా లేబిల్‌పై పేర్కొనవలసిన వివరములు లేక ప్రకటన ఇంగ్లీషులో లేక దేవ నాగరిలిపిలో హిందీలో ఉండవలెను.

అయితే ఇందులోని ఏదియు ఈ నియమములో అవసరమయిన భాషలకదనంగా ఇంకే భాషను వాడుటనయిననూ నివారించదు.

## వ్యాఖ్య

గమనిక :-

ఈ నియమము దృష్ట్యా, తదుపరి నియమములలో నిర్దేశించబడిన లేబిల్‌పై ప్రకటనలు ఆంగ్లములో ముద్రించబడినవి.

34. ప్రకటన గీతచే చుట్టబడవలెను :-ప్రకటన చుట్టు గీత ఉండవలెను:-

'చంటి పిల్లలకు అయోగ్యము' (Unsuitable For Babies) అను ప్రకటన చేయవలసినప్పుడు ఆ పదముల చుట్టూ మరియొక గీత ఉండవలెను

35. చుట్టు గీత యొక్క దూరము :-

"చంటి పిల్లలకయోగ్యము" (Unsuitable For Babies) అను పదములలోని ఏ భాగమునకయిననూ ఆ పదముల చుట్టూ ఉండే గీతకును గల మధ్య దూరము 1·5 మి.మి. తక్కువగాకుండ ఉండవలెను.

36. ప్రకటనకు వాడిన టైపు సైజు:-

ప్రకటనలో వాడు టైపు, చదువరికి ప్రస్ఫుటముగా కనుబడు నంత మరియు ఎట్టి పరిస్థితులలోనూ 3 మి.మీ. ఎత్తుకు తక్కువగాని పరిమాణములో ఉండవలెను. (Synthetic) అను పదము ఎక్కడెక్కడ వాడినా పదార్థము యొక్క పేరునకుపయోగించిన పరిమాణములోనే ఉండవలెను.

అయితే, 25. చ. సెం. మీ. మించని వైశాల్యం గల ప్రకటనలో వాడబడిన టైపుల ఎత్తు 1.0 మి. మీ. తక్కువగాకుండ ఉండవలెను.

37. లేబిల్ పై అసత్యపు లేక దారి తప్పించునట్టి ప్రకటనలు లేకుండుట:-

లేబిల్, ప్యాకేజిలోని ఆహారమునకు సంబంధించిన వివరములు, పరిమాణము లేక పోషక విలువకు సంబంధించి లేక ఆహారము యొక్క మూల స్థానము గురించి, అసత్యమయిన లేక దారి తప్పించునట్టి ఎటువంటి ప్రకటన, స్వత్వ ప్రతిపాదికము (Claim) డిజైను, డివైస్, (Device) ఫాన్సి పేరు పొట్టిపేరు కలిగియుండరాదు.

ఐతే బార్లీ, సుగర్, బుల్స్ఐ, క్రీమ్ క్రాకర్ వంటి కన్ఫెక్షనరీ బిస్కట్లు మరియు తీపిపదార్థముల యొక్క లేక జింజర్ బీర్, గోల్డ్ స్పాట్ వంటి వాయుపూర్వక పానీయములయొక్క స్థాపితమయిన వ్యాపార నామములు లేక ఫ్యాన్సీ పేర్లకు లేక అంతర్జాతీయ వ్యాపారములో, వ్యవహారములో నిలచియున్న ఇతర పేర్లకు ఈ నియమము వర్తించదు.

37-ఏ. యాజమాన్య ఆహారములు మరియు చంటిపిల్లల ఆహారములు:-

అపెండిక్స్-బి లో ప్రమాణములు విహితము చేయబడని చంటిపిల్లల ఆహారము భారత ప్రభుత్వము నుండి అట్టి ఆహారమునకు

మరియు దాని లేబిల్ కు ఆమోదము పొందిన తరువాతనే అమ్మకము నకు తయారీ, ప్రదర్శన లేక నిల్వ చేయవలెను.

## వ్యాఖ్య

గమనిక :

రూలు 37-ఎ 1974 లో ప్రవేశపెట్టబడి 1983 లో సవరింపబడినది. అయితే జి, యస్. ఆర్. 500 తేదీ 9-7-84 ద్వారా పూర్తిగా క్రొత్త నియమము ప్రత్యామ్నాయము చేయబడినది.

38. లేబిల్ పై చట్టమునకు, నియమములకు విరుద్ధమైన ప్రస్తావన లేకుండుట :-

లేబిల్, ఈ చట్టము లేక నియమముల ప్రకారము లేబిల్ పై నుదహరించవలసిన వివరములు లేక ప్రకటనను సూటిగా గాని, గూఢముగా గాని ఖండించు, పరిమిత మొనర్చు, పరివర్తించు విధంగా ఎటువంటి వ్యాఖ్య, ప్రస్తావన, వివరణ కలిగియుండరాదు.

39. వైద్య వృత్తిచే సిఫారసు చేయబడినట్లు సూచనచేయు పదములు లేబిల్ పై వాడకుండుట :—

'వైద్య వృత్తిచే సిఫారసు చేయబడినది' (Recommended by the Medical Profession) అను పదములు గాని, లేక ఆహారము వైద్య వృత్తిచే సిఫారసు చేయబడినదని, విహితమైనదని, లేక ఆమోదించబడినదని సూచించు పదములు అమ్మకమునకు ఆహారము గల ఏ ప్యాకేజిపై లేబిల్ పైన కనిపించరాదు.

40. 'అనుకరణ' సూచించు పదములు అనుమతి లేకుండ వాడుట నిషేధము :—

(1) అట్టి పదము లేక పదముల వాడుక ప్రత్యేకంగా యీ నియమముల ద్వారా అనుమతించిన తప్ప 'ఇమిటేషను' అను పదము

లేక ఆ పదార్థము ఆహారమునకు బదులుగా వాడినది అని అర్థము వచ్చు లేక సూచించునట్టి పదము లేక పదములు ఆహార ప్యాకేజికి తగిలించిన లేబిల్ లేక స్టేటుమెంటు పైన వ్రాయరాదు.

(2) నిర్ణీతమైన పరిమాణములో పండ్లరసము లేని ఫ్రూట్ సిరప్, ఫ్రూట్ జ్యూస్, ఫ్రూట్ స్క్వాష్, ఫ్రూట్ బివరేజి లేక కార్డియల్ లేక క్రష్‌లు, (సందర్భానుసారంగా) ఫ్రూట్ సిరప్, ఫ్రూట్ జ్యూస్, ఫ్రూట్ స్క్వాష్, ఫ్రూట్ బివరేజి లేక కార్డియల్ లేక క్రష్‌గా వర్ణించబడరాదు; మరియు 'సింథటిక్ ప్రోడక్ట్స్' అని వర్ణించబడవలెను. ప్రతి కృత్రిమ ఉత్పత్తి లేబిల్‌పైన స్పష్టముగా, ప్రముఖంగా, 'సింథటిక్' (Synthetic) అని ప్రకటించవలెను. వాడకందారుకు అది పండ్ల ఉత్పత్తి అని నమ్మిక కలిగించునట్లుగా సదరు పదార్థము కలిగిన పాత్రకు తగిలించిగాని, అంటించిగాని, రేపరుపై ముద్రించిగాని లేబిల్ కలిగియుండరాదు. అట్టి ఉత్పత్తిని వర్ణించుటలో 'పండు' (Fruit) అను పదము వాడరాదు. సదరు ఉత్పత్తి 'పండు' బొమ్మ కల్గిన లేబిల్ వేసి అమ్మరాదు. సహజ రుచి కలిపినప్పుడు లేబిల్‌పై "Contains added flavour" అను అక్షరములు మరియు కృత్రిమ రుచి కలిపినప్పుడు 'Artificially flavoured' అని ఉండవలెను.

పండ్ల రసము లేక పిప్పి కలిగియుండని కర్బనీకృత పానీయము (Corbonated Water) (సోడా) వాడకందారుకు అది పండ్లరసము అని నమ్మకం కలిగించునట్లుగా లేబిల్ కలిగియుండరాదు.

(3) విటమిన్ 'సి'తో బలభద్రము చేయబడినట్లు చెప్పబడిన, ఏదేని పండ్ల లేక కాయగూరల ఉత్పత్తి 100 గ్రాముల పదార్థములో 40 మి. గ్రా. లకు తక్కువ గాకుండ యాస్కార్బిక్ ఆమ్లము కలిగియుండవలెను.

41. నకిలీలు శుద్ధమైనవిగా గుర్తు పెట్టబడరాదు :-

ఏదేని ఆహార పదార్థము యొక్క ఇమిటేషను కలిగియున్న ప్యాకేజిపై లేబిల్‌లో 'శుద్ధమైన' (Pure) అను పదము లేక అట్టి అర్థము వచ్చు ఇతర పదము లేక పదములు కలుపరాదు.

42. లేబిల్ యొక్క ఫారం :-

ఎ. (i) కాఫీ చికోరి మిశ్రమం : కాఫీ, చికోరి మిశ్రమము కలిగిన ప్రతి ప్యాకేజిపై క్రింది ప్రకటన ముద్రించబడిన లేబిల్ అంటించబడి యుండవలెను.

**Coffee Blended with Chicory**

Coffee : Percent

Chicory : Percent

బి. (i) కండెన్స్‌డ్ మిల్క్ లేక డెసికేటెడ్ (డ్రైడ్) మిల్క్ : కండెన్స్‌డ్ మిల్క్, లేక డెసికేటెడ్ (dried) మిల్క్ కలిగియున్న ప్రతి ప్యాకేజి క్రింది డిక్లేరేషన్‌లలో ఏదైన తగినట్టిదొకటి లేక రాష్ట్ర ప్రభుత్వముచే అనుమతించబడిన అదే భావముగల యితర ప్రకటన ముద్రించబడియున్న లేబిల్ కలిగియుండవలెను.

ఎ. తీపి చేయబడని కండెన్స్‌డ్ మిల్క్ విషయంలో :-

**Condensed Milk Unsweetened**

(Evaporated Milk)

This tin contains the equivalent of X litres of Milk

బి. తీపి చేయబడిన కండెన్స్‌డ్ మిల్క్ విషయంలో :-

**Condensed Milk Sweetened**

This tin contains the equivalent of X Litres of Milk with sugar added.

సి. తీపి చేయబడని కండెన్స్‌డ్ స్కిమ్డ్ మిల్క్—

**Condensed Skimmed Milk Unsweetened**

(Evoporated skimmed Milk)

This tin contains the equivalent of X litres of skimmed milk.

డి. తీపి చేయబడిన కండెన్స్‌డ్ స్కిమ్డ్ మిల్క్—

**Condensed Skimmed Milk Sweetened**

This tin contains the equivalent of X Litres of skimmed milk with sugar added

డి. డి. తీపి చేయబడిన రుచి కలిగించబడిన కండెన్స్‌డ్ మిల్క్—

This has been flavoured with ........

**Not to be used for Infants below six months**

ఇ. పాల పొడి విషయంలో—

**Milk Powder**

This tin contains equivalent of .... Litres of milk powder.

ఇ. ఇ. లెసిథిన్ కలిగియున్న పాలపొడి విషయంలో—

**Milk Powder in this Package Contains 'Lecithin'**

యఫ్. పాక్షికంగా మీగడ ఎత్తివేయబడిన పాల పొడి విషయంలో-

**Partly Skimmed Milk Powder**

This contains the equivalent of X litres of partly skimmed milk having .... percent milk fat

జి. మీగడ ఎత్తివేయబడిన పాలపొడి విషయంలో-

**Skimmed Milk Powder**

This tin contains the equivalent of X litres of skimmed milk

ii) ప్రతి సందర్భములోను ప్రకటన (x) ఉన్న చోట సరియైన సంఖ్య, అక్షరములలో మరియు అంకెలలో వ్రాసి, పూర్తి చేయబడవలెను.

ఉదాహరణకు-

"One and half (1 1/2)" మరియు సందర్భానుసారంగా భిన్నములు పావులు, అర్ధలుగా, వ్రాయబడవలెను. ఈ నియమముల క్రింద, పాలు లేక మీగడ ఎత్తి వేసిన పాల యొక్క లీటర్లు నిర్ణయించు నిమిత్తం, 'పాలు' అనగా 3.5 శాతము తక్కువ కాని పాలకొవ్వుతో సహా మొత్త 12.10 శాతముకు తక్కువ గాని పాల పదార్థములు కలిగియున్నవి. 'స్కిమ్డ్ మిల్క్' అనగా పాల కొవ్వు కాక 8.5 శాతము తక్కువగాని పాల పదార్థములు కలిగియున్నవి అని అర్థము.

iii) కండెన్స్డ్ మిల్క్ లేక డెసికేటెడ్ (డ్రైడ్) మిల్క్ కలిగిన ప్యాకేజిమీద పలుచన చేయుటకు క్రింది విధముగా సూచనలు మినహా విహితమైన ప్రకటనకుగాని "machine skimmed" "skimmed" "unsuitable for babies" అను పదములపై గాని, వ్యాఖ్య, వివరణ, లేక ప్రస్తావన ఉండరాదు.

> "To make a fluid not below the composition of fresh milk or skimmed milk (as the case may be) with the contents of this package and (here insert the number of parts) of water by volume to one part by volume of this condensed milk or dessicated (dried) milk."

iv) కండెన్స్డ్ మిల్క్ స్కిమ్డ్ మిల్క్ లేక డెసికేటెడ్ స్కిమ్డ్మిల్క్ కలిగియున్న ప్యాకేజి లేబిల్పై వాని వర్ణనగా లేక వర్ణనలో భాగంగా 'Milk' అను పదము ఎక్కడ కనబడినా "Machine skimmed" లేక "skimmed" లేక "Partly skimmed" అను పదము, సందర్భమును బట్టి ముందుగాని, వెనుక గాని ఉండవలెను.

సి. ఫ్లూయిడ్ మిల్క్ : పాలసీసాల మూతపై అందులోని పాల యొక్క స్వభావము స్పష్టముగా సూచించవలెను. సూచన పూర్తిగా గాని, క్రింద పేర్కొనబడినట్లు సంక్షిప్తముగా గాని యుండవలెను.

1. గేదె పాలు 'బి' అను అక్షరం ద్వారా సూచించవచ్చును.
2. ఆవుపాలు 'సి' అను అక్షరం ద్వారా సూచించ వచ్చును.
3. మేక పాలు 'డి' ,, ,,
4. ప్రమాణీకరించబడినపాలు 'యస్' ,, ,,
5. టోన్డ్ పాలు 'టి' ,, ,,
6. డబల్ టోన్డ్ పాలు 'డి టి' ,, ,,
7. మీగడ ఎత్తివేసిన పాలు 'క' ,, ,,
8. పాస్టరైజ్డ్ పాలు 'పి' తరువాత పాలతరగతి గుర్తు } ,, ,,

ఉదాహరణకు, పాస్టరైజ్డ్ గేదెపాలు "P B" అక్షరములు కలిగియుండవలెను.

లేనిచో, పాల సీసాల మూతల రంగులు పాల స్వభావమును సూచించునట్లుగా ఉండవలెను. పాలు, అమ్ము, నిల్వ చేయు లేక అమ్ముటకు ప్రదర్శించుచోట, రంగుల వర్గీకరణ చూపవలెను. సంబంధిత లోకల్ (హెల్త్) అథారిటీకి ఏక కాలంలో తెలియపరచవలెను, వార్తా పత్రికలు, సమాచార సంస్థల వంటి వాటిని గూడ ఉపయోగించ వచ్చును.

డి. ఐస్‌క్రీం :- వీధులలో గాని పబ్లిక్ వచ్చు స్థలం (Public resort) లో స్టాల్ బండి, ఒంటి చక్రపు బండి, లేక ఇతర వాహనము

ద్వారా, లేక సిబ్బందిగాని, వాహనముగాని లేకుండ, బుట్ట, సీసా, పళ్లెం, లేక ఇతర పాత్రల ద్వారా అమ్మ, అమ్మటకు ప్రతిపాదించు, లేక ప్రదర్శించు ప్రతి ఐస్‌క్రీం, మిక్స్‌డ్ ఐస్‌క్రీం వ్యాపారి తన పేరు, చిరునామా, ఉన్నట్లయితే, తయారీదారు పేరు, చిరునామా, స్పష్టంగా, ప్రముఖంగా, సందర్భమునుబట్టి స్టాల్, వాహనము లేక పాత్రపైన అగుపరచవలెను.

ఇ. ఆకు పత్తిగల ప్రతి ప్యాకేజి, అది దాల్చిన చెక్కనుండి భేదము తెలియునట్లు ప్రకటన ముద్రించబడిన లేబిల్ కలిగి యుండవలెను.

యఫ్. వంటనూనె కలుప బడిన మిరపకాయల ప్రతి ప్యాకేజి, క్రింది లేబిల్ కలిగి యుండవలెను.

**Chillies in the Package Contain an Admixture of not more than 2 percent of ............ ... (Name of Oil)**

జి. ఆకు పత్తి బెరడు గల ప్రతి ప్యాకేజి క్రింది లేబిల్ కల్గియుండ వలెను.

**Assia Bark (Taj)**

జి. జి. దాల్చిన చెక్క గల ప్రతి ప్యాకేజి క్రింది లేబిల్ కల్గియుండ వలెను.

**Cinamon (Dalchini)**

హెచ్ స్టార్చ్ కలిగియున్న ఐస్‌క్రీం, కల్ఫి, కుల్ఫా మరియు చాక్‌లెట్ ఐస్‌క్రీం కల్గియున్న ప్రతి ప్యాకేజీపై లేబిల్ రూలు 43 (2)లో పేర్కొనబడిన ప్రకటన కల్గియుండవలెను.

ఐ. బేకరీ వంటి పరిశ్రమలలో వాడు సోడియం బైకార్బొనేటు తటస్థీకరణ కారకముగా వాడిన కొంతగా మీగడ తీసివేయబడిన పాలపొడి ఈ విధముగా లేబిల్ ప్రకటన కల్గియుండవలెను.

**Unfit for Direct Consumption**

జె. 'హింగ్రా' గల ప్రతి ప్యాకేజి, క్రింది విధముగా ప్రకటన ముద్రించబడిన లేబిల్ కలిగి యుండవలెను.

"This container contains hingra (imported) from Iran/Afghanistan and is certified to be conforming to the standard laid down in the prevention of food Adulteration Rules, 1955"

కె. లేనల్ల మిరియాలు :- లేనల్ల మిరియాలు గల ప్రతి ప్యాకేజి, అగ్‌మార్కు సీలు మరియు రూలు 32లో విహితమైనదానికి అదనంగా క్రింది లేబిల్ కల్గియుండవలెను.

Light Black Pepper (Light Berries)

యల్. మసాలా :- మసాలా మిశ్రమం గల ప్రతి ప్యాకేజి ఉత్పత్తిలోని దినుసులు తూకం ప్రకారం అవరోహణ క్రమంలో పేర్కొన బడిన లేబిల్ కల్గి యుండవలెను.

యమ్. కాంపౌండు ఇంగువ :- ఇంగువ మిశ్రమం గల ప్రతి ప్యాకేజిపై ఉపయోగించబడిన తినదగు స్టార్చి లేక తినదగు పిండి యొక్క సుమారు నిష్పత్తి లేబిల్‌పై సూచించవలెను.

యన్. ఇంప్రూవర్ గాని బ్లీచింగ్, ఏజెంటుగాని వాడబడిన మైదా పిండి గల ప్రతి ప్యాకేజి క్రింది లేబిల్ కల్గియుండవలెను.

"Wheat flour treated with Improver/ Bleaching Agents, to be used by Bakeries only"

ఒ. పామోలిన్, వేరుశనగ నూనెల మిశ్రమముల ప్రతి ప్యాకేజి, క్రింది లేబిల్ కలిగి యుండ వలెను.

**Blend Of Palmolein And Groundnut Oil**

Palmolein Percent
Groundnut Oil Percent

పి. దిగుమతి చేసిన నువ్వు నూనె, ఆవ నూనెల మిశ్రమం గల ప్రతి ప్యాకేజి క్రింది లేబిల్ కలిగి యుండవలెను.

**Blend of Imported Rape - Seed Oil And Mustard Oil**

Imported Rape - Seed Oil Percent
Mustard Oil Percent

క్యూ. కోల్‌టార్ ఆహార రంగుల పదార్థము **మరియు** మిశ్రమము గల ప్రతి ప్యాకేజి పైన మొత్తం కోల్‌టార్ డై యొక్క శాతము తెలియపరచు ప్రకటన ముద్రించబడిన లేబిల్ ఉండవలెను.

ఆర్. ఈ నియమములలో వేరు విధముగా ఉంటే తప్ప, కారమెల్ తప్ప ఇతర స్వాభావిక రంగులు కల్గి యున్న మాల్టెడ్ మిల్క్ ఫుడ్ గల ప్రతి ప్యాకేజీ, క్రింది లేబిల్ కలిగి యుండవలెను.

Malted milk food in this package contains permitted natural colouring matter

యస్. మోనో సోడియం గ్లూటామేట్ కల్గియున్న మాంసం గల ప్రతి ప్యాకేజి క్రింది లేబిల్ కల్గియుండవలెను.

The package of ...... contains monosodium glutamate unfit for infants below 12 months

టి. శుద్ధి చేయుబడిన గుగ్గిలం గల ప్రతి ప్యాకేజి క్రింది లేబిల్ కల్గి యుండవలెను.

**Refined salseed fat**

For use in bakery and confectionery only

యు, మోనో సోడియం గ్లూటామేట్ కలిగి యున్న హైడ్రోలైజ్డ్ విజిటబల్ ప్రోటీను క్యూబులు గల ప్రతి ప్యాకేజీ క్రింది లేబిల్ కల్గియుండవలెను.

This package of ...... contains monosodium glutamate not for use by the children below 12 months.

వి. అల్యూమినమ్ సిలికేట్, యాంటీకేకింగ్ ఏజెంటుగా కల్గియున్న టేబిల్ ఉప్పు గల ప్రతి ప్యాకేజి క్రింది లేబిల్ కల్గియుండవలెను.

**Table salt**

Contains permited Anti - caking agent

డబ్ల్యు. శుద్ధి చేయబడిన గడ్డినూనెగల ప్రతి ఆధారపాత్ర క్రింది లేబిల్ కల్గియుండవలెను.

Refined (Name of the oil) Oil

ఋతే దిగుమతి చేయబడిన తినదగు నూనెల ఆధారపాత్ర (Imported) అనుపదముగూడ ముందు కల్గియుండవలెను.

యక్స్. 40 పి. పి. యం. మించి సల్ఫర్ డయాక్సైడ్ కల్గియున్న ఎండబెట్టిన గ్లూకోస్ సిరప్ గల ప్రతి ప్యాకేజి క్రింది లేబిల్ కల్గియుండవలెను.

Dried glucose syrup for use in sugar confectionery only

వై. ఎగుమతి కొరకు రుచి కలుప బడిన తేయాకు గల ప్రతి ప్యాకేజి క్రింది లేబిల్ గల్గియుండవలెను.

**Tea with (Name of Flavour)**

For Export Only

జడ్. అన్నాట్టో రంగు కలిగిన శాకనూనెల ప్యాకెట్టు లేబిల్‌పై క్రింది లేబిల్ కలిగియుండవలెను.

**Annatto Colour in Oil**

(Name of the oil/oils used)

జి. యస్. ఆర్. 764 (ఇ) తేది 15-11-84 ప్రకారం చేర్చబడినది.

43. ఆహారములో చేర్పు మిశ్రమం, లేక కొరత :-

1. ఏదైనా చేర్పు, మిశ్రమం, కొరత గల ఆహార వస్తువు యొక్క ప్రతి ప్రకటన, ధరల లేక వ్యాపార పట్టిక, లేక లేబిల్ సదరు ఆహారములో చేర్పు, మిశ్రమము, కొరత ఉన్నట్లుగా వివరించవలెను. మరియు అట్టి చేర్పు, మిశ్రమం, కొరత యొక్క స్వభావం మరియు పరిమాణము పేర్కొనవలెను. అట్టి ప్రకటన ధరల, లేక వ్యాపార పట్టిక లేక ఆహారముగల పాత్రకు తగిలించిన లేబిల్ సదరు ఆహారం స్వచ్ఛమైనదని భావన కల్గించు ఎట్టి పదములు కల్గి యుండ రాదు.

అయితే, ఈ నియమము నిమిత్తము, క్రిందివి చేర్పు లేక మిశ్రమంగా భావించరాదు.

ఎ. వెన్న లేక మార్గరన్ లో ఉప్పు

బి. ఆహారములో విటమిన్సు

2. చేర్పు, మిశ్రమం, లేక కొరత వలన స్వచ్ఛముగాని ఆహారము గల ప్రతి ప్యాకేజి, క్రింది ప్రకటన గల లేబిల్ అతికించబడి యుండవలెను.

**Declaration**

This ...... (a) contains an admixture/addition of not more than ...... (b) ...... Percent of ...... (c) .........

ఎ. ఇచట ఆహార పదార్థము యొక్క పేరు వ్రాయుము

బి. ఇచట మిశ్రమము యొక్క పరిమాణము వ్రాయుము

సి. ఇచట మిశ్రమము యొక్క పేరు లేక కొరత అయిన దినుసు పేరు వ్రాయుము.

సందర్భమునుబట్టి "Contains an admixture of" బదులుగా "Contains an addition of" లేక "Is deficient in" అను పదములు వ్రాయవలెను.

3. చేర్పు, మిశ్రమం, కొరత గల ఆహారం అమ్మే వ్యక్తి, కొనుగోలుదారు ప్రకటన చదివి అర్థం చేసికొనగలడు అని నమ్మటకు కారణమున్నప్పుడు తప్ప, అతడు కోరినచో, అమ్మే సమయంలో నోటిద్వారా, లేబిల్ ప్రకటనలోని సమాచారము చెప్పవలెను.

4. ఈ నియమంలోనున్న ఏదియు ఈ చట్టం ప్రకారం లేక దీని క్రింది నియమావళి ప్రకారం స్వచ్ఛమైన పరిస్థితిలోనే అమ్మవలసిన ఏ ఆహార పదార్థమునూ, స్వచ్ఛంగా కాకుండ వేరే విధముగా అమ్మటకు, అధికారమిచ్చుచున్నట్లుగా భావించ రాదు.

5. ఈ రూలులో ఉన్న ఏదియూ, తీపి పదార్థములు, మిఠాయిలు (Confectionery) బిస్కట్లు, బేకరీ ఉత్పత్తులు, ప్రాసెస్ చేయబడిన పండ్లు, ఏరెటెడ్ పానీయములు మరియు రుచి కారకములకు వర్తించదు.

## భాగం VIII

## అమ్మకముల క్రమబద్ధము మరియు నిషేధము

రూలు 44:- కొన్ని మిశ్రమముల అమ్మకము నిషేధము :-

రూలు 43 నిబంధనలలో ఏమి ఉన్నప్పటికి ఏ వ్యక్తియు తాను గాని లేక తన నౌకరు లేక ఏజెంటు ద్వారాగాని—

ఎ. కేవలం పాలనుండి తయారు కాని, లేక 25 శాతము కంటె తక్కువ పాల క్రొవ్వు ఉన్న క్రీమ్,

బి. నీరు కలుపబడిన పాలు,

సి. కేవలం పాల క్రొవ్వునుండి తీయబడని ఏదైన పదార్థము కలిపిన నెయ్యి,

డి. (క్రొవ్వు తీసివేసిన) స్కిమ్డ్ పాలు, పాలుగా,

ఇ. ఏవేని రెండు తినదగిన నూనెలను కలిపి ఒకే తినదగిన నూనెగా,

ఎఫ్. నెయ్యి గాని యే యితర పదార్థముగాని కలుప బడిన వనస్పతి

జి. అనుబంధం — బి లో నిర్ణయించబడిన ప్రమాణములననుసరించి అట్టి కృత్రిమ తీపి చేయు పదార్థము అనుమతించబడినప్పుడు తప్ప, ఏదేని కృత్రిమ తీపి చేయు పదార్థము కలిసియున్న ఆహారము.

హెచ్. అన్య పదార్థములు కల్గియున్న పసుపు,

ఐ. చికోరి కాక ఏ యితర వస్తువుతో నయినా మిశ్రమమయిన కాఫీ,

జె. మరుగ బెట్టిన, పాస్ట్రైజు చేయబడిన లేక స్టెరిలైజు చేయబడిన పాలనుండి తయారుగాని దహీ లేక పెరుగు,

కె. × × × × × ×

ఎల్. నియమములలో చెప్పబడినట్లుగా కాక, పాలలోలేని పదార్థము కల్గియున్న అనుబంధం - బిలో పేర్కొనబడిన పాల ఉత్పత్తి;

—అమ్మరాదు.

అయితే కేంద్ర ప్రభుత్వము రాజ పత్రములో ప్రకటన* ద్వారా కాఫీలో * కరుగు అంశములనుంచి తయారీలను ఈ నియమము యొక్క పరిధి నుండి మినహాయించవచ్చును.

అంతేగాక క్లాజ్ (ఇ) కొరకు నూనెను సజలము చేయకుండా బౌడోయిన్ పరీక్ష (Boudoyin Test) చేసినప్పుడు అనగా 5 మి. లీ. శాంపిల్‌ను (1.19 విశిష్ట సాంద్రత గల) ఉదజహారిక ఆమ్లముతో మరియు 2% Alcoholic ద్రావణముగల 3 మి. లీటర్ల Furfural తో

[* దీని ప్రకారం 'నెస్ కఫే' ఈ రూలు క్రింద మినహాయించబడినది]

బలముగా 2 ని. ఊపి. 5 నిమిషములు నిలకడగా ఉంచగా, లోవిబాండ్ స్కేల్ (Lovibondien Scale) పై 1 సె. మి. సెల్‌లో 15.0. ఎరుపు యూనిట్లు (Red Units) గరిష్ఠ పరిమితిగా (Maximum Tolerance Limit) అనుమతించబడినది.

అంతేగాక,

i) మిశ్రమములో వేరుశనగ నూనె బరువులో 10% కంటె తక్కువ కానప్పుడు,

ii) మిశ్రమము కేంద్ర ప్రభుత్వ పౌర సరఫరా శాఖ లేదా ప్రాధికారమీయబడిన ఏజెంట్లచే ప్రోసెస్ చేయబడిన (Processed) మరియు అమ్మబడిన;

iii) పామోలిన్ మరియు వేరుశనగ నూనెల మిశ్రమము నియమము లలో ఇచ్చిన కొలతలకు అనుగుణంగా ఉన్న యెడల

పామోలిన్ నూనె మరియు వేరుశనగ నూనెల మిశ్రమమునకు క్లాజ్ (ఇ)లో ఉన్న నిషేధము (30-4-1978 వరకు) అమలులో ఉండదు.

అంతేగాక,

దిగుమతి చేసికొనిన నువ్వుల నూనె (Rape-seed oil) ఆవ నూనెల మిశ్రమముల విషయంలో :-

ఎ. మిశ్రమంలో ఆవ నూనె శాతం బరువున 20 శాతము తక్కువ గాకుండ ఉన్నప్పుడు,

బి. మిశ్రమము, భారత ప్రభుత్వ పౌర సరఫరాల శాఖ లేక వారిచే ప్రాధికారమీయబడిన ఏజెంట్లచే తయారు చేయబడి అమ్మబడి నప్పుడు, మరియు,

సి. దిగుమతి చేయబడిన నువ్వులనూనె (Rape-seed oil) మరియు ఆవ నూనెల మిశ్రమము కేంద్ర ప్రభుత్వము విహిత పరచ్చిన ప్రమాణముల కనుగుణంగా ఉన్నప్పుడు

ఈ క్లాజు ఆహార కల్తీ నివారణ (5వ సవరణ) నియమములు, 1977 అమలులోనికి వచ్చిన తేది (5-12-1977) నుండి 1 సం. వరకు వర్తించదు.

44-ఎ. ఏ రాష్ట్రంలోనయినా, అట్టి రాష్ట్ర ప్రభుత్వము, రాజపత్రములో అధి సూచనద్వారా, దీని గురించి, పేర్కొనిన తేదీ నుండి, ఏ వ్యక్తి అయినా,

ఎ. లంక ధాన్యము (Kesari Gram) (Lathyrus Sativus) మరియు దాని ఉత్పత్తులు

బి. లంక పప్పు (Kesari Dal) (Lathyrus Sativus) మరియు దాని ఉత్పత్తులు

సి. లంక పప్పు పిండి (Kesari Dal) (Lathyrus Sativus) మరియు దాని ఉత్పత్తులు

డి. లంక ధాన్యము (Lathyrus Sativus) మరియు శనగలు (Cicer arietinum) లేక ఇతర ధాన్యముల మిశ్రమము

ఇ. లంక పప్పు (Kesari dal) మరియు శనగపప్పు లేక ఇతర పప్పుల మిశ్రమము

యఫ్. లంక పప్పు (Kesari dal) పిండి, మరియు శనగపిండి లేక ఇతర పిండిల మిశ్రమం

ఏ తరహాలోనైనా అమ్ముట, అమ్ముటకు, ప్రతిపాదించుట, ప్రదర్శించుట, లేక అమ్ముటకు తన స్వాధీనంలో ఉంచుకొనుట, లేక అమ్ముటకు ద్దేశించబడిన ఏ ఆహార వస్తువుయొక్క తయారీలోనయినా, సంబారముగా ఉపయోగించుట-చేయరాదు.

విశదీకరణ :- లంక ధాన్యము (Kesari gram) కు కొన్ని భారతీయ భాషలలో సమాన పదములు క్రింది విధముగా ఉన్నవి.

అస్సామీ — ఖేసరి, తో౯రా
బెంగాలి — ఖేసరి, తో౯రా, కసూ్సర్, బతూరా
బిహారీ — ,, ,, ,, ,,
గుజరాత్ — లంగ్
హిందీ — ఖేసరీ, కసూ్సర్ కేసరీ, కేసర్ త్రైరీ, బతూరా చప్రీ, దూబియా, కన్సారీ, కేసారీ, ల్రతి, తీన్ రా, తూ్యరీ, కసో్సర్
కన్నడ — లాకీ, బేళ్ళి, కేసరి బేళి
మలయాళం — కేసరి, లంకీ, వట్టు
తమిళం — ముకు
మరాఠి — లాఖేరీ, బట్రి, లాఖి, లంగ్, ముత్రా, తో౯రా, బట్రోలీ కేదాల్, లాఖ్
ఒరియా — ఖేసరా, ఖేసరీ, ఖేసరీదాల్
పర్షియన్ — మాసంగ్
పంజాబీ — కైసారీ, చుదాల్, కారస్, కారిల్, కాసా
సంస్కృతము — సందీక, త్రిపూటీ
సింధి — మిట్టర్
తెలుగు — లంక

## వ్యాఖ్య

ఈ రూలు క్రింద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం లంక ధాన్యము/పప్పు (అమ్మకం/నిషేధం) ఉత్తర్వు 1963 జి. ఒ. యం. యస్. 1522 హెల్త్ తేది 28-4-64 ద్వారా చేసింది రాజపత్రములో ప్రకటించినది.

**44 – ఏ. పండ్లు పక్వము చేయుటలో కార్బైడ్ వాయువు వాడకం నిషేధం :**

ఏ వ్యక్తియు సామాన్యంగా కార్బైడ్ గాస్ అని పిలువబడు ఎసటలీను వాయువుతో కృత్రిమంగా పక్వము చేయబడిన పండ్లు, అమ్మట, అమ్మటకు ప్రతిపాదించుట ప్రదర్శించుట చేయరాదు. ఏ రూపములోనయినా అమ్మటకొరకు తన ఆవరణాలో కల్గియుండరాదు.

**44 – బి. అమ్మబడిన ప్రాంతమునకు నిర్ణీతమైన రైచెర్టు విలువకంటె తక్కువ గలనేతి అమ్మకంపై పరిమితి :**

అమ్మకమునకు దిగుమతి చేయబడిన లేక నిల్వ చేయబడన ప్రాంతమునకు నిర్ణీతమైన, రైచెర్టు విలువ మరియు 40° సి వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువకు భిన్నమైన ప్రమాణము గల నెయ్యి ఆగ్ మార్క్ సీలుతో తప్ప, సదరు ప్రాంతములో అమ్మబడరాదు, నిల్వ చేయబడరాదు.

అయితే అట్టి నేయి i. ఆగ్ మార్క్ సీలువేసిన పాత్ర తెరచిన తరువాత ఒకసారిగా 2 కెజీలకు ఎక్కువగాని పరిమాణములలో విడిగా అమ్మవచ్చును.

ii. మరియు (తీపి పదార్థములతో సహా) కన్ఫెక్షనరీ తయారీలలో వాడవచ్చును.

2. 1 వ సబ్ రూలులో పేర్కొనబడిన విధంగా అట్టినేయి, మరియు అట్టినేయి వాడబడిన కన్ఫెక్షనరీ అమ్ముచున్న వ్యక్తి—

సె. 10 క్రింద ఫుడ్ ఇన్‌స్పెక్టరు విశ్లేషణకొరకు శాంపిల్ తీసికొనినప్పుడు మరియు సె. 12 క్రింది కొనుగోలుదారు శాంపిల్ విశ్లేషణ చేయగోరినప్పుడు ఫారం VI-B లో డిక్లరేషను (ప్రకటన) యివ్వవలెను.

3. విశ్లేషణచేయగా, శాంపిల్, తయారీ అయినట్లు చెప్పబడిన ప్రాంతమునకు విహితపరిచిన ప్రమాణములకు సరిపోయినచో అది, కేవలం అమ్మబడిన ప్రాంతమునకు విహితపరిచిన ప్రమాణములకు సరిపోని కారణంవలననే, కల్తీ ఆహారంగా పరిగణించరాదు.

44 – సి. త్రిపుర, అస్సాం, మరియు పశ్చిమ బెంగాల్‌లో తయారైన నువ్వుల నూనె అమ్మకంపై పరిమితి :

త్రిపుర అస్సాం, పశ్చిమ బెంగాల్‌లలో పెరిగిన తెల్ల నువ్వుల నుండి తీయబడి, నువ్వులనూనెకు పేర్కొనబడిన ప్రమాణములకు భిన్నమైన ప్రమాణములు గల నువ్వుల నూనె, ఆగ్‌మార్క్ లేబిల్ గల సీల్లు వేయబడిన పాత్రల లోనే అమ్మవలెను. ఆగ్‌మార్క్ లేబిల్ లేకుండ ఈ నువ్వులనూనె అమ్మినప్పుడు, అమ్ముటకు ప్రతిపాదించినప్పుడు, నువ్వులనూనె [Til oil] ఇవ్వబడిన ప్రమాణము వర్తించును.

44 – డి. కార్బియా కల్లోసా మరియు తేనె [Honey dey] అమ్మకంపై పరిమితి :—

కార్బియూ కల్లోసా మరియు హానిడ్యూ అగ్‌మార్క్‌ సీలు కలిగిన పాత్రలలోనే అమ్మవలెను.

14 - ఇ. కంగ్రా టీ అమ్మకంపై పరిమితి :—

కంగ్రా తేయాకు, అగ్రికల్చరల్ ప్రొడ్యూస్ (గ్రేడింగ్ అండ్ మార్కెటింగ్) చట్టం 1937, మరియు దాని క్రింది నియమముల ప్రకారం వర్గీకరణచేసి, గుర్తువేయబడిన తర్వాతనే అమ్మవలెను, అమ్మటకు ప్రతిపాదించవలెను.

45. శుద్ధమైన తేనెను పోలియుండే, శుద్ధమైనదిగాని ఆహారమును శుద్ధమైన తేనెగా గుర్తువేయబడరాదు.

ఏ వ్యక్తియు శుద్ధమైన తేనె గాకుండా తేనెను పోలియున్న ఏ పదార్థము యొక్క ప్యాకేజిపై లేబిల్‌పై లేక ఏ ప్రకటనలోనయినా 'తేనె' (Honey) అను పదము లేక తేనె అని సూచించు పదము, గుర్తు, బొమ్మ లేక డిజైను వాడరాదు.

46. నేయి లేక వెన్న మిశ్రమములు అమ్మట లేక అమ్మకమునకు ఉపయోగించుట నిషేధం :

ఏవ్యక్తియు, నెయ్యి లేక వెన్న మిశ్రమము మరియు (a) నెయ్యి లేక వెన్నకు నకిలీగా లేక ప్రత్యామ్నాయముగా తయారు చేయబడిన లేక (b) 'నేయి' నిర్వచమునకు సరిపోని నూనె లేక క్రొవ్వుతో తయారయిన లేక కల్గియున్న పదార్థముల మిశ్రమము, అమ్మట లేక అమ్మటకు లేక అమ్మబడు ఆహారము తయారీలో ఒక సంబారముగా వాడుటకు తన స్వాధీనములో ఉంచుకొనుట, చేయరాదు,

అయితే ఈ రూల్‌లో నిషేధించబడిన మిశ్రమము ఏదేని ఆహార పదార్థపు తయారీలో కావలసిన ఎడల, అట్టి మిశ్రమమును అట్టి ఆహార పదార్థమును తయారు చేయునప్పుడు మాత్రమే చేయవలెను.

47. కలిపిన కృత్రిమ తీపి చేయు పదార్థము లేబిల్‌పై సూచించవలెను.

అనుబంధం - బి లో విహిత పరచిన ప్రమాణముల ప్రకారం అట్టి కృత్రిమ తీపి చేయు పదార్థము కలుపుట అనుమతించిన సందర్భములలో తప్ప, ఏ ఆహార పదార్థమునకు (Sachrine) శాకరిన్ గాని లేక ఏ ఇతర కృత్రిమ తీపి చేయు పదార్థమును గాని కలుప రాదు. మరియు ఏదేని ఆహారమునకు ఏదేని కృత్రిమ తీపి చేయు పదార్థము కలిపిన యెడల అట్టి ఆహారము కలిగి ఉన్న పాత్రపై ఈ క్రింద చూపిన నమూనాలో తెలియజేయు లేబిల్ బంకతో అతికించబడవలెను.

This......... (name of food) contains an admixture of ........... (name of the artificial sweetener)

48. సహజముగా చనిపోయిన జంతువుల లేక పక్షుల (కోళ్ళ) మాంసం వాడకం నిషేధం;

ఏ వ్యక్తియు సహజ కారణములవలన చనిపోయిన జంతువుల, లేదా పక్షుల (కోళ్ళ) మాంసము అమ్ముట లేక అమ్మబడు ఆహార తయారీలో ఒక సంభారముగా వాడుట చేయరాదు.

48 — ఎ. అనుమతింప బడిన ఆహార రంగుల అమ్మకం :—

i) ఏ వ్యక్తియు కోల్ తార్ (Coaltar) ఆహారపు రంగులను గాని లేదా వాటి మిశ్రమములను లేదా ఏదేని అట్టి రంగుల తయారీలను ఆహారములోగాని పైనగాని వాడుటకు అమ్మకము, నిల్వ, పంపిణీ లేక అమ్ముటకు ప్రదర్శన చేయరాదు.

ii) ఏ వ్యక్తి కూడ ఆహారములోగాని, పైనగాని వాడుటకు అనుమతింపబడిన కోల్ తార్ రంగు (Coaltar dye) ను ఆధారపాత్రపై ఈ క్రింది వివరములు ఉన్న లేబిల్ లేకుండా అమ్మరాదు.

ఎ. "Food colour" అను పదములు

బి. రంగు (Dye stuff) యొక్క, రసాయన నామము, సాధరణ లేక వ్యాపార నామము, రంగు సూచి,

iii) ఏ వ్యక్తియు అనుమతింపబడిన కోల్ తార్ రంగుల మిశ్రమమును ఆహారములోగాని, పైనగాని అవి గల పాత్రపై ఈ క్రింది వివరములు ఉన్న లేబిల్ లేకుండా అమ్మరాదు.

ఎ. "Food colour mixture" అను పదములు,

బి. రంగు (dye stuff) యొక్క రసాయననామము, సాధారణ లేక వ్యావార నామము.

IV) ఏ వ్యక్తి కూడా అనుమతింపబడిన కోల్ తార్ రంగుల తయారీని, ఆహారములోకాని లేదా పైనగాని వాడుటకు అదిగల పాత్రపై ఈ క్రింది వివరములు ఉన్న లేబిల్ లేకుండా అమ్మరాదు.

ఎ. "Foodcolour preparation" అను పదములు.

బి. తయారీలో వాడబడిన వివిధ సంబారములు.

V) సబ్ రూల్ (1)లో సూచించబడిన లైసెన్సు రూల్ 50 యొక్క సబ్ రూల్ (2) క్రింద నియమించబడిన లైసెన్సింగ్ అథారిటీచే ఇవ్వబడవలెను. మరియు రాష్ట్ర ప్రభుత్వము ఇట్టి మేరకు పేర్కొనిన షరతులకు లోబడి యుండవలెను.

VI) అన్ని ఆహార రంగులు, కుంకుమపువ్వు, కర్కుమిన్, లలో తప్ప, సహజ ఆహారరంగులు, అనుమతించబడిన కోల్ తార్ ఆహార రంగులు కుంకుమ, కర్కుమిన్ తప్ప, వాని మిశ్రణాల తయారీలతో సహా, అన్ని ఆహార రంగులు, భారత ప్రమాణ ముల సంస్థ ధృవీకరణ గుర్తుతో మాత్రమే అమ్మబడవలెను.

జి. యస్. ఆర్. 764 (ఇ) తేదీ 15-11-84 ద్వారా మార్చబడినది.

48 — బి. కీటకములచే దెబ్బతినిన ఎండు ఫలములు మరియు పోకల (nuts) అమ్మకము.

ఎండిన ద్రాక్షపండ్లు, అత్తిపండ్లు, జీడిపప్పు, యాప్రికాట్లు, బాదాంపప్పు వంటి, ఎండు ఫలములలో, మరియు పోకలలో కీటకములచే దెబ్బతినినవి లెక్కింపున 5 శాతము మించకుండ ఉండవచ్చును.

4? — సి. ఆహార సంకలనాత్మత పదార్థముల (Additives) అమ్మకం

కొన్ని ఆహారములలో కలుపుటకు అనుమతించబడిన ఈ క్రింది చెప్పబడిన ఆహార సంకలనాత్మక పదార్థములు భారత ప్రమాణ సంస్థవారి ధృవీకరణ పత్రపుగుర్తుతో మాత్రమే అమ్మవలెను.

1. సల్ఫ్యూరిక్ యాసిడ్ (ఫుడ్ గ్రేడ్)
2. సోడియం ప్రొపియనేట్ (ఫుడ్ గ్రేడ్)
3. కాల్షియం ప్రొపియనేట్ (ఫుడ్ గ్రేడ్)
4. సార్బిక్ యాసిడ్ (ఫుడ్ గ్రేడ్)
5. పొటాషియం మెటాబైసల్ఫైట్ (ఫుడ్ గ్రేడ్)
6. సోడియం మెటాబైసల్ఫైట్ (ఫుడ్ గ్రేడ్)
7. సార్బిటాల్ (ఫుడ్ గ్రేడ్)
8. బెన్‌జాయిక్ యాసిడ్ (ఫుడ్ గ్రేడ్)
9. సోడియం బెన్‌జోయేట్ (ఫుడ్ గ్రేడ్)
10. ఫ్యూమరిక్ యాసిడ్ (ఫుడ్ గ్రేడ్)
11. సోడియం కార్బాక్సిమిథైల్ సెల్యులోస్ (ఫుడ్ గ్రేడ్)
12. సోడియం అల్జినేట్ (ఫుడ్ గ్రేడ్)
13. ఏగర్ ఏగర్ (ఫుడ్ గ్రేడ్)
14. అల్జినిక్ యాసిడ్ (ఫుడ్ గ్రేడ్)
15. కాల్షియం అల్జినేట్ (ఫుడ్ గ్రేడ్)
16 జెలాటిన్ (ఫుడ్ గ్రేడ్)
17. అస్కార్బిక్ యాసిడ్ (ఫుడ్ గ్రేడ్)
18. బ్యుటిలేటెడ్ హైడ్రాక్సీ టోలోన్ (బి.హెచ్.టి (ఫుడ్ గ్రేడ్)
19. బుటిలేటెడ్ హైడ్రాక్సీ అనిసోల్ బి. హెచ్. ఏ. (ఫుడ్ గ్రేడ్)
20. కేరమెల్ (ఫుడ్ గ్రేడ్)
21. అన్నట్టో కలర్ (ఫుడ్ గ్రేడ్)

భాగం ix

## విక్రయం మరియు లైసెన్సుకు షరతులు.

49. విక్రయమునకు షరతులు.

1. అమ్ముటకు ఉద్దేశించిన ఆహారమునుగాని లేదా ఆహారపు సంబారమును ఉత్పత్తి, తయారీచేయుటకు లేక కలిగి యుండుటకు వాడు ప్రతి ఉపకరము ఆధార పాత్రను అన్ని వేళల మంచి స్థితిలో మరియు మరమత్తులో మరియు శుభ్రముగా మరియు ఆరోగ్యకరముగా ఉంచవలెను. అట్టి ఉపకరమును పాత్రను మరి దేనికి ఉపయోగించరాదు.

2. ఏ వ్యక్తియు సరియైన ఎనామిల్ పూతలేని సరిగా కళాయి పెట్టబడని లేదా అట్టి తయారుచేసే వస్తువు లేదా ఆహారమునకు హాని చేయు లేక ఉపద్రవము కల్గించునట్టి, సామగ్రితో తయారు చేసిన, లేక అట్టి పరిస్థితులలో నుంచిన పాత్రలను అమ్ముటకుద్దేశించబడిన ఆహారమును లేక ఆహార సంబారమును ఉత్పత్తి, తయారీచేయుటలో లేక నిల్వచేయుటలో వాడరాదు.

3. అమ్ముటకుద్దేశించిన ఆహారమును మరియు ఆహార సంబారమును గలిగి ఉన్న ప్రతి ఉపకరము ఆధారపాత్ర అన్ని వేళల, ఆహారము, ధూళి, మురికి, ఈగలు మరియు ఇతర కీటకములనుండి సంరక్షింపబడుటకు గట్టిగా బిగియు మంచి మూతగల్గి లేదా సరిగా బిగియు మూతతో, దగ్గరగా బిగియు మూత లేదా గాజువల లేదా తగినంత సన్నని యితర వస్త్రముచే మూయబడి ఉండవలెను.

5. ఈ క్రింది సామగ్రి లేక లోహములచే తయారు చేయబడిన ఉపకరము లేక ఆధారపాత్ర, ఆహారపు తయారీలో వాడిన యెడల, అట్టి ఆహారము మానవులు భుజించుటకు పనికిరానిదిగా భావించవలెను.

i) త్రుప్పు పట్టిన పాత్రలు;

ii) పెచ్చులు ఊడిన మరియు త్రుప్పు పట్టిన, ఎనామిల్ పూత గల పాత్రలు,

iii) సరిగ్గా కళాయి లేని రాగి లేదా ఇత్తడి పాత్రలు; మరియు

iV) ఉపకరములకు రసాయనిక మేళనములో పోత అల్యూమినము మరియు అల్యూమినము ఎల్లాయ్‌లకు నిర్ణయించబడిన IS 20-1959 లేక పాత్రలకు రాట్ అల్యూమినమ్ మరియు అల్యూమినమ్ ఎల్లాయ్‌లకు నిర్ణయించబడిన IS 21-1959 లకు సరిపోని అల్యూమినంతో తయారు చేయబడిన ఉపకరములు.

అయితే చక్కెర మిఠాయి లేదా నిత్యావసరనూనెలను తయారు చేయుటకై రాగిపాత్రలు సరిగ్గా కళాయి లేనప్పటికి వాడవచ్చును. మరియు అట్టి పాత్రను వాడినంత మాత్రమున ఆ చక్కెర మిఠాయి లేక నిత్యావసర నూనె మానవులు భుజించుటకు తగనిదని భావించరాదు.

6. ఏ వ్యక్తియు లేబిల్ గల సీలు వేయబడిన ఆధార పాత్రలో తప్ప ఒక కిలోగ్రాముకంటే ఎక్కువ బరువుగల కాంపౌండు ఇంగువను అమ్మరాదు.

7. ఏ వ్యక్తియు పాత్రపై రూల్ 42లో పేర్కొనబడిన ఫారంలో ప్రకటన అచ్చు వేయబడ్డ లేబిల్ లేకుండా 'హింగ్రా' అమ్మరాదు.

8. ఏ వ్యక్తియు భారత ప్రమాణముల సంస్థ యొక్క ధృవీకరణ గుర్తులేకుండ టిటానియమ్ ఆక్సైడు (ఆహార తరగతి) అమ్మరాదు.

9. ఏ వ్యక్తియు బేకరీ మరియు మిఠాయిల కొరకు తప్ప సాల్ట్‌పీటరు కొన్న అమ్మరాదు. అది శుద్ధి చేయబడవలెను. మరియు రూలు 42 (T)లో విహితమైన లేబిల్ ప్రకటన కల్గి యుండవలెను.

10. యాంటీ కేకింగ్ ఏజెంటు గల లేబిల్ ఉప్పు రూలు 42(V) లో పేర్కొనబడిన లేబిల్ కల్గియున్న ప్యాకేజీలలో మాత్రమే అమ్మవలెను.

11. ఏ వ్యక్తియు ఆహారములో ఉపయోగించుటకు లాక్టిక్ ఆమ్లము భారత ప్రమాణముల సంస్థ గుర్తులు కల్గియుంటే తప్ప అమ్మరాదు.

12. బట్టీ పద్ధతిలో తయారుచేయబడిన "కథా" ప్రస్ఫుటంగా "Batti Katha" అని గుర్తు వేయబడవలెను.

13. కొబ్బరినూనె తప్ప ఇతర తినదగు నూనెలు, క్రూడ్ (పచ్చి) శుద్ధి చేయబడని స్థితిలో దిగుమతి చేసికొనినప్పుడు, అమ్ముటకుముందు శుద్ధి చేయబడవలెను. అట్టి నూనెలు రూలు 42 (W)లో విధించిన ప్రకటనగల లేబిల్ కల్గియుండవలెను.

14. 40 పి. పి. యం. కు మించి సల్ఫర్ డై ఆక్సైడ్ గల గ్లూకోజ్ సిరప్ రూలు 42 (X)లో పేర్కొనబడిన లేబిల్ గల ప్యాకేజీలలో మాత్రమే అమ్మవలెను.

15. ఏ వ్యక్తియు, ఆహార వస్తువులు ఎక్కడయితే తయారీ, నిల్వ, అమ్మకంకొరకు ప్రదర్శన చేయబడినవో, అదే ఆవరణలో ఏదైనా క్రిమిసంహారిణి యొక్క నిల్వ, అమ్మకముకు ప్రదర్శన చేయరాదు. అమ్మకం అనుమతించరాదు.

అయితే ఈ సబ్ రూలులోనిదేదియు, నివాస గృహములలో ఉపయోగించుటకు ఆమోదించబడి, అట్లు క్రిమిసంహారిణుల చట్టం 1968 (1968 యొక్క 46) క్రింద రిజిస్టరు చేయబడిన క్రిమి సంహారిణులకు వర్తించదు.

విశదీకరణ:— ఈ సబ్ రూలు నిమిత్తం 'క్రిమిసంహారిణి' అను పదం క్రిమిసంహారిణుల చట్టం 1968 లో యివ్వబడిన అర్థమే కల్గియుండును.

50. లైసెన్సుకు షరతులు—

ఏ వ్యక్తికూడా ఈ క్రింద చూపబడ్డ ఏ ఆహార వస్తువులను లైసెన్సు క్రింద తప్ప తయారీ, అమ్మకం, నిల్వ, పంపిణీ లేదా అమ్మకమునకు ప్రదర్శన చేయరాదు.

ఎ. అన్ని తరగతుల మరియు పేర్లు గల పాలు

బి. మీగడ, మలై, పెరుగు, స్కిమ్డ్‌పాలు, పెరుగు ఛన్నా, స్కిమ్డ్‌పాల ఛన్నా, జున్ను, ప్రాసెస్ చేయబడిన జున్ను, ఐస్‌క్రీం, మిల్క్ ఐస్, కండెన్స్‌డ్ పాలు, (తీపి చేయబడినవి, చేయబడనివి), కండెన్స్‌డ్ స్కిమ్డ్‌పాలు, (తీపి చేయబడిన, చేయబడని), పాలపొడి, స్కిమ్డ్‌పాలపొడి, పాక్షికంగా స్కిమ్డ్ పాలపొడి, ఖోవా, చంటిపిల్లల పాల ఆహారము, టేబిల్ వెన్న, వెన్న, దేశీవెన్నవంటి పాల ఉత్పత్తులు

సి. గోమాంసపు క్రొవ్వు, వేటమాంసపు క్రొవ్వు, మేక క్రొవ్వు మరియు పందిమాంసపు క్రొవ్వు మొదలగు తినదగు జంతువుల క్రొవ్వులు,

డి. తినదగు విజిటేబల్ నూనెలు

ఇ. మార్గరిన్‌తో సహా తినదగు క్రొవ్వులు,

యఫ్. పప్పులు, ధాన్యములు, వక్కలు, స్టార్చ్‌లు, సగ్గుబియ్యం, సొజ్జలు, మైదా, బేసన్‌వంటి పిండ్లు మరియు వేవరి ఉత్పత్తులతో సహా పిండ్లనుండి చేయబడ్డ పదార్థములు.

జి. సోడాలవంటి ఆల్కహాలిక్ కాని పానీయములు

హెచ్. టీ, కాఫీ, కోకో మరియు చికోరి

ఐ. అల్లంగాని, పొడిగొట్టిగాని కుంకుమపువ్వు, కూర పొడి, ఆవాలు, ఇంగువ మరియు మిశ్రమ ఇంగువలతో సహా మసాలా దినుసులు సంబారములు.

జె. చక్కెర, తేనె, గుర్, బెల్లం మొదలగు తీపి చేయు పదార్థములు,

కె. ఆహారములో, ఆహారములు పాత్రల రేపర్‌లో వాడుటకు అనుమతించబడిన రుచికారకములు, యాంటీ ఆక్సిడెంట్లు ఎమల్సీకరణ లేక స్థిరత్వ కారకములు,

యల్. కృత్రిమ తీపి చేయు పదార్థములు,

యమ్. మిఠాయి, తీపి పదార్థములు, కారపు పదార్థములు,

యెన్. ఐస్ క్యాండీలు

ఓ. తినదగు జిలాటిన్

పి. బెల్లపు పాగు,

క్యూ. కొబ్బరి,

ఆర్. మాంసము మరియు మాంసపు ఉత్పత్తులు, చేపలు మరియు చేపల ఉత్పత్తులు,

యస్. మానవులు భుజింపదగ్గ వెండి ఆకు

టి. తీపి చేయబడ్డ ఐస్, తీగె క్యాండీలు మరియు అటువంటి ఉత్పత్తులు

యు. చెరకు రసము, తాజా పండ్ల రసము మరియు షర్బతులు (పండ్ల ఉత్పత్తులు ఆర్డర్ 1955 వర్తించనివి)

అయితే పండ్ల ఉత్పత్తుల ఆర్డర్ 1955 క్రింద ఉన్న పండ్ల ఉత్పత్తులు Solvent extracted oils, De-oiled and edible flour control order 1967 వర్తించు 'సాల్వెంట్ ఎక్స్ట్రాక్టెడ్' నూనె, తినదగు పిండి Vegetable oil products order 1947 వర్తించు వనస్పతి ఈ రూల్ నుండి మినహాయింపబడినవి.

వి. తయారు చేయబడ్డ ఆహారము లేదా 'రెడీ టు సర్వ్' ఆహారము.

అయితే రుచి కలుపబడిన ఎగుమతి చేయు తేయాకు ఎగుమతి కొరకు సంబంధిత లైసెన్సింగు అథారిటి ఇచ్చిన ప్రత్యేక లైసెన్సుచే క్రమబద్ధము చేయబడవలెను.

1 - ఎ లైసెన్సు ఇచ్చు అధికారి ఒకటిగాని లేదా ఎక్కువ ఆహార వస్తువులకు, మరియు ఒకే 'లోకల్ ఏరియా'లో ఉన్న వివిధ సంస్థలు, లేక ఆవరణలకు ఒకే లైసెన్సు ఇవ్వవచ్చును.

1 - బి. రూల్ 12-బి క్రింద కంపెనీచే నామనిర్దేశము చేయబడిన డైరక్టర్ గాని మేనేజర్ యొక్క పేరు, చిరునామా లైసెన్సులో పేర్కొనబడి యుండవలెను.

2. రాష్ట్ర ప్రభుత్వముగాని లోకల్ అథారిటీగాని లైసెన్సు లిచ్చు అధికారులను నియమించవలెను.

3. రాష్ట్ర ప్రభుత్వపు లేదా లోకల్ అథారిటీ యొక్క ఆమోదముతో లైసెన్సింగ్ అథారిటీ, లిఖితపూర్వకమైన ఉత్తర్వుద్వారా, తన క్రింద పని చేయుచున్న ఏ వ్యక్తికైనా లైసెన్సులపై సంతకము చేయుట మరియు అట్టి ఉత్తర్వులో చూపింపబడ్డ ఏ అధికారములనైనను, ప్రధానము చేయ వచ్చును.

4. ఒక వేళ ఒకటి కంటే ఎక్కువ లోకల్ ఏరియాలలో వివిధ స్థలములలో ఆహార వస్తువులు ఉత్పత్తి, నిలవ, లేదా అమ్మకమునకు ప్రదర్శించుట జరిగిన ఒకే లోకల్ ఏరియాలో లేని స్థలములకు వేరు వేరు దరఖాస్తులు పెట్టబడవలెను, వేరు వేరు లైసెన్సులు ఇవ్వబడవలెను.

అయితే ప్రత్యేక వ్యాపార స్థలము లేని సంచార విక్రయ దారులు లైసెన్సింగ్ అథారిటీ యొక్క అధికార పరిధిలో ప్రత్యేకించబడిన ప్రాంతంలో వ్యాపారము చేసికొనుటకు లైసెన్సు ఇవ్వబడవలెను.

5. లైసెన్సు కోరబడిన ఆహార వస్తువుల ఉత్పత్తి, నిల్వ లేదా అమ్మకమునకు ప్రదర్శనలకు లైసెన్సు ఇచ్చుటకు ముందు లైసెన్సింగ్ అథారిటీ అట్టి అవరణను తనిఖీ చేయవలెను మరియు శుభ్రతలో లోపములు లేవని తృప్తిపడవలెను. లైసెన్సు కోరు దరఖాస్తుదారు, ఆవరణలో లైసెన్సింగ్ అథారిటీ లైసెన్సు ఇచ్చుటకు కోరినట్టి మార్పులు చేయవలసి ఉండును. అయితే లైసెన్సింగ్ అథారిటీ ప్రజారోగ్య దృష్ట్యా అవసరమని తృప్తి చెందినచో లిఖితపూర్వకంగా కారణములను నమోదు చేసి లైసెన్సు ఇచ్చుటకు నిరాకరించవచ్చును.

6. ... ... ...

7. ఖారాలు, తీపి పదార్థములు, మరితర ఆహార వస్తువులు అమ్ము, అమ్మటకు ప్రదర్శించు హోటలు, రెస్టారెంటు, మరి యితర స్టాల్‌ల యజమానులు (స్థావరమైనవి, పర్యటించు వానితో సహా) నేయితో కొనుగోలుదారుల సమాచారము కొరకు, నేతితో తినదగు నూనెలతో, వనస్పతి, మరితర క్రొవ్వులతో వండిన వివిధ వస్తువుల విడివిడి జాబితాలు నోటీసు బోర్డుపై పెట్టవలెను.

8. ... ... ...

9. ఏ లైసెన్సుదారుడూ తాకుటద్వారాగాని, గాలిద్వారా గాని వ్యాపింప జేయు అంటువ్యాధులు, అసహ్యాకరమైన, వ్యాధులున్న నౌకర్లను ఉద్యోగములో ఉంచరాదు.

10. ఏ వ్యక్తియు మూత్రశాల, మఱుగుదొడ్డి మురికి కాలువ లేదా మురికి మరియు చెత్త నిల్వ చేయు స్థలమునుండి, లైసెన్సింగ్ అథారిటీకి తృప్తికరంగా సరిగా వేరు చేయబడని ఆవరణలో ఏదేని ఆహార పదార్థమును తయారీ నిలువ, అమ్మకమునకు ప్రదర్శన లేదా అమ్మకమునకు అనుమతించుట చేయరాదు.

11. అమ్మకమునకు ఉద్దేశించిన వస్తువులు అపరిశుద్ధముగానట్లుగా నిలువకు లేక ఉత్పత్తికి వాడు అన్ని పాత్రలకు సరియైన మూత కల్గి అవి అపరిశుద్ధముగాకుండ ఉండవలెను.

12. వెన్న, నెయ్యి, వనస్పతి, తినదగునూనెలు, మరితర క్రొవ్వుల ప్రతి ఉత్పత్తిదారు (ఘనిని నడుపువానితో సహా) మరియు టోకు వ్యాపారి, ఉత్పత్తిచేయబడిన లేదా తమకు ముట్టిన,

తాను అమ్మిన మరియు తన తయారీస్థలం లేక వ్యాపారస్థలం నుండి పంపబడిన వస్తువుల ప్రతి కన్‌సైన్‌మెంటు యొక్క గమ్యస్థానము చూపు రిజిష్టరు వ్రాయవలెను. మరియు అట్టి రిజిష్టరును లైసెన్సింగ్ అథారిటీ తనిఖీ కొరకు ఎప్పుడు కోరిన అప్పుడు చూపించవలెను.

13. ఈ నియమము క్రింద లైసెన్సు పొందిన సంచార విక్రయదారు స్పష్టముగా తన లైసెన్సు నెంబరు, అమ్ముటకు లైసెన్సు పొందిన వస్తువుల రకము, తన పేరు మరియు విలాసము మరియు ఒకవేళ ఉన్నట్లయితే ఎవరి కొరకైతే తాను పని చేయుచున్నాడో, అట్టి యజమాని పేరు మరియు విలాసములను చూపించుచూ ఒక లోహపు బ్యాడ్జిని తన భుజమునకు కట్టుకొనవలెను. ఆహారము గల పాత్రలు మరియు బండికూడ అదే మాదిరిగా వివరములున్న గుర్తు పెట్టబడవలెను. రాష్ట్ర ప్రభుత్వము లేక లోకల్ అథారిటీ కోరిన యెడల అమ్మకందారు లోహపు బ్యాడ్జికి అదనంగా తన ఫోటో మరియు లైసెన్సు నంబరు గల గుర్తింపు కార్డును, తన వెంట ఉంచుకొనవలెను. సదరు గుర్తింపు కార్డును ప్రతి సంవత్సరము పొడిగించుకొనవలెను.

అయితే భుజముపై బ్యాడ్జిలు ధరించుటకు లేదా విడిగా లైసెన్సు పొందుటకు నిమిత్తము కంపెనీల యొక్క పూర్తికాల ఉద్యోగులు మున్సిపాలిటి లైసెన్సు వివరములతో గుర్తింపు కార్డు వెంట ఉంచికొనిన యెడల అట్టివారు సంచార విక్రయదారులుగా పరిగణింపబడరు.

14. వేనికైతే ఈ నియమముల క్రింద లైసెన్సు కోరబడినదో అట్టి అమ్మకమునకు ఉద్దేశించిన ఆహార వస్తువుల యొక్క

పేరు లైసెన్సు కొరకు దరఖాస్తులో పేర్కొనబడవలెను. ఏదైనా అభ్యంతరకరమైన, ద్వందార్థములిచ్చు, తప్పుదారి బట్టించు, వ్యాపారనామము లైసెన్సింగ్ అథారిటీ చే ఆమోదించబడరాదు.

15. లైసెన్సు పొందిన ప్రతి ఆహారముల విక్రయదారు తాను అమ్ముటకు ప్రదర్శించిన మరియు ప్రతిపాదించిన ఆహారముల స్వభావము, తెలియబరుచుచూ లైసెన్సు పొందిన ప్రతి ఆహార విక్రయదారు, నోటీసు బోర్డుపై ప్రదర్శించవలెను.

51 లైసెన్సు కాలపరిమితి :

ఏ లైసెన్సు అయినా ముందుగానే నిలిపివేయబడిన లేదా రద్దు చేయబడిన తప్ప రాష్ట్ర ప్రభుత్వము నిర్ణీతపరచిన గడువు వరకు అమలులో ఉండును.

అయితే ఒక వేళ లైసెన్సు నిర్ణీత కాలపరిమితి సమాప్తి కాక ముందే క్రొత్త లైసెన్సు కొరకు దరఖాస్తు పెట్టుకొనిన యెడల, అట్టి దరఖాస్తుపై ఉత్తర్వులు అగు వరకు సదరు లైసెన్సు అమలులో ఉండును.

51 ఎ :- కొన్ని లోకల్ ఏరియాలలో లైసెన్సు యిచ్చు విధానము :-

ఓడ రేవు, విమానాశ్రయం, రైల్వే స్టేషను, (రైల్వే కాలనీ, ఆఫీసు యార్డు, గూడ్సు షెడ్డు, ట్రాన్ షిప్ మెంటు షెడ్డు, వర్క్ షాపు, రైల్వేల కొరకు లేక సంబంధించి, రైల్వే అడ్మినిస్ట్రేషన్ చే నడుపబడు చున్న ఇతర కార్యస్థానములతో సహా) రైల్వే స్టేషనుల సముదాయము ల అధికార పరిధిలో యున్న 'లోకల్ ఏరియా'లలో లైసెన్సులు యిచ్చుటకు అధికారమీయబడిన లైసెన్సింగ్ అథారిటీ ఓడరేవు, విమానాశ్రయం, లేక రైల్వే స్టేషను ఏ రాష్ట్రములో ఉన్నదో అట్టి

రాష్ట్రి ప్రభుత్వముచే విహిత పరచిన పద్ధతిలో తన విధులను నిర్వర్తించవలెను, మరియు లైసెన్సులిచ్చుటకు అట్టి ప్రభుత్వంచే విహితమైన ఫారంలు 5 ఉపయోగించవలెను.

## భాగం X

## పరిరక్షక పదార్థములు

**52.** పరిరక్షక పదార్థము యొక్క నిర్వచనము :

పరిరక్షక పదార్థము అనగా, ఆహారములో కలుపగా ఆహారము పులియుట, ఆమ్లీకరణ, లేక యితర విధములైన ఆహార విచ్ఛేదము కలుగుటను అరికట్టు, నిరోధించు, కట్టివేయు శక్తిగల పదార్థము.

**53.** పరిరక్షక పదార్థముల వర్గీకరణ :

పరిరక్షక పదార్థములు క్రింది తరగతులుగా విభజింపబడవలెను.

[I] 1వ తరగతి పరిరక్షక పదార్థములు :

ఎ. సామాన్య ఉప్పు

బి. చక్కెర

సి. డెక్స్ట్రోస్

డి. గ్లూకోజ్ (సిరప్)

ఇ. [......]

యఫ్. మసాలాలు

జి. వెనిగార్ లేక ఎసిటెక్ ఆమ్లము

హెచ్. తేనె

ఐ. [......]

జె. [......]

కె. [......]

యల్. తినదగు శాక నూనె

జి. యస్. ఆర్. 764 [ఇ] తేదీ 15-11-84 ద్వారా చేర్చబడినది.

వేరువిధముగా నియములలో చెప్పి ఉంటే తప్ప. ఏ ఆహారములోనైనా 1 వ తరగతి పరిరక్షక పదార్థముల సంకలనము నియంత్రించబడలేదు. అయితే 1 వ తరగతి పరిరక్షక పదార్థము కలుపబడిన ఆహార వస్తువు అనుబంధం 'B' లో నిర్దేశించబడిన ప్రమాణముల కనుగుణంగా ఉండవలెను.

[II] రెండవ తరగతి పరిరక్షక పదార్థములనగా :

ఎ. బెంజోయిక్ ఆమ్లము (దానియొక్క లవణములతో సహా)

బి. సల్ఫ్యూరిక్ ఆమ్లము (దానియొక్క లవణములతో సహా)

సి. హామ్, ఊరబెట్టిన మాంసం వంటి ఆహారములకు సంబంధించిన సోడియం లేక పొటాషియం నైట్రేటులు

డి. సోడియం, పొటాషియం, మరియు కాల్షియం (సోడియం లేక కాల్షియం ప్రొపనేట్, లాక్టిక్ ఏసిడ్, మరియు ఏసిడ్ కాల్షియం ఫాస్ఫేటు,) లతో సహా యాస్కార్బిక్ ఆమ్లము.

ఇ. నిసిన్

యఫ్. సోడియం, మరియు కాల్షియం ప్రొపనేటు

జి. మిథైల్ లేక ప్రొపైల్ పారాహైడ్రాక్సి బెంజోయేట్

హెచ్. ఎస్టర్లు (ప్రొపియోనిక్ ఆమ్లం, వాని ఎస్టర్లు, లవణములతో సహా)

ఐ. సోడియం డై ఎసిటేట్

జె. లాక్టిక్ ఆమ్లం యొక్క, సోడియం, పొటాషియం, మరియు కాల్షియం లవణములు)

జి. యస్. ఆర్. 764 తేదీ 15-11-84 ద్వారా చేర్చబడినది.

54. ఒకటికంటె ఎక్కువ 2 వ తరగతి పరిరక్షక పదార్థముల వాడకం నిషేధం:

ఏ వ్యక్తియు, ఆహారములోగాని పైనగాని, ఒకటికంటె ఎక్కువ 2 వ తరగతి పరిరక్షక పదార్థములు వాడవాదు.

అయితే రూలు 55 క్రింద యివ్వబడిన పట్టికలో కాలం (2)లో ఒకటి కంటె ఎక్కువ పరిరక్షక పదార్థములను ఒకదాని బదులు ఒకటి అనుమతించబడినప్పుడు రూలు 55లో ఏమి ఉన్నప్పటికీ, సదరు పరిరక్షక పదార్థములు ఒకటి లేక ఎక్కువ సంయోజనములో వాడవచ్చును. అయితే వాడబడిన ప్రతి పరిరక్షక పదార్థము అట్టిపరిరక్షక పదార్థములు కలుపబడిన నిష్పత్తినిబట్టి లెక్కకట్టగా వచ్చిన భాగముల సంఖ్య సదరు పట్టికలో కాలం (3)లో సదరు పరిరక్షక పదార్థమునకు పేర్కొనబడిన భాగముల సంఖ్యను మించరాదు.

ఉదాహరణ :

క్రింద ఇవ్వబడిన పట్టికలో ఐటం (బి) లో పేర్కొనబడిన ఆహార వస్తువులు, సల్ఫర్ డై ఆక్సైడ్ లేక బెంజోయిక్ ఆమ్లము, వరుసగా మిలియనులో 40 భాగములు, 200 భాగములు వాడవచ్చును. రెండు పరిరక్షక పదార్థములు సంయోజనములో వాడబడినప్పుడు, సల్ఫర్ డై ఆక్సైడ్ నిష్పత్తి మిలియనుకు 20 భాగములయినచో, బెంజోయిక్ ఆమ్లము నిష్పత్తి మిలియనుకు 100 భాగములు మించరాదు.

55. రెండవ తరగతి పరిరక్షక పదార్థముల వాడకం ప్రమితం.

క్రింది ఆహార తరగతులలో రెండవ తరగతి ప్రరక్షక పదార్థముల వాడకం ప్రతిదానికి ఎదురుగా ఇవ్వబడిన నిష్పత్తి మించని కాన్ సెంట్రేషన్(గాఢత)కు పరిమితమై యుండవలెను.

| | ఆహార వస్తువులు | పరిరక్షక పదార్థము | భాగములు మిలియనుకు |
|---|---|---|---|
| | 1 | 2 | 3 |
| 1. | సాసేజీలు పచ్చిమాంసం, పిండి, మసాలాగల సాసేజీలు | సల్ఫర్ డైయాక్సైడ్ | 450 |
| 2. | పండ్లు, పండ్ల గుజ్జు, జామ్, క్రిస్టలైజ్డ్లగేస్, లేక క్యూర్ చేయబడిన పండు లేక ఇతర ఉత్పత్తులుగా మార్చుటకు | | |
| | [ఎండబెట్టని] రసము : | సల్ఫర్ డైయాక్సైడ్ | 2000 |
| | ఎ. ఛెర్రీలు | " | 3000 |
| | బి. స్ట్రాబెర్రీలు, రాస్ బెర్రీలు | " | 2000 |
| | సి. ఇతర పండ్లు | " | 1000 |
| 3. | పండ్ల రసము కాన్సంట్రేట్ | " | 1500 |
| 4. | ఎండబెట్టిబడిన పండ్లు | | |
| | ఎ. ఆప్రికాట్లు, అత్తిపండ్లు, యాపిళ్ళు, పియర్లుమరియు ఇతర పండ్లు | " | 2000 |
| | బి. రైసిన్‌లు, సుల్తానాలు | " | 750 |

| | | | |
|---|---|---|---|
| 5. | పలుచనచేసిన తరువాత వాడబడు ఇతర నాన్ అల్కహాలిక్ సారాయములు, స్క్వాష్‌లు, క్రష్‌లు, ఫ్రూట్ సిరప్‌లు, కార్డియర్‌లు, పండ్ల రసము, మరియు బార్లీ నీరు | సల్ఫర్‌డయాక్సైడ్<br>బెంజోయిక్ ఏసిడ్ | 360<br>600 |
| 6. | జామ్, మార్మలేడ్, ప్రిసర్వ్, డబ్బాలలో ఛెర్రీ మరియు ఫ్రూట్ జెల్లీ | సల్ఫర్‌డయాక్సైడ్<br>బెంజోయిక్ యాసిడ్ | 40<br>200 |
| 7. | క్రిస్టలైజ్డ్‌గ్లేస్, లేక క్యూర్ చేయబడిన పండ్లు, పంచదారతో పక్వము చేయబడిన చెక్కులతో సహా | సల్ఫర్‌డయాక్సైడ్ | 150 |
| 8. | షెడ్యూలులో వేరే పేర్కొనబడని పండ్లు, మరియు పండ్ల గుజ్జు | " | 350 |
| 9. | చక్కెర, గ్లూకోస్, ఖండసారి | " | 70 |
| 10. | మొక్కజొన్న పిండి మరి అటువంటి స్టార్చిలు | " | 100 |
| 11. | మొక్కజొన్న సిరప్ | " | 450 |
| 11-ఎ. | డబ్బాలలో పెట్టబడిన రసగుల్లాలు [డబ్బాలోపలి వైపు] సల్ఫ్యూరిక్ యాసిడ్ / వార్నిషు నిరోధించు / పూత వేయబడి యుండవలెను.] | " | 100 |
| 12. | జిలాటిన్ | " | 1000 |
| 13. | బీర్ | సల్ఫర్‌డయాక్సైడ్ | 70 |
| 14. | ఆపిల్ సారాయము | " | 200 |
| 15. | అల్కహాలిక్ సారాయము | " | 450 |

| | | | |
|---|---|---|---|
| 16. | తీపి చేయబడిన మినరల్ నీరు మరియు తీపి చేయబడిన రెకీ - టు - సర్వ పానీయములు | సల్ఫర్‌డయాక్సైడ్ లేక బెంజోయిక్ ఆసిడ్ | 70 120 |
| 17. | కాచిన శొంఠి సారాయి (Brewed Ginger beer) | బెంజోయిక్ ఆసిడ్ | 120 |
| 18. | కాఫీ ఎక్స్ట్రాక్ట్ | " | 450 |
| 19. | పండ్లు లేక కూరగాయలు ఊరగాయలు, పచ్చళ్ళు | " లేక సల్ఫర్‌డయాక్సైడ్ | 250 100 |
| 20. | టమాటో మరి యితర వ్యంజనములు | బెంజోయిక్ ఎసిడ్ | 750 |
| 21. | హామ్, బేకన్‌లలో సహా వండబడిన మాంసము | సోడియం లేక పొటాషియం నైట్రేటు సోడియం నైట్రేటుగా లెక్కించబడినది. | 200 |
| | | కమర్షియల్ సాల్టు పీటర్ | 500 |
| 22. | డేనిష్ టిన్‌డ్ కేవియర్ | బెంజోయిక్ ఆసిడ్ | 50 |
| 23. | డిహైడ్రేటెడ్ కూరలు | సల్ఫర్‌డయాక్సైడ్ | 2000 |
| 24. | టొమాటో పరీ మరియు పేస్ట్ | బెంజోయిక్ ఏసిడ్ | 250 |
| 25. | సిరప్‌లు షర్బతులు | సల్ఫర్‌డయాక్సైడ్ లేక బెంజోయిక్ ఏసిడ్ | 600 |
| 26. | శొంఠి (Dried ginger) | సల్ఫర్‌డయాక్సైడ్ | 2000 |
| 27. | హార్డ్ బాయిల్డు సుగర్ కన్ఫెక్షనరి | " | 350 |

| | | | |
|---|---|---|---|
| 28. | జొన్న, ప్రాసెస్ చేయబడిన జొన్న | సార్బాల్ ఏసిడ్ [దీని సోడియం, పొటాషియం, కాల్షియం లవణములతో సహా] [సార్బాక్ ఏసిడ్‌గా లెక్కించబడినది] | 1000 |
| 29. | పిండి మిఠాయిలు [ఫ్లోర్ కన్‌ఫెక్షనరి] | సార్బిక్ ఏసిడ్ లేక దానినిసిన్ | 1000 |
| | | సోడియం లవణములు | 1500 |
| 30. | వేయించిన చేప [రేపర్లలో] | సార్బిక్ ఏసిడ్ [రేపర్లకు మాత్రమే సార్బిక్ ఏసిడ్] | |
| 31. | రసగుల్లాల డ్రైమిక్స్‌లు | సల్ఫర్‌డయాక్సైడ్ | 100 |
| 32. a. | సూపులు (డబ్బాలలో పెట్టబడనవి) | సల్ఫర్ డయాక్సైడ్ | 150 |
| b. | పొడిచేయబడిన సూపులు | " | 1500 |
| c. | నిర్జలీకరణము చేయబడిన సూపు మిశ్రమం, డబ్బాలలో కాక యితర ఆధార పాత్రలలో పెట్టబడినవి | " | 1500 |
| 33. | పండ్లు మరియు వెజిటబుల్ ఫ్లేకులు, పొడి | | 600 |
| 34. | బేక్ చేయబడిన ఆహారమునకు పిండి | సోడియం డయాసిటేట్ | 2500 |
| | | లేక ప్రాపియనేట్లు లేక | 3200 |
| | | మిథైల్ ప్రొపైల్ హైడ్రాక్సీ బెంజోయేట్లు | 500 |

55 — ఎ. ఆహార మిశ్రమములలో 2వ తరగతి పరిరక్షక పదార్థముల వాడకం:–

రూలు 55 లో చెప్పబడిన రెండు లేక ఎక్కువ ఆహారములు లేక ఆహారముల తరగతుల మిశ్రమములో, రెండవతరగతి పరిరక్షక పదార్థము లేక పదార్థములు, లేక అట్టి మిశ్రమములోని ఆహారములు లేక ఆహారతరగతి అనుమతించబడిన పరిరక్షక పదార్థము లేక పదార్థములు పరిమితికి కట్టుబడియుండవలెను.

ఉదాహరణ :-

రూలు 55 క్రింద యివ్వబడిన పట్టికలో ఐటం 23లో ఇవ్వబడిన ఆహారంలో డిహైడ్రేటెడ్ ఆహారములలో సల్ఫర్ డైయాక్సైడ్ మిలియనుకు 2000 భాగములు వాడవచ్చును.

ఈ ఆహారము ఐటం 24 లోని ఆహారముతో అనగా బెంజోయిక్ ఏసిడ్ 250 పి. పి. యం. అనుమతించబడిన టమోటా పరీ మరియు పేస్టేలతో కలిసినప్పుడు ఈ ఆహారములు సమాన వాటాలలో గల మిశ్రములో సల్ఫర్ డయాక్సైడ్ బెంజోయిక్ ఏసిడ్ల నిష్పత్తి, వరుసగా, 1000 పి. పి. యం. మరియు 125 పి. పి. యం. ఉండవలెను.

55 — బి. నైట్రేట్ మరియు నైట్రైట్ల వాడకంపై నిర్బంధం:–

పసిబిడ్డల ఏ ఆహారమునకూ, నైట్రేట్ లేక నైట్రైట్లు వాడరాదు.

[జి. యస్. ఆర్. 764 (ఇ) తేదీ 15-11-84 ద్వారా చేర్చబడినది]

## భాగం XI

## విషలోహములు

57. విషలోహములు :—

(1) ఇండియన్ ఫార్మకోపియా మోనోగ్రాఫ్‌లలో వివరించబడిన రసాయనములు ఆహారములలో వాడబడినప్పుడు తత్కాలమునకు అమలులో ఉన్న ఇండియన్ ఫార్మకోపియాలో సంబంధిత మోనోగ్రాఫ్‌లలో పేర్కొనబడిన పరిమితులకు మించి విషలోహములు కలిగియుండరాదు.

(2) సబ్ రూలు (1) లో ఏమి ఉన్నప్పటికీ, క్రింది పట్టికలో కాలం (2) లో పేర్కొనబడిన ఏ ఆహార వస్తువు గూడ, పేర్కొనబడిన లోహం, కాలం 3 లో పేర్కొనబడిన పరిమాణమునకు మించి కలిగియుండరాదు.

—: పట్టిక :-

| విషలోహము పేరు | ఆహార వస్తువు | తూకములో భాగములు మిలియనుకు |
|---|---|---|
| 1. సీసం | 1. పానీయములు | 0.5 |
| | కాన్‌సెంట్రేటెడ్ మృదుపానీయములు మృదుపానీయములలో వాడు కాన్‌సెంట్రేటులతో సహా కాదు] పండ్ల మరియు వెజిటెబల్ జ్యూస్ [టమాట జ్యూస్‌తోసహా, కాని, లైమ్ జ్యూస్ లెమన్ జ్యూస్‌లతో సహా కాదు.] | 1.0 |
| | మృదుపానీయములలో వాడు కాన్‌సెంట్రేటులు లైమ్ జ్యూస్ మరియు లెమన్ జ్యూస్‌తో | 2.0 |

| విషలోహము పేరు | ఆహార వస్తువు | ఔాకములో భాగములు మిలియనుకు |
|---|---|---|
| | I- ఎ బేకింగ్ పౌడరు | 1.0 |
| | I- బి తినదగు నూనెలు | |
| | II- ఇతర ఆహారములు | |
| | యాన్ హైడ్రస్ డెక్స్ట్రోస్, డెక్స్ట్రోస్ మోనోహైడ్రేట్ • తినదగు నూనెలు మరియు కొవ్వు/శుద్ధిచేయబడిన తెల్ల చక్కెర [సల్ఫేటెడ్ యాష్ 0.03 శాతమునకు మించినది.] | 0.5 |
| | ఐస్‌క్రీం ఐసెడ్ లొల్లీలు మరియు గడ్డ కట్టిన ఆహారములు. | 0.1 |
| | డబ్బాలల్లో పెట్టిన చేప, మాంసం, తినదగు జెలాటిన్, మాంసం భాగములు హైడ్రోలైజ్డ్ ప్రోటిన్ డ్రైడ్ లేక డిహైడ్రేటెడ్ - కూరగాయలు [ఉల్లిపాయలు కాక] | 0.1 |
| | అన్నిరకముల చక్కెర, చక్కెర సిరప్, ఇన్‌వర్ట్ చక్కెర, రంగు చక్కెర [సల్ఫేట్ యాష్ 1.0 ఎక్కువగల నేరుగా భోజన వినియోగమునకు లేదా శుద్ధిచేయబడిన చక్కెర తయారీకాక యితరతయారీల కొరకు అమ్మినప్పుడు తప్ప, ముడి చక్కెర తినదగు [చక్కెర పాగు] కారమెల్ ఘనద్రవ గ్లూకోస్ మరియు స్టార్చి మార్పిడీ ఉత్పత్తులు 1.1% [మంచి సల్ఫేటెడ్ యాష్ కల్గియున్నవి.] | 5.0 |
| | కోకోపౌడరు [క్రొవ్వులేని పొడిపదార్థములో లెక్కన] | 5.0 |

| విషలోహము పేరు | | ఆహార వస్తువు | తూకములో భాగములు మిలియనుకు |
|---|---|---|---|
| | | ఈస్ట్ మరియు ఈస్ట్ ఉత్పత్తులు | 5.0 [పొడి పదార్థంపైన] |
| | | టీ. డీహైడ్రేటెడ్ ఉల్లిపాయలు, ఎండబెట్టిన మూలికలు మరియు మసాలా దినుసులు. రుచికారకములు, ఆమ్లము, ఎలానేట్లు, అగర్, కారగిన్, మరియు సవిడ్ నుండి రాబట్టిన అటువంటి ఉత్పత్తులు. | 10.0 [పొడి పదార్థము పైన] |
| | | ఆహారముల ప్రాసెసింగ్‌లో లేక తయారీలో వాడబడు పెక్టిన్ ద్రవము, పేర్కొనబడని ఇతర రసాయనములు | 10.0 |
| | | కారమెల్ కాక యితర ఆహార రంగులు | 10.0 [పొడిరంగు పదార్థంపై] |
| | | పెక్టిన్ ఘనపదార్థం | 50.0 |
| | | హార్డ్ బాయిల్డ్ కన్‌ఫెక్షనరి | 2.0 |
| | | III. పేర్కొనబడని ఆహారములు | 2.5 |
| 2. రాగి | I. | పానీయములు | |
| | | కాన్‌సెంట్రేట్‌లు, సోడాలు మినహాయించి మృదు పానీయములు | 7.0 |
| | | కార్బొనేటెడ్ పానీయం (టాడీ) | 5.0 |
| | | మృదుపానీయముల కాంసెంట్రేట్‌లు | 20.0 |

| విషలోహము పేరు | ఆహార వస్తువు | తూకములో భాగములు మిలియనుకు |
|---|---|---|
| | II. ఇతర ఆహారములు | |
| | చికోరి [ఎండబెట్టబడిన, కాల్చబడిన కాఫీ కాఫీ గింజలు, రుచి కారకములు, పెక్టిన్ ద్రవము | 30.0 |
| | రంగులు | |
| | తినదగు జెలాటిన్ ఎండిన రంగు పదార్థంపై | 30.0 |
| | టమాటా కెచప్ | 50.0 |
| | [ఎండబెట్టబడిన మొత్తం ఘనపదార్థంపై] | |
| | (ఎండిన పదార్థంపై) ఈస్ట్ మరియు ఈస్టు ఉత్పత్తులు | 60.0 |
| | కొకో | 70.0 |
| | [కొవ్వులేని పదార్థంపై] | |
| | టమాటో పరీ. పస్తే పౌడరు జ్యూస్, కాక్టైలు | 100.0 |
| | [ఎండబెట్టబడిన టమాటో ఘన పదార్థములపై] | |
| | తేయాకు | 150.0 |
| | పెక్టిన్ ఘనపదార్థము | 400.0 |
| | హార్డ్‌బాయిల్డ్ సుగర్ కన్‌ఫెక్షనరి | 5.0 |
| | III. పేర్కొనబడని ఆహారము | 30.0 |
| 3. ఆర్సెనిక్ :- | | |
| | I. పాలు | 0.1 |

| విషలోహము పేరు | ఆహార వస్తువు | తూకములో భాగములు మిలియనుకు |
|---|---|---|
| | II. పానీయములు | |
| | సోడా తప్ప, నీళ్ళుపోసి పలచనచేసి త్రాగుటకుద్దేశించబడిన మృదుపానీయములు | 0.5 |
| | సోడా | 0.25 |
| | III. పరిరక్షకములు, యాంటీ ఆక్సిడెంటులు ఎమల్సీకరణ మరియు స్థిరత్వ కారకములు కృత్రిమ ఆహార రంగులు | పొడి పదార్థంపై |
| | మరియు ఆహార రంగులు | 3.0 |
| | IV. ఇతర ఆహారములు : | |
| | ఐస్‌క్రీం, ఐస్‌డ్ లొల్లీలు మరటువంటి గడ్డ కట్టిన ఆహారములు | 0.5 |
| | డీ హైడ్రేటెడ్ ఉల్లిపాయలు, తినదగు జెలాటిన్ పెక్టిన్ ద్రవము | 2.0 |
| | ఎండబెట్టిన, కాల్చిన, చికోరి | 4.0 |
| | ఎండబెట్టిన మూలికలు పెక్టిన్ ఘనపదార్థం-అన్ని గ్రేడులు మసాలా దినుసులు | 5.0 |
| | కృత్రిమ రంగు కాని ఆహార రంగులు | 5.0 |
| | హార్డ్ బాయిల్డు సుగర్ కన్‌ఫెక్షనరి | పొడి పదార్థంపై 1.0 |
| | V. పేక్యానుజీన ఆహారం | 1.1 |

| విషలోహము పేరు | ఆహార వస్తువు | టూకములో భాగములు మిలియనుకు |
|---|---|---|
| 4. టిన్ :- | | |
| | I. ప్రొసెస్డ్ మరియు డబ్బాలలో ఆహారములు | 250.0 |
| | I-ఎ హార్డ్‌బాయిల్డు సుగర్ కన్‌ఫెక్షనరి | 5.0 |
| | II. పేర్కొనబడని ఆహారములు | 250.0 |
| | III. ఫ్రూట్ ప్రోడక్ట్ ఆర్డర్ 1955 వర్తించు పండ్ల పదార్థములు | 50.0 |
| | III ఎ హార్డ్‌బాయిల్డ్ సుగర్ కన్‌ఫెక్షనరి | 5.0 |
| | IV. పేర్కొనబడని ఆహారములు | 50.0 |

భాగం XII

## యాంటీ ఆక్సిడెంట్లు, ఎమల్సీకరణ, స్థిరత్వ కారకములు, మరియు యాంటీ-కేకింగ్ ఏజంట్లు

**58.** 'యాంటీ ఆక్సిడెంటు' నిర్వచనము :-

యాంటీ ఆక్సిడెంటు అనగా ఆహారమునకు కలుపగా ఆహారము యొక్క ఆక్సీడేషన్‌ను నిరోధించు లేక నివారించు పదార్థము. కాని చక్కెర, తృణ ధాన్యములు, నూనెలు, పిండ్లు, మూలికలు మరి యితర మసాలాదినుసులు కాదు.

59. యాంటీ ఆక్సిడెంట్లు వాడకము పై నిర్బంధములు :-

లేసిథీన్, యాస్కార్బిక్ ఆమ్లము, మరియు టోకోఫెరాల్ తప్ప ఏ యితర యాంటీ- ఆక్సిడెంటు గూడ ఆహారముపై వాడరాదు.

i) అయితే క్రింది యాంటీ ఆక్సిడెంట్లు నేయి, వెన్న తప్ప మిగిలిన తినదగు నూనెలు, క్రొవ్వులలో వాని కెదురుగా చెప్పబడిన మోతాదుకు మించకుండా కలుపవచ్చును.

1. ఈథైల్ గాలేటు
2. ప్రొపైల్ గాలేటు
3. ఆక్టైయిల్ గాలేటు లేక వాని మిశ్రమము 0.01 శాతము
4. డొడిసైల్ గాల్టు 0.02 "
5. యాస్కోర్బైల్ పాల్మిటేట్ 0.02 "

అంతేగాక నేయి, వెన్న బ్యుటిలేటెడ్ హైడ్రోక్సియానిసోల్ (బి. హెచ్. ఎ.) 0.02 శాతము గాఢత మించకుండా కల్గి యుండ వచ్చును.

6. బ్యూటీలేటెడ్ హైడ్రోక్సియానిసోల్ (బి హెచ్ ఎ) 0.02 "
7. సిట్రిక్ ఆమ్లం
8. టార్టారిక్ ఆమ్లం
9. గాలిక్ ఆమ్లం 0.01 శాతము
10. రెసిన్ గయాక్ 0.05 "
11. టెర్షియరీ బ్యుటైల్ హైడ్రోక్వినోన్ (టి. బి. హెచ్. క్యూ.) 0.02 "

ii) అయితే రసగుల్లాలు, పేడాలు, పాలమిశ్రమములు బ్యుటిలేటెడ్ హైడ్రోక్సియానిసోల్ (బి. హెచ్. ఎ.) క్రొవ్వు ఆధారంగా లెక్కించగా 0.02 శాతం మించకుండా కల్గియుండవచ్చును.

iii) అంతేగాక రూ. 59 లో అనుమతించబడిన యాంటీ-ఆక్సి డెంట్లు అనుమతించబడిన రుచికారకములతో 0.01 శాతము గాఢత మించకుండా వాడవచ్చును.

(జి. యస్. ఆర్. 764 (ఇ) 15-11-84 ప్రకారం సవరించబడినది)

iv) అంతేగాక బ్యూటిలేటెడ్ హైడ్రోక్సియానిసోల్ (బి. హెచ్. ఎ.) పూర్వపు ప్రతికల్పనలో ఐటం 1 నుండి 4 వరకు ఉదహ రించబడిన యాంటాక్సిడెంట్లతో కలిపి వాడినప్పుడు, మిశ్రమం యొక్క పరిమాణం 0.02 శాతం మించరాదు.

59-ఎ. విటమిన్-డి తయారీలో యాంటీ ఆక్సిడెంట్ల వాడకం :—

విటమిన్ డి తయారీలు రూలు 59 లో నిర్దేశించబడిన యాంటీ ఆక్సిడెంట్లు 0.03 శాతము మించకుండా కల్గియుండవచ్చును.

60. ఎమల్సీకరణ, స్థిరత్వ కారకముల నిర్వచనము :—

'ఎమల్సీకరణ కారకములు' (ఎమల్సీకరణులు) మరియు 'స్థిరత్వ కారకములు' అనగా ఆహారములో కలుపగా జలయానకములో ఏక రూపముగా నూనెల క్రొవ్వుల విక్షేపణ, లేక విపర్యముగా మరియు/ లేక అట్టి స్థిరత్వము దోహదము చేయగల పదార్థములు, మరియు క్రిందివానితో సహా—

అగర్, ఆల్జినిక్ ఆమ్లము, కాల్షియం, మరియు సోడియం ఆల్జినేట్లు, కార్రగీన్, గుఆర్, కరయా, అరబిక్, కొరోబియన్ ఫర్సిలారన్, ట్రగాకాంత్, షుదీ బంకవంటి తినదగు బంకలు, డెక్స్ట్రిన్, సోర్బిటాల్, పెక్టిన్, సోడియం మరియు కాల్షియం పెక్టేటు, సోడియం సిట్రేట్, సోడియం ఫాస్ఫేటులు, సోడియం టార్ట్రేట్, కాల్షియం లాక్టేట్, లెసిథిన్, ఆల్బుమెన్, జిలాటిన్, క్విల్లాయ్ల్యా మార్చబడిన

స్టార్చులు, హైడ్రోలైజ్డ్ ప్రొటీనులు, కొవ్వుగల ఆమ్లముల మోనో గ్లిసెరైడులు, దయోగ్లిసెరైడులు, కృత్రిమ లెసిథిన్, ప్రొపైలిని గ్లైకోల్ స్టియరేటు, ప్రొపైలినీ గ్లైకోల్ ఆల్జినేట్, మిథైల్ ఈథైల్ సెల్యూలోస్, మిథైల్ సెల్యూలోస్, సోడియం కార్బొక్సి మిథైల్ సెల్యులోస్, స్టారైల్ టార్టారిక్ ఆమ్లము, కొవ్వుగల ఆమ్లముల మోనో గ్లిసెరైడులు, డై గ్లిసెరైడుల ఎస్టర్లు, మోనో స్టియరైన్ సోడియం సల్ఫోఎసిటేట్, క్రొవ్వు ఆమ్లముల సోర్బిటాన్ ఎస్టర్లు లేక సయోజనములలో పోలీ ఆక్సి-ఈథిలీన్ సోర్బిటాన్ మోనోస్టియరేట్లు, సోడియం స్టియారోయిల్-2, లాక్టిలేట్ మరియు కాల్షియం స్టియరోయిల్-2, లాక్టిలేటు మరియు బ్రోమినేటెడ్ గడ్డి నూనెలు.

61. ఎమల్సీకరణ మరియు స్థిరత్వకారకముల వాడకంపై నిర్బంధములు :—

ఎమల్సీకరణ మరియు స్థిరత్వకారకముల వాడకం ప్రత్యేకముగా అనుమతించిబడినప్పుడు తప్ప, ఆహారంపై ఏ ఎమల్సీకరణ కారకము స్థిరత్వ కారకములు వాడరాదు.

అయితే క్రింది ఎమల్సీకరణ కారకములు, స్థిరత్వ కారకములు పాలలో, మీగడలో వాడరాదు—

క్రొవ్వు ఆమ్లముల యొక్క మోనో గ్లిసెరైడులు, లేక డై గ్లిసెరైడులు, కృత్రిమ లెసిథిన్, ప్రొపైలిన్ గ్లైకోల్‌స్టియరేటు, ప్రొపైలిన్ గ్లైకోల్ ఆల్జినేటు, మైథిల్ ఇథైల్ సెల్యూలోస్, మిథైల్ సెల్యూలోస్ కొవ్వు ఆమ్లముల మోనోగ్లిసెరైడులు, డైగ్లిసెరైడులు స్టియరైక్ ఆమ్ల ఎస్టర్లు, మోనోస్టియరిన్ సోడియం సల్ఫో ఎసిటేట్,

కొవ్వు ఆమ్లముల సార్బిటాన్ ఎస్టర్లు లేక సంయోజనములో, బ్రొమినేటెడ్ గడ్డి నూనెలు.

61-ఎ. స్టార్చి పాస్ఫేటు వాడకం :—

సిరప్, ఐస్‌క్రీం పొడి, సలాడ్ డ్రస్సింగ్ మరియు పుడ్డింగ్‌లలో ఆరబిక్ బంక ప్రత్యామ్నాయము, స్టార్చి ఫాస్ఫేటు 0.5 శాతము వరకు వాడవచ్చును.

61-బి. రుచికారములలో ఎమల్సీకరణ కారకములు, స్థిరత్వ కారకముల వాడకం :—

ఎమల్సీకరణ కారకములు స్థిరత్వ కారకములు రుచికారకములలో వాడవచ్చును.

61-సి. పండ్ల ఉత్పత్తులలో ఎమల్సీకరణ కారకముల, స్థిరత్వ కారకముల వాడకం :—

పండ్ల ఉత్పత్తులలో క్రింది ఎమల్సీకరణ కారకములు స్థిరత్వ కారకములు వాడవచ్చును.

1. పెక్టిన్, 2. సోడియం ఆల్జినేటు, 3. కాల్షియం ఆల్జినేటు, 4. ఆల్జినిక్ ఆమ్లము, 5. ప్రొపెలిన్ గ్లైకోల్ ఆల్జినేటు.

62. యాంటీ కేకింగ్ ఏజెంట్లు వాడకంపై పరిమితి :—

ప్రత్యేకంగా అనుమతించబడి యుంటే తప్ప ఆహారములో యాంటీ కేకింగ్ ఏజంటు వాడరాదు.

[అయితే, ఉప్పు, ఉల్లిపొడి, వెల్లుల్లిపొడి, పండ్లయొక్క పొడి (Fruit Powder) క్రింది యాంటీకేకింగ్ ఏజంట్లను ఒంటిగాగాని, లేక సంయోగములోగాని 20 శాతం మించకుండా యుంచవచ్చును.

1. మెగ్నీషియం, మరియు కాల్షియంల యొక్క కార్బొనేట్లు
2. కాల్షియం మరియు మెగ్నీషియంల యొక్క ఫాస్ఫేట్లు
3. కాల్షియం, మెగ్నీషియం, అల్యూమినమ్, లేక సోడియంల సిలికేట్లు లేక సిలికాన్ డయాక్సైడ్
4. అల్యూమినమ్, అమ్మోనియం, పొటాషియం, సోడియం, కాల్షియంల మైరిస్టేట్లు, పార్మిట్లు, లేక స్టేరియేట్లు]

జి. యస్ 764 తేదీ 15-11-84 ప్రకారం సవరించబడినది.

62-ఎ. తినదగు నూనెలలో క్రొవ్వులలో యాంటీ ఫోమింగ్ ఏజెంట్లు:-

తినదగు నూనెలు, తీక్షణంగా వేయించుటకు ఆహారగ్రేడు డైమిథైల్ పోలిసి లోక్సేన్, యాంటీ ఫోమింగ్ ఏజెంటుగా మిలియనుకు 10 భాగములు వరకు వాడవచ్చును.

వివరణ :—

ఈ రూలు నిమిత్తము 'యాంటీ ఫోమింగ్ ఏజెంటు' అనగా వేడి చేయునప్పుడు నురుగు ఎత్తును, పాడగు మార్పులను నిరోధించు పదార్థము.

## భాగము XIII

## రుచికారకములు మరియు సంబంధిత పదార్థములు

63. రుచికారకములు :-

రుచికారకములనగా ఆహారమునకు కమ్మదనము అనగా రుచి లేక సువాసన లేక రెండు కలిగించగల రుచి పదార్థములు ఎక్స్‌ట్రాక్టులు, రుచితయారీలతో సహా, రుచికారకములు క్రింది 3 తరగతులకు చెంది యుండును.

ఎ. సహజ రుచులు మరియు సహజ రుచికల్గించు పదార్థములు :-

"సహజరుచి", "సహజ రుచి కల్గించు పదార్థములు" అనగా వరుసగా, మానవభోజనమునకు కేవలము శాకములనుండి ప్రకృతి పద్ధతులద్వారా తీయబడిన లేక సహజస్థితిలోనిదిగాని ప్రోసెస్ చేయబడినదిగాని జంతుపదార్థము, మానవ భోజనమునకు యోగ్యమయి ఉన్న రుచి తయారీలు మరియు రుచి పదార్థములు.

బి. సహజ సమరుచికారక పదార్థములు (Natural identical flavouring Substances)

పరిమళమునిచ్చు ముడి పదార్థములనుండి రసాయన పద్ధతిలో వేరు పరచబడిన లేక కృత్రిమంగా తయారుచేయబడిన పదార్థములు 'సహజ సమ రుచికారక పదార్థములు'. అవి రసాయనకముగా, ప్రోసెస్ చేయబడినవి అయినా, కానివయినా మానవభోజనమునకు ఉద్దేశించబడిన సహజ ఉత్పత్తులలో ఉన్న పదార్థములకు సర్వ సమానములు.

సి. కృత్రిమ రుచికల్గించు పదార్థములు :-

ప్రాసెస్ చేయబడినవికాని, చేయబడనివికాని మానవ భోజనమునకుద్దేశించబడిన సహజ ఉత్పత్తులలో గుర్తించబడనివి కృత్రిమంగా రుచి కల్గించు పదార్థములు.

63 - ఎ. ఆహారములో కుమారిన్, మరియు డిహైడ్రోకుమారిన్ వాడకం నిషేధము :-

ఏ ఆహార వస్తువులలోనయినా, కుమారిన్ మరియు డిహైడ్రోకుమారిన్ వాడుట నిషేధించబడినవి.

64. రుచులలో ద్రావణి :-

డైథిలీన్ గ్లైకోల్ మరియు, మోనో-ఈథైలీథర్ రుచులలో ద్రావణిగా వాడరాదు.

(జి. యస్. ఆర్. 764 తేది 15-11-84 ప్రకారం సవరించ బడినది)

64-ఎ రుచులలో యాంటీ ఆక్సిడెంట్లు, ఎమల్సీకరణ మరియు స్థిరత్వ కారకములు మరియు ఆహార పరిరక్షకములు :-

రుచికారకములు అనుమతించబడిన యాంటీ ఆక్సిడెంట్లు, ఎమల్సీకరణ మరియు స్థిరత్వకారకములు, మరియు ఆహార పరిరక్షకములు కల్గియుండ వచ్చును.

64-బి మోనోసోడియం గ్లూటామేటు :-

ఆహారవస్తువుకు మోనోసోడియం గ్లూటామేటు కలుప వచ్చును అయితే 'రెడీ - టు - సర్వ్' ఆహారంలో మొత్తం సోడియం గ్లూటామేట్ అంశం 1 శాతం మించరాదు. అది 12 నెలలలోపు బిడ్డలకుద్దేశించబడిన ఆహారమునకు కలుపరాదు.

## భాగము XIII - A

## ఆహార సంకలనాత్మకముల "క్యారీ ఓవరు"

64-సి ,, ,, ,, :-

అనుబంధం - బి లో పేర్కొనబడిన ప్రమాణముల కొరకు ఆహారములో రంగులు, రుచికారకములు, యాంటీ ఆక్సిడెంట్లు, పేంటీ కేకింగు ఏజెంట్లు, ఎమల్సీకరణ, స్థిరత్వ కారకములు, మరియు పరిరక్షకములు వంటి సంకలనాత్మకములకు అవి వాడిన ముడి పదార్థములు, ఇతర సంబారములు వాడిన కారణంచే 'క్యారీఓవరు' పద్ధతి వర్తింప చేయబడినది. ఇది కాలుష్య కారకముల ఉనికికి వర్తించదు.

2. ఈ నియమములలో, లేక అనుబంధం-బిలో వేరు విధంగా ప్రత్యేకంగా నిషేధించబడినప్పుడు తప్ప ఆహారంలో సంకలనాత్మకముల ఉనికి సామాన్యముగా సమ్మతము అయితే ముడిపదార్థము, లేక ఇతర సంబారములద్వార 'క్యారీ ఓవరు'తో సహా మొత్తం సంకలనాత్మకము అట్లు అనుమతించబడిన ప్రమాణముల గరిష్ఠ పరిమితి మించి ఉండరాదు.

భాగము XIV

(క్రిమి సంహారిణులు)

65. [1]. సబ్ రూలు (2)లోని నిబంధనలకు లోబడి, ఆహార వస్తువుల పైన సూటిగా ఏ క్రిమి సంహారిణి కూడ వాడరాదు.

అయితే, ఈ సబ్ రూలులో ఉన్న ఏదియూ క్రిమిసంహారిణుల చట్టం 1968 (1968 యొక్క 46) సె. 5 క్రింద స్థాపించబడిన రిజిస్ట్రేషను కమిటీచే రిజిష్టరు చేయబడి అట్టి ఆహారంపై వాడుటకు సిఫారసు చేయబడిన ధూపము (ధూగమందు) (Fumigant) లకు వర్తించదు.

[2]. క్రింది పట్టికలో కాలం (3)లో పేర్కొనబడిన ఆహారములపై, కాలం (2)లో పేర్కొనబడిన క్రిమి సంహారిణి మొత్తం కాలం (4) లో నిర్ణీతమైన సహన పరిమితి (Tolerance limit) దాటరాదు.

పట్టిక

| క్రమ సంఖ్య | క్రిమి సంహారిణి పేరు | ఆహారము | సహన పరిమితి మి.గ్రా./కి.గ్రా. (పిపియం) |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| 1. | ఆల్డ్రిన్, డై ఎల్డ్రిన్ | ఆహార ధాన్యములు, | 0. 01 |
| | | పాలు,పాల ఉత్పత్తులు | 0.15 (కొవ్వు లెక్కన) |
| | పరిమితులు,ఆల్డ్రిన్ మరియు డై ఎల్డ్రిన్‌లకు ఒంటిగా డై ఎల్డ్రిన్‌గా చెప్పబడిన సయోజనములోను | పండ్లు, కూరగాయలు | 0.1 |
| | | మాంసం | 0.2 |
| | | గుడ్లు | 0.1 [పైడొల్ల లేకుండ] |
| 2. | కార్బరైల్ | ఆహారధాన్యములు | 0.5 |
| | | ఓక్రా, ఆకు | 10.0 |
| | | కూరగాయలు | 0.2 |
| | | బంగాళదుంపలు | 0.5 |
| | | ఇతర కాయగూరలు | 1.0 |
| | | ప్రత్తిగింజలు | 1.0 |
| | | మొక్కజొన్న గింజలు | 0.05 |
| 3. | క్లోర్డేన్ అవశేషము (సిస్‌ప్లస్ ట్రాన్స్ క్లోర్డేన్‌గాకొలచినది) | పాలు, పాల ఉత్పత్తులు | 0.05 |
| | | కాయగూరలు | 0.2 |
| | | పండ్లు | 0.1 |
| | | పక్కెర | 0.3 |

| | | | |
|---|---|---|---|
| 4. | డి డి టి. | పాలు,పాల ఉత్పత్తులు | 1.25 [కొవ్వు లెక్కన] |
| | పరిమితులు,డి డి టి, డి డి డి. మరియు డి డి ఇ.లకు ఒంటిగా లేక సంయోజనము నకుగాని వర్తించును | పండ్లు, బంగాళాదుంపలతో సహా కూరగాయలు, | 3.5 |
| | | మాంసం, చేప, కోళ్ళు వగైరా | 7.0 [మొత్తం పదార్థము లెక్కన] |
| | | గుడ్లు | 0.5 [పైడొల్ల లేకుండా] |
| 5. | తయాజినాన్ | ఆహార ధాన్యములు | 0.05 |
| | | కూరగాయలు | 0.5 |
| 6. | డైక్లోర్వోస్ (డైక్లోరో ఎసిటాల్డిహైడ్ యొక్క భాగం) [సాధ్యమైనచోట డి.సి.ఎ రిపోర్టు చేయవలెను.] | ఆహార ధాన్యములు | 1.0 |
| | | మరబట్టిన ఆహార ధాన్యములు | 0.25 |
| | | కూరగాయలు | 0.15 |
| | | పండ్లు | 0.1 |
| 7. | డైకోఫోల్ | పండ్లు, కూరగాయలు | 5.0 |
| | | టీ (పొడిగా తయారీ) | 5.0 |
| 8. | డైమిథోయేట్ (డైమిథోయేట్‌గా నిర్ణయించబడిన, చెప్పబడిన అవక్షేపము) | పండ్లు, కూరగాయలు | 2.0 |

| | | | |
|---|---|---|---|
| 9. | ఎండోసల్ఫాన్ (అవక్షేపములుఎండోసల్ఫాన్ ఎ అండ్ బి మరియు ఎండోసల్ఫాన్ సల్ఫేట్‌ల మొత్తంగా కొలచి, మొత్తంగా తెలుపబడినవి) | పండ్లు, కూరగాయలు | 2.0 |
| | | ప్రత్తిగింజలు | 0.5 |
| | | ప్రత్తిగింజలనూనె క్రూడ్ | 0.2 |
| 10. | ఫెనిట్రోథియాన్ | ఆహార ధాన్యములు | 0.02 |
| | | మరబట్టిన ఆహార ధాన్యములు | 0.005 |
| | | పాలు, పాల ఉత్పత్తులు | 0.05 |
| | | పండ్లు | 0.5 |
| | | కూరగాయలు | 0.3 |
| | | మాంసం | 0.03 |
| 11. | హెప్టాక్లోర్ [హెప్టాక్లోర్ మరియు దాని ఎక్స్‌పోక్సైడ్‌ల అవక్షేపముల సంయోజనము నిర్ణయించి హెప్టాక్లోర్‌గా చెప్పబడునది.] | ఆహార ధాన్యములు | 0.01 |
| | | మరబట్టిన ఆహార ధాన్యములు | 0.002 |
| | | పాలు, పాల ఉత్పత్తులు | 0.15 |
| | | కూరగాయలు | 0,05 |
| 12. | హైడ్రోజెన్ సైయనైడ్ | ఆహార ధాన్యములు | 3.75 |
| | | మరబట్టిన ఆహార ధాన్యములు | 3.0 |
| 13. | హైడ్రోజన్ ఫాస్ఫైడ్ | ఆహార ధాన్యములు | 0.05 |
| | | మరబట్టిన ఆహార ధాన్యములు | 0.01 |
| 14. | ఇనార్గానిక్ బ్రోమైడ్ | ఆహార ధాన్యములు | 25.0 |
| | | మరబట్టి ధాన్యములు | 25.0 |
| | | పండ్లు | 30.00 |
| | | ఎండబెట్టబడిన పండ్లు | 100.0 |
| | | మసాలాలు | |

| | | | |
|---|---|---|---|
| 15. | లిండేన్ | ఆహార ధాన్యములు | 0.25 |
| | | పాలు, పాల ఉత్పత్తులు | 0.2 (కొవ్వులెక్కన) |
| | | పండ్లు, కూరగాయలు | 3.0 |
| | | గ్రుడ్లు | 0.1 (పైడొల్లలేని లెక్కన) |
| | | మాంసం,కోళ్ళు వగైరా | 2.0 (మొత్తం లెక్కన) |
| 16. | మలాథియాన్ [మలాథియాన్ మరియు మలాక్సాన్‌ల సంయోజనముల అవశేషముగా నిర్ణయింపబడి, చెప్పబడునది.] | ఆహార ధాన్యములు | 4.0 |
| | | మరబట్టిన ధాన్యములు | 1.0 |
| | | పండ్లు | 4.0 |
| | | కూరగాయలు | 3.0 |
| | | ఎండబెట్టిన పండ్లు | 8.0 |
| 17. | పెరాథియాన్ [పెరాథియాన్, పరాక్సాన్‌ల సంయోజనముల అవశేషముగా నిర్ణయించబడి పరాథియాన్‌గా చెప్పబడినది.] | పండ్లు, కూరగాయలు | 0.5 |
| 18. | పరాథియాన్ మిథైల్ (పరాథియాన్ మిథైల్ మరియు దాని ఆక్సిజను రసాయనముల సంయోజనముల అవశేషము పరాథియాన్ మిథైల్‌గా నిర్ణయింపబడి, చెప్పబడినది) | పండ్లు | 0.2 |
| | | కూరగాయలు | 1.0 |

| | | | |
|---|---|---|---|
| 19. | ఫాస్ఫోమిడాన్ (ఫాస్ఫోమిడాన్ మరియు దాని డెసిథైల్ డెరివేటివ్‌ల మొత్తంగా చెప్పబడిన అవశేషం) | ఆహార ధాన్యములు<br>పండ్లు, కూరగాయలు | 1.5<br>0 2 |
| 20. | పైరెథ్రిన్ (పైరెథ్రీన్‌ల మరియు పైరెథ్రమ్ యొక్క నిర్మాణములో తత్సంబంధమైన క్రిమి సంహారక భాగాంశముల మొత్తం) | ఆహార ధాన్యములు<br>మరబట్టిన ధాన్యములు<br>పండ్లు, కూరగాయలు | 1.5<br>0.5<br>1.0 |

వివరణ :- ఈ రూలు నిమిత్తం :-

ఎ) 'క్రిమి సంహారిణి' పదము క్రిమిసంహారిణుల చట్టం 1968 (1968 యొక్క 49)లో దానికి ఇవ్వబడిన అర్థమే కలిగి యుండును.

బి) వేరు విధంగా చెప్పబడిన తప్ప—

i) గరిష్ఠ పరిమితులు పూర్తి ఉత్పత్తితో మి.గ్రా/కి.గ్రా లెక్కన చెప్పబడినవి.

ii) అన్ని ఆహారములు వ్యాపారములో జరుగు సహజ వ్యవసాయోత్పత్తులకు ప్రస్తావన.

భాగం XV

## సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్టెడ్ ఆయిలు మరియు తినదగు పిండి (ఎడిబిల్ ఫ్లోర్)

66. 'సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్టెడ్ ఆయిల్' నిర్వచనము :-

'సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్టెడ్ ఆయిలు' అనగా—

'Extraction by Solvent' ప్రక్రియద్వారా నూనె పదార్థము నుండి తీయబడిన ఏదైనా గడ్డినూనె.

67. 'సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్టెడ్ ఆయిలు' తయారీ, నిల్వ, మరియు అమ్మకముల షరతులు :-

'సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్టెడ్ ఆయిలు' తయారీ, నిల్వ, మరియు అమ్మకం, క్రింది షరతులకు లోబడి యుండవలెను.

1 సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్టెడ్ ఆయిలు, డి. ఆయిల్డ్ మీల్ అండ్ ఎడ్‌బిల్ ఫ్లోర్ (కంట్రోల్) ఆర్డర్ 1967 (ఇక ముందు ఈ భాగంలో 'సదరు ఆర్డరు' అని పిలువబడు) క్రింద అందు కొరకు లైసెన్సు పొందిన ఫ్యాక్టరీలలోనే నూనె తయారు చేయవలెను.

2. 'సాల్వెంటు ఎక్స్‌ట్రాక్టెడ్ ఆయిలు' తయారీ కొరకు, నిష్కర్ష (Extraction) ప్రక్రియలో జేయబడిన నూనె పదార్థములు, మరియు సదరు ప్రక్రియలో వాడిన ద్రావణి సదరు ఆర్డరులో క్లాజు 9 సబ్ క్లాజు (7) (8) లలో నిర్దేశించబడిన నాణ్యత ప్రమాణములకు సరిపోవలెను.

3. సదరు ఆర్డరులో క్లాజు 9, సబ్ క్లాజు (1) లో అనుమతించబడినట్టి ఆహార గ్రేడు 'సాల్వెంటు ఎక్స్‌ట్రాక్టెడ్ ఆయిలు మాత్రమే,

నేరుగా మానవ భోజన నిమిత్తం, నేరుగా మానవ భోజనము నిమిత్తం శుద్ధిచేయుటకొరకు లేక గడ్డినూనె తయారు చేయుటకు సదరు ఆర్డరులో క్లాజు 9 సబ్ క్లాజు (2)లో అనుమతించబడినట్టివి మాత్రమే తయారీ, నిల్వ అమ్మకం చేయవలెను. మరియు ఈ నూనెలు అందులో నిర్దేశించబడిన సముచిత నాణ్యత ప్రమాణముల కనుగుణముగా ఉంచవలెను.

4. నూనెలు సదరు ఆర్డరు క్లాజు (11) క్రింది షరతుల ప్రకారం ప్యాకు చేయబడి లేబిల్ చేయబడి యుండవలెను.

5. రిఫైన్డ్ గ్రేడ్: అనగా, తటస్థీకరించబడిన (Nuetralised) నిరంజనం చెందిన (Bleached) వాసన తీసి వేయబడిన (Deodarised) మరియు అట్టి నూనెకు సముచిత నాణ్య ప్రమాణములకనుగుణంగా యున్న నూనె తప్ప, మిగతా సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్టెడ్ నూనెల నిల్వల అమ్మకం, రవాణా, సదరు ఆర్డరు క్లాజు 9, సబ్ క్లాజు (3) యొక్క నిబంధనల కనుగుణంగా ఉండవలెను. అట్టినూనె ఉత్పత్తిదారుచే నేరుగా సదరు ఆర్డరు క్రింద దాని యొక్క పారిశ్రామిక వాడకం దార్లుగా రిజిష్టరు అయిన వారికే అమ్మవలెను మరి ఇంకే వ్యక్తికిగాని, మూడవ వ్యక్తి ద్వారాగాని అమ్మరాదు.

63. 'సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్టెడ్ ఎడిబిల్ ఫ్లోర్' అనగా ప్రత్యేకంగా తయారు చేయబడిన డీ-ఆయిల్డ్ మీల్ నుండి తీయబడిన ఘన పదార్థము అనగా మంచి నాణ్యత గల నూనె గింజలు ఒకే వత్తిడి వలన వచ్చిన దాని నుండి ద్రావణి నూనె తీసివేయగా వచ్చిన అవశేషము.

69. సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్టెడ్ ఎడిబిల్ ఫ్లోర్ తయారీ, నిల్వ, అమ్మకముల షరతులు :-

సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్టెడ్ ఎడిబిల్ ఫ్లోర్ తయారీ, నిల్వ, అమ్మకం క్రింది షరతుల అమలుకు లోబడి యుండవలెను.

1. సదరు ఆర్డరు క్రింద అందుకు నై సెన్సు ఇవ్వబడిన ఫ్యాక్టరీలలోనే తినదగు పిండి (Edible flour) తయారీ చేయవలెను.

2. ఎడిబిల్ ఫ్లోర్ దేనినుండి తయారు చేయబడినది సదరు డి-ఆయిల్డ్ మీల్ మరియు నిష్కర్ష ప్రక్రియలో వాడిన ద్రావణి, సదరు ఆర్డరు క్లాజు 9 సబ్ క్లాజు 6 (8)లలో నిర్దేశించబడిన నాణ్యత ప్రమాణములకు అనుగుణంగా ఉండవలెను.

3. క్లాజు 9 సబ్ క్లాజు 6 లో అనుమతించబడినట్టి, గోధుల రకముల 'ఎడిబిల్ ఫ్లోర్' మాత్రమే తయారు చేయవలెను. మరియు ఇవి అందుకు నిర్దేశించబడిన నాణ్యత ప్రమాణములకు అనుగుణంగా యుండవలెను.

4. సదరు ఆర్డరు క్లాజు 11 నిబంధనం ప్రకారం, ఎడిబిల్ ఫ్లోర్ ప్యాకు చేయబడి లేబిల్ చేయబడవలెను.

## భాగం XVI

సెక్వెస్టరింగ్ మరియు బఫరింగ్ (ఏజంట్లు ఆమ్లములు, క్షారములు మరియు లవణములు)

70. సెక్వెస్టెరింగ్ ఏజంట్లు (Sequestering Agents) నిర్వచనము :-

లోహములు ఆక్సీకరణ విఘటనమును ఉత్ప్రేరణచేసి చిలిపేట్లు ఏర్పడు ప్రతికూల పర్యవసానమును అరికట్టి, తద్వారా విరంజనము, రుచి నాశనము మురుగు వాసన ఆటంకపరచు పదార్థములు.

71. (సంఘర్షక ప్రతిబంధకములు) బఫరింగ్ ఏజెంట్లు (Buffering Agents) నిల్వ చేయుటలో, ప్రాసెసింగ్‌లో ఆమ్ల, క్షార పరిణామములు జరుగకుండ నిరోధించి, తద్వారా ఆహారముల కమ్మదనము, స్థిరత్వమును అభివృద్ధిపరచు పదార్థములు.

72. సెక్వెస్టరింగ్ మరియు బఫరింగ్ ఏజెంట్లు వాడకంపై నిర్బంధం :-

వేరు విధంగా చెప్పబడియుంటే తప్ప, క్రింది పట్టికలోని కాలం (1)లో పేర్కొనబడిన (సెక్వెస్టరింగ్ మరియు బఫరింగ్ ఏజంట్లు) సదరు పట్టికలో (2)వ కాలంలో సంబంధిత నమోదులో పేర్కొనబడిన ఆహార సముదాయములలో, సదరు పట్టికలో కాలం (3)లో సంబంధిత నమోదులో పేర్కొనబడిన మోతాదు మించని గాఢతలో వాడవచ్చును.

పట్టిక

| సెక్వెస్టరింగ్ మరియు బఫరింగ్ ఏజెంటు పేరు | ఆహార సముదాయములు | గరిష్ఠవాడకం దశ మిలియనుకు భాగము పి.పి.యం, (మి.గ్రా. కి. గ్రా) |
|---|---|---|
| 1. ఎసిటిక్ ఆమ్లం | i) పానీయములు. మృదు పానీయములలో ఆమ్లీకరణ, సంఘర్షక ప్రతిబంధక, తటస్థీకరణ పదార్థములు | జి పి యం. పరిమితము |
| | ii) డబ్బాలలో ఉంచబడిన శిశు ఆహారములలో (Canned baby foods) | 5000 |
| 2. ఎడిపిక్ ఆమ్లం | ఉప్పుకు బదులుగా వాడు మరియు ఆహారము | 250 |
| 3. అమ్మోనియంపాస్ఫేటు (మోనోబేసిక్) | పిండిలో బ్రెడ్ ఇంప్రూవర్ | 2500 |

| | | |
|---|---|---|
| 4. అమ్మోనియం కార్బోనేట్ | రొట్టెలు, మిఠాయిలలో ఉబ్బుటకు / పులియ బెట్టుటకు కలుపు పదార్థం (Leavening agent) గా | 5000 |
| 5. కాల్షియం గ్లూకొనేట్ | మిఠాయిలు | 2500 |
| 6. కాల్షియం కార్బొనేట్ | ఆహారములో తటస్థీ కరణిగా | 10,000 |
| 7. కాల్షియం ఆక్సైడ్ | ప్రత్యేకంగా చెప్పబడిన పాల ఉత్పత్తులలో తటస్థీకరణిగా | 2500 |
| 8. సిట్రిక్ ఆమ్లం, మాలిక్ ఆమ్లం. | కర్బనీకృత పానీయములు, మరియు చిరు ఆహారములలో ఆమ్లీకరణిగా | జి. యం. పి. పరిమితము. |
| 9. గ్లూకోనోడెల్టాక్టోన్ | శుభ్రపరచబడిన మాంసము, లేక మాంస ఉత్పత్తులలో పులియబెట్టు పదార్థం (Leavening agent)గా | 5000 |
| 10. D L లాక్టిక్ ఆమ్లం (ఆహార గ్రేడ్) | చిరు ఆహారములలో ఆమ్లీకరణిగా | జి. యం. పి. పరిమితము |
| 11. ఫాస్ఫారిక్ ఆమ్లం | పానీయములు, మృదుపానీయములు | 600 |
| 12. ఆరు ఫాస్ఫేట్ భాగములకు తక్కువ గల్గిన పాలీ ఫాస్ఫేట్ | ఎ. ప్రాసెస్ చేయబడిన జున్ను, రొట్టె | 40 000 |
| | బి. పాల ఉత్పత్తులు | 4000 |
| | సి. కేక్ మిశ్రమములు | 10000 |
| | డి. ప్రోటీన్ ఆహారములు | 4000 |
| 13. L (+) టార్టారిక్ ఆమ్లం | ఆమ్లీకరణులు | 600 |

గమనిక :- D L లాక్టిక్ ఆమ్లం L (+) టార్టారిక్ ఆమ్లం 12 నెలల లోపు పిల్లలకు ఉద్దేశించబడిన ఏ ఆహారములోను కలుపబడరాదు. లాక్టిక్ ఆమ్లం భారత ప్రమాణముల సంస్థ విధించిన ప్రమాణములకనుగుణముగా కూడా యుండవలెను.

# అనుబంధం - ఎ.

ఫారం — 1.

[రూలు 4 (i) చూడుము]

(కేంద్ర ఆహార పరిశోధనశాల డైరక్టరుకు మెమోరాండం)

............... నుండి

డైరక్టరు,
కేంద్ర ఆహార పరిశోధనశాల, గార్కి,

సం. ......................    తేదీ. ......................

మెమోరాండం

ఆహారకల్తీ నివారణ చట్టం 1954 సెక్షను 13 (2) నిబంధనల క్రింద నేను ఇందుమూలంగా ......................అని చెప్పబడుచున్న ఆహార శాంపిల్‌ను పరీక్ష లేక విశ్లేషణముకొరకు పంపుచున్నాను. మరియు పరీక్ష లేక విశ్లేషణముయొక్క ఫలితముపై నివేదిక ఈ కోర్టుకు పంపవలసినదిగా కోరుచున్నాను.

1. ఆధార పాత్రపై మరియు పై కవరుపై ప్రత్యేక గుర్తింపు సంఖ్య,
2. మోపబడిన నేరము వివరములు,
3. అభిప్రాయము కోరబడిన విషయము.

రూ. 40/- ల రుసుము ( Receipt head - 082 - public health, sanitation and water supply fees and fines etc) క్రింద ట్రెజరీలో జమ చేయబడినది. ట్రెజరీ చలాన యిందులో జత చేయబడినది. మెమోరాండం నకలు, పాత్రపై కవరు మీద సీలు వేయుటకు వాడబడిన సీలు యొక్క నమూనా ముద్ర విడిగా రిజష్టరు పోస్టులో పంపబడినవి.

ఒకటవ తరగతి / మెట్రోపాలిటన్
మెజిస్ట్రేటు.

———

ఫారం — 2.

[రూలు 4 (5) చూడుము]

కేంద్ర ఆహార పరిశోధనశాలచే పరీక్ష లేక విశ్లేషణముల సర్టిఫికేటు

సర్టిఫికేటు నెం.

.................... నంబరు గల .................... తేదీ గల ..........
మెమోరాండం నం. తో.............. నుండి ..............తేదీన అందిన .................... అని చెప్పబడుచున్న శాంపిలు (ళ్ళు) విశ్లేషణమునకు తగిన స్థితిలో యున్నద (వ)నియు, మరియు పరీక్ష విశ్లేషణము చేయబడినవనియు, మరియు అట్టి పరీక్షలు విశ్లేషణము యొక్క ఫలితము(లు) క్రింద చెప్పబడినట్లుగాయున్నవని ———————— ధృవీకరించుచున్నాను.

మరియు నా అభిప్రాయము ————————

2. అందినప్పుడు పాత్రమీద మరియు పై కవరు మీద సీళ్ళ పరిస్థితి ఈ విధంగా ఉన్నది....

స్థలం....

తేదీ ....

డైరక్టరు
కేంద్ర ఆహార పరిశోధనశాల.

———

ఫారం — III

[రూలు 7 (3) చూడుము]

పబ్లిక్ ఎనలిస్టు నివేదిక

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 క్రింద సక్రమంగా నియమింపబడి, .........కు పబ్లిక్ ఎనలిస్టు అయిన నేను, .................................... తేదీన .............. నుండి, లోకల్ హెల్త్ అధారిటీ యొక్క’..............

కోడ్ నంబరు........ క్రమ సంఖ్య కల్గి, సరిగా సీలు వేయబడిన మరియు కట్ట బడిన............ శాంపిల్ పొందినాను, మరియు సీలు సరిగా ఉన్నదని విరుగలేదని గమనించినాను అని ధృవీకరించుచున్నాను.

శాంపిల్ పాత్ర మీద మరియు పై కవరు మీద వేయబడిన సీలు పుడ్ ఇన్స్పెక్టరు విడిగా పంపిన సీలు నమూనా ముద్రతో సరిపోలి యున్నది. మరియు శాంపిల్ విశ్లేషణమునకు తగిన స్థితిలో వున్నది.

ఇంకా

నేను సదరు శాంపిల్‌ను విశ్లేషణము చేసినానని / చేయించినానని ధృవీకరించు చున్నాను. నా విశ్లేషణము యొక్క ఫలితము క్రింది విధముగా నున్నదని ప్రకటించు చున్నాను.

.... .... ....

.... .... ....

.... .... ....

మరియు .... .... .... .... అని నా అభిప్రాయము

.... .... .... .... తేదిన సంతకం చేయబడినది.

చిరునామా :

సంతకం

పబ్లిక్ ఎనలిస్టు

———

ఫారం — IV

[ రూలు 10 చూడుము ]

విక్రయదారు పేరు

.... .... ....

.... .... ....

నీ స్వాధీనములోనున్న, ———————— ఆహారమునకుద్దేశించ బడిన .... .... .... .... .... కల్తీ చేయబడినది/మిస్‌బ్రాండ్ చేయబడినదని
(ఆహార వస్తువు పేరు)
నాకు అనిపించగా, కాబట్టి, ఇప్పుడు, ఆహార కల్తీ నివారణ చట్టం 1954, సె. 10 (4) క్రింద, దీనికి సంబంధించి తరువాత ఇవ్వబడు ఉత్తర్వులకు లోబడి, నీవు సదరు నిల్వను భద్రంగా నీ స్వాధీనంలో ఉంచవలెనని, నేను ఇందు మూలంగా ఆదేశించుచున్నాను.

ఫుడ్ ఇన్స్పెక్టరు
'[ఏరియా]'

---

## ఫారం — IV ఎ

[రూలు 10 చూడుము]

(జామీనుదారు బాండు)

మెసర్స్ ............... యజమానులు / భాగస్వాములు అయిన మేము అనగా i) ................................ తండ్రి పేరు ............................ గ్రామస్థుడు మరియు ii) ———————— తండ్రి పేరు ........ గ్రామస్థుడు
(ఇక ముందు విక్రయదారులుగా పిలువబడు), iii) ........................ తండ్రి పేరు ———————— (గ్రామస్థుడు, మరియు iv) ——————— ———————— తండ్రిపేరు ........................ గ్రామస్థుడు [ఇక ముందు జామీనుదారులుగా పిలువబడు] ఈ పత్రముద్వారా అందరికి తెలియబరుచునది యేమనగా

భారత రాష్ట్రపతి/ .... .... .... .... .... గవర్నరుకు [ఇకముందు ప్రభుత్వమని పిలువబడు] రూ. — — — ల మొత్తమునకు గట్టిగా బాధ్యులము, కట్టుబడియున్నాము, మరియు ప్రభుత్వమునకు తప్పక, సత్యముగా అట్టి చెల్లింపుకు మేము యిందు మూలంగా జాయింటుగా/మరియు విడివిడిగా బద్ధులమయినాము.

........................... తేదిన సంతకం చేయబడినది.

శ్రీ — — — — — ఫుడ్ ఇన్స్పెక్టరు .... .... .... .... .... [సరుకు వివరం, సంఖ్య, పరిమాణము మొత్తం విలువ వ్రాయుము, మరియు ఇక ముందు సదరు వస్తువుగా పిలువబడు] — — — — — [స్థలం] నుండి స్వాధీనం చేసికొనగా,

విక్రయదారు (లు) అభ్యర్థనపై గవర్నమెంటు. సదరువస్తువును విక్రయ దారు (లు) ఇటు తర్వాత చెప్పబడిన షరతులతో మరియు జామీనుదారు(ల)తో ఖల పరచబడిన బాండు వ్రాసియిచ్చు షరతుపై సదరు వస్తువును విక్రయదారు(ల) స్వాధీనంలో ఉంచుటకు సమ్మతించగా, విక్రయదారులు అట్లు చేయుటకు అంగీక రించగా.

ఇప్పుడు ఈ లిఖిత బాధ్యత యొక్క షరతు యేమనగా,

విక్రయదారు, ఫుడ్ ఇన్స్పెక్టరు పేర్కొనిన తేదీన, కోర్టులో లేక ఇతర అథారిటీ ముందు సదరు వస్తువును అదే స్థితిలో హాజరు పరచనట్లయితే విక్రయ దారు(లు) మరియు / లేక జామీను దారులు గరవ్నమెంటు కోరిన తక్షణం, మారు మాట లేకుండ, రు...........లు చెల్లించగలరు. అప్పుడు సదరు బాండు రద్దగునని లేనిచో అది పూర్తి బలము, విలువకలిగి అమలులో ఉండును.

1. ఇందుమూలంగా ఇంకనూ ఒప్పుకొనినదేమనగా దీనిక్రింద విక్రయదారు(ల) యొక్క అన్ని బాధ్యతలు లేక షరతుల గురించి లేక సంబంధించి, అయిన ఏ ఒక్క జామీనుదారు ఎరుకలేక సమ్మతితోగాని, లేకుండగాని గవర్నమెంటు గడువు యిచ్చిన, మానుకొనిన, చర్యతీసికొనిన లేదా, తీసికొనక పోయిన కారణం చేత దీని క్రింది జామీనుదారు(ల) ఏ బాధ్యత, నెరవేర్చవలసిన షరతులు ఆటంక పరచబడవు రద్దుకావు. దీనిక్రింది మొత్తమును రాబట్టుకొనుటకు జామీను దారులపైన్, లేక వారిలో ఒకరిపై దావా వేయుటకు ముందు ప్రభుత్వము విక్రయదారుపై దావా వేయనవసరం లేదు.

2. ఈ బాండు ఆహార కల్తీ నివారణ చట్టం 1954 క్రింద, ప్రజాశ్రేయస్సుగల చర్య నిర్వర్తించుటకు ఇవ్వబడినది.

3. దీనిమీద స్టాంపు సుంకము గవర్నమెంటు భరించవలెను. ఇందుకు సాక్ష్యంగా విక్రయదారు(లు) మరియు జామీను దారు(లు) పై తేదీన మరియు భారత రాష్ట్రపతి/

గవర్నరు తరపున శ్రీ ......................................చే, వారి సంతకమునకు క్రింద కనబడుచున్న తేదిన సంతకం చేయడమయినది.

సాక్షులు :-

1. ......................సంతకం సంతకం......................

(పేరు చిరునామా) విక్రయదారు

2. ..............................సంతకం సంతకం......................

(పేరు చిరునామా) విక్రయదారు

సంతకం......................

జామీనుదారు

సంతకం......................

జామీనుదారు

భారత రాష్ట్రపతి/గవర్నరు కొరకు మరియు తరపున

................................

పేరు

హోదా.

---

ఫారం — V

[రూలు 11 చూడుము]

.... .... .... ....

(విక్రయదారు పేరు) కు............................స్థలం

— — — — లోనున్న .... .... .... .... .... గారి ఆవరణ నుండి క్రింద వివరించబడిన ఆహార వస్తువు నిల్వ, ఆహార కల్తీ నివారణ చట్టం 1954 (1954 యొక్క 37 చట్టం సె. 10 సబ్ సెక్షను [4] క్రింది నాచే స్వాధీనం చేసికొనబడినవి.

స్వాధీనం చేసికొనిన ఆహార వస్తువు నిల్వ వివరములు :

— — —

— — —

— — —

పుడ్ ఇన్స్పెక్టరు

ప్రాంతం .... .... .... ....

తేది.

— — —

ఫారం — VI

[రూలు 12 చూడుము]

— — — — కు

నేను ఈ రోజున — — — — లో ఉన్న — — — — గారి ఆవరణలో నుండి క్రింద పేర్కొనబడిన ఆహారము శాంపిల్‌ను పబ్లిక్ ఎనలిస్టుచే విశ్లేషణ చేయించు నిమిత్తం తీసుకొన్నాను.

ఆహార వివరములు

— — — —

పుడ్ ఇన్స్పెక్టరు

ప్రాంతం—

స్థలం :

తేది :-

— — —

ఫారం — VI ఎ

[రూలు 12 - ఎ చూడుము]

వారంటీ యొక్క ఫారం

ఇన్‌వాయిస్ నం.

.... .... .... నుండి

.... .... .... కు

స్థలం :-

తేది :-

| విక్రయం తేదీ | వస్తువు యొక్క స్వభావము నాణ్యత | బాచ్ నం. కోడ్ నం. | పరిమాణం | వెల |
|---|---|---|---|---|
| 1 | 2 | 2 - ఎ | 3 | 4 |

నేను / మేము, ఈ ఇన్‌వాయిస్‌లో ఉదహరించబడిన ఆహారము [లు] చెప్ప బడుచున్న స్వభావము నాణ్యత కల్గియున్నవని వారంటీ యిచ్చుచూ ధృవీకరించు చున్నాను [ము].

తయారీదారు, పంపిణీదారు లేక
డీలరు సంతకం

లైసెన్సు నం.
[వర్తించు సందర్భములలో]

---

ఫారం — VI బి
[రూలు 44 - బి చూడుడు]

.... .... .... .... .... తరఫున నేను/మేము.... .... .... ....
ఇందు మూలంగా .... .... .... .... తరఫున నేను/మేము అమ్మిన.
.... .... .... .... .... తరఫున నేను / మేము .... .... .... .... ....
తయారీలో వాడిన నేయి-

.... .... .... ... నుండి వచ్చినదనియు మరియు, అగ్‌మార్క్ సీలుగల టిన్‌లోని దనియు, సదరు టిన్ .... .... .... .... .... బాచ్ నం. కు సంబంధించినదనియు నా[మా]చే — — — — — తరఫున — — — —శ్రీ/శ్రీమతి/కుమారి మెసర్సు — — — — నుండి — — — — — ఇన్‌వాయిస్/క్యాష్/క్రెడిట్ మెమో నం. — — — — తేదీ — — — — ద్వారా కొన బడినదనియు — సత్యప్రమాణకముగా ప్రకటించుచున్నాను[ము]

స్థలము :
తేదీ.

వ్యాపారి[రుల] సంతకం[లు]

---

## ఫారం — VII

[రూలు 17 చూడుడు]

### పబ్లిక్ ఎనలిస్టుకు మెమోరండం

.... .... .... .... నుండి

— — — — పబ్లిక్ ఎనలిస్టు

— — — — కు,

నంబరు — — — తేది — — — —

### మెమోరాండం

ఆహార కల్తీ నివారణ చట్టం 1954, సెక్షను 10, సబ్ సెక్షను (1) క్లాజు బి) క్రింద, మరియు/లేక సె. 11 సబ్ సెక్షన్ [i] క్లాజు [సి] [ii ] ప్రకారం క్రింద వివరించబడిన శాంపిల్ విశ్లేషణము కొరకు ఇందులో పంపడమైనది.

1. లోకల్ హెల్త్ అథారిటీ యొక్క కోడ్ సంఖ్య మరియు క్రమ సంఖ్య.
2. విక్రయదారు పేరు
3. తీసికొనబడిన తేదీ, స్థలం
4. విశ్లేషణ కొరకు పంపబడిన వస్తువు స్వభావం
5. వాడినట్లయితే, పరిరక్షక పదార్థము యొక్క స్వభావం, పరిమాణం

2. ఈ మెమోరాండం నకలు, శాంపిలు గల బంగీ సీలు వేయుటకు వాడిన సీలు నమూనా ముద్ర, విడిగా పోస్టు/చేతి ద్వారా పంపబడుచున్నది.

ఫుడ్ యిన్స్పెక్టరు

ప్రాంతం

[జి. యస్. ఆర్. 293 [ఇ] - 23-3-85 ప్రకారం సవరించబడినది]

### ఫారం — VIII

[రూలు 12 బి చూడుము]

### కంపెనీచే వ్యక్తుల నామ నిర్దేశము

శ్రీ/శ్రీమతి — — — — కంపెనీ యొక్క డైరక్టరు/మేనేజరు — — — — — సదరు కంపెనీకి ఇన్‌ఛార్జిగా ఉండునట్లు మరియు సదరు కంపెనీ లేక దాని ఎస్టాబ్లిష్‌మెంటు/బ్రాంచి/ యూనిట్ యొక్క వ్యాపార నిర్వహణకు బాధ్యత వహించి యుండునట్లు కంపెనీ వారి — — — — — — తేదిన జరిగిన సమావేశములో తీర్మానము ద్వారా నామ నిర్దేశింపబడినాడని మరియు ఆహార కల్తీ నివారణ చట్టం, 1954 క్రింది సదరు కంపెనీ ఏ నేరము చేయకుండా ఉండుటకు అవసరమయిన అన్ని సముచిత చర్యలు తీసికొనుటకు అధికార మివ్వబడినాడని, ఇందు మూలంగా నోటీసు యివ్వడమైనది.

సదరు తీర్మానము యొక్క ధృవీకరించబడిన నకలు ఇందుతో జత పర్చబడినది.

స్థలము : మేనేజింగ్ డైరెక్టరు/మేనేజరు సంతకం

తేదీ : .... .... ....

[కంపెనీ పేరు]

నేను పై ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె. 17 సబ్ సె. [2] మరియు దీని క్రింది చేయబడిన రూలు 12 - బి ప్రకారం పై నామ నిర్దేశమును అంగీకరించుచున్నాను.

స్థలము : డైరక్టరు/మేనేజరు సంతకం

తేది :

సదరు నామ నిర్దేశము చేరినట్లుగా, ఇందు మూలంగా ఒప్పుకొనుచున్నాను.

స్థలం : లోకల్ హెల్త్ అథారిటీ సంతకం

తేదీ :

నిర్వచనములు నాణ్యత, ప్రమాణములు

ఎ. 01 : పానీయములు : ఆల్కహాలేతర
(Beverages – Non Alcoholic)

ఎ. 01. 0.1 : "కార్బనీకృత నీరు"
(Carbonated Water)

# అనుబంధం-బి

5 కంటె తక్కువ ఉండరాదు.

ఎ. 02 : "బేకింగ్ పౌడర్"
(Baking Powder)

అనగా సోడియం బై కార్బోనేట్ మరియు ఆమ్ల క్రియ జనక పదార్థము పిండి పదార్థము లేదా ఇతర తటస్థ పదార్థములు కలిగియుండి, బట్టీలో ఒకతడవ వేడి చేయుట వలన కార్బన్ డయాక్సైడ్ వెలువరించగల సంయోగము.

బేకింగ్ పౌడరు చూర్ణంలో ఉండు ఆమ్లక్రియ జనక పదార్ధములు

ఎ. టార్టారిక్ ఆమ్లము లేక దాని లవణములు లేక రెండూను

బి. ఫాస్ఫారిక్ ఆమ్లము యొక్క ఆమ్ల లవణములు, లేక

సి. అల్యూమినం యొక్క ఆమ్ల సమ్మేళనము, లేక

డి. ఏవైన పైన చెప్పబడిన వాని సంయోగములు

'బేకింగ్ పౌడర్'ను పరిక్షించినపుడు, దాని బరువుకు 10 శాతము తగ్గకుండ కార్బన్ డయాక్సైడు లభించవలెను.

ఎ. 03 : పిండి ఆహారములు
(Starchy Foods)

ఎ. 03. 01 : యారో రూట్
(Arrow root)

అనగా *Maranta arun dinacca* మొక్కల యొక్క కొమ్మలనుండి లేక వేరు పరచి శుభ్రపరచబడిన స్టార్చ్ *Curcuma august folia*

ఎ. 03. 02 : సగ్గు బియ్యం సాగో
(Sago)

అనగా సహజ రంగులతో సహా బాహ్య పదార్ధములు లేని, సాగో, గడ్డ లేదా, కర్రపెండలము (tapioca) దుంపయొక్క పిండి పదార్థమునుండి తయారు చేయబడిన గుట్టి గుళికలు, మరియు సహజ రంగులతో సహా బాహ్య పదార్ధములు లేనిది.

సగ్గుబియ్యం ఈ క్రింది ప్రమాణములకు అనుగుణముగా ఉండవలెను.

1. మొత్తము భస్మము(పొడి లెక్కన)—బరువు నం. 4 శాతము మించరాదు.
2. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లంలో కరుగని భస్మము (పొడి లెక్కన) 0.1 శాతం మించరాదు.

ఎ. 04 : ఇంగువ

(Asafoetida)

అనగా *Ferula rebric aulist Ferula allianeeo Asofoetida* మరియు పెరోలా జాతికి చెందిన మొక్కల కొమ్మల మరియు వేర్ల నుండి లభించిన కదంబపు జిగురు లేదా రిసిన్. ఇందులో కోలోఫోని రిసిన్ గాల్బోనమ్ రిసిన్ అమోనియాకం రిసిన్ లేక ఏ ఇతర రిసిన్‌గాని ఉండరాదు. ఇంగువ (హింగ్) ఈ క్రింది ప్రమాణములకు అనుగుణముగా ఉండవలెను.

1. మొత్తం భస్మం బరువున 15 శాతము మించరాదు.
2. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని బూడిద బరువు 2. 5 శాతము మించ రాదు.
3. (90 శాతము ఆల్కహాలుతో) నిష్కరించ బడిన ఆల్కహాలిక్ పదార్థము యు యస్ పి 1936 పద్ధతిని లెక్కించగా, 12 శాతముకు తగ్గరాదు.
4. పిండి పదార్థము బరువున 1 శాతము మించ రాదు.

హింగ్రా ఈ క్రింది ప్రమాణములకు అనుగుణంగా యుండవలెను

1. భస్మం—మొత్తం బరువున 20 శాతము మించరాదు.
2. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లంలో కరుగని భస్మం బరువున 8 శాతము మించ రాదు.
3. (90 శాతము ఆల్కహాలులో) నిష్కరించ బడిన ఆల్కహాలిక్ పదార్థము యు యస్ పి 1936 పద్ధతిన లెక్కించగా 50 శాతంకు తక్కువ కారాదు.
4. స్టార్చ్-బరువున 1 శాతము మించ రాదు.

సమ్మిశ్రిత ఇంగువ (Compounded Asafoetida) ఒక్కటి గాని ఎక్కువ రకముల ఇంగువ (Asafoetida లేదా ఇరానీ లేక పఠానీ ఇంగువ లేక రెండును) మరియు తుమ్మ జిగురు తినదగు స్టార్చులు లేక తినదగు ధాన్యముల పిండి కలిగి యున్నది. ఇందులో—

ఎ. కొలోఫోన్ రెసిన్, బి. గాల్బనిక్ రెసిన్, సి. అమోనియాకం రెసిన్ డీ. ఏదైన ఇతర రెసిన్, ఇ. కోల్టార్ రంగులు, యఫ్. ఖనిజ పదార్థములు, జి. మొత్తం భస్మం, అంశం 10 శాతము మించి, హెచ్. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం 1.5 శాతము మించి, ఐ. (90 శాతము ఆల్కహాలుతో) నిష్కరించబడిన పదార్థము యు యస్ పి 1936 పద్ధతిలో లెక్కించగా 6 శాతమునకు తగ్గి ఉండరాదు.

## ఎ. 05 : సుగంధ ద్రవ్యములు
## (Spices and Condiments)

గమనిక—ఈ ఐటం క్రింద విహితమైన అన్య పదార్థం ఈ విధంగా వర్గీకరించ, బడవలెను.

a) చెత్త, కాడలు, గడ్డివంటి సేంద్రియ అన్య పదార్థము

b) దుమ్ము, ధూళి, రాళ్ళు, మట్టిపెళ్ళలు వంటి అసేంద్రియ అన్యపదార్థములు

ఐటం A.05.01, A.05.03, A.05.04, A.05.05, A.05.06, A.05.07 A.05.08, A.05.09, A.05.10, A.05.11, A.05.12, A.05.14 A.05.15, A.05.16, A.05.17, A.05.18 లలో అనుమతించబడిన అన్యపదార్థములో అసేంద్రియ అన్యపదార్థము బరువున 2 శాతం మించరాదు.

## ఎ. 05. 01 : స్యాజీర
## (Siahjira) (Caraway)

అనగా *Carum carvi* మొక్క ఎండిన గింజలు. తినదగిన ఇతర గింజలు చెత్త, పొట్టు, కాడలు, దుమ్ము, ధూళి, మట్టి పెళ్ళలు, మరియు రాళ్ళతో సహా అన్యపదార్థములు బరువున 5 శాతము మించరాదు.

క్రిమి, కీటకముల వలన చెడిన పదార్థము 5 శాతము మించరాదు.

వివరణ : క్రిమి, కీటకములవలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని పూర్తిగాగాని, క్రిమి, కీటకములచే బెజ్జములు వేయబడిన సంబారములు.

ఎ. 05. 01. 01 : సాజీర పొడి

అనగా *Carum carvi* యొక్క ఎండబెట్టబడిన గింజలనుండి వచ్చిన పొడి (గుండ) గింజలు చిన్న చిన్న ముక్కలుగా గాని లేదా సన్నగా నూరబడిన, చూర్ణం రూపంలో గాని ఉండ వచ్చును. అది ఈ క్రింది ప్రమాణముల కనుగుణంగా ఉండవలెను.

1. తేమ—బరువున 13 శాతము మించ కుండ
2. మొత్తం భస్మం బరువున 8 శాతము మించ కుండ
3. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం — బరువున 1. 5 శాతము మించ కుండ

ఎ. 05. 02 : సాజీర

(Siahajira) (Carway black)

అనగా *Carum bulbaca satanum* యొక్క ఎండ బెట్టిన గింజలు. అది ఈ క్రింది ప్రమాణములకనుగుణముగా ఉండవలెను.

1. తినదగు ఇతర గింజలు బరువున 5 శాతము మించకుండ
2. మొత్తం భస్మం బరువున 9 శాతము మించకుండ
3. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం బరువున 1.5 శాతము మించకుండ.

కీటకముల వలన చెడినపదార్థము 5 శాతము మించరాదు.

వివరణ : కీటకముల వలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని పూర్తిగా గాని, కీటకములచే బెజ్జములు చేయబడిన సంబారములు.

ఎ. 05. 03 : చిన్న యాలక్కాయలు

(Choti-Elaichi Cardamom, మొత్తము)

అనగా *elettaria cardamomum* ఎండబెట్టిన మొక్క పక్వమునకు వచ్చిన ఫలాలు. ఇందులో అన్య పదార్థము బరువున 5 శాతము మించరాదు. గుళిక నుండి వేరుపరచిన చినయాలక గింజలలో బాష్ప శీల నూనె 3 (వి/డబ్ల్యు) శాతమునకు తగ్గకుండ ఉండవలెను.

కీటకముల వలన చెడిన పదార్థము 5 శాతము మించరాదు.

వివరణ : కీటకముల వలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని పూర్తిగా గాని, కీటకములచే బెజ్జములు చేయబడిన సంబారములు.

ఎ. 05. 03. 01 : చిన్న యాలకులు
(Choti Elaichi Cardamomum)

అనగా (*elettaria cardamum* గుళిక నుండి వేరుపర్చబడిన గింజలు, ఇందులో యితర పదార్థములు బరువున 2 శాతము మించరాదు. ఈ గింజలు బాష్ప శీల నూనె 3 శాతము (వి/డబ్ల్యు) నకు తక్కువ కాకుండా కల్గియుండవలెను.

కీటకముల వలన చెడిన పదార్థము 5 శాతము మించరాదు.

వివరణ : కీటకముల వలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని పూర్తిగా గాని, కీటకములచే బెజ్జములు చేయబడిన సంబారములు.

ఎ. 05. 03. 02 : యాలకుల పొడి

అనగా *elettaria cardomomum* గుళిక నుండి వేరుపర్చబడిన గింజల పొడి (గుండ) అది చిన్నచిన్న/గింజల ముక్కలుగా గాని సన్నగా నూరబడిన చూర్ణముగా గాని ఉండవచ్చును. అది ఈ క్రింది ప్రమాణముల కనుగుణముగా ఉండవలెను.

1. తేమ — బరువున 14 శాతము మించకుండ
2. మొత్తం భస్మం - బరువున 8 శాతము మించకుండ
3. బాష్పశీలనూనె బరువున 3 శాతము (v/w)కు తగ్గకుండ
4. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం బరువున 3 శాతము మించకుండ.

ఎ. 05. 04 : పెద్ద యాలక్కాయలు
(Badi elaichi [Cardamum Amomam])

అనగా *Ammomum Subulatum Roxb* యొక్క గుళికల ఆకారములో దాదాపు పక్వమునకు వచ్చిన ఎండబెట్టబడిన ఫలములు. ఇందులో రక్షకపత్రావళి ముక్కలు, చిన్న వ్రంత భాగములు మరియు ఇతర అన్యపదార్థములు బరువున

5 శాతము మించియుండరాదు. గుళికలనుండి తీయబడిన గింజలలో భాష్ప శీలనూనె 1 శాతము (V/W) కు తక్కువ కాకుండ ఉండవలెను.

కీటకముల వలన చెడిన పదార్ధము .5 శాతం మించరాదు.

వివరణ :- కీటకముల వలన చెడిన పదార్థములనగా పాక్షికంగా గాని పూర్తిగా గాని, కీటకములచే బెజ్జముల చేయబడిన సంబారములు.

ఎ. 05. 04. 01 : పెద్ద యాలకులు

అనగా Ammomum Subulatum Roxb యొక్క *Cordamum Ammomum* గుళికలనుండి వేరుపర్చబడిన గింజలు ఇందులో ఉన్న అన్య పదార్ధములు బరువున 2 శాతము మించరాదు. గింజలు బాష్పశీల నూనె 1 శాతము (V/W) కు తక్కువ కాకుండ కల్గియుండవలెను.

కీటకములవలన చెడిన పదార్ధము 5 శాతము మించరాదు.

వివరణ : కీటకముల వలన చెడిన పదార్ధములనగా పాక్షికంగా గాని పూర్తిగాగాని కీటకములచే బెజ్జములు చేయబడిన సంబారములు.

ఎ. 05. 04. 02 : పెద్ద యాలకుల పొడి

అనగా *Ammomum Subulatum Roxb* గుళికలనుండి వేరుపరచ బడిన గింజల పొడి (గుండ). ఇది చిన్న చిన్న గింజల ముక్కల రూపములోగాని సన్నగా నూరబడిన చూర్ణం రూపంలోగాని ఉండవచ్చును. ఇది క్రింది ప్రమాణము అనుగుణంగా ఉండవచ్చును.

1. తేమ—బరువున 14 శాతము మించకుండ

2. మొత్తం భస్మం—బరువున 8 శాతము మించకుండ

3. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం—బరువున 3 శాతము మించకుండ

4. బాష్ప శీలనూనె 1 శాతము (V/W) తగకుండ

## ఎ. 05. 05: ఎండు మిరపకాయలు (Chillies మొత్తం)

అనగా *Capsicum annum/Fruitescens* యొక్క ఎండబెట్టబడిన పక్వమునకు వచ్చిన ఫలములు. ఇందులోయున్న రక్షక పత్రావళి ముక్కలు, తొడిమలు, దుమ్ము, మట్టిపెళ్ళలు, రాళ్ళతో సహా అన్యపదార్థముల బరువున 5 శాతము మించరాదు. కాయలు వేయబడిన ఇతర రంగు పదార్థములు, ఖనిజ నూనెలపై పూతలు, మరి ఇతర హానికర పదార్థములు లేనివై యుండవలెను.

కీటకములవలన చెడిన పదార్థము 5 శాతము మించరాదు.

వివరణ : కీటకములవలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని పూర్తిగాగాని కీటకములచే బెజ్జములు వేయబడిన సంబారములు.

## ఎ. 05. 05. 01: మిరప పొడి

అనగా *Capsicum Annumo/Capsicum Fruitescens* కాయ యొక్క శుభ్రపరచి ఎండబెట్టబడిన మిరపకాయలు నూరగా (దంచగా) వచ్చినపొడి (గుండ) ఇది (పొడిగా) ఉండి, ధూళి, బూజు, తుట్టెలు, కీటకములు, అన్య పదార్థములు, కలుపబడిన రంగు పదార్థములు, రుచికారకములు లేనివై యుండవలెను. నూనెయొక్క స్వభావము మరియు పరిమాణము తెలియబరచు లేబిల్ కల్గియుండినచో, తినదగు నూనె బరువున 2 శాతము వరకు ఉండవచ్చును. మిరప పొడి ఈ క్రింది ప్రమాణములకనుగుణంగా ఉండవలెను.

1. తేమ—బరువున 12 శాతము మించకుండా
2. మొత్తం భస్మము—బరువున 8 శాతము మించకుండా
3. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మము బరువున 1.3 శాతము మించకుండ
4. ఈథర్‌నుండి నిష్కరించబడిన, బాష్పీభవనం చెందిన పదార్థము 12 శాతము తగ్గకుండా
5. ముతకనారు బరువున 30 శాతము మించకుండా

ఎ. 05. 06 : దాల్చిన

(Cinamom, మొత్తం)

అనగా *Cinamom Zeylanicum* యొక్క లోపలి బెరడు యొక్క ఎండిన ముక్కలు అది ఏ ఇతర శాక పదార్థము గాని రంగు గాని కల్గి యుండరాదు. అది 0 . 3 శాతము (—) తక్కువ గాకుండ భాష్పశీలనూనె (V / W) కలిగి యుండవలెను.

కీటకములచే చెడిన పదార్థము బరువున 5 శాతము మించరాదు.

వివరణ:- కీటకములవలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని పూర్తిగా గాని కీటకములచే బెజ్జములచే బెజ్జములు వేయబడిన సంబారములు.

ఎ. 05. 06. 01 : దాల్చిన చూర్ణము

అనగా *Cinamom Zeylanicum* Blume యొక్క లోపలి ఎండు బెరడును నూరగా లభించిన చూర్ణము. దాల్చిన చూర్ణము క్రింది ప్రమాణములకు అనుగుణంగా యుండ వలెను.

1. తేమ — బరువున 12 శాతము మించకుండా
2. మొత్తము భస్మం — 8 శాతము మించకుండా
3. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం 2 శాతము మించకుండా
4. భాష్పశీల నూనె 5 శాతము ( )ను తగ్గకుండా

ఎ. 05. 06. 02 : కసింద

(Casia Taj, మొత్తం)

అనగా *Cinnamomum Cassia* Blume, Syn. *Cinamomum arometicum* Nees (Chinese ecinamom or Cassialignea యొక్క ఎండు బెరడు ముక్కలు. అది ఏ ఇతర శాక పదార్థము రంగు పదార్థము కల్గి యుండరాదు.

ఎ. 05. 07: లవంగాలు

(Cloves)

అనగా *Eugina Caryophyllus* (Crspringel) Bullock harrison యొక్క ఎండబెట్టబడిన, విచ్చుకోని పూల మొగ్గలు. దీనిలో అసేంద్రియ పదార్థం

బరువున 0. 5 శాతం మించ రాదు. సేంద్రియ పదార్థం, లవంగాల మొక్కలు లేక యితర మొక్కల శాక పదార్థము, నులి తీగె లవంగాలు, తల్లిలవంగాలు లేక లవంగం మొక్క యొక్క ఇతర భాగాలతో సహా అన్య సేంద్రియ పదార్థం, బరువున 2 శాతం మించరాదు. శీర్షము లేని లవంగాలు అన్య పదార్థంగా పరిగణింప బడరాదు. కీటకములచే చెడిన లవంగాలు బరువున 1 శాతం మించ రాదు.

లవంగాలు (పొడిలెక్కన) బాష్పశీల నూనె కనీసం 15 శాతం (V / W) తగ్గకుండా కల్గియుండ వలెను, అది కలుప బడిన రంగులేనిదై యుండవలెను.

వివరణ:- (I) "కీటకములచే చెడిన లవంగాలు" అనగా పాక్షికంగా గాని పూర్తిగా గాని కీటకములచే బెజ్జములు వేయబడిన లవంగాలు.

(II) "శీర్షము లేని లవంగాలు" అనగా రక్షక పత్రములు, పుష్పాసనం మాత్రమే గల లవంగాలు.

## ఎ. 05. 07. 01: లవంగ చూర్ణము

అనగా *Eugenia caryo phyllus* (C. Sprengel) Bullock and Harrison యొక్క విచ్చుకోని పూల మొగ్గలు ఎండబెట్టి నూరగా వచ్చిన పొడి, లవంగ చూర్ణం క్రింది ప్రమాణములకు అనుగుణంగా ఉండవలెను.

| | | |
|---|---|---|
| 1. | తేమ | బరువున 12 శాతము మించకుండ |
| 2. | మొత్తము భస్మము | బరువున 7 శాతము మించకుండ |
| 3. | సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మము | 5 శాతము మించకుండా |
| 4. | బాష్పశీలనూనె | 15 శాతము (v/w) తగ్గకుండ |

## ఎ. 05. 08: ధనియాలు
## (Coriander)

అనగా *coriandum sativum* యొక్క ఎండబెట్టబడిన పరిపక్వఫలములు దుమ్ము. ధూళి, రాళ్ళు, మట్టి పెళ్ళలు, చెత్త, కాండములు, కాడలు గడ్డిలతోను ధనియాలు గాక ఇతర తినదగు గింజలు మరియు కీటకముల వలన చెడినగింజలు బరువున 5.0 శాతము మించరాదు.

కీటకములచే చెడిన పదార్థము బరువున 5.0 శాతము మించరాదు.

వివరణ : కీటకముల వలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని పూర్తిగా గాని కీటకములచే బెజ్జములు చేయబడిన సంబారములు.

ఎ. 05. 08. 01 : 'ధనియాల పొడి'

అనగా (*coriandum sativum* యొక్క ఎండబెట్టిన ఫలముల నుండి నూరగా వచ్చిన పొడి (గుండ). అది ముతకగా గాని, మెత్తని పొడిగా గాని యుండవచ్చు. అది క్రింది ప్రమాణముల కనుకూలంగా యుండవలెను.

| | | |
|---|---|---|
| 1. | తేమ | బరువున 12 శాతము మించకుండా |
| 2. | మొత్తం భస్మము | బరువున 7.0 శాతము మించకుండా |
| 3. | సజల హైడ్రోక్లోరిక్ అమ్లములో కరగని భస్మము | 1.5 శాతము మించకుండ |

ఎ. 05. 09 : జీలకఱ్ఱ

(Safed zuva) cumin మొత్తం)

అనగా *Cumimum Cyminum (L)* యొక్క ఎండబెట్టిన గింజలు. దుమ్ము, రాళ్ళు, మట్టి పెళ్ళలు, చెత్త, కాడలతో సహా అన్య పదార్థము బరువున 7. 0 శాతం మించ రాదు.

జీలకర్ర గాక ఇతర తినదగు పదార్థము బరువున 5 . 0 శాతము మించరాదు.

కీటకములచే చెడిన పదార్థము 5 . 0 శాతము మించరాదు.

వివరణ:- కీటకములచే చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని పూర్తిగా గాని కీటకములచే బెజ్జములు వేయబడి సంబారములు.

ఎ. 05. 09. 01 : 'జీల కఱ్ఱ పొడి'

అనగా *Cuminum Cyminum (L)* గింజలు ఎండబెట్టి, నూరగా వచ్చిన పొడి (గుండ). పొడి క్రింది ప్రమాణములకు అనుగుణముగా ఉండవలెను.

1. తేమ బరువున 12. 0 శాతము మించకుండ
2. మొత్తం భస్మము 0. 5 శాతము "
3. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మము బరువున 1 . 5% "

ఎ. 05 10 : నల్ల జీల కఱ్ఱ (కాలోంజ్)

(Cumin black)

అనగా *Nigella Sativa (L)* యొక్క ఎండబెట్టబడిన గింజలు. దుమ్ము ధూళి, రాళ్ళు, మట్టిపెళ్ళలు, చెత్త, కాడ, గడ్డిలతో సహా అన్య పదార్థం నిష్పత్తి బరువున 7. 0 శాతము మించ రాదు.

నల్లజీలకర్ర గాక యితర తినదగు గింజల నిష్పత్తి 5. 0 శాతము మించ రాదు.

కీటకములచే చెడిన పదార్థము బరువున 5.0 శాతము మించరాదు.

వివరణ:- కీటకములవలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని, పూర్తిగా గాని కీటకములచే బెజ్జములు చేయబడిన సంభారములు.

ఎ. 05. 10. 01 : నల్లజీలకఱ్ఱ పొడి

అనగా *Nigella Sativa* యొక్క ఎండు గింజలు నూరగా వచ్చిన పొడి (గుండ), పొడి క్రింది ప్రమాణములకు అనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| తేమ | బరువున 12.0 శాతము మించకుండ |
| మొత్తం భస్మము | బరువున 7.0 శాతము మించకుండ |
| సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మము | బరువున 1.5 శాతము మించకుండ |
| బాష్పశీలనూనె | బరువున 0.5 శాతము (v/w) తగ్గకుండ |

ఎ. 05. 11 : సోంపు

(Fennel)

అనగా *Foeniculum Vulgare Mill* యొక్క ఎండబెట్టిన పక్వమైన ఫలములు, దుమ్ము, ధూళి, రాళ్ళు, మట్టిపెళ్ళలు, చెత్త, కాడ, గడ్డిలతో సహా అన్య పదార్థము బరువున 5.0 శాతము మించరాదు. సోంపు కాక యితర తినదగు గింజల విస్తృత్తి బరువున 5 శాతము మించరాదు.

కీటకముల వలన చెడిన పదార్థము బరువున 5.0 శాతము మించరాదు.

వివరణ : కీటకములవలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని, పూర్తిగా గాని, కీటకములచే బెజ్జములు చేయబడిన సంబారములు.

ఎ. 05. 11 : (సోంపు పొడి)

అనగా *Fueniculum Vulgare Mill* యొక్క పక్వమైన ఫలములు, ఎండబెట్టి నూరగా వచ్చిన పొడి [గుండ]. పొడి క్రింది ప్రమాణములకు అను గుణంగా యుండవలెను.

| | |
|---|---|
| తేమ | బరువున 12.0 శాతము మించకుండ |
| మొత్తము భస్మము | బరువున 9.0 శాతము మించకుండ |
| సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మము | బరువున 2.0 శాతము మించకుండ |
| బాష్పశీలనూనె | బరువున 1.0 [v/w] తగ్గకుండ |

ఎ. 05. 12 : మెంతులు :-

(Fenugreek)

అనగా *Trigunella foecum groecum* ఎండబెట్టబడిన పక్వమైన గింజలు. దుమ్ము, ధూళి, రాళ్ళు, మట్టిపెళ్ళలు, చెత్త, కాడలు, గడ్డిలతో సహా అన్య పదార్థము బరువున 5.0 శాతము మించరాదు. మెంతులు గాక యితర నూనె గింజలు బరువున 5.0 శాతము మించరాదు.

కీటకములచే చెడిన పదార్థము బరువున 5.0 శాతము మించరాదు.

వివరణ : కీటకముల వలన చెడిన పదార్థము అనగా పాక్షికంగాగాని, పూర్తిగాగాని, కీటకములచే బెజ్జములు చేయబడిన సంబారములు.

ఎ. 05. 12. 01 : మెంతి పిండి :-

అనగా *Trigonella foenum groecum (L)* యొక్క పక్వమైన గింజలు ఎండబెట్టిన నూరగా వచ్చిన పొడి [గుండ]. పొడి క్రింది ప్రమాణములకు అనుగుణంగా ఉండవలెను.

తేమ - బరువున 10.0 శాతము మించకుండ

మొత్తము భస్మం బరువున 7.0 శాతము మించకుండ

సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం బరువున 2.0 శాతము మించకుండ

చన్నీటిలో కరుగు పదార్థము బరువున 30.0 శాతము తగ్గకుండ

ఎ. 05. 13 : అల్లం :-
(Ginger)

అనగా *Zingiber officianale* Rose యొక్క అపసవ్యమై ఆకారములలో చెక్కు పూర్తిగా తీయబడని కడిగిన మరియు ఎండలో ఎండబెట్టబడిన కొమ్ములు. అన్య పదార్థము బరువున 2.0 శాతము మించరాదు. పొడి లెక్కన, బాష్పశీల నూనె 1.0 శాతము (V/W) తక్కువ గాకుండ ఉండవలెను. శొంఠిలో (సున్నంలో నానబెట్టిన అల్లంలో) సున్నం (కాల్షియం ఆక్సైడ్) (పొడి లెక్కన) బరువున 4.0 శాతము మించరాదు.

కీటకములచే చెడిన పదార్థము బరువున 5 శాతము మించి యుండరాదు.

వివరణ :- కీటకములవలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని,పూర్తిగా గాని కీటకములచే బెజ్జములు కొట్టబడిన సంబారములు

ఎ. 05. 13. 01 : అల్లంపొడి

అనగా అల్లము *Zingiber officinale,* Rose నూరగా వచ్చిన పొడి. పొడి క్రింది ప్రమాణములకు అనుగుణంగా ఉండవలెను.

తేమ – బరువున 13.0 శాతము మించకుండ

మొత్తం భస్మం – బరువున 8.0 శాతము మించకుండ

సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం – బరువున 1.0 శాతము మించకుండ

నీటిలో కరుగు భస్మం – బరువున 1.7 శాతము తగ్గకుండ

చల్లనీటిలో కరుగు నిష్కర్షించబడిన పదార్థము – బరువున 10 శాతము తగ్గకుండ

కాల్షియం [CaO] – 4.0 శాతము మించకుండా
[పొడి లెక్కన]

నిష్కర్షించబడిన పదార్థము

ఆల్కహాలు [90 శాతము V/w] లో కరుగు/బరువున 4.5 శాతము తగ్గకుండ

బాష్పశీలనూనె బరువున 1.0 శాతము [V/w] తగ్గకుండ

ఎ. 05. 14 : జాపత్రి
(Mace)

అనగా *Myristica fragrants,* Hontt యొక్క గింజల యొక్క ఎండిన పై భాగము లేక [ పప్పు ] అది *Myristica nalabracia* లేక *fatna* మరియు *Myristica argentea* యొక్క ఇతర రకముల పప్పులు కల్గియుండరాదు. అన్య పదార్థముల నిష్పత్తి బరువున 3.0 శాతము మించరాదు.

కీటకములచే చెడిన పదార్థము బరువున 5 శాతము మించి యుండరాదు.

వివరణ :- కీటకముల వలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని, పూర్తిగా గాని, కీటకములచే బెజ్జములు వేయబడిన సంబారములు.

ఎ. 05. 14. 01: 'జాపత్రి పొడ'

అనగా *Myrstica fragrants,* Honti గింజల ఎండిన పై భాగముల లేక పప్పును నూరగ వచ్చిన పొడి [గుండ]. పొడి క్రింది ప్రమాణములకను గుణంగా యుండవలెను.

తేమ - బరువున 10 శాతము మించకుండ
మొత్తము భస్మం బరువున 3 శాతము మించకుండ
నజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం బరువున 1.0 శాతము మించకుండ

ముతక 5 నారు బరువున 10 శాతము మించకుండ
ఆవిరి కాని ఈథర్ ఎక్‌స్ట్రాక్ట్ బరువున 20 శాతము తగ్గకుండ 30 శాతము మించకుండ

ఎ. 05. 15: ఆవాలు (రాయ్) (సార్సన్)
(Mustard)

అనగా *Brassica Alba* [L] Boiss [సఫీద్ రాయ్] *Brassica compestris* [L], Var, dichotoma [కాలీసార్సన్స్] *Brassica compestris* Var. Yellow sarson, syn *Brassica compestris* [L] Var. glauca [పీలీసార్సన్] *Brassica compestris* [L] Var. Toria, మరియు *Brassica Nigra* [L] koch *Brassica Juncea* [L] cosset gern [రాయ్] [బెనార్సీరాయ్] ల ఎండబెట్టబడిన గింజలు. దుమ్ము, ధూళి, రాళ్ళు, మట్టిపెళ్ళలు, చెత్త, కాడ, గడ్డి, తినదగు ఆహార పదార్థములు, యితర రకముల, నూనె గింజలతో లేక ఏ ఇతర తరహా మాలిన్యములతో సహా అన్య పదార్థము బరువున 7.0 శాతము మించరాదు.

అది అర్జిమోన్ మెక్సికానా లిన్ గింజలు లేనిదై యుండవలెను.
కీటకములచే చెడిన పదార్థము 5 శాతము మించరాదు.

వివరణ :- కీటకముల వలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని పూర్తిగా గాని, కీటకములచే బెజ్జములు వేయబడిన సంభారములు.

ఎ. 05. 15. 01: ఆవ పొడి

అనగా Brassica alba[L],Boiss[సఫేద్‌రాయ్],Brassica compestris L var. Dichotoma [కాలీసార్సన్], Brassica compestris L, var. yellow sarson, syn. Brassica compestris L. var' g'auca [పీలీసార్సన్] Brassica compestris L, var, toria [తోర్జా] Brassica juncea [L] coss. et. czern [రాయ్‌లాట్ని] మరియు Brassica nogra [L] koch [బనారసేరాయ్] ల ఎండబెట్టబడిన గింజలు నూరగా వచ్చిన పొడి [గుండ]. పొడి క్రింది ప్రమాణములకనుగుణంగా ఉండవలెను.

తేమ - బరువున 7.0 శాతం మించకుండ
మొత్తము భస్మం బరువున 8.0 శాతము మించకుండ
బాష్పశీల నూనె బరువున 0.2 శాతము (V/W) మించకుండ
ఆవిరి కాని ఈథర్ అవశేషము బరువున 22 శాతము తగ్గకుండ
సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం బరువున 2.0 శాతము మించకుండ
ముడినారు బరువున 8.0 శాతము మించకుండ
స్టార్చ్ బరువున 15.0 శాతము మించకుండ
ఆర్జిమోన్ నూనె కొరకు చేసిన పరీక్ష 'నెగటివ్'

ఎ. 05. 16: జాజికాయ
(Nut meg)

అనగా *Myristica fragrans* Hontt యొక్క ఎండబెట్టబడిన గింజలు.

**అన్య పదార్థముల నిష్పత్తి బరువున 3.0 శాతం మించరాదు.**

ఎ. 05. 16. 01: జాజికాయ పొడి

అనగా *Myristica fragrans* Hontt యొక్క ఎండబెట్టబడిన గింజలు నూరగా వచ్చిన పొడి, ఈ క్రింది ప్రమాణములకు అనుగుణంగా యుండవలెను.

తేమ - బరువున 8.0 శాతం మించకుండ
మొత్తం భస్మం - బరువున 5.0 శాతం మించకుండ
సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లంలో కరుగని భస్మం - బరువున 0.5 శాతం మించకుండ
ఆవిరి కాని ఈథర్ అవక్షేపం - బరువున 25.0 శాతం తగ్గకుండ
ముతక నారు — బరువున 10.0 శాతం మించకుండ కుంకుమలో బతికి ఉన్న కీటకములు, తుట్టెలు ఉండరాదు. కంటికి కనబడు చచ్చిన కీటకములు, కీటకముల భాగములు, ఎలుక మలములు వగైరా బొత్తిగా ఉండరాదు.

ఎ. 05. 17: మిరియాలు కాని మిర్చి
(Pepper, black)

అనగా *Piper nigrum* యొక్క ముదురు గోధుమ రంగునుండి నల్లని రంగులో ముడతలుగల ఉపరితలముగల ఎండబెట్టబడిన మృదు ఫలాలు మరియు దుమ్ము, రాళ్ళు, మట్టిపెళ్ళలు, కాడలు, ఆకు పదార్థము, మరి యితర అన్య పదార్థములతో సహా 3.0 శాతము మించరాదు. తేలికైన మృదు—ఫలాలు మరియు పిన్ హెడ్‌లు వరుసగా 10 శాతం మరియు 4 శాతము మించి కల్గియుండరాదు. కీటకములచే చెడిన పదార్థం 5 శాతం మించరాదు.

వివరణ:- కీటకములచే చెడినపదార్థం పాక్షికంగా అనగా గాని, పూర్తిగా గాని కీటకములచే బెజ్జములు వేయబడిన సంబారములు.

ఎ. 05. 17. 01: నల్ల మిరియాలు
(Pepper black)

అనగా *Piper nigrum* యొక్క ఎండబెట్టబడిన మృదుఫలాలను నూరగా వచ్చిన పొడి. మరియు రంగులో కలుపబడిన ఇతర పదార్థము లేకుండవలెను. క్రింది ప్రమాణములకు అనుగుణంగా ఉండవలెను.

| | |
|---|---|
| తేమ | 12.25 శాతం (బరువున) మించకుండా |
| మొత్తం భస్మము | 8.0 శాతం (బరువున) మించకుండా |
| సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లంలో కరుగని భస్మము | 1.2 శాతం (బరువున) మించకుండా |

భాష్పీభవనం చెందని ఈథర్ సారము 5.5 శాతం (బరువున) తగ్గకుండా
ముతక నారు 13.0 శాతం (బరువున) మించకుండా

ఎ. 05. 17. 02: తేలిక నల్ల మిరియాలు
(Light black pepper)

అనగా *Piper nigrum* యొక్క ఎండబెట్టబడిన ముదురు బ్రౌన్ రంగునుండి ముదురు నలుపు రంగులోని మృదు ఫలాలు - అది బాగుగా ఎండబెట్టబడి, తుట్టెలు కీటకములు లేనిదై, దుమ్ము, రాళ్ళు, మట్టి పెళ్ళలు, మట్టి కాడలు, ఆకులభాగములు, మరియు ఇతర తినదగు గింజలతో సహా అన్య పదార్థం 6.0 శాతం మించి పెన్ హెడ్‌లు 10 శాతం మించి లేనిదై యుండవలెను.

ఎ. 05. 17. 03: 'పెన్ హెడ్‌లు'

అనగా పూర్తిగా *Piper nigrum* యొక్క కంకులనుండి వచ్చినవి. అవి దాదాపుగా ఎండుగా, కీటకములు లేకుండ ఉండవలెను. రంగు ముదురు గోధుమ నుండి నలుపులో యుండవలెను. అన్య పదార్థము 6 శాతము మించరాదు.

ఎ. 05. 18: గసగసాలు
(Poppy)

అనగా *Papaver Somniferum* యొక్క పక్వమైన ఫలముల యొక్క ఎండబెట్టబడిన గింజలు. అవి తెలుపు రంగులో గాని లేదా గోధుమ రంగులోగాని ఉండవచ్చును. అన్య పదార్థము బరువున 15.0 శాతము మించరాదు. ఆవిరి కాని ఈథర్ అవక్షేపము బరువున 40.0 శాతము తక్కువ కాకుండ కల్గియుండవలెను.

ఎ. 05. 19: కుంకుమ (కేసర్)
(Saffron)

అనగా *Crocus sativus L.* యొక్క ఎండబెట్టబడిన కేశాగ్రములు అది వేయబడిన ఇతర రంగు పదార్థము. లేక యితర అన్య పదార్థము కల్గియుండరాదు. ఈ క్రింది ప్రమాణములకు అనుగుణంగా యుండవలెను.

1. మొత్తం భస్మము బరువున 8 శాతము మించకుండ
2. సజల హై, క్లో. ఆ. లో కరుగని భస్మము బరువున 1.5 శాతము మించకుండ
3. 103° C. వద్ద ఆవిరి యగు పదార్థము - బరువున 14 శాతము మించకుండ
4. జల అవశేషము - బరువున 55 శాతము తగ్గకుండ
5. మొత్తం నైట్రోజిన్ - (పొడి బరువు లెక్కన) 2 శాతము తగ్గకుండ
6. ఇసుక, మట్టి, దుమ్ము ఆకు, కాడ, చెత్త, మరితర సేంద్రియ పదార్థము - బరువున 1 శాతము మించకుండ
7. పుప్పొడి. కేసరాలు, అండ భాగములు వగైరా మరియు *Crocus sativus* Lein పూల ఇతర భాగములు. బరువున 15 శాతము మించకుండ.

ఎ. 05. 20 : పసుపు కొమ్ము హోల్డి
(Turmeric)

అనగా *Caronma Longa L.* యొక్క
ఎండబెట్టబడిన కొమ్ములు వేరు దుంపలు అన్య
పదార్థము నిష్పత్తి 2.0 శాతము మించరాదు
కీటకముల వలన చెడిన పదార్థము 5 శాతము మించరాదు

వివరణ : కీటకముల వలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని, పూర్తిగా గాని, కీటకములచే బెజ్జములు చేయబడిన సంబారములు.

ఎ. 05. 20. 01 : పసుపు పొడి

అనగా కొమ్ములు/లేక లశునములు ఎండబెట్టి నూరగా వచ్చిన పొడి. అందులో కృత్రిమ రంగులు లేకుండ ఉండవలెను. పొడి క్రింది ప్రమాణముల కనుగుణంగా వుండవలెను.

1. తేమ — బరువున 13.0 శాతము మించకుండ
2. మొత్తం భస్మము — బరువున 9.0 శాతము మించకుండ
3. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మము — బరువున 1.5 శాతము మించకుండ
4, లెడ్ క్రోమేట్ యుండరాదు
5. మొత్తం స్టార్చ్ — బరువున 60.0 శాతము మించకుండా

ఎ. 05. 21 : మసాలా పొడి
(Curry powder)

అనగా మిరియాలు, దాల్చిన, లవంగములు, ధనియాలు, యాలకులు, మిరప కాయలు, మెంతులు, జీలకఱ్ఱ, వెల్లుల్లి, అల్లం, ఆవ, గసగసాలు, పసుపు, జాజికాయ జాపత్రి, కరివేపాకు, తెల్ల మిరియం, కుంకుమ, సోంపులవంటి సుగంధ మూలికల జాతికి చెందిన శుభ్రమైన, ఎండబెట్టబడిన, మంచి సుగంధ ద్రవ్యముల నూరగా లభించిన పొడి పదార్థములో తినదగు స్టార్చ్, ఉప్పు కలపవచ్చును. కూర పొడి తయారీలో వాడిన సుగంధ ద్రవ్యముల నిష్పత్తి బరువున 85.0 శాతము తగ్గరాదు. పొడి, దుమ్ము, తుట్టెలు, క్రిమి, కీటకములు లేనిదై యుండవలెను. అందులో రంగులుగాని, తినదగు ఉప్పు మినహా ఇతర పరిరక్షక పదార్థములుగాని ఉండరాదు. కూర పొడి క్రింద ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

1. తేమ — బరువున 14. 0 శాతము మించకుండా
2. బాష్ప శీలనూనె — బరువున 0.25 శాతము v/w [పొడి లెక్కన] తగ్గకుండా
3. ఆవిరి కాని ఈథర్ బరువున 7.5 శాతము తగ్గకుండ
4. తినదగు ఉప్పు బరువున 5.0 శాతము మించకుండ
5. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మం-బరువున 2 శాతము మించకుండ [పొడి లెక్కన]
6. ముతకనారు బరువున 1.5 శాతము మించకుండా (పొడి లెక్కన)
7. సీసము బరువున 10.0 పి. పి. యం మించకుండా (పొడి లెక్కన)

8. తినదగు ఉప్పు ఎప్పుడు కలిపినా బరువున దాని శాతము లేబిల్ పై ప్రకటించవలెను కూర పొడిలోని సుగంధ ద్రవ్యముల పేర్లు పరిమాణముల బరువుల ప్రకారము అవరోహణ క్రమములో లేబిల్ పై యుండవలెను.

ఎ. 05. 22: దిగుమతి చేయబడిన సోంపు :-

(Aniseed imported)

అనగా *Pimpiriella anisum* యొక్క ఎండబెట్టబడిన పక్వమైన ఫలములు అన్య పదార్థము లేక తినదగు గింజలు బరువున 5.0 శాతము మించరాదు.

అది క్రింది ప్రమాణములకు అనుగుణంగా ఉండవలెను.

ఎ. మొత్తం భస్మం—బరువున 0 9 శాతము మించకుండా

బి. సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మం బరువున 1.5 శాతము మించకుండ

సి. బాష్పశీల నూనె బరువున 1.5 శాతము (v/w)కు తగ్గకుండ, కీటకముల వలన చెడిన పదార్థము 5 శాతము మించరాదు.

వివరణ :- కీటకముల వలన చెడిన పదార్థము అనగా పాక్షికంగా గాని, పూర్తిగా గాని, కీటకములచే బెజ్జములు వేయబడిన సంబారములు.

ఎ. 05. 23: వాము (అజవాన్)

అనగా *Trachy spermum ammi (L)* Spragne యొక్క ఎండబెట్టబడిన పక్వమైన ఫలము అన్య సేంద్రియ పదార్థము మూలక పదార్థము ( ) ల నిష్పత్తి వరుసగా 3 శాతము, 2 శాతము, మించరాదు. వాములలో కంటికి కనబడు, బ్రతికి యున్న కీటకములు, కీటకముల భాగములు, ఎలుక మలములు లేకుండ వలెను.

ఎ. 06: చిక్కుడు

(Bean)

అనగా అల్లే గాని, పప్పుగా గాని ఆహారములో నుపయోగించు కిడ్నీ ఆకారములో గాని, చదును చేయబడి గాని ఉన్న రకముల ఎండు గింజలు.

ఎ. ఒ. ఎ సి. పద్ధతిన నిర్ణయించి అది హైడ్రోసియానిక్ ఆమ్లము 20 పి.పి. యం కలిగియుండరాదు.

ఎ. 07 : తీపి చేయు పదార్థములు

ఎ. 07. 01 : చక్కెర

(Cane Sugar)

అనగా చెఱకు, బీట్ దుంప వగైరాల నుండి లభించిన స్ఫటికీకృత చక్కెర బెల్లం నుండి లభించిన శుద్ధి చేయబడిన పదార్థముతో సహా—

అది 0.7 శాతము మించకుండా భస్మం, 1.5 శాతము మించకుండ నీరు, 96.5 శాతము తగ్గకుండ సుక్రోస్ కలిగియుండవలెను.

అది సల్ఫర్‌డైయాక్సైడ్ 70 పి. పి. యం. మించని గాఢతలో కలిగి యుండవచ్చును.

పట్టిక బెల్లము (మిశ్రీ) (తాటి లేక చెఱకు) 98.0 శాతము తగ్గకుండ సుక్రోస్ గల మరియు 0.4 శాతము మించకుండ భస్మం, ఉన్న స్ఫటికీకృత చక్కెర.

ఎ. 07. 01 : శుద్ధి చేయబడిన చక్కెర

(Refined Sugar)

అనగా చెఱకు, లేక బీట్ దుంప రసముల నుండి లభించిన చక్కెర. అది తెల్లగా, రంగు లేని, మట్టి, మరితర అన్య పదార్థములు లేనిదై స్ఫటిక రూపములో నుండవలెను. అది క్రింది ప్రమాణములకు అనుగుణంగా యుండవలెను.

సుక్రోస్—బరువున 99.80 శాతము తగ్గకుండా

తేమ — బరువున 0 1 శాతము మించకుండా

సల్ఫర్‌డయాక్సైడ్ 70 పి. పి. యం మించకుండా

ఎ. 07. 02 : బురా

(Bura)

సుక్రోస్‌గా తెలుపబడు మొత్తం చక్కెర 96.5 శాతము తగ్గకుండా మరియు మొత్తం బరువులో, సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లంలో కరుగని భస్మం 0.5 శాతము మించకుండా ఉండవలెను.

ఖండసారి చక్కెరలో సుక్రోస్ మొత్తం చక్కెరలో కనీసం 90 శాతము తగ్గరాదు.

బురా, మరియు ఖండసారి 70 పి. పి. యం. గాఢత మించని సల్ఫర్ డయాక్సైడ్ కలిగియుండవలెను.

ఎ. 07. 03: తేనె

(Honey)

అనగా కేవలం పుష్పముల మకరందము నుండి లేదా ఇతర మొక్కల తీపి రసంపై తిరుగు తేనెటీగలు చేసిన పనినుండి లభించిన ఆహారము. అది ఎ. తేమ 25 శాతము, బి. భస్మము 0.5 శాతము, సుక్రోస్ 5 శాతము [కార్బియా కల్లోసా మరియు హనీడ్యూల విషయంలో గరిష్ఠ పరిమితి 10 శాతము] మించి కలిగి యుండరాదు, ఇన్వర్ట్ సుగర్ అనబడు చక్కెర ఉనికి కనీసము 65 శాతము [కార్బియ కల్లోసా, హనీడ్యూల విషయంలో 60 శాతము] ఉండవలెను.
ఫ్రుక్టోస్ / గ్లూకోస్ నిష్పత్తి 0.9 శాతము తగ్గరాదు. ఫైహే పరీక్ష సాధరణంగా 'నెగటివ్' ఉండవలెను.

ఎ. 07. 04: 'ఐస్ లొల్లీలు, లేక తినదగు ఐస్'

(Ice Lollies or Edible Ices)

జి. యస్. ఆర్. 816 [ఇ] తేది 3-11-83 సవరణ ప్రకారం

అనగా చక్కెర, సిరప్, పండ్లు, పండ్లరసం, కోకో, సిట్రిక్ ఆమ్లము, అనుమతించబడిన రుచి కారకములు మరియు/రంగులు కలిగియున్న గడ్డ కట్టిన మంచు. అది/ స్థిరత్వకారకములు లేక ఎమల్సీకరణులు బరువున 0.5 శాతము మించకుండ కలిగియుండవచ్చును.

ఎ. 07. 04. 01 :- ఐస్ కాండీ

అనగా పండ్లు, పండ్లరసం, కోకో, వప్పులు [ — ] సిట్రిక్ ఆమ్లం అనుమతించబడిన రుచులు, మరియు రంగులు కలిగియున్న గడ్డకట్టిన మంచు. అది స్థిరత్వ కారకములు మరియు/లేక ఎమల్సీకరణులు బరువున 0.5 శాతము మించకుండ కలిగియుండవచ్చును.

ఎ. 07. 05: బెల్లం

(Gur: Jaggery)

అనగా చెఱకును పిండగా వచ్చిన లేక తాటి, ఖర్జూర, కొబ్బరిచెట్ల సారంను మరుగబెట్టగా లేక ప్రాసెస్‌చేయగా ఉత్పన్నమయినది. అది ఆరోగ్యమునకు హాని కలిగించు పదార్థములు లేనిదై మరియు క్రింది ప్రమాణములకు [పొడి లెక్కన] అనుగుణమయినదిగాను ఉండవలెను.

i. ఇన్‌వర్ట్ సుగర్ అనబడు మొత్తం చక్కెరలు — 90 శాతము తగ్గకుండ సుక్రోస్ 60 శాతము తగ్గకుండా.

ii. నీటిలో కరుగని అన్య పదార్థము 2 శాతము మించకుండా.

iii. మొత్తం భస్మము 6 శాతము మించకుండా.

సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని భస్మము 0.5 శాతము మించకుండ ద్రవ, పాక్షికంగా ద్రవ రూపములో ఉన్న రకం బెల్లంకాక, బెల్లం 10 శాతముమించి తేమ కలిగియుండరాదు.

బెల్లం సల్ఫర్‌డయాక్సైడ్ 70 పి. పి. యం. మించని గాఢతలో కలిగి ఉండ వచ్చును.

సోడియం బైకార్బోనేటు, వాడిన యెడల, ఆహార గ్రేడ్ నాణ్యత కలదై యుండవలెను.

ఎ. 07. 06: క్యూబు చక్కెర

(Cube Sugar)

అనగా శుద్ధి చేయబడిన చక్కెర స్ఫటికములనుండి తయారు చేయబడిన ఘనములు. లేక ఘనముల గడ్డలు అది తెల్లగనుండి, దుమ్ము, మరితర కాలుష్యము లేకుండ ఉండవలెను. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా ఉండవలెను.

ఎ. సుక్రోస్ బరువున 99.7 శాతము తగ్గకుండ

బి. తేమ బరువున 0.25 శాతము మించకుండ

సి. మొత్తం భస్మము బరువున 0.03 శాతము మించకుండ

డి. సల్ఫర్‌డయాక్సైడ్ 70 పి.పి.యం మించకుండా

ఎ. 07. 07 : డెక్ట్రోస్ (Dextrose)

వాసన లేని, తీయని రుచిగల. తెల్లని లేదా శేత క్రీమ్ రంగులోనున్న కణాత్మక చూర్ణము.

పొటాషియం. క్యూప్రిటార్ట్రేట్ ద్రావణంతో వేడి చేయగా, క్యూప్రస్ ఆక్సైడ్ అవక్షేపం సమృద్ధిగా ఉత్పన్నము కావలెను. క్రింది ప్రమాణములకను గుణంగా ఉండవలెను.

1. సల్ఫేటెడ్ భస్మము—(పొడి లెక్కన) 0 1 శాతము మించకుండ

ఆమ్లత్వము : అప్పుడే మరుగబెట్టి చల్లార్చిన 50 మి. లీ. నీటిలో 50 గ్రాములు కరగబెట్టగా తటస్థీకరణకు ఫినాల్ఫ్తలీన్ సూచికకు 0.21 మి. లీ. మించని N/10 సోడియం హైడ్రాక్సైడ్ కావలసియుండును.

గ్లూకోస్ :- 99.0 శాతము [పొడి లెక్కన] తగ్గకుండ

సల్ఫర్ డయాక్సైడ్:- 70 పి. పి. యం. మించరాదు.

ఎ. 07. 08 : గోల్డెన్ సిరప్

అనగా చక్కెరను విలోమికృతము చేయగా లభించిన సిరప్. అది ఆహ్లాద కరమైన రుచి కలిగి, బంగారు పసుపు వర్ణంలో, స్ఫటికములు లేనిదై యుండ వలెను. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

తేమ - బరువున 25 శాతము మించకుండా

మొత్తం భస్మము - బరువున 2.5 శాతము మించకుండా

ఇన్వర్ట్ సుగర్ అనబడు మొత్తం చక్కెర - బరువున 72 శాతము తగ్గకుండా

సల్ఫర్‌డయాక్సైడ్ - 70 పి. పి. యం. మించకుండా.

సోడియం బై కార్బొనేట్ వాడిన యెడల అది ఆహార గ్రేడ్ నాణ్యత కలిగి యుండవలెను.

ఏ. 07. 09 : ఐసింగ్ సుగర్
(Icing sugar)

అనగా స్టార్చి సహితముగా గాని, రహితముగా గాని శుద్ధిచేయబడిన చక్కెర [ ] ను లేక వాక్యూమ్‌పాన్ ఫ్లాంటేషన్, తెల్ల చక్కెరను మెత్తని పొడిగా చేయబడిన చక్కెర తినదగు స్టార్చ్ కలిపినచో, అవి చక్కెరలో అంతటా సమానముగా వ్యాపించి యుండవలెను. అది తెల్లని చూర్ణం రూపంలో, దుమ్ము గాని, మరితర అన్య పదార్థముగాని లేనిదై యుండవలెను. అది క్రింది ప్రమాణములకనుగుణంగా ఉండవలెను.

ఎ. మొత్తం స్టార్చ్ మరియు సుక్రోస్ (తేమ లేకుండ) / బరువున 99.0 శాతము తగ్గకుండా

బి. తేమ - బరువున 0.80 శాతము మించకుండా

సి. స్టార్చ్ - బరువున 0.5 శాతము [పొడి లెక్కన] మించకుండా

ఎ. 07. 10 : శాకరీన్ సోడియం

అనగా (Saccharin Sodium) $C_7 H_4 NNa O_3 SHO_2$ ఎంపిరకల్ ఫార్ములా కలిగి మరియు 241.2 అణుభారము కలిగి 20° C వద్ద 1.5 భాగముల నీటిలో మరియు 50 భాగముల ఆల్కహాలు [95 శాతము]లో కరుగునది. సామాన్యముగా 'Soluble Saccharian' అని పిలుపబడినది. ఇండియన్ ఫార్మకోపియాలో ఇవ్వబడిన విధంగా రూపు పట్టగా 105° C వద్ద స్థిర భారమునకు పొడి చేయబడిన పదార్థమునకు సంబంధించి గణించగా 98.5 శాతము తగ్గకుండా 100.5 శాతము మించకుండా $C_7 H_4 O_3$ Ns Na కలిగియుండవలయును. అది 2 పి. పి. యం. మించి ఆర్సెనిక్, 10 పి.పి.యం మించి సీసం కలిగియుండరాదు. ఇండియన్ ఫార్మకోపియాలోని పద్ధతిలో పదార్థము నుండి వేరుపరచబడిన శాకరీన్ ద్రవీభవన స్థానం 225° C - 226°C ల మధ్య ఉండవలెను. 105° C వద్ద పొడిచేయగా బరువు నష్టం దాని బరువులో 12 శాతం తగ్గకుండ 16 శాతం మించకుండ ఉండవలెను. పదార్థము గుర్తింపు పరీక్షలు తృప్తి పరచవలెను.

ఇండియన్ ఫార్మకోపియాలో ఉదహరించబడిన విధముగా విడి ఆమ్లము లేక క్షారము అల్కలైన్, అమ్మోనియం సమ్మేళనములు. మరియు పారాసల్ఫామోయిల్ బెంజోయేట్‌ల పరిమితి పరీక్షలకు అనుగుణంగా ఉండవలెను.

ఎ. 07. 11: పొడి గ్లూకోస్ సిరప్ :—

తెల్లని లేక క్రీమ్ తెలుపు రంగులో తీయని రుచిగల కమ్మదనము కల కొంత వరకు ఆర్ద్ర కర్షకముగా ఉన్న బరక లేక మెత్తని పొడి అది పులియకుండ, తుట్టెలు, దుమ్ము, యితర అన్య పదార్థములు లేక కలుపపడిన తీపి చేయు లేక రుచి కలిగించు పదార్థములు లేనిదయి ఉండవలెను.

అది కలుపబడిన సహజ రంగు లేక కోల్‌టారు రంగు కూడ కలిగియుంత రాదు. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా ఉండవలెను.

1. మొత్తం ఘనపదార్థం — బరువున 93.0 శాతము తగ్గకుండా
2. తగ్గు చక్కెర [Reducing Sugar] బరువున 20 శాతం తగ్గకుండా
3. సల్ఫేటెడ్ భస్మము బరువున 1.0 శాతం మించకుండా
4. సల్ఫర్‌డయాక్సైడ్ బరువున 4.0 పి. పి. యం. మించకుండా

వస్తువు కన్‌ఫెక్షనరీ తయారీలో వాడుటకు రూలు 42 (w) లో పేర్కొన బడిన ప్రకారం లేబిల్‌తో అమ్ముట కొరకయినచో సల్ఫర్‌డయాక్సైడ్ 1.50 పి. పి. యం. మించకుండ ఉండవచ్చును.

ఎ. 08: కాఫీ

ఎ. 08. 01: (1) కాఫీ (పచ్చి, వేయించని)

అనగా *Coffea arabica, coffea liberica, coffea excelsa* లేక *coffea robusta* ల గింజ పొట్టు తీయగా దానిపై పలచని పొర (స్పెరమోడర్మ్) కొద్దిగా తప్ప : లేనిది.

(2) రోస్టెడ్ కాఫీ

అనగా పచ్చి లేక సరిగా శుభ్రపరచబడి, బ్రౌన్ రంగు వచ్చువరకు వేయించబడి, దాని ప్రత్యేక రుచి (aroma) పొందినది.

(3) గ్రౌండ్ కాఫీ

అనగా రోస్టెడ్ కాఫీ నుంచి మాత్రమే లభించిన, పొట్టు లేని కాఫీ పొడి.

(4) కాఫీ

(పచ్చి, ముడి, వేయించని), రోస్టెడ్ కాఫీ (గ్రౌండ్ కాఫీ, కృత్రిమ రంగు రుచి, మెరుపు, అన్య పదార్థము లేకుంత. మంచిగా, పొడిగా, తాజాగా, ముతుగు, చెడు వాసనలు (మరియు రుచి) లేకుండవలెను.

రోస్టెడ్ కాఫీ మరియు గ్రౌండ్ కాఫీ క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

i) శాంపిల్ 100° సి ల (స్థిరభారమునకు ఎండబెట్టగా) మొత్తం భస్మం తెలుపు లేక నీలి- తెలుపు రంగులో నుండి బరువున 3.0 శాతము తగ్గక 7.0 శాతం మించక యుండవలెను.మరియు బరువులో 6.0 శాతం మించిని దానిలో కనీసం 65 శాతం మరుగబెట్టబడిన స్వేదన జలము కరుగునదై యుండవలెను.

సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మం 5.0 శాతం మించరాదు.

ii) పొడి కాఫీ యొక్క ఒక గ్రాముకు కరుగు భస్మం క్షారత్వము, N/10 ఆమ్లములో 3.5 మి. లీ. తగ్గక, 4.5 మి. లీ. మించక యుండవలెను.

iii) ప్రమాణ పద్ధతుల ద్వారా పొందిన కఫైన్ (Caffeinge) 1.0 శాతం తగ్గకుండవలెను.

iv) 2 గ్రాముల శాంపిల్ 100° సి వద్ద స్థిరభారమునకు 100 మి. లీ. ల మరుగు స్వేదన జలము 1 గంట రిప్లెక్స్ క్రింద ఎండబెట్టి (పొడి చేసి) లెక్కించగా వచ్చిన జలసారము (Aqueous extract) 26.0 శాతం తగ్గకుండా మరియు 35.0 శాతము మించకుండా ఉండవలెను.

ఎ. 08. 02 : చికోరి

(Chicory)

అనగా *Chicorium intybus linn* యొక్క ఎండబెట్టబడిన వేళ్ళను మొత్తంలో బరువున 2.0 శాతం మించకుండా తినదగు కొవ్వులు, నూనెలు, మరియు గ్లూకోజ్ లేక సుక్రోస్ వంటి చక్కెరలతోగాని, లేకుండ గాని వేయించగా లభించిన రోస్టెడ్ చికోరి పొడి, దుమ్ము, కలుపబడిన రంగులు రుచి పదార్థముల లేకుండవలెను. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

1. మొత్తం భస్మం - 3.5 శాతం తగ్గకుండ 10.0 శాతం మించకుండ [పొడి లెక్కన]
2. సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మం - బరువున 2.5 శాతం మించకుండ (పొడి లెక్కన)
3. నీటిలో కరుగు పదార్థము - 50.0 శాతం తగ్గకుండ (పొడి లెక్కన)

ఎ. 08. 03 :

కాఫీ చికోరి, మిశ్రమము :- చికోరి కలుపబడిన కాఫీ, లేక కాఫీ మరియు చికోరీ స్వచ్ఛమైన 'నూరబడిన కాఫీ' రోస్టెడ్, మరియు నూరబడిన చికోరి పొడితో కలుపబడినదయి, బాగుగ, పొడిగా, దుమ్ము లేకుండా, మురుగు, లేక అసహ్యకరమైన వాసన రుచి లేనిదియు అయి యుండవలెను,

కాఫీ చికోరి మిశ్రమంలో కఫైన్ 6.0 శాతం తగ్గక, జలసారము (Aqueous extract) 50.0 శాతము మించక యుండవలెను. చికోరి మిశ్రమం కలిగియున్న ఏదేని డబ్బా లేక ఇతర ఆధారపాత్ర తప్పుడు భావ ప్రకటన కలిగి యుండరాదు. తరువాత "Mixed with chicory" లేక "Blended with chicory" అను పదములు గూడ కలిగియున్నచో "French coffee" అను పదము వాడవచ్చును.

ఎ. 08. 04 : 'కరగు కాఫీ పొడి'

అనగా స్వచ్ఛమైన కాఫీ గింజలు తాజాగా వేయించి నూరగా (పొడిచేయగా) వచ్చిన కాఫీ పొడి. అది కాఫీ గల సహజమైన రంగు, రుచి, వాసన కలిగి ధారాళంగా ప్రవహించునట్లుండవలెను. అది అపరిశుద్ధ పదార్థము లేనిదై, చికోరి లేక యితర పదార్థములు కలుపబడనిదై యుండవలెను. అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

ఎ. తేమ — 3.5 శాతం మించకుండా

బి. మొత్తం భస్మము — 15.0 శాతం మించకుండా (పొడి లెక్కన)

సి. కఫైన్ — 2.8 శాతం తగ్గకుండా (పొడి లెక్కన)

డి. మరుగు నీటిలో ద్రావణీయత — కొద్దిగా కదిలించినచో వెంటనే 30 సెకండ్లలో కరుగవలెను.

ఇ. $16 \pm 2°C$ ల వద్ద చన్నీటిలో ద్రావణీయత — కొద్దిగా కదిలించినచో 3 నిమిషములలో కరుగవలెను.

(జి. యస్. ఆర్. 848 తేది 19-11-83 ద్వారా చేర్చబడినది)

ఎ. 08. 05 : 'ఇన్‌స్టెంట్ కాఫీ, చికోరి మిశ్రమం'

అనగా బాగా వేయించిన మరియు నూరిన కాఫీ మరియు బాగా వేయించిన మరియు నూరిన చికోరిలనుండి తయారయిన పదార్ధము. అది కాఫీ-చికోరి పొడికిగల సహజమైన రంగు, రుచి (వాసన) లక్షణములు కలిగి ధారాళంగా ప్రవహించు విధంగా ఉండవలెను. అది అపరిశుద్ధ పదార్థములు, కలుపబడిన పదార్ధములు లేనిదై యుండవలెను. రూలు 42 (ఎ) లో నిర్దేశించబడిన విధంగా ఆధార పాత్రపై వాడబడిన కాఫీ చికోరిల శాతం గుర్తించబడవలెను. అది క్రింది ప్రమాణములకు గూడ అనుగుణంగా ఉండవలెను.

ఎ. తేమ — బరువున 5 శాతం మించకుండా

బి. మొత్తం భస్మం — బరువున 7.0 శాతం తగ్గకుండా, 10 శాతం మించకుండా (పొడి లెక్కన)

సి. కఫైన్ అనార్ద్ర— బరువున 1.4 శాతం తగ్గకుండా (పొడి లెక్కన)

ఎ.09 :– జి. యస్. ఆర్. 848 తేది 19-11-83 సవరణ ప్రకారం (8. 7.68. తేదిన తొలగించబడినది.)

ఎ. 10 : తినదగు క్రొవ్వు :–

ఎ. 10. 01 : గోమాంసపు క్రొవ్వు

అనగా గోవు శవమునుండి లభించిన క్రొవ్వు. దాని సపోనిఫికేషను విలువ 193 — 200 ల మధ్యన అయోడిన్ విలువ 35 — 46 ల మధ్య ఉండవలెను.

ఎ. 10. 02 : గొఱ్ఱె మాంసపు క్రొవ్వు

అనగా గొఱ్ఱె శవమునుండి లభించిన క్రొవ్వు. దాని సపోనిఫికేషను విలువ 192 — 195 ల మధ్య అయోడిన్ విలువ 35 — 46 మధ్యన ఉండవలెను.

ఎ. 10. 03 : మేక మాంసం క్రొవ్వు

అనగా మేక శవమునుండి లభించిన క్రొవ్వు. దాని సపోనిఫికేషను విలువ 193 — 196 ల మధ్య అయోడిన్ విలువ 36 — 45 మధ్య ఉండవలెను.

ఎ. 10. 04 : పంది కొవ్వు
(Lord)

అనగా (పంది) నుండి లభించిన కొవ్వు. కొవ్వు అమ్లములు కొవ్వు లేక ఇతర పదార్థములు 1 శాతం మించి కలిగియుండరాదు. దాని సపొనిఫికేషను విలువ 192 — 198 ల మధ్య మరియు అయోడిన్ విలువ 52 — 65 ల మధ్య ఉండవలెను.

ఎ. 10. 05 : కోకో వెన్న

అనగా *Thoebroma Cocoa* L గింజల మొనలనుండి పిండగా లభించిన కొవ్వు. అది ఇతర నూనెలు, కొవ్వులు, ఖనిజనూనెలు, కలుపబడిన రంగులు లేనిదై యుండవలెను. అవి క్రింది ప్రమాణములకనుగుణంగా ఉండవలెను. కొవ్వు అమ్లములు (ఓలిక్ ఆమ్లముగా చెప్పబడినది) 1.5 శాతం మించకుండా.

అయోడిన్ విలువ 32 — 42 వరకు
ద్రవీభవన స్థానము 29° C — 30° C వరకు
40° C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టో మీటరు విలువ—40.9. — 48.0 వరకు
సొ నిఫికేషన్ విలువ 185 — 200 వరకు

ఎ. 10. 06 : 'తక్కువ మరియు ఎక్కువ కొవ్వు కోకో పొడి'
(Low and high fat cocoa)

అనగా *Theobroma Cocoa* L గింజల — కోకో గింజలనుండి లభించిన పాక్షికంగా కొవ్వు తీసివేయబడిన పొడి. అది తయారీలో క్షారము మరియు/లేక మేగ్నీషియం కార్బొనేటు, బైకార్బొనేటు మరియు టార్టారిక్, సిట్రిక్, ఫాస్ఫోరిక్, ఆమ్లములతో ట్రీట్ చేయబడవచ్చును. అది ముదురువాసన, మట్టి, మురికి, కీటకములు కీటక భాగములు, సిలేంద్రములతో (Fungus) నిండియుండరాదు. అది క్రింది ప్రమాణములకనుగుణంగా ఉండవలెను.

1. మొత్తం భస్మము - 14.0 శాతము మించకుండా [తేమపై, కొవ్వు లేని పద్ధతిపై]
2. సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మము - 1.0 శాతము మించకుండా [తేమపై, కొవ్వులేని పద్ధతిపై]

3. మొత్తం భస్మము యొక్క క్షారత్వము - కె2 ఒగా 6.0 శాతము మించ కుండా [తేమపై, కొవ్వు లేని పద్ధతిపై]

4. కోకో వెన్న :-

   i) తక్కువ కొవ్వు - 10.0 శాతము తగ్గకుండా
   [తేమపై కొవ్వులేని పద్ధతిపై]
   ఎక్కువ కొవ్వుకు 20.0 శాతము తగ్గకుండా
   [తేమపై కొవ్వులేని పద్ధతిపై]

ఎ. 10. 07: శుద్ధి చేయబడిన సాల్విత్తన కొవ్వు :-

అనగా సాల్ వృక్షములు *Shorea robusta Gaertn of, (No. Dipetro carpaceae)* గింజలలోని పప్పునుండి తీయబడిన క్షారములలో తటస్థీకరించబడిన, బ్లీచింగ్ ఎర్త్ లేక యాక్టివేటెడ్ కార్బన్ లేక రెంటితో విరంజనం చేయబడిన, ఆవిరితో వాసన తీసివేయబడిన, ఇంకే రసాయనములు వాడబడని శుద్ధి చేయబడిన క్రొవ్వు, లేక డీ-ఎసిడిఫికేషను, బ్లీచింగ్ మరియు వాసన తీసివేయుట భౌతిక క్రియల ద్వారా చేయవచ్చును. కరుగబెట్టగా, కత్తిరించు పదార్థములు అవశేషములు, నిక్షేపితమైన లేక ఇతర అన్య పదార్థం, వేరుపరచబడిన నీరు, లేక కలుపబడిన రంగులు లేనిదై యుండవలెను. పదకట్టబడిన శాంపిల్‌ను 40° C వద్ద 24 గంటలుంచిన తరువాత చిక్కన [Turbidity] ఉండరాదు. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా ఉండవలెను

1. తేమ — 0.1 శాతము మించకుండ
2. బ్యూట్రోరిఫ్రాక్టో మీటరు విలువ 40° C వద్ద 36.7 — 51.0
   లేక రిఫ్రాక్టివ్ ఇండెక్స్ 40° C వద్ద — 1.4500 — 1.4600
3. అయోడిన్ విలువ [విజి పద్ధతి] 31 — 45
4. సపోనిఫికేషను విలువ 80 — 95
5. (Cruseporifisble matter) పదార్థము-బరువున 2.5 శాతము మించకుండా
6. క్రొవ్వు నూనెలు [ఓలిక్ ఆమ్లముగా చెప్పబడినవి] - బరువున 0.25 శాతము మించకుండ
   లేక ఆమ్లపు విలువ — 0. 5 మించకుండ

7. 9.10 ఎపోక్సీ మరియు 9.10 డైహైడ్రోక్సీ స్టియరిక్ ఆమ్లము — బరువున 3.0 శాతము మించకుండా

8. మండే ఉష్ణోగ్రత (పెన్‌స్కీ-మార్టెన్ క్లోజ్డ్ మెథడ్)—250° C తగ్గకుండా

ఎ. 10. 08: క్యారబ్ పొడి

అనగా వేయించిన *Ceratonia Siliqa. L Taub. Family. Leguminosee* [కాయల] [pod] నుండి తీయబడిన పొట్టులేని పొడి. అది కృత్రిమ రంగులు, రుచి, అన్య పదార్థములు మరియు మెరుపు పదార్థములు లేనిదై బాగుగా, పొడిగా, తాజా స్థితిలో ఉండి, మురుగు మరియు అభ్యంతరకరమైన రుచి/వాసన లేనిదై ఉండవలెను. అది క్రింది ప్రమాణములకు అనుగుణంగా ఉండవలెను.

| | | |
|---|---|---|
| i) | మొత్తము భస్మము | 1.2 శాతము మించకుండా [బరువున] |
| ii) | ఆమ్లములో కరుగని పదార్థము | 5 శాతము మించకుండా [బరువున] |
| iii) | టానిన్ | 0.1 శాతము తగ్గకుండా మరియు 0.15 శాతము మించకుండా. |

ఎ. 11:- పాలు, పాల ఉత్పత్తులు

ఎ. 11. 01: నిర్వచనములు 'పాలు'

అనగా ఆరోగ్యకరమైన పాడి పశువుల నుండి పూర్తిగా పిండుట వలన లభించిన సాధారణ చనుస్రావము. అవి కోలోస్ట్రాల్ లేనివై యుండవలెను. భిన్న పేర్లు గల వివిధ రకముల పాలు. ఐటం ఎ. 11. 01. 11 క్రింద నిర్దేశించబడిన ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

ఎ. 11. 01. 02: 'పాస్చురైజేషన్'
(Pasturisation)

వివిధ రకముల పాలకు సంబంధించి పాస్చురైజేషను అను పదం యొక్క అర్థం, వివిధ రకముల పాలు క్రింది చెప్పబడిన విధంగా వేడిచేసి, పంపిణీకి ముందు తగిన ఉష్ణోగ్రతకు చల్లార్చిన పాలు, పాశ్చరైజ్‌డ్ పాలు /పాల ఉత్పత్తి పాస్ఫేటు టెస్టుకు నెగెటివ్ చూపవలెను.

'పాశ్చరైజేషన్','పాశ్చరైజ్డ్' పదములు, మరి సారూప్య పదములు వివిధ రకముల పాల యొక్క ప్రతి అణువు కనీసం 63° C కు వేడి చేసి అట్టి ఉష్ణోగ్రత వద్ద 30 నిమిషములుంచు, లేక 71.5° C లకు వేడి చేసి అట్టి ఉష్ణోగ్రత వద్ద 15 సెకండ్లు వుంచు ఫాస్ఫేటు టెస్టు నెగిటివ్ వచ్చునట్టి అమోదించబడిన ఉష్ణోగ్రత - కాలం సంయోగములో వేడి చేయు, ప్రక్రియకు ప్రస్తావనగా గ్రహించవలెను.

పాశ్చరైజ్ చేయబడిన అన్ని పాలు / మరియు పాల ఉత్పత్తులు వెంటనే 10° C లేక అంతకు తక్కువ ఉష్ణోగ్రతకు చల్లపరచవలెను.

ఎ. 11. 01. 03 : స్టెరిలైజేషన్

'పాలు' గురించి వాడినప్పుడు 'స్టెరిలైజేషన్' అనగా పాలను 115° C వద్ద నిలకడగా 15 నిమిషములు లేక 145° సి వద్ద 3 సెకండ్లు వేడి చేయుట లేక, తయారీ తేది తరువాత సామాన్య ఉష్ణోగ్రత వద్ద కనీసం 15 రోజులు నిల్వ ఉండ గలందుకు ఆమోదించబడిన ఉష్ణోగ్రత - కాలం సంయోగములో వేడి చేయుట. 'స్టెరిలైజ్డ్' పాలు నెగెటివ్ టర్బిటీ టెస్టులో అల్బుమిన్ లేనట్లుగా చూపవలెను. స్టెరిలైజ్డ్ పాలు స్టెరిలైజు చేయబడిన ఆధారపాత్రలోనే అమ్మబడవలెను.

ఎ. 11. 01. 04 : మరుగ బెట్టబడిన పాలు

అనగా మరుగు స్థితికి తేబడిన పాలు.

ఎ. 11. 01. 05 : 'ఫ్లేవర్డ్ పాలు'

ఏ పేరుతో పిలువబడిన, రుచి కల్గించిన పాలు(మొత్తంగా గాని ముక్కలుగా గాని వలగగొట్టి గాని) పప్పులు, చాకోలేటు, కాఫీ లేక ఇతర తినదగు రుచి, ఆహార రంగులు, మరియు చక్కెర కలిగియుండవచ్చును. ఫ్లేవర్డ్ పాలు స్టెరిలైజ్డ్ లేక పాశ్చరైజ్డ్ లేక మరుగబెట్టినవి. అయి ఉండవలెను పాలలకం లేబిల్ పై ఉదహరించవచ్చును.

ఎ. 11. 01. 05 ఎ : 'మిక్స్‌డ్ పాలు'

అనగా ఆవు, గేదె, గొర్రె, మేక, లేక ఇతర పాలిచ్చు పశువుల పాల సంయోగం, మరియు ఐటం ఎ. 11. 01. 11 క్రింద ఇవ్వబడిన పట్టికలోని ప్రమాణములకు అనుగుణమైనదే యుండినది.

ఎ. 11. 01. 06 : 'స్టాండర్డైజ్డ్ పాలు'

అనగా ఘనపదార్థములను సరిచేసి గాని, ఎ. 11. 01. 11 క్రింద పట్టికలో ఇవ్వబడిన కొవ్వు, కొవ్వు కాని ఘనపదార్థముల శాతమునకు ప్రమాణీకరించబడిన ఆవు, లేక గేదె, లేక గొర్రె, లేక మేకపాలు లేక వీనిలో ఏపాలతోనైనా సంయోగము. స్టాండర్డైయిజ్‌డ్ పాలు పాశ్చరైజు చేయబడవలెను. మరియు ఫాస్ఫేటు పరీక్షలో నెగెటివ్ చూపవలెను

A 11. 01 07 : రికంబైన్డ్ పాలు

పాల కొవ్వు, కొవ్వు కాని ఇతర పాల ఘనపదార్థములు నీరుల నుండి తీయబడిన సజాతీయమైన ఉత్పాదనము.

ఎ. 11. 01. 08 : 'టోన్డ్ పాలు'

అనగా గేదె లేక ఆవు పాలు, లేక రెండూ తాజా స్కిమ్‌డ్ పాలతో మిశ్రమం చేయగా, లేక ఆవు లేక గేదె పాలు లేక రెండునూ పాల ఘన పదార్థములను సరిచేసి ఎ. 11. 01. 11 క్రింది పట్టికలో ఇవ్వబడిన కొవ్వు, కొవ్వుకాని పాల ఘనపదార్థముల శాతమునకు ప్రమాణీకరించబడగా తయారైనవి. అవి 'పాశ్చరైజ్' చేయబడవలెను. ఫాస్ఫేటు టెస్టు నెగెటివ్ చూపవలెను. కొవ్వుగాని ఘన పదార్థములు కలిపినప్పుడు అవి పూర్తిగా ఏక జాతీయమైన ఉత్పత్తి అగునట్లు, నిల్వ చేయగా ఘన పదార్థములు పేరుకోనట్లు జాగ్రత్తలు తీసికొనవలెను.

ఎ. 11. 01. 09 : 'డబుల్ - టోన్డ్ పాలు'

అనగా పాలు, లేక గేదె పాలు లేక రెండునూ తాజా స్కిమ్‌డ్ పాలతో మిశ్రమం చేయగా, లేక ఆవు పాలు లేక గేదె పాలు లేక రెండునూ, పాల ఘన పదార్థములు సరిచేసి ఎ. 11. 01. 11 క్రింది పట్టికలో ఇవ్వబడిన కొవ్వు, కొవ్వు కాని ఇతర ఘన పదార్థముల శాతమునకు ప్రమాణీకరించగా తయారైనవి. అవి పాశ్చరైజ్ చేయబడవలెను, మరియు ఫాస్ఫేటు టెస్ట్ నెగటివ్ చూపవలెను. కొవ్వు లేక పొడి కొవ్వుకాని పాల ఘనపదార్థములు వాడినప్పుడు, ఉత్పత్తి ఏక జాతీయముగా ఉండునట్లు నిల్వచేయగా, ఘన పదార్థముల డిపాసిట్సు రానట్లు జాగ్రత్తలు తీసికొనవలెను.

ఎ. 11. 01. 10 : 'స్కిమ్డ్ పాలు'

అనగా పాలనుండి యాంత్రిక పద్ధతిన దాదాపు పూర్తిగా పాలకొవ్వు తీసి వేయబడినవి.

ఎ. 11. 01. 11 :

వివిధ రకముల మరియు వివిధమైన పేర్లతో పిలువబడు పాలకు ప్రమాణములు క్రింది విధముగా ఉండవలెను.

| పాలతరగతి | పేరు | ప్రాంతం | కనీస శాతం | |
|---|---|---|---|---|
| | | | పాలకొవ్వు | కొవ్వుకాని పాల ఘనపదార్థములు |
| బర్రెపాలు | పచ్చి, పాస్చ రైజ్డ్, బాయిల్డ్, ప్లేవర్డ్ మరియు స్టెరిలైజ్డ్ | అస్సాం<br>బీహార్<br>చండీగర్<br>ఢిల్లీ<br>గుజరాత్<br>హర్యానా<br>మహారాష్ట్ర<br>మేఘాలయ<br>పంజాబ్<br>సిక్కిం<br>ఉత్తరప్రదేశ్<br>పశ్చిమ బెంగాల్ | 6.0 | 9.0 |

| పాలతరగతి | పేరు | ప్రాంతం | కనీస శాతం<br>పాలకొవ్వు | <br>కొవ్వుకాని పాల ఘనపదార్థములు |
|---|---|---|---|---|
| బఱ్ఱెపాలు | పచ్చి, పాస్చ రైజ్డ్ బాయిల్డ్, ఫ్లేవర్డ్ మరియు స్టెరిలైజ్డ్ | అండమాన్ మరియు నికోబార్<br>ఆంధ్రప్రదేశ్<br>అరుణాచలప్రదేశ్<br>దాద్రా మరియు నగర్ హవేలి<br>గోవా, డామన్ మరియు డయ్యూ<br>కేరళ<br>హిమాచల ప్రదేశ్<br>జమ్ము & కాశ్మీర్<br>లక్షద్వీపములు<br>మధ్యప్రదేశ్<br>మనిపూర్<br>మిజోరామ్<br>నాగాలాండ్<br>నెఫా<br>ఒరిస్సా<br>పాండిచ్చేరి<br>రాజస్థాన్<br>తమిళనాడు<br>త్రిపుర | 5.0 | 9.0 |

| పాలతరగతి పేరు | ప్రాంతం | కనీస శాతం | |
|---|---|---|---|
| | | పాలకొవ్వు | కొవ్వుకాని పాల ఘనపదార్థములు |
| | చండీగర్<br>హర్యానా<br>పంజాబ్ | 4.0 | 8.5 |
| ఆవుపాలు, పచ్చి, పాస్చ్ రైజ్‌డ్ బాయిల్డ్, ఫ్లేవర్‌డ్ మరియు స్టెరిలైజ్‌డ్ | అండమాన్ మరియు నికోబార్<br>ఆంధ్రప్రదేశ్<br>అస్సాం<br>బీహార్<br>దాద్రా మరియు నాగర్ హవేలి<br>ఢిల్లీ<br>గోవా, డామన్ డయ్యు<br>గుజరాత్<br>హిమాచల ప్రదేశ్<br>జమ్మూ, కాశ్మీర్<br>కర్నాటక<br>కేరళ<br>లక్షద్వీపములు<br>మధ్యప్రదేశ్<br>మహారాష్ట్ర<br>మనిపూర్<br>మేఘాలయ | 3.5 | 8.5 |

| పాలతరగతి | పేరు | ప్రాంతం | కనీస శాతం పాలకొవ్వు | కొవ్వుకాని పాల ఘనపదార్థములు |
|---|---|---|---|---|
| | | నాగాలాండ్<br>నెఫా<br>పాండిచ్చేరి<br>రాజస్థాన్, సిక్కిం<br>తమిళనాడు<br>త్రిపుర<br>ఉత్తరప్రదేశ్<br>ప. బెంగాల్ | 3.5 | 8.5 |
| ఆవుపాలు | పచ్చి పాస్చ రైజ్‌డ్ బాయిల్డు, ఫ్లేవర్‌డ్ మరియు స్టెరిలైజ్‌డ్ | ఒరిస్సా<br>మిజోరాం | 3.0 | 8.5 |
| | పచ్చి, పాస్చ రైజ్‌డ్ బాయిల్డు ఫ్లేవర్‌డ్ మరియు స్టెరిలైజ్‌డ్ | చండిగఢ్<br>హర్యానా<br>కేరళ<br>మధ్యప్రదేశ్<br>మహారాష్ట్ర<br>పంజాబ్<br>ఉత్తరప్రదేశ్ | 3.5 | 9.0 |
| మేకపాలు లేక గొఱ్ఱెపాలు | పచ్చి పాస్చ రైజ్‌డ్ బాయిల్డు ఫ్లేవర్‌డ్ మరియు | అండమాన్ మరియు నికోబార్ దీవులు | 3 0 | 9,0 |

| పాలతరగతి | పేరు | ప్రాంతం | కనీస శాతం | |
|---|---|---|---|---|
| | | | పాలకొవ్వు | కొవ్వుకానిపాల ఘనపదార్ధములు |
| | స్టైరిలైజ్డ్ | ఆంధ్రప్రదేశ్<br>అరుణాచలప్రదేశ్<br>అస్సాం<br>బీహార్<br>దాద్రా మరియు<br>నాగర్ హవేలి<br>ఢిల్లీ<br>గోవా, డామన్<br>మరియు డయ్యూ<br>గుజరాత్<br>హిమాచల ప్రదేశ్<br>జమ్మూ & కాశ్మీర్<br>కర్నాటక<br>లక్ష ద్వీపములు<br>మనిపూర్<br>మేఘాలయ<br>మిజోరాం<br>నాగాలాండ్<br>నీఫా<br>ఒరిస్సా<br>పాండిచ్చేరి<br>రాజస్థాన్<br>సిక్కిం<br>తమిళనాడు<br>త్రిపుర<br>పశ్చిమ బెంగాల్ | 3.0 | 9.0 |

| పాలతరగతి | పేరు | ప్రాంతం | కనీస శాతం | |
|---|---|---|---|---|
| | | | పాలకొవ్వు | కొవ్వుకానిపాల ఘనపదార్థములు |
| మిశ్రమ పాలు | పచ్చి, పాశ్చరైజ్డ్, బాయిల్డు ఫ్లేవర్డ్ మరియు స్టెరిలైజ్డ్ | భారతదేశమంతట | 4.5 | 8.5 |
| స్టాండర్డైజుపాలు | పాశ్చరైజ్డ్ ఫ్లేవర్డ్ మరియు స్టెరిలైజ్డ్ | భారతదేశమంతట | 4.5 | 8.5 |
| రికంబైన్డ్స పాలు | పాశ్చరైజ్డ్ ఫ్లేవర్డ్ మరియు స్టెరిలైజ్డ్ | భారతదేశమంతట | 3.0 | 8.5 |
| టోన్డ్ పాలు | పాశ్చరైజ్డ్ ఫ్లేవర్డ్ మరియు స్టెరిలైజ్డ్ | భారతదేశమంతట | 3.0 | 8.5 |
| డబుల్ టోన్డు పాలు | పాశ్చరైజ్డ్, ఫ్లేవర్డు, మరియు స్టెరిలైజ్డు | భారతదేశమంతట | 1.5 | 9.0 |
| స్కిమ్డ్ పాలు | పచ్చి, పాశ్చరైజ్డు, బాయిల్డ్, ఫ్లేవర్డు మరియు స్టెరిలైజ్డు | భారతదేశమంతట | 0.5% మించకుండ | 8.7 |

గమనిక :-

i. పాలు ఏ రకమైన పాలయినవి సూచన చేయకుండా అమ్మినప్పుడు గేదె పాలకు విహితమయిన ప్రమాణములు వర్తించును.

ii. వివిధములైన పేర్లు గల పాలకు వేడి చేయు పద్ధతి ఈ క్రింద విశదముగా పొందుపరచెను.

| | |
|---|---|
| పేరు | పేడి చేయుపద్ధతి |
| పచ్చి | — |
| పాస్చరైస్డు | పాస్చరైజేషన్ |
| బాయిల్డ్ | మరగబెట్టుట |
| ఫ్లేవర్డు | పాస్చరైజేషన్ లేక స్టెరిలైజేషన్ |
| స్టెరిలైజ్డ్ | స్టెరిలైజేషన్ |

ఎ. 11. 02: పాల ఉత్పత్తులు

అనగా, మీగడ, మలై, పెరుగు, స్కిమ్డ్ పాల పెరుగు, ఛన్నా, స్కిమ్డ్ పాల ఛన్నా, ఛీజ్, ప్రాసెస్ చేయబడిన ఛీజ్, జున్ను, ఐస్‌క్రీం, మిల్క్‌ఐస్‌లు, కండెన్స్‌డ్ పాలు, తీపి చేయబడిన మరియు తీపి చేయబడని కండెన్స్‌డ్ స్కిమ్డ్ పాలు, తీపి చేయబడిన, తీపి చేయబడని పాల పొడి, స్కిమ్డ్ పాలపొడి, పాక్షిక స్కిమ్డ్ పాలపొడి, ఖోవా, శిశుపాల ఆహారము టేబుల్ వెన్న, దేశీ వెన్న వంటి పాల నుండి లభించిన పదార్థములు.

ఎ. 11. 02. 01:

పాల, ఉత్పత్తులు, అనుబంధం - బి లో పేర్కొనబడినవి, ప్రమాణములలో పేర్కొనిన తప్ప, పాలలో కనుగొనబడని ఏ పదార్థమును కలిగియుండరాదు.

ఎ. 11. 02. 02:

మీగడ, స్టెరిలైజ్డ్ మీగడ మినహా కనీసం 25 శాతం పాల కొవ్వుగల, ఆవు పాలు లేక గేదె పాలు లేక వాని మిశ్రమముల నుండి ఉత్పన్నమయినవి.

ఎ. 11. 02. 03: మలై

ఆవు లేక గేదె పాలు లేక వాని మిశ్రమమును మరగబెట్టి చల్లారబెట్టబడగా వచ్చిన, వెన్నకొవ్వు చాలా ఎక్కువగా యున్న పదార్థం, అది కనీసం 25 శాతం పాల కొవ్వు గలిగి యుండవలెను.

ఎ. 11. 02. 04: పెరుగు

'పాస్చరైజ్డ్' లేక 'బాయిల్డు' పాలను ప్రకృతి పద్ధతితో లేదా లాక్టిక్ ఆమ్లం లేక ఇతర బాక్టీరియల్ కల్చర్ పద్ధతి ద్వారా పులియబెట్టగా వచ్చిన పదార్థం. పెరుగు, కలుపబడిన చక్కెర కలిగి యుండవచ్చును. పెరుగులోని పాల కొవ్వు, కొవ్వు కాని పాల ఘన పదార్థముల కనీస శాతం, ఏ పాల నుండైతే తయారయినదో ఆ పాలలోని కనీస శాతం ఉండవలెను. ఏ పాలనుండి తయారైనదీ సూచన లేకుండా పెరుగు అమ్మబడినప్పుడు గేదె పాలనుండి తయారైన పెరుగుకు విహితమైన ప్రమాణములు వర్తించును.

[ఇది తయారు చేయుటలో పాల ఘన పదార్థములను వాడవచ్చును.]
జి. యస్. ఆర్. 550 (ఇ) తేది 4-7-85 ద్వారా చేర్చబడినది.

ఎ. 11. 02. 05: 'ఛన్నా'

'ఛన్నా' (పానీర్) ఆవు పాలు లేక గేదె పాలు లేక రెంటి మిశ్రమమును మజ్జిగ, లాక్టిక్ ఆమ్లం, లేక సిట్రిక్ ఆమ్లంలో పేరబెట్టగా వచ్చిన పదార్థం. అది 70 0 శాతం మించి తేమ కలిగియుండరాదు. పాల కొవ్వు, పొడి పదార్థంలో 50 శాతం తగ్గరాదు.

[ఇది తయారు చేయుటలో పాల ఘన పదార్థమును వాడవచ్చును.]
జి. యస్. ఆర్. 550 (ఇ) తేదీ 4-7-85 ద్వారా చేర్చబడినది.

ఎ. 11. 02. 06: 'స్కిమ్డ్ పాల ఛన్నా'

స్కిమ్డ్ ఆవు పాలు లేక గేదె పాలు లేక రెంటి మిశ్రమమును మజ్జిగ, లాక్టిక్ ఆమ్లం లేక సిట్రిక్ ఆమ్లంలో పేరబెట్టగా వచ్చిన పదార్థం. అది 70 శాతం మించి తేమ కలిగియుండరాదు. పాల కొవ్వు పొడి పదార్థంలో 13 శాతం మించరాదు.

ఎ. 11. 02. 07: 'జున్ను'

**(Cheese)**

(గట్టి) అనగా హానికరంగాని బాక్టీరియల్ కల్చర్ల ప్రభావము క్రింద, హానికరం గాని కోయాగ్యులేషన్ ఏజంటుల పాలు విరుగగొట్టబడిన తర్వాత ద్రవము పిండి వేయగా లభ్యమయిన పదార్థం అది, పాలలో కనుగొనబడని ఏ పదార్థమునూ, కోయాగ్యులేషన్ ఏజంటు, సోడియం క్లోరైడ్, బరువున 0 02 శాతం మించని కాల్షియం క్లోరైడ్ (అనార్ద్ర లవణము", యన్నాట్టో లేక కారటోన్ రంగు కలిగి యుండరాదు; మరియు ఎమల్సీకరణాలు, మరియు లేక స్థిరత్వకారకములు అనగా సిట్రిక్ అమ్లం, సోడియం సిట్రేట్ లేక ఆర్థో ఫాస్ఫారిక్ అమ్లం, మరియు పోలిఫాస్ఫారిక్ అమ్లం యొక్క సోడియం లవణముల బరువున 0.2 శాతం మించకుండా కలిగియుండవచ్చును. ఉపరితలమును కప్పుటకు వాడబడిన మైనం ఆరోగ్యమునకు హాని కలిగించు ఎట్టి పదార్థము కలిగియుండరాదు. మైనం రంగు వేయబడినచో అనుమతించబడిన ఆహార రంగులు మాత్రమే వాడవలెను. గట్టి జున్ను 43 శాతం మించని తేమ, పొడి పదార్థంలో 42.0 శాతంకు తగ్గని పాలకొవ్వు కలిగియుండవలెను. గట్టి జున్ను, సోర్బిక్ అమ్లం లేక సోర్బిక్ అమ్లంగా గణించబడిన దాని సోడియం, పొటాషియం, లేక కాల్షియం లవణములు 0.1 శాతం, లేక నిసిన్ [ఒంటిగా గాని సంయోగములోగాని] 0.1 శాతం ఉండవచ్చును.

ఎ 11. 02. 07. 01: 'ప్రాసెస్డ్ జున్ను'

అనగా జున్నును అనుమతించబడిన ఎమల్సీకరణాలు మరియు / లేక స్థిరత్వకారకములు అనగా, సిట్రిక్ అమ్లం, సోడియం సిట్రేట్, మరితర ఆర్థో ఫాస్ఫారిక్ అమ్లం మరియు పైరోఫాస్ఫారిక్ అమ్లములలో మసాలాలు, మరియు అమ్లీకరణాలు [Acidifying agents] అనగా వెనిగార్, లాక్టిక్ అమ్లం, ఎసిటిక్ అమ్లం, సిట్రిక్ అమ్లం, ఫాస్ఫారిక్ అమ్లములతో కలిపిగాని లేకుండగాని, వేడిచేయగా వచ్చిన పదార్థం. 'ప్రాసెస్డు జున్ను' 4.0 శాతం మించకుండా, అనుమతించ బడిన ఎమల్సీకరణాలు మరియు / లేక స్థిరత్వకారకములు 4.0 శాతం మించకుండ కలిగియుండవచ్చును. అయితే ఏ సందర్భంలోనూ అనార్ద్ర

అసేంద్రియ ఏజంట్లు 3.0 శాతం మించరాదు. అది, తేమ 47.0 శాతం మించి కలిగియుండరాదు. పాలకొవ్వు, పొడి పదార్థంలో 47 శాతం తగ్గరాదు. ప్రొసెస్టు జున్ను 0.1% సోర్బిక్ ఆమ్లం, లేక సోర్బిక్ ఆమ్లంగా గణించబడు సోడియం, పొటాషియం లేక కాల్షియం లవణములు. లేక నిసిన్ 0.1 శాతం నిసిక్ బంతిగా గాని సంయోగములో గాని కలిగియుండవచ్చును. అది [అనార్ద్ర] కాల్షియం క్లోరైడ్ బరువులో 0.02 శాతం మించకుండా కలిగియుండవచ్చును.

ఎ. 11.0.2.08' ఐస్‌క్రీం' కుల్ఫీ, కుల్ఫా చాకొలెట్ ఐస్‌క్రీం :-

అనగా ఆవు లేక గేదె పాలు లేక వాని మిశ్రమం లేక మీగడ మరియు/లేక ఇతర పాల ఉత్పత్తులు, చక్కెర, డెక్ట్రోస్, కర్యాకోస్ ద్రవం మరియు పొడి గ్లూకోస్ ద్రవం గుడ్లు, పండ్లు, పండ్ల రసం, నిల్వ చేయబడిన పండ్లు, పప్పు [Nuts] చాకొలేటు, తినదగు రుచులు, అనుమతించబడిన ఆహారరంగు సహితముగా లేక రహితముగాఘనీభవింపజేయగా వచ్చిన ఉత్పత్తి. అది అనుమతించబడిన స్థిరత్వ మరియు ఎమల్సీకరణ కారకములు బరువున 0.5 శాతం మించకుండా కలిగియుండ వచ్చును. ఘనీభవనము చేయక ముందు మిశ్రమం తగినంతగా వేడి చేయబడ వలెను ఉత్పత్తి 10 శాతం తగ్గకుండా పాలకొవ్వు, 3.5 శాతం ప్రొటీను, 36 శాతం తగ్గకుండా మొత్తం ఘన పదార్థములు కలిగియుండవలెను. మినహాయింపు-పై జెప్పబడిన తయారీలో పండ్లు, పప్పులు [Nuts] లేక రెండునూ కలిగి యున్నప్పుడు, పాల కొవ్వు బరువున 8 శాతం తగ్గరాదు.

రూలు 43 [2] లో పేర్కొనబడినట్లుగా లేబల్‌పై ప్రకటనతో, స్టార్చ్ 5 శాతం వరకు కలుపవచ్చును.

ఐస్‌క్రీం ప్రమాణములు మృదువైన ఐస్‌క్రీంలకు గూడ వర్తించును. చాకలేట్ లేక అటువంటి పైపూత పై పొరగా ఉండు ఐస్‌క్రీం ల విషయంలో ఐస్‌క్రీం భాగం మాత్రమే ఐస్‌క్రీం ప్రమాణముల కనుగుణంగా ఉండవలెను.

ఎ. 11. 02 09 : 'మిల్క్ ఐస్‌లు లేక మిల్క్ లోల్లీలు'

అనగా చక్కెర డెక్ట్రోస్, గ్లూకోస్ ద్రవం గుడ్లు, పండ్లు, పండ్ల రసం పప్పులు [Nuts] చాకోలేట్‌లు రుచులు మరియు అనుమతించబడిన రంగులు కలపబడి గాని, లేకుండ గాని, పాల, స్క్రిమ్డ్ పాలు, లేక పాల ఉత్పత్తులను గడ్డ కట్టపరచగా వచ్చినది. అది అనుమతించబడిన స్థిరత్వకారకములు 0.5 శాతం మించకుండా కలిగి యుండవచ్చును. మిశ్రమం గడ్డకట్ట పరచుటకు ముందు తగినట్లు వేడి చేయవలెను. ఉత్పత్తి 2 శాతం మించని పాల కొవ్వు, 3.5 శాతం తగ్గకుండ ప్రొటీన్లు, మరియు 20 శాతం తగ్గకుండా మొత్తం ఘన పదార్థములు కలిగియుండ వలెను.

ఎ. 11. 02. 10 : 'తీపి చేయబడని కండెన్స్‌డ్ పాలు' (ఎవాపరేటెడ్ మిల్క్)

అనగా ఆవు లేక గేదె పాలు లేక వాని మిశ్రమం లేక స్టాండర్డైస్డు పాలు నుండి, పాక్షికంగా నీరు తీసి వేయబడిన ఉత్పత్తి. అది కలుపబడిన కాల్షియం క్లోరైడ్, సిట్రిక్ అమ్లం, సోడియం సిట్రేట్ మరియు ఆర్థో ఫాస్ఫారిక్ అమ్లం యొక్క సోడియం లవణములు మరియు (లీనియర్ పాస్ఫేట్‌గా) పోలీ ఫాస్ఫారిక్ అమ్లం ఉత్పత్తి బరువులో 0.3 శాతం మించకుండా కల్గియుండవచ్చును. అట్టిచేర్పులు లేబిల్ పై ప్రకటించనక్కరలేదు. తీపి చేయబడని కండెన్స్డు పాలు కనీసం 8 శాతం పాల కొవ్వు మరియు 26 శాతం పాల ఘన పదార్థములు కలిగియుండవలెను.

ఎ. 11. 02. 11 : 'తీపి చేయబడిన కండెన్స్‌డ్ పాలు'

అనగా ఆవు లేక గేదె పాలు లేక వాని మిశ్రమం లేక స్టాండర్డైసు పాల నుండి పాక్షికంగా నీరు తీసి వేయబడి, చక్కెర కలుపబడినవి. అది శుద్ధి చేయబడిన లాక్టోస్ అనుమతించబడిన రుచి, కాల్షియం క్లోరైడ్, సిట్రిక్ అమ్లం, సోడియం సైట్రేట్, ఆర్థో ఫాస్ఫారిక్ అమ్లం యొక్క సోడియం లవణములు ఫాస్ఫారిక్ అమ్లం [లీనియర్ ఫాస్ఫేట్‌గా] ఉత్పత్తి బరువులో 0.3 శాతం మించకుండా కలిగి యుండవచ్చును. అట్టి చేర్పు లేబిల్‌పై ప్రకటించనక్కరలేదు తీపి చేయబడిన కండెన్స్‌డ్ పాలు కనీసం 9 శాతం పాల కొవ్వు, కనీసం 31 శాతం మొత్తం పాల ఘన పదార్థములు మరియు కనీసం 40 శాతం చక్కెర కలిగియుండవలెను.

ఎ. 11. 02. 12: 'తీసి చేయబడని కండెన్స్‌డ్ స్కిమ్డ్ పాలు'
(ఎవాపరేటెడ్ స్కిమ్డ్ పాలు)

అనగా ఆవు లేక గేదెల స్కిమ్డ్ పాలు లేక వాని మిశ్రమముల నుండి పాక్షికంగా నీరు తీసి వేయబడినది. అది కలుపబడిన కాల్షియం క్లోరైడ్, సిట్రిక్ ఆమ్లం, సోడియం సిట్రేట్ మరియు ఆర్థో ఫాస్ఫారిక్ ఆమ్లం యొక్క సోడియం లవణములు [లీనియర్ ఫాస్ఫేట్‌గా] మరియు పోలీ ఫాస్ఫారిక్ ఉత్పత్తి బరువులో 0.3 శాతం మించకుండా కలిగియుండవచ్చును. అట్టి చేర్పులు లేబిల్‌పై ప్రకటించ నక్కరలేదు.

తీసి చేయబడని కండెన్స్‌డ్ స్కిమ్డ్ పాలు కనీసం 10 శాతం మొత్తం పాల ఘన పదార్థములు కలిగియుండవలెను. కొవ్వు శాతం బరువున 0.5 శాతం మించరాదు.

ఎ. 11. 02. 13: 'తీసి చేయబడిన కండెన్స్‌డ్ స్కిమ్డ్ పాలు'

అనగా చక్కెర కలుపబడిన తరువాత ఆవు పాలు, గేదె పాలు లేక వాని మిశ్రమం నుండి, పాక్షికంగా నీరు తీసి వేయబడినది. అది కలుపబడిన కాల్షియం క్లోరైడ్, సిట్రిక్ ఆమ్లం, సోడియం సిట్రేట్ మరియు ఆర్థో ఫాస్ఫారిక్ ఆమ్లం యొక్క సోడియం లవణములు మరియు పాలీ ఫాస్ఫారిక్ ఆమ్లం [లీనియర్ ఫాస్ఫేట్‌గా] ఉత్పత్తి బరువులో 0.3 శాతం మించకుండా కలిగియుండవచ్చును. అట్టి చేర్పులు లేబిల్‌పై ప్రకటించనక్కరలేదు.

తీసి చేయబడిన కండెన్స్డ్ స్కిమ్డ్ పాలు కనీసం 26 శాతం మొత్తం పాల ఘన పదార్థములు, 40 శాతం చక్కెర కలిగియుండవలెను. కొవ్వు బరువున 0.5 శాతం మించరాదు.

ఎ. 11. 02. 14: 'పాలపొడి'

అనగా ఆవు పాలు, గేదె పాలు వాని మిశ్రమముల నుండి లేక స్టాండర్డైస్డ పాల నుండి నీరు తీసి వేయగా లభించిన ఉత్పత్తి. అది కాల్షియం క్లోరైడ్, సిట్రిక్ ఆమ్లం, సోడియం సిట్రేట్, ఆర్థో ఫాస్ఫారిక్ ఆమ్లం యొక్క సోడియం లవణములు

మరియు పాలీ ఫాస్ఫారిక్ ఆమ్లం [లీనియర్ ఫాస్ఫేట్‌గా, ఉత్పత్తి బరువులో 0.3 శాతం మించకుండా మరియు బ్యూటిలేటెడ్ హైడ్రోక్సియానిసోల్ [Bha] 0.01 శాతం మించకుండా కలిగియుండవచ్చును. అట్టి చేర్పులు లేబిల్‌పై ప్రకటించవ నక్కరలేదు. రూ. 42 (ఇ ఇ) ప్రకారం లేబిల్ ప్రకటనతో, 0.5 శాతం వరకు కలిగియుండవచ్చును. పాల పొడి 5.0 శాతం మించకుండా తేమ మరియు 26 శాతం తగ్గకుండా పాల కొవ్వు కలిగియుండవలెను. లాక్టిక్ ఆమ్లంగా తెలుపబడిన ఆమ్లత్వం గరిష్ఠ పరిమితి 1.2 శాతం మించరాదు. ప్లేట్ కౌంట్ గ్రాముకు 50,000 మించరాదు. 0.1 గ్రాము పొడిలో కోలీఫార్మ్ ఉండరాదు. ఉత్పత్తి యొక్క సూచి ఇట్లుండవలెను—

| | రోలర్‌డ్రైడ్ | స్ప్రే డ్రైడ్ |
|---|---|---|
| ద్రావణీయత శాతం [కనీసం] | 85.00 మి. లీ. | 98.50 మి. లీ. |

పొడిచేయు ప్రక్రియ లేబిల్‌పై ఉదహరింపవలెను.

స్ప్రేడ్రైడ్ ఉత్పత్తి, నికరపరిమాణము 510 గ్రాములు మించినపుడు, గాలి చొరని సీలు వేయబడిన ఆధార పాత్రలలో ప్యాకు చేయబడవలెను.

జి. యస్. ఆర్. 50౩ [ఇ] 1981 సవరణ ద్వారా తొలగించబడినది.

ఎ. 11. 02. 15: 'స్కిమ్డ్ పాలపొడి'

అనగా ఆవు లేక గేదె పాలు లేక వాని మిశ్రమముల నుండి నీరు తీసి వేయబడిన ఉత్పత్తి. అది కలుపబడిన కాల్షియం క్లోరైడ్, సిట్రిక్ ఆమ్లం, సోడియం సిట్రేట్ మరియు ఆర్థో ఫాస్ఫారిక్ ఆమ్లం యొక్క సోడియం లవణములు మరియు పోలీ ఫాస్ఫారిక్ ఆమ్లం [లీనియర్ ఫాస్ఫేట్‌గా] బరువులో 0.3 శాతం మించకుండ కలిగియుండవచ్చును. అట్టి చేర్పులు లేబిల్‌పై ప్రకటించవనక్కరలేదు. స్కిమ్డ్ పాల పొడి 1.5 శాతం, మించి పాల కొవ్వు మరియు 50 శాతం మించి తేమ కలిగి యుండరాదు. లాక్టిక్ ఆమ్లంగా చెప్పబడిన ఆమ్లత్వం 1.5 శాతం మించరాదు. ప్లేట్ కౌంట్ గ్రాముకు 50,000 మించరాదు. 0.1 గ్రాము పొడిలో కోలీఫార్మ్ ఉండరాదు. ఉత్పత్తి సూచి ఇట్లుండవలెను.

| | రోలర్‌డ్రైడ్ | స్ప్రేడ్రైడ్ |
|---|---|---|
| ద్రావణీయత శాతం [కనీసం] | 85 మి. లీ. | 98.5 మి. లీ. |

పొడిచేయు ప్రక్రియ లేబిల్‌పై ఉదహరించబడవలెను.

ఎ. 11. 02. 16 : 'పాక్షిక స్కిమ్డ్ పాలపొడి'

అనగా ఆవు లేక గేదెల పాక్షికంగా స్కిమ్డ్ పాలు లేక వాని మిశ్రమం నుండి నీరు తీసి వేయబడిన ఉత్పత్తి అది కలుపబడిన కాల్షియం క్లోరైడ్, సిట్రిక్ ఆమ్లం, సోడియం సిట్రేట్ మరియు ఆర్థో ఫాస్ఫారిక్ ఆమ్లం యొక్క సోడియం లవణములు మరియు పోలీ ఫాస్ఫారిక్ ఆమ్లం [లీనియర్ ఫాస్ఫేట్‌గా ఉత్పత్తి బరువులో 0.3 శాతం మించకుండ కలిగియుండవచ్చును. అట్టి చేర్పులు లేబిల్‌పై ప్రకటించనక్కరలేదు. పాక్షిక స్కిమ్డ్ పాల పొడి 15.0 శాతం మించి కలిగియుండరాదు. కొవ్వు అంశం, 1.5 శాతం మించి మరియు 26.0 శాతంకు తగ్గి ఉండవలెను. బ్యూటిలేటెడ్ హైడ్రోక్సీయాని సోల్ [Bha] ఉత్పత్తి బరువులో 0.01 శాతం మించకుండా కలుపవచ్చును. ఖచ్చితంగా ఉన్న కొవ్వు అంశం లేబిల్‌పై తెలుపబడవలెను. ఉత్పత్తి యొక్క కనీస ద్రావణీయత / ద్రావణీయత సూచి క్రింది ప్రమాణములకనుగుణంగా ఉండవలెను.

| | రోలర్ డ్రైడ్ | స్ప్రేడ్రైడ్ |
|---|---|---|
| ద్రావణీయత శాతం [కనీసం] | 85.0 మి. లీ. | 98.5 మి లీ. |

పొడిచేయు ప్రక్రియ లేబిల్‌పై ఉదహరించబడవలెను. స్ప్రేడ్రైడ్ ఉత్పత్తులు, పరిమాణము 510 గ్రాములు మించినచో గాలి చొరని సీలు వేయబడిన ఆధార పాత్రలలో అమ్మవలెను. బేకరీ వంటి పరిశ్రమలలో వాడు పాక్షికంగా స్కిమ్డ్ పాలు [పులుపు] సోడియం బైకార్బోనేటు తటస్థీకరణకారకముగా కలిగియుండ వచ్చును అయితే ఉత్పత్తి 'Unfit for direct consumption' అని లేబిల్ కలిగియుండవలెను, కాని తటస్థీకరణ కారకముతో సహా మొత్తం సంకలనాత్మకముల పరిమాణము పాక్షికంగా స్కిమ్డ్ పాల పొడికి నిర్దేశించబడిన ప్రకారమే ఉండవలెను. ద్రావణీయత శాతం బరువులో 75 శాతం ఉండుట మినహాయించి, అది పాక్షిక స్కిమ్డ్ పాల పొడి ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

ఎ. 11. 02. 17 : ఖోవా

(Khoa)

అనగా ఆవులేక గేదెలేక మేకలేక గొర్రె పాలు లేక పాల ఘనపదార్థములు వాని మిశ్రమములను త్వరిత గతిని పొడి చేయగా/

—లభించిన ఉత్పత్తి. పాల కొవ్వు శాతం ఉత్పత్తి బరువులో 20 శాతంకు తగ్గరాదు. అది బరువున 0.1 శాతం మించకుండా సిట్రిక్ ఆమ్లం కలిగియుండ వచ్చును.

ఎ. 11. 02. 18 : శిశువుల కొరకు పాల ఆహారము

(Infant milk food)

అనగా ఆవు పాలు లేకగేదెపాలు లేక వాని సంయోగమును పొడి చేయుట వలన( — ) లేక స్టాండర్డైస్డు పాలను లవణముల ప్రత్యేకమైన కార్బోహైడ్రేట్లు (చక్కెర, డెక్ట్రోస్, డెక్స్ట్రిన్స్, మాల్టోస్. లాక్టోస్) విటమిన్లు కలిపి పొడి చేయుట వలన. (            ) లభించిన ఉత్పత్తి. అది స్టార్చ్, మరియు యాంటీ ఆక్సిడెంట్లు లేనిదై యుండవలెను, దానిలో తేమ 5 శాతం మించి యుండరాదు, పాలకొవ్వు 18 శాతం తగ్గరాదు. 28 శాతం మించరాదు, కార్బోహైడ్రేటులు మొత్తం 35.0 శాతం, పాలప్రొటీనులు 20 శాతం తగ్గరాదు: మొత్తం భస్మము 8 . 5 శాతం మించరాదు సజల హైడ్రోక్లోరికామ్లంలో కరుగని భస్మము 0.05శాతం మించరాదు. ఇనుము (Fe గా) కనీసం 4.0 మి గ్రా/100గ్రా) మరియు విటమిన్-ఎ, కనీసం 15 IU/g. తగ్గరాదు. పొడి చేయుటకు వాడిన ప్రక్రియ ( —— ) లేబల్‌పై సూచించబడవలెను. 0.1 గ్రాము పొడిలో కోలోఫార్మ్ ఉండరాదు. ఉత్పత్తి యొక్క ద్రావణీయత సూచి క్రింది ప్రమాణములకనుగుణంగా ఉండవలెను.

| ద్రావణీయత | రోలర్‌డ్రైడ్ | స్ప్రే డ్రైడ్ |
|---|---|---|
| శాతం (కనీసం) | 8.5 మి.లీ | 98. 5 మిలీ |

ఉత్పత్తి గాలి చొరని సీలు వేయబడిన ఆధార పాత్రలలో అమ్మవలెను, మరియు ఏ తేదీలోగా — భుజింప వలెనో లేబిల్‌పై ఉండవలెను.

ఎ. 11. 02. 19 : టేబిల్ వెన్న

[Table (creamery) butter]

అనగా ఉప్పు యున్నట్టో, లేక రంగు పదార్థంగా కారటోన్ కలుపబడి గాని, లేకుండగానిఆవు, గేదెపాలు లేక వాని సంయోగములనుండి లేక వాని మీగడ లేక పెరుగునుండి లభించిన ఉత్పత్తి, అది జంతు కొవ్వు, మైనం, ఖనిజనూనెలు, శాక నూనెలు, కొవ్వులు, లేనిదై ఉండవలెను. అది బరువులో కనీసం 80 శాతం తగ్గకుండా

పాల కొవ్వులు, బరువులో 1.5 శాతం మించకుండ పెరుగు మరియు 6 శాతం మించకుండఉప్పు, కలిగియుండవలెను. డయాసిటైల్ రుచి కారకముగా వాడవచ్చును, కాని అట్లు వాడిన. డయాసిటైలు అంశం మొత్తం మిలియనుకు 4 భాగములు మించరాదు. కాల్షియం హైడ్రాక్సైడ్, సోడియం బైకార్బొనేటు, సోడియం కార్బొనేటు, సోడియం పాలి ఫాస్ఫేటులు (— లీనియర్ ఫాస్ఫేట్ గా) .... ఉత్పత్తిలో హైడ్రోజను గాఢత తగ్గించుటకు, మొత్తం వెన్న బరువులో 0.2 శాతం మించకుండా కలుపవచ్చును.

(జి. యస్. ఆర్. 503, 1-9-81 తేదీ సవరణ ప్రకారం తొలగించబడినది.)

ఎ. 11. 02. 20 : దేశి వెన్న

[Deshi (cooking) butter]

అనగా ఉప్పుతోసహా ఎటువంటి పరిరక్షక పదార్థము కలుప బడని, ఆవు లేక గేదె పాలనుండి లేక వాని సయోగమునుండి లేక వాని నుండి లభించిన పెరుగునుండి లభించిన ఉత్పత్తి. కలుప బడిన రంగు, రుచి కారకము కల్గియుండవచ్చును. అది ఇతర జంతు కొవ్వు, మైనం, మరియు ఖనిజ నూనె మరియు శాక నూనెలు, మరియు కొవ్వులు లేనిదై యుండవలెను. అది బరువులో కనీసం 76.0 శాతం పాల కొవ్వు కలిగి యుండవలెను.

అయితే టేబిల్ వెన్న లేక దేశీ వెన్నయో సూచన లేకుండ అమ్మినప్పుడు టేబిల్ వెన్నకు విహితమైన ప్రమాణములు వర్తించును.

ఎ. 11. 02. 21 : నేయి

కేవలం పాల నుండి లేక పెరుగు నుండి లేక రంగు, పరిరక్షకము కలుపబడని మీగడ నుండి తయారైన దేశీ వెన్న నుండి తీయబడిన స్వచ్ఛమైన విశదమైన కొవ్వు. క్రింది పట్టికలో కాలం (2) లో పేర్కొనబడిన రాష్ట్రములో లేక కేంద్ర పాలిత ప్రాంతంలో తయారైన నేయి నాణ్యత ప్రమాణం సదరు పట్టికలో సంబంధించిన కాలం 3-4-5-6 లలో సదరు రాష్ట్రం లేక కేంద్ర పాలిత ప్రాంతమునకు ఎదురుగా పేర్కొనబడినట్లుండ వలెను.

పట్టిక

| క్రమ సంఖ్య | రాష్ట్రం/కేంద్ర పాలిత ప్రాంతం పేరు | 40° సి వద్ద బ్యూట్రో రిఫ్రాక్టో మీటరు విలువ | రైచర్ట కనీస విలువ | శాతం ఎఫ్ ఎఫ్ ఎ తేమ ఒలిక్ ఆమ్లం గరిష్ఠ పరిమితి | గరిష్ఠ పరిమితి |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. | ఆంధ్రప్రదేశ్ | 40.0-43.0 | 24 | 3.0 | 0.5 |
| 2. | అండమాన్ మరియు నికోబార్ దీవులు | 41.0-44.0 | 24 | 3.0 | 0.5 |
| 3. | అరుణాచల్ ప్రదేశ్ | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 4. | అస్సాం | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 5. | బీహార్ | 40.0-43.0 | 28 | 3.0 | 0.5 |
| 6, | చండీగర్ | 40.0-43.0 | 28 | 3.0 | 0.5 |
| 7. | నగర్ హవేలి మరియు దాద్రా | 40.0-43.0 | 24 | 3.0 | 0.5 |
| 8. | ఢిల్లీ | 40.5-43.0 | 28 | 3.0 | 0.5 |
| 9. | ఎ] గోవా | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| | బి] డామన్ మరియు డయ్యు | 40.0-43.5 | 24 | 3.0 | 0.5 |
| 10. | గుజరాత్ | | | | |
| | ఎ] ప్రత్తి ప్రాంతంకానిది | 40.0-43.5 | 24 | 3.0 | 0.5 |
| | బి] ప్రత్తి ప్రాంతం | 41.5-45.0 | 21 | 3.0 | 0.5 |
| 11. | హర్యానా | | | | |
| | ఎ] ప్రత్తి ప్రాంతంకానిది | 40.0-43.0 | 28 | 3.0 | 0.5 |
| | బి] ప్రత్తి ప్రాంతం | 40.0-43.0 | 28 | 3.0 | 0.5 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 12. | హిమాచల్ ప్రదేశ్ | 40 0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 13. | జమ్ము మరియు కాశ్మీర్ | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 14, | కర్నాటక | | | | |
| | ఎ] బెల్గాం జిల్లాగాక | 40.0-43.0 | 24 | 3.0 | 0.5 |
| | బి] బెల్గాం జిల్లా | 40.0-41.0 | 26 | 3.0 | 0.5 |
| 15. | కేరళ | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 16. | లక్ష ద్వీపములు | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 17. | మధ్య ప్రదేశ్ | | | | |
| | ఎ] ప్రత్తి ప్రాంతంకానిది | 40.0-44.0 | 26 | 3.0 | 0.5 |
| | బి] ప్రత్తి ప్రాంతం | 40.5-45.0 | 21 | 3.0 | 0.5 |
| 18. | మహారాష్ట్ర | | | | |
| | ఎ] ప్రత్తి ప్రాంతంకానిది | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| | బి] ప్రత్తి ప్రాంతం | 41.0-45.0 | 21 | 3.0 | 0.5 |
| 19. | మనిపూర్ | 20.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 20, | మేఘాలయ | 40.0-43.8 | 26 | 3.0 | 0.5 |
| 21. | మిజోరాం | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 22. | నాగాలాండ్ | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 23. | ఒరిస్సా | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 24. | పాండిచ్చేరి | 40.0-44.0 | 26 | 3.0 | 0.5 |
| 25. | పంజాబ్ | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 26. | రాజస్థాన్ | | | | |
| | ఎ] జోధపూర్ డివిజన్‌కాక | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| | బి] జోధపూర్ డివిజన్ | 41.5-45.0 | 21 | 3.0 | 0.5 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 27. | తమిళనాడు | 41.0-44.0 | 24 | 3.0 | 0.5 |
| 28. | త్రిపుర | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 29. | ఉత్తరప్రదేశ్ | 40.0-43.0 | 26 | 3.0 | 0.5 |
| 30. | పశ్చిమ బెంగాల్ | | | | |
| | ఎ] విష్ణుపూర్ సబుడివిజన్ కాక | 40.0-43.0 | 28 | 3.0 | 0.5 |
| | బి] విష్ణుపూర్ సబ్ డివిజన్ | 41.5-45.0 | 21 | 3.0 | 0.5 |
| 31. | సిక్కిం | 40.0-43.0 | 28 | 3.0 | 0.5 |

వివరణ : ప్రత్తి [Cotton tract areas] ప్రాంతం అనగా పశువులు ప్రత్తి గింజలతో విస్తారముగా మేపబడు మరియు సంబంధించిన రాష్ట్రప్రభుత్వ ముచే అట్లు ప్రకటించబడిన ప్రాంతము,

జి. ఎస్. ఆర్. 579 [ఇ] 13-10-80 సవరణ ప్రకారము.

ఎ. 12 : మార్గరైన్

అనగా తినదగు నూనెలను మరియు కొవ్వులను నీటితో కలిపిన ద్రవము అతి మురుగు వాసన, కలుపబడిన రంగు లేక రుచిని కలిగించు పదార్థములు ఖనిజ నూనె మరియు జంతు శరీరముల కొవ్వులు లేనిదై ఉండవలెను. 2.5 శాతమునకు మించ కుండా ఉప్పు, 0.02 శాతం గరిష్ట పరిమితివరకు అనుమతింప బడిన ఎమల్సీకరణులు మరియు స్థిరత్వకారకములు మరియు బ్యూటిలైటెడ్ — హైడ్రాక్సీ అని సోల్ (బి. హెచ్. ఎ)2 శాతం ఉంతవచ్చును. అది ఈ క్రింద చూపబడిన ప్రమాణములకు అనుగుణంగా ఉండవలెను.

1. కొవ్వు - 80శాతము (ద్రవ్యము/ద్రవ్యము) నకు తగ్గకుండా
2. తేమ—12 శాతము తగ్గకుండా మరియు 16 శాతము ద్రవ్యము/ద్రవ్యము)నకు మించకుండా

3. విటమిన్ ఎ — అమ్మిన కాలంలో ఒక గ్రాము పదార్థమునకు 30.I.U తగ్గకుండా
4. నిష్కర్షించబడిన కొవ్వు ద్రవీభవస్థానము 30°C—37° C (క్యాపిలరీ స్లిప్ పద్ధతి)
5. నిష్కర్షించబడిన కొవ్వు యొక్క సపోనిఫై కాని పదార్థం — బరువున 1. 5 శాతం మించకుండా
6. నిష్కర్షించ బడిన కొవ్వు యొక్క కొవ్వు ఆమ్లములు (ఓలిక్ ఆమ్లంగా) బరువున 0.25 శాతం మించకుండా

లేక ఆమ్లపు విలువ — 0.5 శాతం మించకుండా

తూకములో 5శాతము తగ్గకుండా నూవుల నూనెను కలిగి యుండవలెను. అయితే వేరు చేసిన కొవ్వును 20:80 నిష్పత్తిలో శుద్ధి చేయబడిన వేరు శనగ నూనెను కలిపి బౌడోయిన్ పరీక్ష చేసినపుడు వచ్చిన ఎరుపు రంగు లోవిబాండ్ స్కేలుపై ఒక సె. మి. సెల్ లో 2.5 ఎరుపు యూనిట్ల కంటే పలచన కాకుండు నంత ఉండవలెను. [జి. యస్ ఆర్ 245 (2) 11. 3. 82 లేదీ సవరణ ప్రకారం చేర్చబడినది.]

గమనిక :- మార్గరైన్ తయారీలో వాడు నూనెలు విజిటేబల్ ఆయిల్ ప్రొడక్ట్సు ఆర్డరు 1947 లో వనస్పతి తయారికి సూచించ బడిన నూనెలు మాత్రమే అయి ఉండవలెను.

ఎ. 13 : (తొలగించబడినది)

ఎ. 14 : టీ

అనగా కాంగ్రా టీ కాకుండా కేవలం 'కామిలియం' కుటుంబము మరియు తేయాకు జాతికి చెందిన మొక్కల ఆకులు, మొగ్గలు, మరియు లేత కాండములనుండి పొంది తేయాకు (i) (ఆకు, (ii) విరిగిన, [Broken] (iii) చెరిగిన [Fanning] మరియు (iv) పొడితో [Dust] సహా, అది ఈక్రింది ప్రమాణములకు అనుగుణముగా ఉండవలెను.

| | |
|---|---|
| ఏ. 100°c వద్ద స్థిర భారమునకు పొడిచేసిన టీ పై నిర్ణయించబడిన మొత్తం భస్మము ( ) | బరువున 4.0నుండి 8.0 శాతము (పొడి లెక్కన) |
| బి, మరగు స్వేదన జలములో కరగు మొత్తము భస్మము | మొత్తము భస్మంలో 40.0 శాతమునకు తగ్గకుండ |
| సి. హైడ్రోక్లోరిక్ ఆమ్లంలో కరుగని భస్మము | 1.1 శాతము మించ-కుండా (పొడి లెక్కన) |
| డి. 100°C వద్ద స్థిరభారమునకు పొడిగా చేయబడిన) పొడి టీ 100 భాగముల స్వేదనజలంతో 1 గంట రిఫ్లెక్స్ క్రింద మరుగ బెట్టగా లభించిన ధృతి | 32 శాతమునకు తగ్గకుండా |
| ఇ. కరుగు భస్మముయొక్క క్షారత్వము | పొడి లెక్క 2° అని తెలియ పరిచిన] 1.0 శాతమునకు తగ్గ కుండ మరియు 2.2 శాతమునకు మించకుండ |
| యఫ్, ముతక నార 100° C పై స్థిరభారమునకు పొడిగాచేసి పై నిర్ణయించ బడిన | 17 శాతమునకు మించ కుండ |

దానిలో కలుప బడిన వాటి రంగు పదార్థము లేక రుచి కారకములు ఉండ రాదు, అయితే ఎగుమతి కొరకు టీ, రూలు 42 సబ్ రూల్ [పై] లో నిర్దేశించబడిన విధంగా సరియైన లేబిల్‌తో కలుపబడిన రుచి, వాసన కలిగియుండ వచ్చును. అంతే గాక రుచి సువాసన కలుపబడిన తేయాకు తయారీలో వాడబడిన తేయాకు టీ యొక్క ప్రమాణములకు అనుగుణంగా ఉండవలెను.

జి. యస్. ఆర్ 843 [2] 19. 11. 83 సవరణ ప్రకారం చేర్చబడినది

ఎ. 14 : 01 : కాంగ్రా టీ

అనగా హిమాచల ప్రదేశ్‌లోని కంగ్రా మరియు మండ్ లోయలో పెంచబడు కమేలియా సైనేన్‌సిస్ లేదా కామేలియా మొక్కల ఆకులు, మొగ్గల మరియు లేత కాండముల నుండి పొందిన టీ. ఇది ఈ క్రింది ప్రమాణములకు అనుగుణంగా ఉండవలెను.

| | |
|---|---|
| ఎ. స్థిర భారమునకు 1000ం॰ వద్ద పొడిగాచేసిన టీ పై నిర్ణయించబడిన మొత్తం భస్మం | బరువున 5. నుండి 8.0 శాతము వరకు పొడి లెక్కన, |
| బి. మరుగు స్వేదనజలంతో కరుగు మొత్తం భస్మము | మొత్తము భస్మంలో 33 శాతమునకు తగ్గకుండా |
| సి. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరగని భస్మము | బరువున 1.2 శాతమునకు మించకుండా పొడిలెక్కన |
| డి. ఎండు టీని స్థిర భారమునకు 1000° C వద్ద ఎం 100 భాగముల స్వేదన జలంతో 1 గంట రిఫ్లెక్స్ క్రింద మరుగ బెట్టగా వచ్చిన ధృతి | 23 శాతమునకు తగ్గకుండా |
| ఇ. కరుగు భస్మము యొక్క క్షారత్వము | [పొడి లెక్కన]$K_2O$ అని చెప్పబడిన] 1.0శాతము నకు తగ్గకుండా మరియు 2.2 శాతమునకు మించకుండ |

యన్. మూతుక [నార 1000° C వద్ద స్థిర 1.8 శాతమునకు
భారమునకు పొడిగా చేయబడిన టీ పై మించకుండా
నిర్ణయించిన]

అది కలుప బడిన రంగు పదార్థము కాని రుచికారకము గాని కల్గియుండరాదు.

అయితే, కాంగ్రా టీ అవునా కాదా అనే సూచన లేకుండా టీ అమ్మబడిన లేదా అమ్మకమునను ప్రతిపాదించ బడిన యెడల దానికి ఎ 14 లో నిర్దిష్టమైన టీ ప్రమాణములు వర్తించును.

అంతేగాక ఎగుమతి కొరకు టీ, రూలు 42 సబ్ రూలు [పై]లో నిర్దేశింప బడిన లేబిల్ ప్రకటనతో, కలుప బడిన రుచి కల్గి, యుండవచ్చును.

అంతేగాక రుచి కల్గించబడిన టీ తయారీలో వాడబడిన తేయాకు, టీ యొక్క ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

జి. యస్. ఆర్. + 1 19. 11. 83 తేదీ నవరణ ప్రకారం చేర్చ బడినది.

ఎ 15 : తినదగు ఉప్పు

(Edible common salt)

అనగా మట్టి, మెరికలు మరియు ఇతర అన్యమైన కల్తీ చేయు పదార్థములలో కంటికి కనబడు మాలిన్యములు లేని, తెలుపు లేదా లేత గులాబి, లేదా / లేత బూడిద రంగులో ఉన్న స్ఫటిక ఘన పదార్థం. దాని యొక్క పొడిగా చేయబడని శాంపిల్ బరువులో 6 శాతం కంటె ఎక్కువ తేమ కలిగి యుండరాదు దానిలో సోడియం క్లోరైడు, మరియు సోడియం క్లోరైడు కాక నీటిలో కరుగు ఇతర పదార్థములు [పొడి లెక్కన] క్రింద పట్టిక 2 వ కాలములో పేర్కొన బడినట్లు 1 వ కాలములో సంబంధించిన సమోదులో చెప్పబడిన మాన్య శాతం పరిమితిలో 2,3 వ కాలంలో పేర్కొనబడినట్లుండవలెను. నీటిలో కరగని పదార్థం, బరువున [పొడి లెక్కన] 1.0 శాతము మించరాదు.

ప ట్టి క

| మాన్యత గల కాల పరిమితి | సోడియం క్లోరైడ్ కనీస పరిమితి యన్. ఎ. సి. యల్. శాతం [పొడి లెక్కన] | సోడియం క్లోరైడు కాక, నీటిలో కరుగు యితర పదార్థముల గరిష్ఠ నిష్పత్తి [పొడి లెక్కన] |
|---|---|---|
| 31-3-82 వరకు | 94.0 | 5.0 |
| 1-4-82 నుండి 31-3-83 వరకు | 94.5 | 4.5 |
| 1-4-83 నుండి 31-3-84 వరకు | 95.0 | 4.0 |
| 1-4-84 నుండి 31-3-85 వరకు | 95.0 | 3.5 |
| 1-4-85 నుండి | 96.0 | 3.0 |

అయితే టేబల్ ఉప్పు అల్యూమినియం సిలికేట్ [ఆంటి కేకింగ్ ఏజెంటుగా] 2 శాతం గరిష్ఠ పరిమితి వరకు కలిగియుండవచ్చును. అంతేగాక అట్టి దానిలో నీటిలో కరగని పదార్థము మొత్తం 2.2 శాతం మించరాదు మరియు సోడియం క్లోరైడ్ [పొడి లెక్కన] 97 శాతం కంటె తక్కువగా ఉండరాదు.

ఎ. 15. 01 : అయోడీకృత లవణములు :

అనగా మట్టి, మెరికల మరియు ఇతర అన్యమైన కల్తీ వస్తువులు వంటి కనబడు మాలిన్యములులేని. తెలుపు, లేత గులాబీ, లేక లేత బూడిద రంగులో ఉన్న స్ఫటిక ఘన పదార్థము. దాని యొక్క ఎండబెట్టి పొడిగా చేయబడని శాంపిల్ బరువులో 6 శాతము కంటె ఎక్కువ తేమ గలిగియుండరాదు. దానిలో పొడిగా చేయబడిన బరువు ప్రాతి పదికపై బరువులో సోడియం క్లోరైడ్ కనీసం 96.0 శాతం [బి] నీటిలో కరగని పదార్థము కనీసం 3 0 శాతం, [సి] సోడియం క్లోరైడ్ కాక నీటిలో కరగు ఇతర పదార్థం 3.0 శాతం మించకుండా, మరియు

[డి] పోటాషియం అయోడైడ్ తయారీ స్థానంలో 25 - 35 పి. పి. యం. ల మధ్య, రిటైలుతో సహా పంపిణీ స్థితిలో 15 పి. పి. యం. తక్కువ గాకుండ ఉండవలెను.

జి. యస్. ఆర్. 290 (ఇ) 13-4-81 తేది సవరణ ప్రకారం మార్చబడినది.

ఎ. 15. 02: ఇనుముతో ఫోర్టిఫై (పుష్టి) చేయబడిన ఉప్పు

అనగా మట్టి మరి అన్య మాలిన్యములు, కల్తీ చేయు పదార్థముల వంటి కనబడు కాలుష్యములేని తెల్ల లేక లేత పాటల వర్ణము లేక బూడిద రంగులో నున్న స్ఫటికీకృత ఘన పదార్థము. అది క్రింది ప్రమాణములకనుగుణంగా ఉండవలెను.

| | |
|---|---|
| 1. తేమ | 5 శాతం మించకుండా [బరువున] |
| 2. నీటిలో కరుగని పదార్థము | 1 శాతం మించకుండా [పొడి బరువు లెక్కన] |
| 3. క్లోరైడ్ భాగములు [NaCl గా] | 96.5 శాతం తగ్గకుండ [ " ] |
| 4. సజల హైడ్రోక్లోరిక్ ఆమ్లములో కరుగని పదార్థం | 0.3 శాతం మించకుండా [పొడి లెక్కన I.S. 253-1970 లో పేర్కొనబడిన పద్ధతి ద్వారా నిర్ణయించబడిన] |
| 5. సోడియం క్లోరైడ్ కాక నీటిలో కరుగు ఇతర పదార్థం | 2.5 శాతం మించకుండా [పొడి బరువు లెక్కన] |
| 6. ఇనుము [Fe గా] | 850 - 1100 పి. పి. యం. |
| 7. మూలక భాస్వరము [$PO_4$ గా] | 1500 - 2000 పి. పి. యం. |
| 8. సల్ఫేట్ [$SO_4$ గా] | 1.1 శాతం మించకుండా [బరువున] |
| 9. నీటిలో కరుగు మెగ్నీషియం — | 0.10 శాతం మించకుండా (బరువున) |
| 10. 5 శాతము ద్రావణములో, నీటిలో విలువ | 2 - 3.5 |

అయితే ఫోర్టిఫైడ్ ఉప్పు అల్యూమినియం సిలికేట్‌ను యాంటికేకింగ్ ఏజెంటుగా 2.0 శాతం గరిష్ఠ ప్రమాణము వరకు కలిగి యుండవచ్చును. అట్టి సందర్భంలో నీటిలో కరుగని పదార్థం మొత్తం పొడి బరువు లెక్కన 2.2 శాతం మించరాదు.

[జి. యస్. ఆర్. 11 [ఇ] తేదీ 4-11-85 ప్రకారము చేర్చబడినది.

## ఎ. 16 ఫలాల ఉత్పత్తులు
## (Fruit products)

### ఎ. 16. 01: పండ్ల రసం

ఎ. ఒంటిగా గాని సంయోగములో గాని చక్కెర, డెక్ట్రోస్, విలోమీకృత చక్కెర, గ్లూకోసు ద్రవముల

బి. నీరు, తొక్కల నూనె, ఫ్రూట్ ఎసెన్సు, రుచి, ఉప్పు, యాస్కోర్బిక్ అమ్లం, సిట్రిక్ అమ్లం, టార్టారిక్ అమ్లం, మాలిక్ అమ్లం మరియు అనుమతించబడిన రంగుల, పరిరక్షకముల, సహితంగా గాని, రహితంగా గాని, మంచి బాగుగా పక్వము చెందిన తాజా ఫలముల నుండి పిండి తీయబడిన పులియని, గాఢత కలిగించబడని, ద్రవము, ఉత్పత్తిలో సిట్రిక్ అమ్లంగా గుణించబడిన అమ్లత్వము, స్వచ్ఛమైన నిమ్మ రసంలో లేక గుజ్జులో, 4 శాతం తగ్గకుండ, మరియు స్వచ్ఛమైన నిమ్మ రసంలో 5 శాతం తగ్గకుండ, ఇతర రసములలో 3.5 శాతం మించకుండా ఉండవలెను.

(టమాటో రసం మినహా) తీపి చేయబడిన ఫల రసములోని కరుగు ఘన పదార్థము మొత్తం 10 శాతం తగ్గరాదు. ఫార్మారిక్ అమ్లము గరిష్ఠ పరిమితి 0.5 శాతం వరకు వాడవచ్చును.

అది అనుమతించబడిన ఎమల్సీకరణులు, స్థిరత్వకారకములు రూలు 61- C లో నిర్దేశించబడినట్లుగా కలిగి ఉండవచ్చును.

* జి. యస్. ఆర్. 249 (ఇ) తేది 8-3-83 సవరణ ప్రకారం చేర్చబడినది.

### ఎ. 16. 02: టమాటో రసం

అనగా ఎ) ఉప్పు, బి) చక్కెర, డెక్ట్రోస్, లేక రెండు పొడి రూపంలో కలుపబడిన, సి) సిట్రిక్ అమ్లం మాలిక్ అమ్లం లేక యాస్కోర్బిక్ అమ్లం, డి) తో గాని లేకుండా గాని, అన్ని కాడలు మరియు అభ్యంతరకరమైన భాగములు తీసివేయబడిన పక్వమైన టమోటాలను కొంత గుజ్జును వేడిచేసి తాని చేయతగాని నీరు కలియని

ఏ పద్ధతిలోనయినా, పిండితీయబడిన డబ్బాలలో లేక సీసాలలో వేయబడిన కాంసెంట్రేట్ చేయబడని, పాశ్చరైస్డ్ రసము.

ఉప్పు లేకుండా నీటిలో కరుగు ఘనపదార్థం మొత్తం (w/w) 5 శాతంకు తగ్గరాదు.

(జి. యస్. ఆర్. 764 (ఇ) 15-11-84 ద్వారా తొలగించబడినది.)

అది అనుమతించబడిన ఎమల్సీకరణులు స్థిరత్వకారకములు కూడ రూలు 61-సి లో నిర్దేశించబడిన ప్రకారం కలిగియుండవచ్చును.

(జి. యస్. ఆర్. 249 (ఇ) 8-3-83 తేది సవరణ ప్రకారం చేర్చబడినది )

16. 03 : ఫ్రూట్ సిరప్

అనగా

ఎ. నీరు, తొక్కల నూనె, ఫ్రూట్ ఎస్సెన్సులు, మరియు రుచులు, ఉప్పు

బి. సిట్రిక్ ఆమ్లం. యాస్కోర్బిక్ ఆమ్లం

సి. అనుమతించబడిన పరిరక్షకములు మరియు రంగులతోగాని, లేకుండ గాని

చక్కెర, డెక్స్ట్రోస్, విలోమీకృత చక్కెర, గ్లూకోస్ ద్రవం ఒంటిగా గాని, సంయోగములోగాని గల తీపిచేయబడిన ఫలరసం.

కరుగు ఘనపదార్థముల మొత్తం (W/w) 65 శాతమునకు తగ్గరాదు. ఉత్పత్తిలో ఫలరసం యొక్క శాతం కనీసం 25 [W/w] ఉండవలెను.

అది అనుమతించబడిన ఎమల్సీకరణులు. స్థిరత్వకారకములు కూడ రూలు 61-సి లో నిర్దేశించబడిన ప్రకారం కలిగియుండవచ్చును.

(జి. యస్. ఆర్. 249 [ఇ] 8-3-83 తేది సవరణ ప్రకారం చేర్చబడినది)

ఎ. 16. 04 : ఫ్రూట్ స్క్వాష్

అనగా ఎ) నీరు, తొక్కల నూనె, ఫ్రూట్ ఎస్సెన్సులు, మరియు రుచులు, ఉప్పు, బి) సిట్రిక్ ఆమ్లం, యాస్కోర్బిక్ ఆమ్లం, సి) అనుమతించబడిన పరిరక్షకములు, మరియు రంగులు కలిగి గాని, లేకుండ గాని

చక్కెర, డెక్స్ట్రోస్, విలోమీకృత చక్కెర లేక గ్లూకోస్ ద్రవం ఒంటిగాగాని, సంయోగములోగాని కలిగియుండి మంచి పక్వమైన పండ్లగుజ్జు, పిండి తీయబడిన రసం.

ఉత్పత్తిలో కరుగు పదార్థము మొత్తము (w/w) 10 శాతము తగ్గరాదు.

ఉత్పత్తి ఫలరసం యొక్క శాతం 25.0 (w/w) తగ్గరాదు.

అది అనుమతించబడిన ఎమల్సీకరణులు, స్థిరత్వకారకములు కూడ రూలు 61-సి లో నిర్దేశించబడిన ప్రకారం కలిగియుండవచ్చును.

జి. యస్. ఆర్. 249 (ఇ) 8-3-83 తేది సవరణ ప్రకారం చేర్చబడినది.

ఎ. 16. 05 : 'ఫ్రూట్ డ్రింక్'

అనగా—

ఎ. నీరు, తొక్కల నూనె, ఫ్రూట్ ఎస్సెన్సులు, మరియు రుచులు, ఉప్పు.

బి. సిట్రిక్ ఆమ్లం, యాస్కోర్బిక్ ఆమ్లం

సి. అనుమతించబడిన పరిరక్షకములు, మరియు రంగులు కలిగి గాని, లేకుండగాని

చక్కెర, డెక్స్ట్రోస్, విలోమీకృత చక్కెర లేక, గ్లూకోస్ ద్రవం ఒంటిగా గాని, సంయోగములోగాని గలతీపిచేయబడిన ఫలరసం మరియు నీటినుండి తయారు చేయబడినట్లు చెప్పబడిన పానీయం.

ఉత్పత్తిలో కరుగు ఘనపదార్థముల మొత్తం (w/w) 10 శాతంకు తగ్గరాదు.

ఉత్పత్తిలో, ఫలరసం యొక్క శాతం 25.0 (w/w) కు తగ్గరాదు.

అది అనుమతించబడిన ఎమల్సీకరణులు. స్థిరత్వకారకములు కూడ రూలు 61-సి లో నిర్దేశించబడిన ప్రకారం కలిగియుండవచ్చును.

జి. యస్. ఆర్. 249 (ఇ) 8-3-83 తేది సవరణ ప్రకారం చేర్చబడినది.

ఎ. 16.06 : టమాటో సాస్ టమాటో కెచప్ టమాటో రెలిష్, లేక టమాటో సాస్ యొక్క ఒక రూపమని భావము తెల్పు ఏ యితర పేరు పెట్టబడినదయినా—

ఎ. చక్కెర, ఉప్పు, వినిగార్, ఎసిటిక్ ఆమ్లం, ఉల్లి, వెల్లుల్లి సుగంధ ద్రవ్యములు

బి. సిట్రిక్ ఆమ్లము, యాస్కోర్బిక్ ఆమ్లము

సి. అనుమతించబడిన పరిరక్షకములు—
కలిగి గాని లేకుండా గాని. మంచి పక్వమైన టమాటోలనుండి తయారు చేసినదై యుండవలెను.

ఉత్పత్తి తోలు, గింజలు లేనిదై యుండవలెను. 37° C వద్ద 15రోజులు ఇన్‌క్యుబేటరులో ఉంచగా పులియు చిహ్నము చూపరాదు. బూజుల సంఖ్య పరీక్షచేసిన దానిలో 40 శాతం మించరాదు. ఈస్ట్ మరియు స్పోరులు 1/60 సి. యం. యం. కు 125 దాటరాదు. బాక్టీరియా సంఖ్య 1 సి సి. కు 100 మిలియను దాటరాదు.

ఎసిటిక్ ఆమ్లము రూపములో ఆమ్లత్వం 1.0 శాతం మరియు కరుగు ఘనపదార్థము మొత్తం (w/w) 25 శాతము తగ్గరాదు. అది ఏ ఇతర శాక పదార్థము కలిగియుండరాదు.

అది అనుమతించబడిన ఎమల్సీకరణులు. స్థిరత్వకారకములు కూడ రూలు 61-సి లో నిర్దేశించబడిన ప్రకారం కలిగియుండవచ్చును.

జి. యస్. ఆర్. 249 (ఇ) 8-3-83 తేది సవరణ ప్రకారం చేర్చబడినది.

ఎ. 16. 07 : 'జామ్'

అనగా

ఎ. సిట్రిక్, మాలిక్, యాస్కోర్బిక్ ఆమ్లం

బి. అనుమతించబడిన పరిరక్షకములు, రంగులు

పి. పండ్లనుండి లభించిన పెక్టిన్‌లు, కలిగిగాని లేకుండ
గాని, తాజా పండ్లను డబ్బాలలో నిల్వ ఉంచిన పండ్లు, శుష్కఫలాలు లేక పండ్ల గుజ్జును నీరు, చక్కెర, డెక్స్ట్రోస్, విలోమీకృత చక్కెర లేక గ్లూకోజ్ ద్రవముతో ఒంటిగా గాని, డి. సంయోగములోగాని తగు స్థిరత్వము వరకు మరుగబెట్టగా తయారైనది.

కరగు ఘన పదార్ధములు (W/w కనీసం 68 శాతం ఉండవలెను.

జామ్ —

ఎ. పండ్లు. 45 శాతం (స్ట్రా బెర్రీ లేక రాస్ బెర్రీ)ం విషయంలో 25 శాతమునకు తక్కువ.

బి. పై చెప్పబడినవి మినహా తీపిచేయు పదార్థము.

సి. సహజ అమ్లత్వంలో లేక పెక్టిన్ భాగములో లోటును భర్తీచేయుటకు సరియగు పరిమాణములో తప్ప ఆపిల్ లేక రుబార్బ్.

డి. టార్టారిక్ ఆమ్లం.

ఇ. అగర్ లేక జెలాటిన్ — కలిగియుండరాదు.

తుప్పెలు లేనిదై యుండవలెను.

శుష్కఫలాలు వాడినప్పుడు లేబిల్‌పై విశదంగా ప్రకటించబడవలెను.

ఆది అనుమతించబడిన ఎమల్సికరణిలు, స్థిరత్వకారకములు కూడ రూలు 61 సి లో నిర్దేశించబడిన ప్రకారం కలిగి యుండవచ్చును.

జి. ఎస్. ఆర్. 249 [ఇ] ప్రకారం 8-3-83 తేదీ సవరణ ప్రకారం చేర్చబడినది.

ఎ. 16. 03

[జి, ఎస్. ఆర్. 992 తేది 4-6-71 తొలగించబడినది],

ఎ. 16. 09 : మార్మలేడ్
(Marmalade)

ఎ. సిట్రిక్ ఆమ్లం, టార్టారిక్ ఆమ్లం లేక యాస్కోర్బిక్ ఆమ్లం.

బి. నిమ్మరసము కలిగిన వాడబడిన పండ్లకిలో సహజమైన ఆమ్లత్వలోటును భర్తీ చేయుటకు తగిన పరిమాణములో ఆమ్ల భాగము కలిగియుండినది

గాని, లేనిదిగాని, పేరు చెప్పబడిన సిట్రస్ ఫలముయొక్క తొక్క, గుజ్జు, రసము, నీరు, చక్కెర. డెక్ట్రోస్, విలోమీకృత చక్కెర, గ్లూకోస్ ద్రవం ఒంటిగాగాని, సంయోగములోగాని తగిన స్థిరత్వము అనగా (consistency) వరకు మరుగబెట్టగా వచ్చిన ఉత్పత్తి.

అది అనుమతించబడిన పరిరక్షకములు, రంగులు ఏదైన పండునుంచి లభ్యమైన పెక్టిన్ కలిగియుండవచ్చును. అది చెప్పబడిన పండు 45 శాతం తగ్గకుండా కలిగియుండవలెను. కరుగు ఘన పదార్థముల మొత్తము (W/w) 65 శాతం తగ్గరాదు.

అది అనుమతించబడిన ఎమల్సీకరణులు. స్థిరత్వకారకములు కూడ రూలు 61 సి లో నిర్దేశించబడిన ప్రకారం కలిగియుండవచ్చును.

జి. ఎస్. ఆర్. 249 [ఇ] 8-3-83 తేది/సవరణ ప్రకారం మార్చబడినది.

ఎ. 16. 10 :

[జి. ఎస్. ఆర్. 992 తేది 4-6-71 ప్రకారం తొలగించబడినది.]

ఎ. 16. 11: 'ఫ్రూట్ చట్నీ'

అనగా మంచి ఆరోగ్యకరమైన పండ్ల నుండి మసాలాలు, ఉప్పు, ఉల్లి, వెల్లుల్లి, చక్కెర, వెనిగార్ లేక ఎసిటిక్ ఆమ్లములతో తయారుచేయబడినది. మరియు (అది) 50 శాతము తగ్గకుండా కరుగు ఘనపదార్థం మొత్తం (W/w) కలిగియుండవలెను. అనుమతించబడిన పరిరక్షకములు కలిగియుండవచ్చును. తయారయిన పదార్థంలో పండు శాతం కనీసం 40 కి తగ్గరాదు. పదార్థము యొక్క ఆమ్లత్వం (ఎసిటిక్ ఆమ్లంగా చెప్పబడినది) బరువున 0.75 శాతం తగ్గక 2.0 శాతం మించక ఉండవలెను. భస్మము భాగము 5.0 శాతం మించరాదు.

అది అనుమతించబడిన ఎమల్సీకరణులు. స్థిరత్వకారకములు కూడ రూలు 61-C లో నిర్దేశించబడిన ప్రకారము కలిగియుండవచ్చును

జి. ఎస్. ఆర్. 249 (ఇ) తేది 8-3-83 సవరణ ప్రకారం మార్చబడినది.

## ఎ. 16. 12: సాస్
## (Sauce)

అనగా కీటకములు సిలేంద్రము లేక పండు లేక శాకము యొక్క నాణ్యతకు భంగము కలిగించునవిలేనిదై, ఏ లోపంలేని, ఏదైన తగిన జాతి రకమునకు చెందిన మంచి పండు లేక శాకమునుండి తీయబడినది.

అందులో కలుపదగు పదార్థములు-పండ్లు, శాకము వాని గుజ్జు, రసం, శుష్కఫలాలు, చక్కెర, సుగంధ ద్రవ్యములు, ఉప్పు వెనిగార్, ఎసెటిక్ ఆమ్లం, సిట్రిక్ ఆమ్లం, మాలిక్ ఆమ్లం, ఉల్లి, వెల్లుల్లి. రుచి కలిగించు పదార్థములు మరియు అనుమతించబడిన పరిరక్షకములు మాత్రమే. అది ఏకోల్తార్ రంగును కలిగియుండరాదు.

కరుగు ఘనపదార్థముల మొత్తం, కనీసం 15 శాతం తగ్గరాదు. ఎసిటిక్ ఆమ్లముగా మొత్తం ఆమ్లత్వము 10 శాతము తగ్గరాదు,

స్థిరత్వకారకములు కూడ రూలు 61 సి లో నిర్దేశించబడిన ప్రకారం కలిగి యుండవచ్చును.

జి. ఎస్. ఆర్. 249 (ఇ) 8-3-83 తేది సవరణ ప్రకారం మార్చబడినది.

## ఎ. 16. 13: మసాలా సాస్
## (Spices based sauce)

అనగా మిర్చి సాస్‌వంటి ఒకటిగాగాని, సంయోగములోగాని ఏదైన తగిన రకపు సుగంధ ద్రవ్యముల నుండి లభించిన పదార్థము. అట్టి సుగంధ ద్రవ్యములు మంచిగా, సిలేంద్రములు లేక కీటకముల దాడి లేనివై ఉండవలెను. కలుపదగిన పదార్థములు, తాజా లేక యెండిన మసాలాలు చక్కెర, ఉప్పు, వెనిగార్ ఎసిటిక్ ఆమ్లం, సిట్రిక్ ఆమ్లం, ఫ్యూమరిక్ ఆమ్లం, ఉల్లి, వెల్లుల్లి, రుచి కారకములు అనుమతించబడిన పరిరక్షకములు అనుమతించబడిన స్థిరత్వ, ఎమల్సీకరణ కారకములుమాత్రమే. అది 'కారమెల్' కలిగియుండవచ్చును. కాని ఏ కోల్ తారు ఆహార రంగులు కలిగియుండరాదు. అది కొద్దిగా శాకము, పండ్లు, గుజ్జు, రసం కూడా కలిగియుండవచ్చును.

ఎసిటిక్ ఆమ్లంగా, మొత్తం ఆమ్లత్వ విలువ, 10 శాతము తగ్గరాదు; మరియు కరుగు ఘన పదార్థముల మొత్తం బరువున 10.0 శాతం తగ్గరాదు.

## ఎ. 17 : తినదగు నూనెలు
## (Edible oils)

### ఎ. 17. 01 : కొబ్బరి నూనె,
### (Coconut oil)

అనగా ( *Cocos nucifera* ) కాయల అంతర్భాగము Kernel నుండి లభించిన కొబ్బరి పిండి తీయబడిన నూనె. అది మురుగువాసన, నిక్షేపితమయిన లేక యితర అన్య పదార్థము, వేరుపరచబడిన నీరు కలుపబడిన రంగు, రుచి, పదార్థములు, లేక ఖనిజ నూనె లేనిదై స్ఫుటంగా యుండవలెను. అది యీ క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

| | | | |
|---|---|---|---|
| ఎ. | 40° సి వద్ద బ్యూట్రో రిఫ్రాక్టో మీటరు విలువ | — | 34.0 35.5 శాతము |
| బి. | సపోనిఫికేషను విలువ | — | 25 శాతము |
| సి. | అయోడిన్ విలువ | — | 7.5 -10.0 శాతము |
| డి. | పోలెన్ స్కీ విలువ | — | 13. శాతము మించకుండా |
| ఇ. | ఓలిక్ ఆమ్లంగా, స్వేచ్ఛా కొవ్వు ఆమ్లం | — | 3 శాతము మించకుండా |

### ఎ. 17. 02 : ప్రత్తి గింజల నూనె
### (Cotton seed oil)

(అనగా – మంచి, శుభ్రమైన పొట్టు తీయబడిన ప్రత్తి Gossypyum జాతి) గింజల నుండి తీయబడిన శుద్ధిచేయబడి, నిర్మలీకరణము చేయబడిన నూనె. అది మురుగు వాసన, నిక్షేపితమైన లేక ఇతర అన్య పదార్థములు, వేరుపరచబడిన నీరు, కలుపబడిన రంగు, రుచి పదార్థములు, లేక ఖనిజ నూనె లేనిదై స్ఫుటముగా ఉండవలెను. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుంతవలెను.

| | | | |
|---|---|---|---|
| ఎ | 40° సి వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | — | 55.6 నుండి 60,2 |
| బి. | సపోనిఫికేషను విలువ | — | 190 నుండి 198 |
| సి. | అయోడిన్ విలువ | — | 98 నుండి 112 |

డి. సపోనిఫై కానిపదార్థం — 1.5 శాతంమించకుండా
ఇ. ఒలిక్ ఆమ్లంగా కొవ్వు ఆమ్లం — 1.0 శాతంమించకుండా
యఫ్. వడగట్టబడిన శాంపిల్‌ను 24 గంటలు 30°C వద్ద ఉంచగా చిక్కగా కారాదు.

ఎ. 17. 03: వేరుశనగ నూనె (మూంగ్ ఫల్లీ కా తేల్)

(Groundnut oil)

అనగా శుభ్రమైన మంచి వేరు శనగ పప్పు నుండి (Arachis hypogoes) పిండి తీయబడినది. అది మురుగువాసన నిక్షేపితమైన లేక ఇతర అన్య పదార్థము వేరు చేయబడిన నీరు, కలుపబడిన రంగు, రుచి పదార్థములు లేక ఖనిజ నూనె లేనిదై స్పుటంగా యుండవలెను. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

ఎ. 40°C వద్ద బ్యుట్రో రిఫ్రాక్టో మీటరు విలువ — 54.0 నుండి 57.1
బి. సపోనిఫికేషను విలువ — 188 నుండి 196
సి. అయోడిన్ విలువ — 85 నుండి 99
డి. సపోనిఫై కాని పదార్థం 1.0 శాతం మించకుండ
ఇ. ఓలిక్ ఆమ్లంగా కొవ్వు ఆమ్లం — 3 శాతం మించకుండ
యఫ్. బెలియర్ పరీక్ష — 39° - 41°సి

ఎ. 17. 04: అవిసె నూనె

(Linseed oil)

అనగా శుభ్రమైన మంచి *(Linum usitatissium)* అవిసె గింజల నుండి పిండి తీయబడిన నూనె. అది మురుగువాసన, నిక్షేపితమైన లేక యితర అన్య పదార్థము, వేరు చేయబడిన నీరు, కలుపబడిన రంగు, రుచి పదార్థములు, లేక ఖనిజముల నూనె లేనిదై స్పుటంగా యుండవలెను. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

ఎ. 40°సి వద్ద బ్యూట్రో రిఫ్రాక్టో మీటరు విలువ — 69.5 — 74.3
బి. సపోనిఫికేషను విలువ — 188 — 195
సి. అయోడిన్ విలువ — 170 తక్కువగాకుండా
డి. పదార్థం సపోనిఫై కాని — 1.5 శాతం మించకుండా
ఇ. ఓలిక్ ఆమ్లంగా కొవ్వు పదార్థం — 2 శాతం మించకుండా

ఎ. 17. 05: ఇప్పనూనె

(Mahua oil)

అనగా శుభ్రమైన మంచి ఆరోగ్యకరమైన మధుకా *(Bassia latifolia)* లేక *B, langi folia* లేక రెంటి మిశ్రమము)ల గింజలు లేక పప్పుల నుండి పిండితీయబడిన నూనె. అది ముదుగువాసన, నిక్షేపితమైనలేక ఇతర అన్యపదార్థములు వేరు చేయబడిన నూనె కలుప బడిన రంగు లేక రుచి పదార్థము లేక ఖనిజనూనె లేనిదై స్ఫుటముగా యుండవలెను. అది శుద్ధి చేయబడి క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

| | | |
|---|---|---|
| ఎ. | 40°సి వద్ద బ్యూట్రో రిఫ్రాక్టో మీటరు విలువ | — 49.5 - 52.7 |
| బి. | సపోనిఫికేషను విలువ | — 187 - 196 |
| సి. | ఐడిన్ విలువ | — 58 - 70 |
| డి. | సపోనిఫైకాని పదార్థం | — 2.0 శాతం మించకుండ |
| ఇ. | స్వేచ్ఛా కొవ్వు ఆమ్లములు (ఓలిక్ ఆమ్లంగా) | — 0.25 శాతం మించకుండ |

ఎ. 17. 06: ఆవ నూనె

(Rapeseed oil Mustard oil)

అనగా *Compestris juncea* లేక *Napus varieties of brassica* కు చెందిన శుభ్రమైన, మంచి ప్రత్తి గింజల నుండి పిండి తీయబడిన నూనె. అది ముదుగు వాసన. నిక్షేపితమైన లేక ఇతర అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు, కలపబడినరంగు, లేక రుచి కారకములు లేక ఖనిజ నూనె లేనిదై స్ఫుటముగా యుండవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | | |
|---|---|---|
| ఎ. | 40° C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 58.0-60.5 |
| బి. | సపోనిఫికేషను విలువ | 168-177 |
| సి. | అయోడిన్ విలువ | 96-110 పోలిబ్రోమైడ్ పరీక్ష-నెగటివ్ గా వుండెను. |

| | |
|---|---|
| డి. సపోలిపైకాని పదార్థం | బరువున 1.2 శాతం మించకుండ |
| ఇ. ఓలిక్ అమ్లంగా కొవ్వు అమ్లం | 3.2 శాతం మించకుండ |
| యఫ్. బెలియర్స్ పరీక్ష | 27.5 శాతం మించకుం |
| జి. ఆర్జిమోన్ నూనెకు పరీక్ష | నెగెటివ్ |
| హెచ్. హైడ్రోసియానిక్ అమ్లమునకు పరీక్ష | నెగిటివ్ |
| ఐ. ఆర్జిమోన్ నూనెకు పరీక్ష | నెగిటివ్ |

ఎ. 17. 07: 'ఆలివ్ నూనె'

అనగా పక్వమైన ఆలివ్ [Olea europea] ఫలాల నుండి పిండి తీయబడిన నూనె. అది మురుగు వాసన, నిక్షేపితమైన లేక యితర అన్య పదార్థము, వేరు చేయబడిన నీరు, కలుపబడిన రంగు, లేక రుచి కారకనులు లేక ఖనిజనూనె లేనిదై స్పుటముగా యుండవలెను.

అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40° C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 35.0 - 56.0 |
| బి. సపోనిఫికేషను విలువ | 185 - 196 |
| సి. ఆయోడిన్ విలువ | 79 - 90 |
| డి. సపోనిపైకాని పదార్థం | 1 0శాతం మించకుండ |
| ఇ. ఒలిక్ అమ్లంగా కొవ్వు అమ్లం | 30 శాతం మించకుండ |

ఎ. 17. 08: గసగసాల నూనె

(Poppy seed oil)

అనగా గసగసాల *Papaver somniferum* నుండి తీయబడిన నూనె. అది మురుగు వాసన. నిక్షేపితమైన లేక యితర అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు కలుపబడిన రంగు, లేక రుచి కారకములు లేక ఖనిజనూనె లేనిదై స్పుటకంగా యుండవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40°C వద్ద బ్యూట్రో-రిఫ్రాక్టోమీటరు విలువ | 60-64.0 |
| బి. సపోనిఫికేషన్ విలువ | 186-194 |
| సి. అయోడిన్ విలువ | 133-143 |
| డి. సపోనిఫై కాని పదార్థం | 1.0 శాతం మించకుండ |
| ఇ. ఓలిక్ ఆమ్లంగా కొవ్వు ఆమ్లం | 3.0 శాతం మించకుండ |

ఎ. 17. 09: పొద్దుతిరుగుడు పూవు నూనె
(Sunflower seed oil)

అనగా *Carthamus tinctorius* గింజల నుండి పిండి తీయబడిన నూనె, అది మురుగు వాసన, వినిపితమైన లేక యితర అన్య పదార్థం వేరు చేయబడిన నీరు కలుపబడిన రంగు, లేక రుచి కారకములు లేక ఖనిజ నూనె లేనిదై స్పుటముగా యుండవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 62 6 - 64.7 |
| బి. సపోనిఫికేషన్ విలువ | 186 - 196 |
| సి. అయోడిన్ విలువ | 135 - 148 |
| డి. సపోనిఫై కాని పదార్థం | 1.0 శాతం మించకుండ |
| ఇ. ఓలిక్ ఆమ్లంగా కొవ్వు ఆమ్లం | 3.0 శాతం మించకుండ |
| యఫ్. బెలియర్స్ పరీక్ష | 16°C మించకుండా |

ఎ. 17. - 10: టారామిరా నూనె
(Taramira oil)

అనగా శుభ్రమైన మంచి టార్మిరా *Eruca sativa* గింజల నుండి పిండి తీయబడిన నూనె. అది మురుగు వాసన, విక్షేపితమైన లేక ఇతర అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు కలుపబడిన రంగు, లేక రుచి కారకములు లేక ఖనిజనూనె లేనిదై స్పుటముగా యుండవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40∘C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 58.0 - 60.0 |
| బి. సపోనిఫికేషను విలువ | 174 - 177 |
| సి. అయోడిన్ విలువ | 99 - 105 |
| డి. సపోనిఫై కాని పదార్థం | 1.0 శాతం మించకుండ |
| ఇ. ఓలిక్ ఆమ్లంగా కొవ్వు ఆమ్లం | 3.0 శాతం మించకుండ |

ఎ. 17. 11: నువ్వుల నూనె

(Til oil, gingely or sesame oil)

అనగా శుభ్రమైన, మంచి నల్ల బ్రౌను, తెల్ల లేక మిశ్రమ నువ్వుల (*Sesamum indicum*) నుండి పిండి తీయబడిన నూనె. అది మురుగు వాసన. నిక్షేపితమైన లేక యితర అన్య పదార్థము వేరు చేయబడిన నీరు, కలుపబడిన రంగు, లేక రుచి కారకములు లేక ఖనిజ నూనె లేనిదై స్పుటముగా ఉండవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను

| | |
|---|---|
| ఎ. 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 58 - 61.0 |
| బి. సపోనిఫికేషన్ విలువ | 188 - 193 |
| సి. అయోడిన్ విలువ | 105 - 115 |
| డి సపోనిఫై కాని పదార్థం | 1.5 శాతం మించకుండ |
| ఇ. ఓలిక్ ఆమ్లంగా విడి కొవ్వు ఆమ్లం | 3.0 శాతం మించకుండా |
| యఫ్. బెలియర్స్ పరీక్ష | 22°C మించకుండా |

అయితే త్రిపుర, అస్సాం, పశ్చిమ బెంగాల్‌లో పెంచబడిన తెల్ల నువ్వుల నుండి తీయబడిన నూనె, క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 60.5 - 65.4 |
| బి. సపోనిఫికేషన్ విలువ | 185 - 190 |
| సి. అయోడిన్ విలువ | 115 - 120 |
| డి. ఓలిక్ ఆమ్లంగా కొవ్వు ఆమ్లం | 3.0 శాతం మించకుండ |
| ఇ. సపోనిఫై కాని పదార్థం | 2.5 శాతం మించకుండ |
| యఫ్. బెలియర్స్ పరీక్ష | 22°C మించకుండ |

ఎ. 17. 12 : 'నైగర్ గింజల నూనె'

(Niger seed oil) సోర్గియరా – కా – తేల్

అనగా శుభ్రమైన మంచి *Guizotia abyssinica* గింజల నుండి పిండి తీయబడిన తినదగు నూనె. అది మురుగు వాసన, లేక విక్షేపితమైన, ఇతర అన్య పదార్థములు, వేరు చేయబడిన నీరు కలుపబడిన రంగు, రుచి కారకములు, ఖనిజ మరితర నూనెలు లేనివై స్ఫుటముగా యుండవలెను. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 61.0 - 65.0 |
| బి. సపోనిఫికేషను విలువ | 188 - 193 |
| సి. అయోడిన్ విలువ | 125 - 135 |
| డి. సపోనిఫై కాని పదార్థము | 1 శాతం మించకుండ |
| ఇ. విడి కొవ్వు ఆమ్లంలు (ఓలిక్ ఆమ్లంగా) | 3.0 శాతం మించకుండ |
| యఫ్. బెలియర్స్ పరీక్ష | 2[illegible]°C మించకుండ |

ఎ. 17. 13 : సోయాబీన్ నూనె

(Soyabean oil)

అనగా శుభ్రమైన మంచి సోయా చిక్కుడు గింజ (*Soja max*) ల నుండి పిండి తీయబడిన, మరియు దానిలో సహజంగా ఉండు జిగురు ఎక్కువ భాగమును జల సంకలన చర్య ద్వారా మరియు యాంత్రికంగా లేక భౌతికంగా వేరు

చేయబడిన, నూనె. అది మురుగు వాసన, నిక్షేపితమైన లేక యితర అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు, కలుపబడిన రంగు, లేక రుచి కారకములు లేక ఖనిజ నూనె లేనిదై యుండవలెను. అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 61.7 - 69.5 |
| బి. సపోనిఫికేషను విలువ | 189 - 195 |
| సి. అయోడిన్ విలువ | 120 - 141 |
| డి. సపోనిఫై కాని పదార్థము | 1.5 శాతం మించకుండా |
| ఇ. స్వేచ్ఛా కొవ్వు ఆమ్లంలు(ఓలిక్ ఆమ్లంగా) | 1.25 శాతం మించకుండా |
| యఫ్. శాస్వరం | 0.02 శాతం మించకుండా |

## ఎ. 17. 14: మొక్క జొన్న నూనె [Maize (corn) oil]

అనగా శుభ్రమైన మంచి, శుద్ధి చేయబడిన మొక్కజొన్న (*Zea mays* Linn *Fam graininiae*) గింజల నుండి తీయబడిన నూనె. అది మురుగు వాసన నిక్షేపితమైన లేక యితర అన్య పదార్థము, వేరు చేయబడిన నీరు, కలుపబడిన రంగు లేక రుచి కారకములు లేక ఖనిజ నూనె లేనిదై యుండవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 56.7 - 62.5 |
| బి. సపోనిఫికేషను విలువ | 187 - 195 |
| సి. అయోడిన్ విలువ | 103 - 128 |
| డి. సపోనిఫై కాని పదార్థం [బరువున] | 1.5 శాతం మించకుంత |
| ఇ. ఓలిక్ ఆమ్లంగా విడి కొవ్వు ఆమ్లం | 1.0 శాతం మించకుంత |

ఎ. 17 15: "శుద్ధి చేయబడిన శాక నూనె"
(Refined vegetable oil)

అనగా (వత్తిడి వలన పిండి తీయబడిన, క్షారముతో తటస్థీకరించబడిన, పిల్చే మట్టి మరియు / లేక యాక్టివేటెడ్ కార్బన్‌తో విరంజనం చెందించబడిన, ఆవిరితో వాసన తీసి వేయబడిన తినదగు ఏ శాక నూనె, ఏ ఇతర రసాయన పదార్థము వాడరాదు. ఆధార పాత్ర లేబిల్‌పై ఏ నూనె నుండి శుద్ధి చేయబడినదో, స్పష్టంగా పేర్కొనబడవలెను. శుద్ధి చేయబడిన శాకనూనె క్రింద పేర్కొనబడిన ప్రమాణముల కనుగుణంగా ఉండి, అదనంగా పేర్కొనబడిన తినదగు నూనెలకు నిర్దేశించబడిన ప్రమాణములు (కొవ్వు అమ్లం తప్ప) మిగిలినవి వర్తించును. స్వేచ్ఛా కొవ్వు అమ్లము 0.25 శాతము మించక ఉండవచ్చును.

తేమ బరువున 0.10 శాతము మించరాదు.

ఎ. 17. 16: సీమ బాదం నూనె
(Almond oil)

అనగా *Prunus amygdauls Batach, var, dulcis* Koehne (తీపి సీమ బాదాం) లేక *Prunus amygdauls Batach, var, Amara Focke* (చేదు సీమ బాదాం) గింజల నుండి వేడి చేయకుండా పిండి తీయబడిన నూనె. అది మురుగు వాసన, నిక్షేపితమైన లేక యితర అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు, కలుపబడిన రంగు, లేక రుచి కారకములు లేక ఖనిజ నూనె లేనిదై యుండవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 54 - 57 |
| బి. సపోనిఫికేషను విలువ | 186 - 195 |
| సి. అయోడిన్ విలువ | 90 - 100 |
| డి. ఓలిక్ అమ్లంగా కొవ్వు అమ్లం | 3.0 శాతం మించకుండ |
| ఇ. బెల్లియర్ పరీక్ష | 60°C మించకుండ |

ఎ. 17. 17: పుచ్చకాయగింజల నూనె

అనగా పుచ్చకాయ (*Citrullus vulgaris schrad*) (*Family: Cucurbitaceae*) ఫలము యొక్క శుభ్రమైన మంచి గింజల నుండి నిష్కరింప బడిన నూనె. అది మురుగు వాసన, కల్తీ చేయు పదార్థములు, మరియు యితర అవక్షేపము, నిక్షేపితమైన, అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు, కలుపబడిన రంగు, లేక రుచి కారకములు లేక ఖనిజ నూనె లేనిదై స్పుటంగా యుండవలెను. అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. తేమ, కరుగని పదార్థం | 0.25 శాతం మించకుంట |
| బి. 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 55.6 - 61.7 |
| సి. సపోనిఫికేషను విలువ | 190 - 198 |
| డి. అయోడిన్ విలువ | 115 - 125 |
| ఇ. ఓలిక్ అమ్లంగా విడి కొవ్వు అమ్లం | 3.0 శాతం మించకుండ |
| యఫ్. సపోనిఫై కాని పదార్థం | 1.05 శాతం మించకుండ |

ఎ. 17. 18: దిగుమతి చేయబడిన ఆవనూనె

అనగా *Compestris, juncea* లేక *Brassica* కుటుంబమునకు చెందిన napus రకముల శుభ్రమైన, మంచి ఆవాల నుండి పిండి తీయబడి లేదా సాల్వెంట్ ఎక్స్ట్రాక్షన్ పద్ధతి ద్వారా తీయబడి, ఇండియాలోకి దిగుమతి చేయబడిన నూనె, లేక

బి. *Compestris, juncea* లేక *napus varieties of brassica* కుటుంబమునకు చెందిన Napus రకముల శుభ్రమైన, మంచి, దిగుమతి చేయబడిన ఆవాల నుండి, ఎక్స్ప్రెషను పద్ధతి లేదా సాల్వెంట్ ఎక్స్ట్రాక్షన్ పద్ధతి ద్వారా తీయబడిన నూనె.

సి, అది మురుగు వాసన, నిక్షేపితమైన, యితర అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు, కలుపబడిన రంగు, లేక రుచి కారకములు లేక ఖనిజ నూనె లేనిదై యుండవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 51.0 - 64.8 |
| లేక రిఫ్రాక్టివ్ సూచి | 1.4600 - 1.4690 |
| బి. సపోనిఫికేషను విలువ | 166 - 198 |
| సి. అయోడిన్ విలువ | 94 - 126 |
| డి. సపోనిఫైకాని పదార్థం | 2 శాతం మించకుండ |
| ఇ. ఆర్జిమోన్ నూనె పరీక్ష | 1 నెగెటివ్ |
| యఫ్. హైడ్రోసియానిక్ ఆమ్లం (ఫెర్రిక్ క్లోరైడు టెస్ట్) | సఫలం |
| జి. ఓలిక్ ఆమ్లంగా చెప్పబడు విడి కొవ్వు ఆమ్లం | 3.0 శాతం మించకుండ |
| హెచ్. లేత ఆమ్లం విలువ | 6.0 శాతం మించకుండ |

ఇండియాలోకి దిగుమతి చేయబడిన ఆవనూనె, లేక సాల్వెంటు ఎక్స్ట్రాక్షన్ పద్ధతిన లభించిన ఆవనూనె విడి కొవ్వు ఆమ్లం ప్రమాణముకు తప్ప ఎ. 17.15 క్రింది నిర్దేశించబడిన ప్రమాణములకు సరిపోయినప్పుడు మాత్రమే మానవ భోజనమునకు సరఫరా చేయవలెను. (ఆమ్లం విలువ 0.6 మించకుండ) విడి కొవ్వు ఆమ్లం 0.3 శాతం మించరాదు.

అదనంగా (పెన్‌స్కీ- మార్టెన్ క్లోజ్‌డ్ మెథడ్)

250°C లకు తగ్గని ఫ్లాష్‌పాయింటు కలిగియుండవలెను.

## ఎ. 17. 19 : 'పామ్ ఆయిల్'

## (Palm oil)

అనగా ఆయిల్ పామ్ (*Elaeis Guincensis*) ఫలముల మధ్య ఫల కవచములోని కండ భాగము నుండి ఎక్స్‌ప్రెషన్‌పద్ధతిలేదా సాల్వెంటు ఎక్స్ట్రాక్షన్ పద్ధతి ద్వారా తీయబడిన నూనె. అది మురుగు వాసన, నిక్షేపితమైన, యితర అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు కలుపబడిన రంగు, లేక రుచికారకములు లేక ఖనిజనూనె లేనిదై యుండవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు | 35.5 - 44.0 |
| లేక | |
| రిఫ్రాక్టివ్ ఇండెక్స్ | 1.4491 - 1.4552 |
| బి కరుగు స్థానము (కాపిలరి స్లిప్ పద్ధతి) | 37°C మించకుండ |
| సి. అయోడిన్ విలువ (వీజిస్ పద్ధతి) | 45 - 56 |
| డి. సపోనిఫకేషను విలువ | 195 - 205 |
| ఇ. సపోనిఫైకాని పదార్థం | 1.2 శాతం మించకుండ |
| యఫ్. (ఓలిక్ ఆమ్లంగా చెప్పబడు విడి కొవ్వు ఆమ్లం | 5.0 శాతం మించకుండ |
| లేక ఆమ్లం విలువ | 10.0 శాతం మించకుండ |

మానవ భోజనమునకు సరఫరా చేయకముందు, 'పామ్ ఆయిల్' శుద్ధి చేయబడవలెను. అది ఎ. 17. 15 క్రింది ప్రమాణములకు అనుగుణంగా యుండవలెను. అదనంగా అది (పెన్‌స్కీ - మార్టెన్ క్లోస్డ్ మెథడ్) 250°C లకు తగ్గని ఫ్లాష్ పాయింటు కలిగియుండవలెను.

ఎ. 17. 20 : 'పామోలిన్'

(Palmolein)

అనగా *Elaeis Guineensis* ఫలముల మధ్య ఫల కవచములోని కండ నుండి ఎక్స్‌ప్రెషను పద్ధతి లేదా సాల్వెంటు ఎక్‌స్ట్రాక్షను పద్ధతి ద్వారా పొందిన 'పామ్ ఆయిల్' యొక్క ఫాక్షనేషన్ వలన వచ్చిన ద్రవభాగము, అది మురుగు వాసన, నిక్షేపితమైన యితర అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు, కలుపబడిన రంగు, లేక రుచి కారకములు లేక ఖనిజ నూనె లేనిదై యుండవలెను.

అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ | 43.7 - 52.5 |
| లేక రిఫ్రాక్టివ్ సూచి | 1.455 - 1.4610 |

| | |
|---|---|
| బి. అయోడిన విలువ (విజ్'స్ పద్ధతి) | 54 - 62 |
| సి. సపోనిఫికేషను విలువ | 195 - 205 |
| డి. (క్లౌడ్) పాయింటు | 18°C మించకుండ |
| ఇ. సపోనిఫై కాని పదార్థం | 1.2 శాతం మించకుండ |
| యఫ్. విడి కొవ్వు ఆమ్లములు[ఓలిక్ ఆమ్లంగా చెప్పబడు] | 3.0 శాతం మించకుండ |

లేక

| | |
|---|---|
| ఆమ్లపు విలువ | 6.0 శాతం మించకుండ |

ఇంకా పామోలిన్ సాల్వెంట్ ఎక్స్ట్రాక్టెడ్ 'పామ్ ఆయిల్' నుండి తీయబడినదయితే అది మానవ భోజనమునకు సరఫరా చేయక ముందు శుద్ధిచేయబడవలెను. అది ఎ. 17.15క్రింద విధించబడిన ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

అదనంగా అది (పెన్స్కీ - మార్టెన్ - క్లోజ్ మెథడ్) 250°C కు తగ్గని ఫ్లాష్ పాయింటు కలిగియుండవలెను.

## ఎ. 17. 21: 'పామ్కర్నెల్ ఆయిల్'

అనగా ఆయిల్పామ్ చెట్టు యొక్క ఫలములలోని పప్పుల (*Eleis guineensis*) నుండి పిండి లేక సాల్వెంట్ ఎక్స్ట్రాక్షన్ తీయబడిన నూనె. అది మురుగువాసన నిక్షేపితమైన, లేక యితర అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు, కలుప బడిన రంగు, మరియు రుచి కారకములు లేక ఖనిజ నూనె లేనిదై స్ఫుటముగా యుండవలెను.

అది క్రింది ప్రమాణమున కనుగుణంగా యుండవలెను.

| | | |
|---|---|---|
| ఎ. | 40°C వద్ద బ్యూట్రో రిఫ్రాక్టో మీటరు విలువ | 35.3 - 39.5 |
| | లేక రిఫ్రెక్టివ్ సూచి | 1.4490 - 1.4520 |
| బి. | అయోడిన్ విలువ | 10 - 23 |
| సి. | సపోనిఫికేషను విలువ | 237 - 255 |

| | | |
|---|---|---|
| డి. | సపోనిఫైకాని పదార్థం | 1.2 శాతం మించకుండా |
| ఇ. | విడి కొవ్వు ఆమ్లములు | 3.0 శాతం మించకుండా |
| | లేక ఆమ్లము విలువ | 6 శాతం మించకుండా |

ఇంకా అది సాల్వెంట్ ఎక్స్ట్రాక్షన్ పద్ధతి ద్వారా లభించిన నూనె అయినచో శుద్ధి చేసిన తర్వాతనే మానవ భోజనమునకు సరఫరా చేయవలెను. అది ఎ. 17.15 క్రింద విధించబడిన ప్రమాణములకు అనుగుణంగా యుండవలెను. అదనంగా అది 250°C కు తగ్గని ఫ్లాష్ పాయింటు (పెన్స్కీ - మార్టిన్ మెథడ్) కల్గి యుండ వలెను.

ఎ. 17. 22: పొద్దుతిరుగుడు పూల గింజలనూనె

అనగా శుభ్రమైన మంచి పొద్దు తిరగుడు పూవు గింజలు లేక *Hetianthus annus Linn(Family composite)* మొక్కల కేక్‌నుండి పండి లేక సాల్వెంటు ఎక్స్ట్రాక్షన్ పద్ధతి ద్వారా లభించిన నూనె. అది మురుగువాసన, నిక్షేపితమైన లేక యితర అన్య పదార్థం, వేరు చేయబడిన నీరు కలుపబడిన రంగు, లేక రుచికారకములు లేక ఖనిజ నూనె లేనిదై స్ఫుటముగా యుండవలెను.

అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

| | | |
|---|---|---|
| ఎ. | ·0°సి వద్ద బ్యూట్రో రిఫ్రాక్టో మీటరు విలువ | 57.1 - 82.9 |
| | లేక రిఫ్రాక్టివ్ సూచి | 1.4640 - 1.4800 |
| బి. | అయోడిన్ విలువ (విజ పద్ధతి) | 100 - 145 |
| సి. | సపోనిఫికేషను విలువ | 188 - 194 |
| డి. | సపోనిఫైకాని పదార్థము | 1.5 శాతం మించకుండా |
| ఇ. | ఓలిక్ ఆమ్లంగా చెప్పబడు విడి కొవ్వు ఆమ్లం | 3.0 శాతం మించకుండా |
| | లేక ఆమ్లపు విలువ | 6.0 శాతం మించకుండా |

నూనె సాల్వెంట్ ఎక్స్ట్రాక్షన్ పద్ధతిన పొందినదయినచో శుద్ధి చేయబడిన తర్వాతనే మానవ భోజనమునకు సరఫరా చేయవలెను. అది ఐటం ఎ 17. 15 క్రింద విధించబడిన ప్రమాణములకనుగుణంగా యుండ వలెను. అదనంగా అది (పెన్స్కీ - మార్టెన్ - క్లోస్డ్ మెథడ్)—250° C కు తగ్గని ఫ్లాష్ పాయింటు కల్గియుండ వలెను.

ఎ. 17. 23 : 'తవుడు నూనె'

(Rice bran oil)

అనగా మరబట్టు ప్రక్రియలో వేరుబరచబడు, *Oryza sativa* Linn *Farm Gramineae* యొక్క వరి బియ్యము యొక్క అంతురచ్ఛదము (Ento-sprin)పై పొర,సామాన్యముగా తవుడు అను పిలువబడుదానినుండి తీయబడిన నూనె.

శుద్ధి చేయబడిన తవుడు నూనె, సాల్వెంట్ ఎక్స్ట్రాక్టెడ్ నూనె నుండి తీయబడి, క్షారముతో తటస్థీకరించబడి, బ్లీచింగ్ మట్టి లేక యాక్టివేటెడ్ కార్బన్‌తో లేక రెంటితో విరంజనం చేయబడి. ఆవిరితో వాసన తీసి వేయబడినదయి ఉండవలెను. పర్యాయంగా తటస్థీకరణ. నిరంజనం, మరియు వాసన తీసి వేయుట భౌతిక పద్ధతి ద్వారా చేయవచ్చును.

నూనె మురుగువాసన, కల్తీచేయు పదార్థములు, అవక్షేపము, నిక్షేపితమైన తేలు లేక యితర అన్య పదార్థములు వేరు చేయబడిన నీరు, కలుప బడిన రంగు, లేక రుచికారకములు లేనిదై స్ఫుటముగా యుండవలెను.

నూనె యొక్క స్ఫుటత్వము వడబెట్టబడిన శాంపిల్ 35° C వద్ద 24 గంట లుంచగా మడ్డి లేకపోవుటను బట్టి నిర్ణయించ బడవలెను. తవుడు నూనె శుద్ధిచేసిన తరువాతనే మానవ భోజనముకు అమ్మవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

ఎ. తేమ మరియు కరుగని మలినములు—బరువున 0.1 శాతం మించకుండా

బి. 40° C వద్ద రిఫ్రాక్టివ్ సూచి 1.4600—1.4700

లేక బ్యూట్రో రిఫ్రాక్టోమీటరు విలువ 51.0-60 4

సి. సపోనిఫికేషను విలువ 180-195

డి. అయోడిన్ విలువ (విజ్ పద్ధతి) 90-105

ఇ. (ఓలిక్ ఆమ్లంగా)విడి కొవ్వు 0.25 శాతం మించకుండా

ఆమ్లం లేక బరువున 0.5 శాతం మించకుండా

యఫ్. సపోనిఫై కాని పదార్థము　　　　3.0 శాతం మించకుండా

జి. ఫ్లాష్ పాయింటు (పెన్‌స్కీ మార్టిన్ 250° C తగ్గకుండా క్లోజ్డ్ మెథడ్)

గమనిక:- ఐటమ్ ఎ. 17 క్రింద పేర్కొనబడిన తినదగు నూనెలు ఆముదపు నూనె లేనివై ఉండవలెను.

ఎ. 18 : ధాన్యములు :

Cereals

ఎ. 18. 01 : ఆటా గోధుమపిండి

(Atta)

గోధుమలు మరబట్టబడి గాని, నూరగా గాని లభించిన మృతక పదార్థము. అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

ఎ. తేమ 14.0 శాతం మించకుండా　(130° - 133° C వద్ద 2 గంటలు వేడి చేసి నిర్ణయించగా)

బి. మొత్తం భస్మం 2.0 శాతం మించకుండా　(పొడి బరువు లెక్కన)

సి. సజల హైడ్రోక్లోరికామ్లంలో కరుగని భస్మము　0.15 శాతం మించకుండా (పొడి బరువు లెక్కన)

డి. బంక　6 శాతం తగ్గకుండ (పొడి బరువు లెక్కన)

ఇ. ఆల్కహాలు ఆమ్లత్వం (90 శాతం ఆల్కహాలులో)　$H_2SO_4$ గా చెప్పబడినది. — 0. 18 శాతం మించకుండ (పొడి లెక్కన)

ఎలుకల పెంట్రుకలు, మలములు కి. గ్రా.కు రెండు దాటరాదు.

ఎ. 18. 01. 01: ఫార్టిఫైడ్ ఆటా

అనగా గోధుమ పిండి ఏ ఒకటిగాని ఎక్కువగాని క్రింది వస్తువులు కలుపగా వచ్చిన పదార్థము,

ఎ. కాల్షియం కార్బొనేటు (తయారు చేయబడిన చాక్)సామాన్యంగా క్రేటా ప్రిపరేట. అని పిలువబడునది.)

బి. ఇనుము; సి. థైమీన్; డి. రిబోఫ్లెవైన్; ఇ నైసిన్

ఫార్టి ఫికేషన్ కొరకు కాల్షియం కార్బొనేటు పొడరు వాడినచో, బరువులో 100 భాగముల ఫార్టిఫైడ్ ఆటా లో 0 3 కు తగ్గకుండా, 0.30 భాగములకు మించ కుండా కాల్షియం కార్బొనేటు ఉండునట్టి పరిమాణములో వాడవలెను.

ఎ. 18. 01. 02: 'పౌష్టిక ఆటా'

(Protein rich (paushtik) Atta)

అనగా గోధుమపిండి (ఆటా)లో వేరుశనగ పిండి 10 శాతం వరకు కలుపగా తయారైన ఉత్పత్తి. అది క్రిమి కీటకముల లేక సిలీంద్రము, వాసన, మురుగు రుచి లేనిదై యుండవలెను. అది కలుపబడిన రుచికారకములు, రంగులు లేక యితర అన్య పదార్థములు కల్గియుండరాదు. అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండ వలెను.

ఎ. తేమ —14.0 శాతం మించకుండా అనార్ద్ర భారాన్నిబట్టి)

బి. మొత్తం భస్మము —2. 76 " "

సి. సజల హైడ్రో.క్లో.ఆ.లో కరుగని భస్మము 0.1 "

డి. మొత్తం ప్రోటీన్ (N×6.25) 12.5 శాతం తగ్గకుండా "

ఇ. ముతకనారు — 2.5 శాతం మించకుండా (అనార్ద్రభారాన్నిబట్టి)

ఎఫ్. ఆల్కహాలిక్ అమ్లత్వము —
[90 శాతం ఆల్కహాలులో —
$H_2$ $SO_4$ గా చెప్పబడినది] — 0.12 శాతం మించకుండా (అనార్ద్రభారాన్నిబట్టి)

ఎ. 18. 02 : మైదా

(Maida wheat flour)

అనగా గోధుమలు మరబెట్టగా లేక నూరగా వచ్చిన పదార్థమును దంచి శుభ్రంచేయగా [ ] లభించిన మెత్తని పదార్థం, అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

| | | |
|---|---|---|
| ఎ. | తేమ | — 14.0 శాతము మించకుండా [130-133°C వద్ద 2 గం. లు వేడి చేసి నిర్ణయించగా] |
| బి. | మొత్తం భస్మం | — బరువున 0.1 శాతం మించకుండా |
| సి. | సజల హైడ్రోక్లోరికామ్లంలో కరుగని భస్మము | — 0.1 శాతం మించకుండా — [అనార్ద్ర భారాన్నిబట్టి] |
| డి. | బంక [అనార్ద్రభారాన్నిబట్టి] | — 7.5 శాతం తగ్గకుండా |
| ఇ. | ఆల్కహాలిక్ ఆమ్లత్వం | — [90శాతం ఆల్కహాలుతో $H_2SO_4$ గా చెప్పబడిన అనార్ద్ర భారాన్నిబట్టి 0.12 శాతం మించకుండా] |

ఎలుక వెంట్రుకలు, మలములు కేజికి 5 కు మించరాదు. ఉత్పత్తి సేవకీ నిమిత్తం వాడబడునవయినచో క్రింది పదార్థములు. ఏజెంటు ప్రతిదానికి యెదురుగా చెప్పబడిన పరిమాణములలో వాడవచ్చును.—

| | | | |
|---|---|---|---|
| i. | బెంజోయిల్ పెరాక్సైడ్ | [గరిష్ఠ పరిమితి] | 40 పి. పి. యం |
| ii. | పొటాషియం బ్రోమైటు | [ ” ] | 20 పి. పి. యం |
| iii. | యాస్కోర్బిక్ ఆమ్లం | [ ” ] | 200 పి. పి. యం |

ఎ. 18. 02. 01 : 'ఫార్టిఫైడ్ మైదా'

అనగా మైదాకు ఒకటిగాని యెక్కువగాని క్రింది వస్తువులు కలుపగా లభించిన పదార్థము.

ఎ. కాల్షియం కార్బొనేటు (తయారుచేయబడిన చాక్, సామాన్యంగా క్రేటా ప్రైపరేటా అని పిలువబడినది.)

బి. ఇనుము

సి. థయామిన్

డి. రిబోఫ్లవీన్

ఇ. నై సిన్

ఫార్టిఫికేషను కొరకు కాల్షియం కార్బొనేటు వాడినచో 100 గ్రాముల ఫ్టార్టిఫైడ్ మైదా కనీసం 0.30 తగ్గకుండా 0.35 మించకుండా కాల్షియం కార్బొనేటు ఉండునట్టి పరిమాణములో కలుపబడవలెను.

ఎ. 18. 02. 02 : 'ప్రొట్టిక మైదా'
(Protein rich maida)

అనగా మైదాను (గోధుమ పిండి)న్ని 10 శాతం వరకు వేరుశనగ పిండితో కలుపగా లభించిన పదార్థము. అది కీటకముల సిలేంద్రములతోగాని వాసన, మురుగు రుచి లేనిదై యుండవలెను. అది కలుపబడిన రుచికారకము, రంగు. లేక ఇతర అన్యపదార్థము కలిగియుండరాదు. అది క్రింది ప్రమాణముల కనుగుణంగాయుండ వలెను.

| | |
|---|---|
| తేమ | 14. 0 శాతం మించకుండా |
| మొత్తం భస్మము | 1. 4 శాతం మించకుండా |
| సజల హైడ్రో ఆ. లో కరగని భస్మము | 0. 1 శాతం మించకుండా [అనార్ద్రీభావాన్నిబట్టి] |
| మొత్తం ప్రోటీన్లు [N × 6.25 ] | 12. 5 శాతం మించకుండా [ " |
| ముతక నార | 0.53 శాతం మించకుండా [ " ] |
| ఆల్కహాలిక్ ఆమ్లత్వం [90 శాతం మించకుండా] ($H_2SO_4$ గా తెలుపబడినది) | 0.12 శాతం మించకుండా [ " ] |
| జింక్ | 7. 0 శాతం మించకుండా [అనార్ద్రీభావాన్నిబట్టి] |

ఎ 18 03 : 'గోధుమ రవ్వ' (సూజీ)

(Semolina)

అనగా గోధుమలు నూరు మరియు దంచు ప్రక్రియ ద్వారా లభించిన పదార్థము. అది మాగుడువాసన మరి యే వాసన లేనిదై క్రీమ్ - పసుపు రంగులో ఉండవలెను. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా ఉండవలెను.

| | | | |
|---|---|---|---|
| ఎ. | తేమ | | 14. 5 శాతం మించకుండా [130° - 135C° వద్ద 2 గం.లు వేడిచేసి నిర్ణయించగా] |
| బి. | మొత్తం భస్మము | [పొడి బరువు లెక్కన] | 0.1 శాతం మించకుండా |
| సి. | సజల హై క్లో. ఆ. కరుగని భస్మము | [ " ] | 0.1 శాతం మించకుండా |
| డి. | బంక | | 6.0 శాతం తగ్గకుండా |
| ఇ. | ఆల్కహాలిక్ ఆమ్లత్వం 90 శాతం ఆల్కహాలు $H_2 SO_2$ గా చెప్పబడినది] | | 0.18 శాతం మించకుండా |

ఎలుక వెంట్రుకలు మరియు మలము ఒక కె॥ జీ॥కి 5 దాటరాదు.

ఎ. 18. 04 : శనగ పిండి

(Basan)

['బేసన్' అనగా/పొట్టు తీయబడిన శనగలు (Cicer arietinum) నూరగా వచ్చిన పదార్థం, ఇది కలుపబడిన రంగులు, లేక ఇతర అన్య పదార్థములు కలిగి యుండరాదు. శనగపిండి క్రింది ప్రమాణముల కనుగుణంగా ఉండవలెను.

| | | |
|---|---|---|
| ఎ. | మొత్తం భస్మము | 5 శాతం మించకుండా |
| బి. | సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మం | 0.5 శాతం మించకుండా |

ఎ. 18. 05 : పెరల్ బార్లి

(Pearl barley)

అనగా శుభ్రమైన మంచి బార్లి *Horden vulgure* లేక [ *Hordeum distichon* ] నుండి లభించిన పదార్థం. అది పులిసిన మాగుడు లేక ఇతర

అభ్యంతరకరమైన రుచి, వాసన, కల్తీచేయు పదార్థములు. కీటకములు పిలింద్రములు [———] ఎలుకల కాలుష్యము లేనిదై తెల్లని రంగులో ఉండవలెను. అది ఇతర ధాన్యములు బరువులో 1 శాతం మించి కలిగియుండరాదు. బార్లీ పొడి శుభ్రమైన మంచి పొట్టు తీసివేయబడిన బార్లీ ధాన్యము నూరగా లభించిన పదార్థము. బార్లీ స్టార్చ్ బరువులో 98.0 శాతంకు తగ్గరాదు, బార్లీ పొడి క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

| | | | |
|---|---|---|---|
| ఎ. | మొత్తం భస్మము | (అనార్ద్రభారాన్నిబట్టి) | 1.0 శాతం మించకుండా |
| బి. | సజల హై.క్లో. లో కరుగని భస్మము | ( " ) | 0.1 శాతం మించకుండా |
| సి. | ముతక నార | ( " ) | 0.50 శాతం మించకుండా |
| డి. | ఆల్కహాలిక్ అమ్లం | (90 శాతం ఆల్కహాల్) $H_2 SO_4$ గా చెప్పబడునది. | 0.10 శాతం మించకుండా |

ఎ 18. 05. 01 : 'హోల్ మీల్ బార్లీపొడి'
(Whole meal barley powder)

అనగా శుభ్రమైన మంచి పొట్టు చేయబడిన బార్లీ ధాన్యము *Hodeums vulgare or Hordeum distichon* నూరగా లభించిన పదార్థం. అది క్రింది ప్రమాణముల కనుగుణంగా ఉండవలెను.

| | | | |
|---|---|---|---|
| ఎ. | తేమ | | 14.0 శాతం మించకుండా (130° - 133° C వద్ద 2 గం॥లువేడిచేసి నిర్ణయించగా) |
| బి. | మొత్తం భస్మము | [అనార్ద్రభారాన్నిబట్టి] | 3 శాతం మించకుండా |
| సి. | సజల హై.క్లో.ఆ. కరుగని భస్మం | | 0.5 శాతం మించకుండా |
| డి. | ఆల్కహాలిక్ ఆమ్లత్వం (90శాతం ఆల్కహాలులో $H_2 SO_4$ గా చెప్పబడినది) | [ " ] | 0.17 శాతం మించకుండా |

ఎలుకల వెంట్రుకలు మరియు మలము 1 కె.జి.కి 5 మించరాదు,

ఎ. 18. 03 :

మానవ భోజనమునకు ఉద్దేశింపబడిన ఆహార ధాన్యములు తృణధాన్యములు పప్పు ధాన్యములు మిల్లెట్లు పూర్తిగా గాని నూకలు పప్పులు గాని అంతర్భాగములు ( ) వట్లు "ఆహార ధాన్యములు" మరియు ప్రత్యేకించి చెప్పబడినపుడు భిన్న ప్రమాణ పరిమితులు కల్గియుండును. మానవ భోజనమునకుద్దేశించబడిన ఆహార ధాన్యములు క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

I, సాధారణము:- ఆహార ధాన్యములు కృత్రిమ రంగులతో సహా ఆరోగ్య హాని కల్గించు పదార్థం కల్గియుండరాదు చీడ మందుల అవశేషం అనుమతించబడిన విహితమైన పరిమితి దాటి యుండరాదు.

II. అన్య పదార్థములు:- అన్య పదార్థము అనగా ఆహార ధాన్యములు కాక, సేంద్రియ మరియు నిరింద్రియ పదార్థములు ఇసుక రాళ్ళు మట్టి పెళ్ళలు రేగడి బురదలతో సహా నిరింద్రియ పదార్థము 1 శాతము మించరాదు. అయితే వడ్ల విషయంలో, అది బరువులో 3 శాతం మించరాదు. చెత్త, గడ్డి, కాండములు, గింజలు మెరికలు నూనె గింజలు, మరియు, విషముగాని ఇతర గింజలతో సహా సేంద్రియ పదార్ధము బరువులో 3 శాతం మించరాదు బాజ్రా మరియు గోధుమ ధాన్యం ఎర్గాట్ వల్ల చెడిన ధాన్యం బరువున 0.05 శాతం మించి కలిగియుండరాదు.

III. 'చెడిన ధాన్యం' చెడిన ధాన్యం అనగా సిలీంద్రము( )తేమ, లేక వేడి వలన బయటకు కనబడకుండా ధాన్యం లోపలి భాగం చెడినవి. అది బరువున 5 శాతం మించరాదు.

1 'కీటకములవలన చెడిన' బెజ్జములు పడిన ధాన్యం గింజలు, లెక్కింపుకు 10 శాతం మించకుండా, లేక కీటకములచే చెడుట వలన ఉత్పత్తి యైన యూరిక్ ఆమ్లం భాగం

110 గ్రాములకు 10 మిల్లి గ్రాములు మించకుండా—రెంటిలో తక్కువది.

ఎలుకల వెంట్రుకలు మరియు మలము

ఎలుకల వెంట్రుకలు. మరియు మలము కిలోగ్రాము శాంపిల్‌లో 5 దాటరాదు.

తేమ:- పొడిచేయబడిన ఆహార దాన్యములను 130 - 133°C వద్ద 2గం.లు వేడి చేయగా బరువులో నష్టం 16 శాతం మించ రాదు.

ఎ. 18. 07 : బిస్కట్టులు
(Biscuits)

వేఫర్ బిస్కత్తులు తప్ప, బిస్కత్తులు, మైదా, వనస్పతి, లేక రిఫైండ్ ఆయిల్, లేక టేబల్ వెన్న లేక దేశీ వెన్న లేక మార్గరిన్ లేక నెయ్యి లేక వాని మిశ్రమంతో తయారు చేయబడవలెను. అది తినదగు ఉప్పు కలిగియుండ వచ్చును. అది ఒకటిగాని ఎక్కువగాని క్రింది సంబారములు కలిగియుండ వచ్చును.

అనుమతించబడిన యాంటీ ఆక్సిడెంట్లు, ఎమల్సీకరణ మరియు స్థిరత్వ కారకములు, అనుమతించబడిన పరిరక్షకములు, రంగులు, బేకింగ్ పౌడరు, మజ్జిగ. తృణధాన్యములు, చాకొలేటు, సిట్రిక్ ఆమ్లం, కోకో. తినదగు ఎండు కొబ్బరి డెక్ట్రోస్, శుష్కఫలాలు మరియు పప్పులు (Nuts) గుడ్లు, యన్జైమ్‌లు అనుమతించబడిన రుచి కారకములు, రుచి పెంచునవి మరియు నిలబెట్టునవి, ఫ్లోర్ ఇంప్రూవర్లు, అల్లము, గ్లూటిన్, వేరుశనగ కేక, పిండి, పాల తయారీలు, తేనె, జెల్లిఫైయింగ్ ఏజెంట్లు, గ్లూకోస్ ద్రవము, మాల్టు తయారీలు నూనె గింజలు, సుగంధ ద్రవ్యములు, ఆలూ స్టార్చి వంటి తినదగు స్టార్చిలు, చక్కెర, చక్కెర తయారీలు, విలోమీకృత చక్కెర, బెల్లం గోధుమ, ఆటా, మరియు యీస్టు, బిస్కత్తులు క్రింది ప్రమాణములకనుగుణంగా యుండ వలెను.

I) సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మము (అనార్ద్ర భారాన్ని బట్టి) 0.1 శాతం మించకుండ

II) నిష్కరించబడిన కొవ్వు యొక్క ఆల్కహాలిక్ ఆమ్లత్వం (90 శాతము ఆల్కహాలు) ఓలిక్ ఆమ్లంగా 1.5 శాతం మించకుండ

ఎ. 18. 08 : మొక్క జొన్న పిండి
Corn flour (maize starch)

అనగా మొక్కజొన్న *(Zea mays L)* నుండి లభించిన పిండి. అది కలుప బడిన రంగులు, రుచులు లేక ఇతర రసాయనములు కలిగి యుండరాదు. అది దుమ్ము, కీటకములు లార్వా మరితర మాలిన్యములు లేక అన్య పదార్థములు లేనిదై యుండవలెను. అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండ వలెను.

| | |
|---|---|
| తేమ | 12.5 శాతం మించకుండా |
| మొత్తం భస్మం | 0.5 " " అనార్ద్రభారాన్ని బట్టి |
| సజల హై. క్లో. ఆ.లో కరుగని భస్మం | 0.1 " " (") |
| ఆల్కహాల్‌కి ఆమ్లత్వము (90 శాతము ఆల్కహాలులో) | 100 గ్రాముల పొడి స్టార్చికు 2 మి.లీ NaoH కు మించకుండా |

ఎ. 18. 09: 'కార్న్‌ఫ్లేక్స్'

అనగా పొట్టు తీసి వేయబడని, మొలకెత్తని మొక్కజొన్న (*Zea mays L*) ను ఫ్లేక్స్‌గా చేసి, పాక్షికంగా ఎండబెట్టి మరియు వేయించగా వచ్చిన ఉత్పత్తి. అది గోల్డెన్ బ్రౌను రంగులో ఉండి సుమారుగా ఒకటే సైజులో ఉండి పెళుసు ఫ్లేక్స్ రూపములో ఉండవలెను. అది దుమ్ము కీటకములు లార్వా మరియు మాలిన్యములు మరితర అన్య పదార్థములు లేనిదై యుండవలెను.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| తేమ | 7.5 శాతం మించకుండ |
| ఉప్పుతో సహా మొత్తం భస్మం | 1.0 " " (పొడి లెక్కన) |
| సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మం | 0.1 " " " |
| ఆల్కహాలిక్ ఆమ్లత్వం (90 శాతం ఆల్కహాలుతో) | 100 గ్రాముల పొడి పదార్థంలో 2.0 మి. లీ. NaoH కి సమానమైన దానికి మించకుండా. |

ఎ. 18. 10: 'కస్టర్డ్ పౌడరు' (Custard powder)

అనగా ఆరోరూటు, బంగాళ దుంప, లేక జొన్న (*Zea mays*) ల నుండి లభించిన తినదగు స్టార్చ్ కొద్దిగా కలిపినది గాని, కలపనిది గాని, మరియు, ఉప్పు, పాలు, ఆల్బ్యుమినస్ పదార్థం కలిపినది గాని, కలపనిది గాని, మొక్కజొన్న, (Sorghum vulgare) లేక సాగో/కట్టు పెండలముల నుండి లభించిన పదార్థము.

అది అనుమతించబడిన రంగులు మరియు రుచులు కలిగియుండవచ్చును అది అన్య. పదార్థములు లేనిదై యుండవలెను. అది మెత్తని పొడి రూపంలో, పురుగు, కంపు, పులిసిన మరియు మాగుడు వాసన వాసన లేనిదై యుండవలెను. అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఎ. తేమ | 12.5 శాతం మించకుండ |
| బి. మొత్తం భస్మం కలుపబడిన ఉప్పుతో సహా [పొడి లెక్కన] | 0.5 శాతం ,, |
| సి. సజల హై. క్లో. ఆ. కరుగని భస్మం (పొడి లెక్కన] | 0.1 శాతం మించకుండా |

## ఎ. 18. 11 మాకరోని ఉత్పత్తులు (Macoroni Products)

అనగా తినదగు వేరుశనగ పిండి, కజ్జ పెండలం పిండి, సోయా పిండి, పాల పొడి, సుగంధ ద్రవ్యములు, విటమిన్లు, ఖనిజములు వంటి దినుసులు కలిసిగాని, లేకుండగాని, గోధుమపిండి, లేక మైదా పిండిని పిసికి, జాది, ముద్దను సాగదీయగా వచ్చిన ఉత్పత్తులు. అవి కలుపబడిన రంగులు, దుమ్ము, కీటకములు, లార్వా ఇతర మాలినములు లేక అన్యపదార్థములు లేనిదై యుండవలెను.

అవి క్రింది అవసరములకు లోబడి యుండవలెను

| | |
|---|---|
| తేమ | 12.5 శాతం మించకుండా |
| మొత్తం భస్మం | 1.0 శాతం మించకుండా (పొడిలెక్కన) |
| సజల హైడ్రోక్లోరికామ్లంలో కరుగని భస్మం | 0.1 శాతం మించకుండా ( " ) |
| నత్రజని | 1.7 శాతం తగ్గకుండా |

## ఎ. 18. 12 మాల్టెడ్ పాల ఆహారము
## (Malted Milk Food)

అనగా పాలు, లేక పాక్షికంగా స్కిమ్డ్‌పాలు, లేక పాలపొడిని మాల్టుఎక్స్ట్రాక్టు మరియు తృణ, ధాన్యముల పిండితో, పిండిపదార్థము యొక్క పూర్తి జలవిశ్లేషణ జరుగునట్లుగా కలుపగా లభించిన పదార్థం. అది కలుపబడిన చక్కెరలు, అన్య కొవ్వు మరియు పరిరక్షక పదార్థములు కలిగియుండరాదు. అది కోకోపొడి, మరియు సహజ రంగులు కలిగి యుండవచ్చును.

అది క్రింది ప్రమాణములకు లోబడి యుండవలెను

| | | |
|---|---|---|
| తేమ | 5.0 శాతం మించకుండా | |
| మొత్తం భస్మం | 50 " " | (పొడిలెక్కన) |
| హైడ్రోక్లోరికామ్లంలో కరుగనిభస్మం | 0.1 " " | (") |
| పాల కొవ్వు- | 7. 0 శాతం తగ్గకుండా | " |
| నత్రజని | 2.0 శాతం " " | |
| ద్రావణీయత | 80. 0 శాతం తగ్గకుండా | |
| స్టార్చ్ | 5. మి. లీ మరుగునీటిలో 1గ్రాము కరిగించి. చల్లార్చి, K1లో 0.5.మిల్లీటర్ల 0.05 శాతం ద్రావణం కలుపగా. నీలిరంగు రాకూడదు | |
| బాక్టీరియన్ కౌంటు | గ్రాములు 50,000 మించకుండా | |
| కోలీఫార్మ్ కౌంటు | 10 గ్రాములు మించకుండా | |

అయితే మాల్టెడ్ కోకో ఆహారం కలిగియున్నచో

నత్రజని అంశం 1.8శాతం తగ్గకుండా, మొత్తం కొవ్వు 6.0 శాతం (పొడిలెక్కన) తగ్గకుండా ఉండవలెను.

కోకో కలిగియున్న మాల్టెడ్ పాల ఆహారం కలుపబడిన చక్కెర కలిపి యుండవచ్చును.

ఎ. 18 - 13 : 'రోల్డ్ ఓట్లు'

(Quick - cooking oats)

అనగా *Avena sativa* నుంచి పొట్టు తీయబడిన యవలు Avena sativa ఓట్ల నుండి తయారు చేయబడిన పదార్థము. అది కలుపబడిన రంగులు, మురుగు, వాసన మరియు రుచికారకములు లేనిదై కల్గియుండవలెను. అది పలుచని లేత క్రీం రంగులో ఒకే సైజులో ఉన్న పలుచని పొరల రూపంలో ఉండవలెను. అది దుమ్ము, కీటకములు, కీటకముల భాగములు లేనిదై యుండవలెను అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| తేమ | 10.0 శాతం మించరాదు. |
| మొత్తం భస్మము | 20.0 శాతం మించరాదు (పొడిలెక్కన) |
| సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మం | 0.1 శాతము మించరాదు (పొడిలెక్కన) |
| నైట్రోజన్ | 18. శాతము తగ్గకుండా (పొడిలెక్కన) |
| ముతక నారు | 2.0 శాతము మించకుండా (పొడిలెక్కన) |
| ఆల్కహాలిక్ ఆమ్లత్వం (90 శాతం ఆల్కహాలుతో) | 100 గ్రాముల పొడి పదార్థములో 8 మి లి. N, NaOH మించకుండా. |

ఎ. 18. 14 : రొట్టె

Bread (wheatmeal bread (brown bread)

మరియు White bread అనగా గోధుమ ఆటా, మైదా, నీరు, ఉప్పు, యీస్టు లేక ఇతర పులియ బెట్టు పదార్థముల మిశ్రమముతో తయారు చేయబడిన పదార్థం. అది ఒకటిగాని ఎక్కువగాని క్రింది సంబారములు అనగా, కన్‌డెన్స్‌డ్ పాలపొడి, (హోల్ లేక స్కిమ్డ్) మజ్జిగ విరిగిన నీళ్ళు, పెరుగు: గ్లూటిన్, చక్కెర, తేనె, ద్రవ గ్లూకోజ్, మాల్ట్ తయారీలు, తినదగు స్టార్చ్‌లు. తినదగు వేరు శనగ పిండి, తినదగు సోయాపిండి, వనస్పతి లేక తగినరకపు రిఫైన్‌డ్ ఆయిల్, లేక వెన్న లేక నెయ్యి, లేక వాని మిశ్రమం, లెసిథిన్, గ్లైసిరన్ మోనోస్టియరేటు అల్బుమిన్, నిమ్మనీరు, లైసిన్ మరియు సార్బిటాల్.

అది క్రింద యివ్వబడిన ఇంప్రూవర్‌లు కల్గియుండ వచ్చును.

| | |
|---|---|
| అమోనియం పెర్‌సల్ఫేటు | 0. 25 శాతం మించకుండా |
| కాల్షియం ఫాస్ఫేటు | 0. 25 శాతం మించకుండా |
| కాల్షియం కార్బోనేటు | 0. 5 శాతము మించకుండా |
| పొటాషియం బ్రోమేటు | 0. 005 శాతము మించకుండా |
| అమ్మోనియం క్లోరైడ్ | 0. 05 శాతము మించకుండా |
| ఫంగా - అల్ఫా - ఎమలిస్ | 0. 10 శాతం మించకుండా |
| సోడియం స్టియరాయల్ లాక్టిలేటు | |
| కాల్షియం స్టియరైల్ లాక్టిలేట్ | 0.5 శాతం మించకుండా |
| ఒంటిగా గాని సయోగములోగాని | |

అది ఒకటిగాని ఎక్కువగాని క్రింద యివ్వబడిన బూజు నిరోధించు (పదార్థములు) కలిగి యుండవచ్చును.

| | | | |
|---|---|---|---|
| కాల్షియం లేక సోడియం ప్రోప్రియోనేటు | 0.5 శాతం మించకుండా | | |
| సోర్బిక్ ఆమ్లం లేక దాని సోడియం పొటాషియం లేక కాల్షియం లవణములు | 0. 1 | " | " |
| ఎసిటిక్ ఆమ్లం లేక లాక్టిక్ ఆమ్లం | 0.25 | " | " |
| వెనిగార్ | 0 5 | " | " |
| కాల్షియం ఫాస్ఫేటు ఆమ్లం | 1.0 | " | " |
| సోడియం డయాసిటేట్ | 0.5 | " | " |
| సోడియం పైరో ఫాస్ఫేటు | 0.1 | " | " |

అది దుమ్ము, కీటకములు, కీటకముల భాగములు, లార్వా, ఎలుకల వెంట్రు కలు, క్రిములు లేనిదై యుండవలెను. అది కలుప బడిన రంగు పదార్థము లేనిదై యుండ వలెను, అది క్రింది ప్రమాణములకు అనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| ఆల్కహాలికి ఆమ్లత్వం (90 శాతం ఆల్కహాలుతో) | 100 గ్రా. పొడి పదార్థంలో 7.5 మి. లీ. ల N, NaOH మించి యుండ రాదు. |

సజల హై. క్లో, ఆ.లో కరుగని భస్మము 0.1 శాతం మించరాదు. (పొడి లెక్కన)

ముతక నారు (పొడి లెక్కన)

I. బ్రౌన్ రొట్టె 1.8 శాతము మించరాదు
II. తెల్ల రొట్టె 0·5 " "

ఎ. 19 : వనస్పతి :-

'ఏ పద్ధతిలోనయినా హైడ్రోజినేషన్ ప్రక్రియకు లోబరచిన శుద్ధి చేయబడిన తినదగు శాఖానూనె లేక నూనెలు. అది వేరుశనగ నూనె, ప్రత్తిగింజల నూనె. నువ్వుల నూనె, లేక వాని మిశ్రమంల లేక, ఇందుకొరకు ప్రభుత్వంచే అనుమతించ బడిన ఇతర హాని కలిగించని శాఖ నూనెల నుండి హైడ్రోజినేషను ద్వారా తయారు చేయబడవలెను, శుద్ధి చేయబడిన కొవ్వు వాడినచో మొత్తం నూనె మిశ్రమంలో 10 శాతము మించరాదు. అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండ వలెను.

I) అది హాని కలిగించు రంగు, రుచి కారకము, లేక ఆరోగ్యమునకు భంగం కలిగించు ఏ యితర పదార్థం కలిగియుండరాదు.

II) ప్రభుత్వం అధికారమిచ్చిన తప్ప 'హైడ్రోజినేటెడ్' శాఖ నూనెలో ఏ రంగునూ వాడరాదు. ఏట్టి సందర్భంలోనూ నెయ్యిని పోలియుండు రంగు కలుపరాదు.

III. ఏదైన రుచి/వాసన కలిపినప్పుడు, అది నేయికి భిన్నమైనదియు ప్రభుత్వంచే అనుమతించబడిన రుచుల పట్టిక ప్రకారం, మరియు నిర్ణీతమైన పరిమాణములో ఉండవలెను.

అయితే, కేవలం సైనిక దళముల భోజనమున కుద్దేశింపబడిన వనస్పతికి డయాసిటైల్ 4 పి. పి. యం. మించకుండా కలుపవచ్చును.

IV. అది తేమ 0.25 శాతం మించి కలిగియుండరాదు.

V. కాపిల్లరీ స్లిప్ పద్ధతి ప్రకారం నిర్ణయింపబడిన ద్రవీభవన స్థానం. 31°C - 37°C [రెండునూ కలుపుకొని] మధ్య యుండవలెను.

VI. బ్యూట్రో రిఫ్రాక్టో మీటరు విలువ 40°C ల వద్ద, 48 కి తగ్గరాదు.

VII. సపోనిఫై కాని పదార్థం 2.0 శాతం మించి కలిగియుండరాదు.

VIII. ఆమ్ల కొవ్వులు [ఓలిక్ ఆమ్లంగా] 0.25 శాతం మించియుండరాదు.

IX. కరుగబెట్టినచో, స్పష్టంగా, మడ్డి, మురికిలేకుండ ఆహ్లాదకరమైన రుచి మరియు వాసన కలిగియుండవలెను.

X. అది పచ్చి లేక శుద్ధిచేయబడిన నువ్వుల నూనె బరువున 5 శాతం తగ్గకుండా కలిగియుండవలెను. అయితే వనస్పతి శుద్ధిచేయబడిన వేరుశనగ నూనెలో 20:80 నిష్పత్తితో కలిసినప్పుడు బోడోయిన్ పరీక్షలో వచ్చిన ఎరుపు రంగులోని జాంతు స్కేలుపై 1 సెం. మీ. సెల్‌లో 2.0 ఎరుపు యునిట్లు కంటే లేతగా నుండనంతవరకు, కలిగియుండవలెను.

XI. ప్యాకు చేసినప్పుడు కృత్రిమ విటమిన్ - ఎ। గ్రాముకు 25 - I U తక్కువ గాకుండా రిటైలు లేవెల్‌లో గ్రాముకు 15 - I U తగ్గకుండా కలిగియుండవలెను.

XII. ప్రభుత్వం నుండి పూర్వామోదముండిన తప్ప, ఏ యాంటీ ఆక్సిడెంటు, ఎమల్సీకరణి లేక ఏ ఇతర పదార్థమైనా కలుపరాదు.

---

ఏ. 19. 01: 'బేకరీ షార్టెనింగ్'

అనగా క్రింది విధముగా తప్ప — అంశం ఎ-19 లో విహితమైన ప్రమాణముల కనుగుణంగాయున్న వనస్పతి.

ఎ. కాపిలరీ పద్ధతిన నిర్ణయింపగా ద్రవీభావన స్థానం 41°C మించరాదు.

బి. వాయుపూరకమైనచో నైట్రజను లేక మరితర జడవాయువు మాత్రమే వాడవలెను. మరియు అట్లు పూరించిన వాయువు పదార్థం ఘన పరిమాణములో 12 శాతం మించి యుండరాదు.

సి. అది కలుపబడిన మోనోగ్లిసరైడులు ఎమల్సీకరణిగా కలిగియుండవచ్చును.

ఎ. 20 : 'వెనిగార్'

అనగా పండ్లు, మాల్టులు, పాగు చెఱకు రసం వగైరాలవంటి తగిన పదార్థములు పులియబెట్టగా [alcoholic and lacetous fermentation] వలన లభించిన ద్రవము.

అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

1. అది 100 మి. లీ. లలో కనీసం 3.75 గ్రాముల ఎసిటిక్ ఆమ్లం కలిగియుండవలెను.

2. మొత్తం ఘన పదార్థములు కనీసం 1.5 శాతం [W/w] మరియు భస్మం కనీసం 0.18 శాతం కలిగియుండవలెను.

3. అది i. సల్ఫ్యూరిక్ ఆమ్లం లేక ఏ ఇతర ఖనిజ ఆమ్లములు, ii. సీసం లేక రాగి, iii. మిలియనులో 1.5 భాగములు మించి ఆసెనిక్, iv. మరియు ఏ ఇతర అన్య పదార్థము లేక కారమెల్ తప్ప ఏ ఇతర రంగు పదార్థము కలిగియుండరాదు.

4. అదనంగా 'మాల్టివెనిగార్' కనీసం 8.05 శాతం ఫాస్ఫరస్ పెంటాక్సైడ్ $P_2O_5$ మరియు 0.04 శాతం నైట్రోజన్ కలిగియుండవలెను. ఇట్టి పెట్టిన [Brewed] వెనిగార్ ఎసిటిక్ ఆమ్లంతో బలిష్టం చేయరాదు.

ఎ. 20. 01 : కృత్రిమ వెనిగార్ :

అనగా ఎసిటిక్ ఆమ్లం నుండి తయారుచేయబడిన పదార్థం. అది 100 మి.లీ. లకు కనీసం 3.75 గ్రాముల ఎసిటిక్ ఆమ్లం కలిగియుండవలెను.

అది -

ఎ. సల్ఫ్యూరిక్ ఆమ్లం లేక ఏ ఇతర ఖనిజ ఆమ్లము.

బి. సీసం లేక రాగి.

సి. మిలియన్‌కు 1.5 భాగములు మించి ఆర్సెనిక్.

డి. కారమెల్ మినహా ఏ రంగు పదార్థము కలిగియుండరాదు.

కృత్రిమ వెనిగార్ స్పుటంగా, Synthetic - Prepared from acetic acid అని లేబిల్ వేయబడవలెను.

ఎ. 21. 'తినదగిన కాసు'

(Catechu)

అనగా (*Acacia catechu*) యొక్క అంతర్దారువు (*Acacia catechu*) నుండి తీయబడిన కషాయం ఎండబెట్టబడినది. అది మాలిన్యము, ఇసుక, మట్టి, ఇతర దుమ్ము, లేనిదై క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలెను.

ఎ. 5 మి. లీ. ల, 1 శాతం జలద్రావణంలో, 0.1 శాతం ఫెర్రిక్ అమ్మోనియం సల్ఫేటు ద్రావణంతో, ముదురు ఆకు పచ్చరంగు; సోడియం హైడ్రాక్సైడు ద్రావణం కలిపినప్పుడు ఎరుపు - నీలి (Purple) రంగుకు మారవలెను.

బి. 100° C. వద్ద స్థిరభారమునకు పొడి చేసినప్పుడు దాని బరువులో 16 మించి పోగొట్టుకొనరాదు.

సి. నీటిలో కరుగని అవశేషము (100° C వద్ద పొడి చేయగా), బరువున 25 శాతం మించరాదు.

డి. (90 శాతం) ఆల్కహాలులో కరుగని అవశిష్టం (100° C వద్ద పొడి చేయగా) బరువులో 30 శాతం మించరాదు.

ఇ. మొత్తం భస్మం [పొడి లెక్కన] బరువులో 8 మించరాదు.

యఫ్. నీటిలో కరుగని పదార్థం, నీటిని మరుగబెట్టి నిర్ణయించవలెను.

సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మం- (పొడి లెక్కన) — 5.5 శాతం మించరాదు.

అయితే బట్టి కథా విషయంలో సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మం (పొడి లెక్కన) 1.5 శాతం మించరాదు. బట్టీ కథా, రూలు 49 సబ్ రూలు [12] లో కోరబడినట్లు గుర్తింపబడవలెను.

ఎ. 22 : జెలాటిన్ :

(Gelatin)

పశువుల, చర్మం, తెల్లని టిష్యూలు మరియు ఎముకల నుండి తీయబడిన కొలాజిన్‌ను పాక్షికంగా జలవిశ్లేషణం చేయగా లభించిన పరిశుద్ధ పరచబడిన

పదార్థం. అది పలకలు పొరలు, సన్న లేక ముతక లేక మెత్తని పొడి రూపంలో, రంగులేని లేదా లేత పసుపు రంగులో మరియు మందపార దర్శకముగా (Translucent) గా ఉండవలెను. అది అభ్యంతరకరముగాని, స్వల్పంగా, స్వాభావికమైన మరియు బౌలియన్ వంటి వాసన మరియు రుచి కలిగియుండవలెను. అది పొడిగా ఉన్నచో, గాలిలో స్థిరము, కాని తడిగా యున్న లేక ద్రావణములో యున్నచో మైక్రోలయర్ విఘటనముకు లోనగును. అది—

ఎ. 15 శాతం మించి తేమ,

బి. 3 శాతం మించి భస్మం,

సి. 1000 పి. పి. యం మించి సల్ఫర్‌డయాక్సైడ్,

పొడి లెక్కన 15 శాతం కు తగ్గి నైట్రోజన్

— కలిగియుండరాదు.

మానవ భోజనమునకుద్దేశింపబడిన జిలాటిన్, "Gelatin - Food grade" అని లేబిల్ వేయబడవలెను.

ఎ. 23 : (తొలగించబడినది)

ఎ. 24 : ( ,, )

ఎ. 25 : తీపి పదార్థములు

(Sweets and confectionery)

ఎ. 25. 01 : 'హార్డ్‌బాయిల్డ్ సుగర్ కన్‌ఫెక్షనరీ'

అనగా సుక్రోస్ మరియు ద్రవ గ్లూకోస్ (లేక చక్కెర మాత్రమే) • సంయోగమునకు టార్టార్ (పొటాషియం యాసిడ్ టార్ట్రేటు) యొక్క మీగడ వంటి డాక్టరింగ్ ఏజంటుతో కలిపి

ఎ. అనుమతించబడిన రుచికారకములు,

బి. అనుమతించబడిన రంగులు,

సి. ఎసిడ్యులెంట్

డి. ఫిల్లింగ్,

ఇ. ఫలములు లేక ఫల ఉత్పత్తులు లేక తినదగిన కొవ్వు, లేక పాల ఉత్పత్తులు, లేక కోకో లేక ఇతర నిర్దోషమైన దినుసులు సహితముగా గాని, రహితముగా గాని, అతి శీతలీకరణము చేయబడిన ద్రావణము.

అది క్రింది ప్రమాణములకనుగుణంగా యుండవలయును.

i. సల్ఫేటెడ్ భస్మం బరువులో 1.5 శాతం మించకుండా

ii. సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మం " 0.2 "

అది 350 పి. పి. యం మించని గాఢతలో సల్ఫర్‌డయాక్సైడ్ కలిగి యుండవచ్చును.

ఎ. 25. 02 : టాఫీలు

(Toffees)

సాదా టాఫీలు (Plain toffees) :-

అది చక్కెర, వనస్పతి, పాలకొవ్వు, లేక ఏదైనా తినదగు నూనెలతో తయారు చేయబడవలెను. మరియు దాని తయారీలో అదనంగా క్రింది పదార్థములలో ఏదయినా వాడవచ్చును.

తినదగు ఉప్పు, తినదగు వేరుశనగ పిండి, తినదగు స్టార్చ్‌లు, తినదగు జిలాటిన్, బెల్లం, తేనె, ద్రవ గ్లూకోస్, మాల్ట్ సిరప్ అనుమతించబడిన యాంటీ ఆక్సిడెంట్లు, ఎమల్సీకరణులు, సిట్రిక్ ఆమ్లం, టార్టారు మీగడ, అనుమతించబడిన రుచికారకములు, అనుమతించబడిన రంగులు. సార్బిటాల్, టార్టారిక్ ఆమ్లం మరియు విటమినులు

'మిల్క్ టాఫీ' :-

అది చక్కెర, వనస్పతి, పాల కొవ్వు లేక తినదగు నూనె మరియు ఏ రూపములోనయినా పాలు నుండి తయారు చేయబడవలెను. మరియు అదనంగా సాదా టాఫీలో వాడు ఏ పదార్థమయినా కలిగి యుండవచ్చును.

'మోడిఫైడ్ టాఫీ'

అది సాదా టాఫీ లేక మిల్క్ టాఫీలో వాడబడిన దినుసులతో తయారు చేయబడవలెను' అదనంగా క్రింది వానిలో ఒకటిగాని ఎక్కువ గాని కలిగియుంవ వచ్చును.

చాకోలేటు, కాఫీ, కోకో శుష్క ఫలాలు మరియు పప్పులు (Nuts)

'వెన్నటాఫీ'

(Butter toffce :-

అది సాదా టాఫీ, మిల్క్ టాఫీ, లేక మోడిఫైడ్ టాఫీకి వాడబడు దినుసులతో తయారు చేయబడవలెను. కాని బరువులో కనీస 5 శాతం వెన్న కలిగి యుండవలెను.

టాఫీలు క్రింది అవసరములను కూడా పాటించవలెను.

| క్రమ సంఖ్య | లక్షణములు | సాదా టాఫీ | మిల్క్ టాఫీ | మోడిఫైడ్ టాఫీ | వెన్న టాఫీ |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1. | సల్ఫేటెడ్ భస్మం శాతం (గరిష్ఠ పరిమితి) | — | 2.5 | 2.5 | 2.5 |
| 2. | సజల హై. క్లో. ఆ. లో కరుగని భస్మం శాతం (బరువున గరిష్ఠ పరిమితి) | 0.2 | 0.2 | 0.2 | 2.0 |
| 3. | క్షయీకృత చక్కెర (డెక్స్ట్రోస్‌గా లెక్కించ బడిన) శాతం (బరువున) కనీసం | 10.0 | 10.0 | 10.0 | 10.0 |
| 4. | సుక్రోస్ శాతం బరువున (గరిష్ఠ పరిమితి) | 60.0 | 60 0 | 60.0 | 60.0 |
| 5. | కొవ్వు శాతం బరువున (పొడి లెక్కన) కనీసం | 4.0 | 4.0 | 4.0 | 4.0 |
| 6. | మొత్తం ప్రోటీన్ (N × 6.25) శాతం బరువున — కనీసం) | — | 3.6 | — | 6.25 |

ఎ. 25. 03 : 'లాజెంజులు'

(Lozenges)

లాంజెలులు క్రింది పదార్థములనుండి తయారుచేయబడవలెను.

ఎ. వాక్యూమ్ పాన్ చక్కెర, లేక శుద్ధిచేయబడిన చక్కెర, లేక ఐసింగ్ చక్కెరలను పొడిచేయగా వచ్చిన కణాత్మక చక్కెర (Pulverized Sugar)

బి. తినదగు జిలాటిన్, తినదగు జిగురులు, ద్రవగ్లూకోస్, డెక్స్ట్రిన్‌లవంటి అతుకు పదార్ధములు.

సి. అనుమతించబడిన రంగులు.

డి. అనుమతించబడిన రుచికారకములు.

పై వానికి అదనంగా, మిశ్రమమునకు క్రింది సంభారములు గూడ కలుపవచ్చును— అనగా

అల్లం, దాల్చినచెక్క, సోంప్, సాజీరా, యాలకులు, మరితర సుగంధ ద్రవ్యములు పొడి లేక కషాయం రూపంలో, విటమిన్లు, ఉప్పు, సిట్రిక్ ఆమ్లం, సోడియం బై కార్బోనేటు, స్టియరిక్ ఆమ్లం. టాల్క్ (0 1 శాతం మించకుండా) వంటి మెరుగు పుట్టించు పదార్థములు.

అది క్రింది అవసరములను గూడ పాటించవలెను.

1. సల్ఫేటెడ్ భస్మం శాతం బరువున — 3.0 మించకుండా

2. సజల హై.కో.ఆ. లో కరుగని భస్మం బరువున — 0.1 మించకుండా

3. సుక్రోస్ శాతం (బరువున) — 85.0 తగ్గకుండా

ఎ. 26 : ఆహార రంగులు :

(Food colours)

ఎ. 26. 01 : టాట్రాజైన్

Tartrazine)

సామాన్య నామము — టార్ట్రాజైన్

పర్యాయపదములు — హైడ్రజైన్ పసుపు, టార్టార్ పసుపు, ఆమ్లము

పసుపు, యఫ్. డి అండ్ సి పసుపు నెం 5, సి ఐ. అహారము పసుపు 4 లెబెన్స్‌మిటెల్ పసుపు నెం 2.

రంగు - స్వేదన జలములో 0.1 శాతము (w/v) ద్రావణము రంగు - పసుపు

రంగు సూచి సంఖ్య - (1956) నెం. 19140, (1924) - నెం. 640

వర్గము - పైరాజోలోన్

రసాయన నామము - (ట్రైసోడియం లవణము 4-) 4-సల్ఫో-1 ఫినైలాజో(-1-) 4-సల్ఫో ఫినైల్ 1) -45- హైడ్రాక్సిపైరజోల్-3-కార్బోక్సిలిక్ ఆమ్లము)

అనుభావిక ఫార్ములా - $C_{16}$ $H_{9}$ $N_{4}$ $O_{9}$ $S_{2}$ $Na_{3}$

అణుభారము - 534.4

సాధారణ అవసరములు :- కోల్తార్ రంగుల శాంప్లింగ్ మరియు పరీక్షల పద్ధతులు, భాగము రెండు, ఐ యస్ 1699 (భాగము II) - 1963 నెం. 3 మరియు 4 లలో నిర్దేశించబడిన పద్ధతుల ద్వారా పరీక్షించినపుడు, పదార్థము 10 పి.పి యం మించి రాగి మరియు 20 పి.పి.యం. మించి క్రోమియం కలిగియుండరాదు.

టార్ట్రాజైన్ క్రింది అవసరములను పాటించవలెను.

| క్రమ సంఖ్య | లక్షణములు | అవసరము |
|---|---|---|
| 1. | స్వచ్ఛమైన రంగు శాతము బరువున కనీసం గరిష్ఠపరిమితి | 85 |
| 2. | 135° C వద్ద బాష్పశీల పదార్థము, బరువున, గరిష్ఠపరిమితి | 10 |
| 3. | నీటిలో కరుగని పదార్థం బరువున గరిష్ఠపరిమితి | 0.5 |
| 4. | సంయోగ ఈథర్ సారము శాతము బరువున గరిష్ఠపరిమితి | 0.3 |
| 5. | ఉపవర్ణములు, శాతము బరువున గరిష్ఠపరిమితి | 3.0 |
| 6. | ఫినైల్ హైడ్రజెన్ - పి - సల్ఫోనిక్ ఆమ్లము శాతము బరువున గరిష్ఠపరిమితి | 0.5 |
| 7. | మిశ్రమ ఆక్సైడులు బరువున శాతము గరిష్ఠపరిమితి | 1.0 |
| 8. | ఆర్సినిక్ మిలియనుకు భాగములు, గరిష్ఠపరిమితి | 1.0 |
| 9. | సీసం మిలియనుకు భాగములు, గరిష్ఠపరిమితి | 10.0 |

ఎ. 26. 02 :- సన్ సెట్ ఎల్లో యఫ్. సి. యఫ్
(Sunset yellow F C F)

సామాన్య నామము - సన్ సెట్ ఎల్లో
పర్యాయ పదములు - సన్ సెట్ ఎల్లో ఇజి, పేర ఆరెంజి, యఫ్ డి అండ్ సి.ఎల్లో నెం. 6, జేన్ ఆరంజస్, జేన్, సన్ సెట్, యఫ్ సి యఫ్ సి.ఐ, ఫుడ్ ఎల్లో 3, లెజిన్స్ మిటల్ ఆరంజి నెం. 2
రంగు : స్వేదనజలంలో 0.1 శాతం (w/v) ద్రావణం రంగు - నారింజ.
రంగు సూచి సంఖ్య : (1956) నం. 15985
వర్గం : మోనాజో
రసాయన నామం : 1-సల్ఫో-1-ఫీనైల్ ఆజో యొక్క డైసోడియం లవణము-2-హైడ్రోక్సీ నాఫ్తలీన్ - 6 - సల్ఫోనిక్ ఆమ్లము
అణుభావక ఫార్ములా : $C_{16}$ $H_{10}$ $N_2$ $O_7$ $S_2$ $Na_2$
అణుభారం - 452.4 సాధారణ అవసరములు : I.S. 1969 (భాగము 2) 1963 ఐటం 3, 4 కోల్‌తార్ ఆహార రంగుల శాంప్లింగ్ మరియు పరీక్షల పద్ధతులు (భాగం II) లో విహితమైన పద్ధతుల ప్రకారం పరీక్ష చేయగా రాగి 10 పి.పి.యం, క్రోమియం 10 పి.పి.యం. మించరాదు. సన్ సెట్ ఎల్లో క్రింది అవసరములను కూడా పాటించవలెను.

| క్రమ సంఖ్య | లక్షణములు | అవసరములు |
|---|---|---|
| 1. | స్వచ్ఛమైన రంగు అంశములు శాతం, బరువున, కనీసం | 85.0 |
| 2. | 135°C వద్ద భాష్పశీల పదార్థం, శాతం బరువున గరిష్ఠపరిమితి | 10.0 |
| 3. | నీటిలో కరుగని పదార్థం, శాతం బరువున గరిష్ఠపరిమితి | 0.5 |
| 4. | సంయోగ ఈథర్ సారం, శాతం బరువున కనీసం | 0.2 |
| 5. | ఉపవర్ణము, అధమ (సల్ఫేటెడ్ రంగులు) శాతం బరువున గరిష్ఠపరిమితి | 5.0 |
| 6. | మిశ్రమ ఆక్సైడ్‌ల శాతం, బరువున గరిష్ఠపరిమితి | 1.0 |
| 7. | ఆర్సెనిక్ మిలియన్‌కు భాగములు గరిష్ఠపరిమితి | 1.0 |
| 8 | సీసం మిలియన్‌కు భాగములు గరిష్ఠపరిమితి | 10.0 |

ఎ. 26. 03 : అమరాంఫ్

(Amaranth)

సామాన్య నామము : అమరాంథ్

పర్యాయ పదములు : బోర్డెక్స్ S, FD & రెడ్ No.2 నేఫ్తాల్ రెడ్ S
ఏసిడ్ క్రిమసన్ అజోర్బైన్, బ్రిలియంట్
బోర్డెక్స్ - బి, బోర్డెక్స్ యాసిడ్ బి, అమరాంథ్,
సి. ఐ. ఫుడ్ రెడ్ 9

రంగు—స్వేదన జలంలో 0.1 శాతం [w/v] ద్రావణం రంగు - ఎఱుపు
రంగు సూచి సంఖ్య — (1956) — నెం. 16185
(1924) — నెం. 184

వర్గం — మొనాజో

రసాయన నామం :- 1-4 సల్ఫో (1) నేఫ్తలైజో యొక్క ట్రైసోడియం లవణం, (2) హైడ్రోక్సీ నాఫ్తలీన్ - (3) 6 డై సల్ఫోనిక్ ఆమ్లం

అనుభావిక ఫార్ములా - $CO_2H_{11}N_2O_{10}S_3Na_3$ అణు భారం - 604.5

సాధారణ అవసరములు :- ఐటం 3, 4, I S 1699 (భాగం II) 1963 కోల్‌తారు రంగుల శాంప్లింగ్, పరీక్షల పద్ధతులు (భాగం II) లో నిర్దేశించబడిన పద్ధతుల ప్రకారం పరీక్ష చేయగా, రాగి 10 పి. పి. యం క్రోమియం 20 పి. పి. యం మించి యుండరాదు.

అమరాంథ్ క్రింది అవసరములకు గూడ పాటించవలెను.

| క్రమ సంఖ్య<br>1 | లక్షణములు<br>2 | అవసరములు<br>3 |
|---|---|---|
| 1. | స్వచ్ఛమైన వర్ణముల అంశం శాతం బరువున కనీసం | 85.0 |
| 2. | 135°C వద్ద బాష్పశీల పదార్థం శాతం బరువున గరిష్ఠ పరిమితి | 10.0 |
| 3. | నీటిలో కరుగని పదార్థం శాతం బరువున గరిష్ఠ పరిమితి | 0.5 |
| 4. | సంయోగ ఈథర్ సారముల శాతం బరువున గరిష్ఠ పరిమితి | 0.5 |

| క్రమ సంఖ్య 1 | లక్షణములు 2 | | అవసరములు 3 |
|---|---|---|---|
| 5. | ఉప వర్ణములు (ఫాస్ట్ రెడ్ ఇ గా) శాతం | ” | 4.0 |
| 6. | మిశ్రమ ఆక్సైడులు శాతం బరువున | ” | 1.0 |
| 7. | ఆర్సెనిక్, మిలియనుకు భాగములు | | 1.0 |
| 8. | సీసం, మిలియనుకు భాగములు | | 10.0 |

). 36. 04: ఈరిథ్రోసిన్

(Erythrosine)

సామాన్య నామం : ఈథరిథ్రోసిన్

పర్యాయ పదములు : సోల్యు బుల్ ప్రిమ్‌రోస్, పైరోసిన్-బి, $FD_4$ C ఎరుపు, నెం. 3 ఐడోసిన్-బి, ఈరోథ్రోసిన్ బి యన్, ఈరోథ్రోసిన్ జె, ఈరోథ్రోసిన్ ఎక్స్ట్రా బ్లూ, C. I. ఫుడ్ రెడ్ - 14

రంగు - స్వేదన జలములో 0.1 శాతం [w/v] ద్రావణం రంగు - ఎరుపు.

రంగు సూచి సంఖ్య — 1956 నెం. — 45430
1924 నెం. — 773

రసాయన నామం: టెట్రా అయోడోఫ్లోరిసేన్ హైడ్రోక్సీ టెట్రా-అయోడో కార్బోక్సీ-ఫినైల్ ఫ్లోరీన్ } వర్గం - కార్మీన్ యొక్క డై సోడియం పోటాషియం లవణములు

అనుభావిక ఫార్ములా - $C_{20}H_6O_5I_4Na_2$

అణుభారం — 879.9 (డై సోడియం లవణములు)

సాధారణ అవసరములు — ఐటం 3,4 I. S : 1699 [భాగం II]-1963, కోల్‌తార్ ఆహార రంగుల శాంప్లింగ్ మరియు పరీక్షల పద్ధతుల - భాగం - II ప్రకారం పరీక్ష చేయగా రాగి 10 పి. పి. యం, క్రోమియం 20 పి. పి. యం మించకుండా ఉండవలెను.

ఈరోథ్రోసిన్ క్రింది అవసరములకు కూడ అనుగుణముగా యుండవలెను.

| క్రమ సంఖ్య<br>1 | లక్షణములు<br>2 | అవసరములు<br>3 |
|---|---|---|
| 1. | స్వచ్ఛమైన రంగుల అంశం శాతం. బరువున - కనీసం | 85.0 |
| 2. | 135°C వద్ద బాష్పశీల పదార్థం శాతం బరువున గరిష్ఠ పరిమితి | 12.0 |
| 3. | నీటిలో కరుగని పదార్థం శాతం బరువున " | 0.2 |
| 4. | సంయోగ ఈథర్ సారము శాతం బరువున " | 0.2 |
| 5. | సోడియం అయాక్సైడ్‌లు, శాతం బరువున " | 0.4 |
| 6. | మిశ్రమ ఆక్సైడ్‌లు, శాతం బరువున " | 1.0 |
| 7. | తడిలేని స్వచ్ఛమైన రంగులో స్వాభావికంగా కలగియున్న అయోడిన్ శాతం బరువున | 55.8-58.5 |
| 8. | ఆర్సెనిక్ మిలియనుకు భాగములు | 10.0 |
| 9. | సీసం మిలియనుకు భాగములు | 10.0 |

ఎ. 26. 05 : ఇండిగో కార్మైన్

(Indigo carmine)

సామాన్య నామం : ఇండిగో కార్మైన్

పర్యాయ పదములు : ఇండిగోటైన్, ఇండిగో. సాక్సోనీ ఎక్స్ట్రాక్ట్, బ్లూ, FD&C; బ్లూ నెం. 2, సి. ఫుడ్; - బ్లూ - 1 లేబిన్‌స్మిటెల్ బ్లూ నెం.2

రంగు - స్వేదాన జలంలో 0.1 శాతం [w/v] ద్రావణం - నీలం

రంగు సూచి సంఖ్య — 1956 నం. 73015
1924 నం. 1180

వర్గం — ఇండిగోయిడ్

రసాయన నామం — ఇండిగోటైను యొక్క డై సోడియం లవణము-5 : 5 — డై సల్ఫోనిక్ ఆమ్లం.

అనుభావక ఫార్ములా — $C_{16}H_8N_2O_8S_2Na_2$ అణుభారం : 466 4

సాధారణ అవసరములు : పదార్థము కోల్‌టారు ఆహార రంగుల శాంప్లింగ్

మరియు పరీక్షల పద్ధతులు భాగము II I. S 1699 [భాగం II] - 1963, ఐటం [2] [4] లలో నిర్దేశించబడిన పద్ధతిలో పరీక్ష చేయగా, రాగి 10 పి. పి. యం, క్రోమియం 20 పి. పి. యం మించకుండ ఉండవలెను.

ఇండిగో కార్మైను క్రింది అవసరములను గూడ పాటించవలెను.

| క్రమ సంఖ్య 1 | లక్షణములు 2 | | అవసరములు 3 |
|---|---|---|---|
| 1. | స్వచ్ఛమయిన రంగు అంశం శాతం, బరువున కనీసం | | 85.0 |
| 2. | 135°C వద్ద బాష్పశీల పదార్థం శాతం బరువున గరిష్ఠ పరిమితి | | 10.0 |
| 3. | నీటిలో కరుగని పదార్థం శాతం బరువున | " | 5.0 |
| 4. | సంయోగ ఈథర్ సారముల శాతం బరువున | " | 0.5 |
| 5. | అథమ సల్ఫోనేటెడ్ రంగులు (సోడియం ఇండిగో మోనో సల్ఫోనేట్) శాతం బరువున | " | 5.0 |
| 6. | మిశ్రమ ఆక్సైడుల శాతం బరువున | " | 1.0 |
| 7. | ఆర్సెనిక్ మిలియనుకు భాగములు | " | 1.0 |
| 8. | సీసం మిలియనుకు భాగములు | | 10.0 |

ఎ. 26. 06 :- బీటా కార్టోన్

(B-Carotene)

బీటా కార్టోన్, బెంజన్ మిథనాల్ ద్రావణం నుండి స్ఫటీకరణము చేయగా ముదురు వయొలేటు రంగులో లభించు షడ్భుజ పట్టకము [Haxagonal Prism] గాను, పెట్రోలియం ఈథర్‌నుండి ఎరుపుగా రాంబిన్ ఆకారములో, చావాపు (*Quadratic Plates*) గాను వచ్చును.

పర్యాయ పదములు - C. I. నేచురల్ ఎల్లో 26.
రంగు సూచి సంఖ్య - (1956) - 75130. వర్గం కారాటోనోయిడ్స్
రసాయన నామం అల్ట్రాన్స్ బీటా కార్టోన్
అనుభావిక ఫార్ములా $C_{40}$ $H_{6}$ అణుభారం - 536.89
ద్రవీభవన స్థానం 190° ± 1° C

ద్రావణీయత - కార్బన్ డైసల్ఫైడ్, బెంజీన్ మరియు క్లోరోఫార్మ్‌లో కరుగును. సామాన్య హెక్సేన్, సైక్లోహెక్సేన్, ఈథర్. పెట్రోలియం ఈథర్ మరియు నూనెలలో స్వల్పము కరుగును. మెథనాల్, ఈథనాల్‌లలో కరుగదు- నీటిలో కరుగదు.

స్పెక్ట్రో ఫోటో మెట్రిక్ అవసరములు :- (సుమారుగా 100 మి. లీ. లకు 0.2 మి. గ్రాముల చొప్పున (సైక్లో హెక్సేన్‌లో సర్వట్రాన్స్) బీటాకార్టోన్‌యొక్క గరిష్ఠశోషణ తరంగ దైర్ఘ్యములు (*Wave lengths af absorption maxima of all trans Beta-Carotene in cyclohexane*).

1 సెం. మీ. సెల్‌లో 456 మి.మైక్రోన్‌ల 484 మి. మైక్రోన్‌ల ప్రాంతములో ఉండవలెను. 330 - 335 మిల్లీ మైక్రోనుల ప్రాంతములో సిస్ గరిష్టం (Cis peak) ఉండరాదు.

క్లోరోఫార్మ్‌లో బీటా కార్టోన్ ద్రావణము అంటిమనీట్రైక్లోరైడ్ ద్రావణం కలుపగా 590 మి. మైక్రోనుల తరంగ దైర్ఘ్యములో [Maximum absorption] గరిష్ఠ శోషణము [Maximum absorption] గల ముదురు నీలపురంగు యివ్వవలెను.

రంగు రియాక్షన్ : క్లోరోఫార్మ్ 0.2 శాతం బీటాకార్టోన్ ద్రావణం 2 మి. లీ. కు 2 మి. లీ.ల గాఢ సల్ఫ్యూరిక్ ఆమ్లం కలిపినప్పుడు ఆమ్ల పౌర నీలం రంగుకు మారవలెను.

పదార్థం కనీసం 96.0 శాతం స్వచ్ఛత కలిగియుండవలెను.

లోహ మాలిన్యముల గరిష్ఠ పరిమితి -

| | |
|---|---|
| ఆర్సెనిక్ [As గా] | 5 పి. పి. యం. |
| సీసం [Pb గా] | 20 పి. పి. యం. |

ఎ. 26. 07 : క్లోరోఫిల్

మొక్కలలో నుండి తీయబడి ఆహారములలో రంగు పదార్థంగా విరివిగా వాడబడు ఆకు పచ్చరంగు.

పర్యాయ పదములు : సి. ఐ. సహజ ఆకుపచ్చ 3.

లిబెన్‌స్మెటిల్ - ఆకుపచ్చ 1 రంగు : ఆకుపచ్చ

| | | |
|---|---|---|
| రంగు సూచి సంఖ్య | — (1956) - | 75810 |
| | (1924) - | 12499 |

వర్గం - ఫోర్బిన్ (డైహైడ్రో ఫోర్బిన్)

రసాయన నామం - 1, - 3, - 5, - 8 టెట్రామిథైల్ 4 - ఈథైల్ - 2 వినైల్ - 9 - కేటో - 10. కార్బోమిటాక్సి ఫార్బిన్ - ఫిటైల్ 7 - ప్రొపియనేట్ యొక్క క్లోరోఫిల్-మెగ్నీషియా కాంప్లెక్స్.

1, 5, 8 - ట్రైమిథైల్ - 3 - ఫార్మిల్ 4 ఈథైల్ - 2 వినైల్ - 9 - కేటో - 10 – కార్బో - మిథాక్సి ఫార్బిన్ ఫిటైల్ - 7 - ప్రొపియనేట్ యొక్క క్లోరోఫిల్ - మెగ్నీషియం కాంప్లెక్స్.

ఆనుభావిక ఫార్ములా - క్లోరోఫిల్ - ఎ $C_{55}\ H_{72}\ O_{5}\ N_{4}\ Mg$.
క్లోరోఫిల్ - బి $C_{55}\ H_{70}\ O_{6}\ N_{4}\ Mg$.

అణుభారం - క్లోరోఫిల్ ఎ - 893.54 క్లోరోఫిల్ బి - 907.52

సాధారణం - పదార్థము చిక్కనైన ముదురు ఆకుపచ్చరంగు ఎథనోలిక్ జల ద్రావణంగా లేక క్లోరోఫిల్ డిగ్రడేషన్ తైల ద్రావణము.

గుర్తింపు పరీక్ష - ఎథనాల్‌లో క్లోరోఫిల్ ద్రావణం ముదురు ఎరుపు ప్రతి దీప్తి, నీలం రంగులో ఉండవలెను.

బ్రౌన్ ఫేజ్ రసాయన చర్య - క్లోరోఫిల్ ఆకుపచ్చ ఈథరు లేక పెట్రోలియం ఈథరు ద్రావణమునకు ఎథనాల్ 10 శాతం పొటాషియం హైడ్రాక్సైడ్ ద్రావణము కొద్దిగా కలుపగా బ్రౌను రంగు వచ్చి వెంటనే ఆకుపచ్చకు మారవలెను.

లోహ మాలిన్య గరిష్ఠ పరిమితి -

| | | |
|---|---|---|
| ఆర్సెనిక్ | (As గా) - | 5 పి. పి. యం. |
| సీసం | (Pb గా) - | 20 పి. పి. యం. |
| రాగి | (Cu గా) - | 30 పి. పి. యం. |
| జింక్ | (Zn గా) - | 50 పి పి. యం. |

ఎ. 26. 08 : కారమెల్

వర్ణన కారమెల్ ఆమ్లములు లేక క్షారముల, లవణముల సమక్షంలోగాని పరోక్షంలోగాని ఆహార గ్రేడ్ కార్బోహైడ్రేట్‌లు లేక క్రింద ఇవ్వబడిన వాని సంయోగముల నుండిగాని తయారుచేయబడవలెను. పదార్థం ముదురు బ్రౌన్ రంగులో (స్ఫటిక నిర్మాణం లేనిదిగాగాని) లేక ద్రవముగాగాని ఉండవలెను.

ముడి పదార్థములు- (ఎ) డెక్స్ట్రోస్ (బి) విలోమీకృత చక్కెర (సి) లాక్టోస్ (డి) మాల్ట్‌సిరప్ (ఇ) సుక్రోస్ మరియు (ఎఫ్) గ్లూకోస్‌సిరప్

2. కారమైలేజేషనులో సహాయం చేయుటకు క్రింది ఆమ్లములు మరియు క్షారములు వాడవచ్చును.

ఆమ్లములు :- 1. ఏసిటిక్ ఆమ్లం 2 సిట్రిక్ ఆమ్లము 3. ఫాస్ఫారిక్ ఆమ్లము 4. సల్ఫ్యూరిక్ ఆమ్లము 5. సల్ఫర్ డయాక్సైడ్ మరియు 6. కార్బోనిక్ ఆమ్లము.

క్షారములు :- 1 అమ్మోనియా లేక అమ్మోనియం హైడ్రాక్సైడ్.
2. పొటాషియం హైడ్రాక్సైడ్ 3. సోడియం హైడ్రాక్సైడ్

3. లవణములు :- అమ్మోనియం, సోడియం లేక పొటాషియం కార్బొనేటు (బైకార్బొనేటుతో సహా) ఫాస్ఫేటు (డయాబేసిక్ ఫాస్ఫేటు మరియుమోనోబేసిక్ ఫాస్ఫేటు), సల్ఫేటు మరియు సల్ఫైటు వాడవచ్చును.

ఈ నియమములో అనుమతింపబడిన ఎమల్సీకరణులు మరియు స్థిరత్వకారకములు కలుపవచ్చును.

**గుర్తింపు పరీక్షలు** - ఎ. 0.5 మి. లీ. ల పాస్ఫారిక్ ఆమ్లం, 2.5 మి. లీ. ల 5 శాతం[W/V] కారమెల్ ద్రావణంకు కలిపిన, అవక్షేపము రాకూడదు.

బి. 100 భాగముల నీటిలో 1 భాగం కారమెల్ కరగించగా ప్రత్యేకమైన రంగుగల స్ఫుటమైన ద్రావణం లభించవలెను.

సి. ద్రావణం 6 గం.లు సూర్యరశ్మిలో నుంచగా ద్రావణం రంగు మారకూడదు. అవక్షేపము రాకూడదు.
పదార్థము యొక్క 10 శాతం ద్రావణము యొక్క కనీస సాంద్రత (గ్రా/మి లీ.) 1.023 ఉండవలెను.

లోహముల మాలిన్యముల గరిష్ఠ పరిమితి -

| | | |
|---|---|---|
| రాగి | (Cu గా) | 30 పి. పి. యం. |
| ఆర్సెనిక్ | (As గా) | 5 పి. పి. యం. |
| సీసం | (Pb గా) | 5 పి. పి. యం. |

**ఎ. 26- 09 : అన్నాట్టో**

పదార్థము క్రింది రెండు రకములలో నుండవలెను.

ఎ. వెన్న మరితర ఆహార పదార్థములలో ఉపయోగించుటకు నూనెలో ద్రావణం

బి. జున్ను (ఛీస్) మరితర ఆహార పదార్థంగా ఉపయోగించుటకు నీటిలో ద్రావణం

సాధారణ :- పదార్థం Bixa Orellana L యొక్క నుండి మాత్రమే రాబట్టి కావలెను. మరియు ఇతర అన్య రంగు పదార్థము కలిగియుండరాదు. అది ఆరోగ్యకరమయిన పరిస్థితులలో తయారు చేసి ప్యాకు చేయబడవలెను.
వెన్న మరితర ఆహార పదార్థములలో వాడుటకు నూనెలో అన్నాట్టో రంగు ద్రావణము :

ఈ నియమములో చేర్చబడిన శాక నూనెలు మాత్రమే ఒంటిగా గాని, సంయోగములో గాని వాడవలెను.

i). నూనెలో అన్నాట్టో రంగు ద్రావణం స్ఫుటంగా నుండవలెను. మరియు 15°C వద్ద తగ్గిన ఆధార పాత్రలలో నిల్వ చేసినప్పుడు కొద్ది స్టేయరైన్ అవశేషము తప్ప, అస్లే యుండవలయును.

రంగు 1 : 1000 [w/v] విలీనత వద్ద ఎమైల్ ఎసిటేట్‌లో ద్రావణం యొక్క రంగు, 1 సెం. మీ. సెల్‌లో లోని బాండు టింటో మీటరుతో కొలువగా క్రింది వాని కంటె తక్కువ యుండరాదు.

పసుపు యూనిట్లు — 5.0
ఎరుపు యూనిట్లు — 0.4

లేక చెప్పబడిన విలీనత వద్ద ప్లంజరు రకం కాలరీ మీటరులో ఉత్తర సూర్యకాంతివంటి పతన కాంతు ఉపయోగించి పోల్చగా 1 సెం. మీ ద్రవలోము వద్ద ద్రావణం రంగు క్రింది నిరింద్రిముకు సమానంగా ఉండవలెను.

| | |
|---|---|
| పొటాషియం డై క్రోమేటు | 0.320 గ్రా |
| కోబాల్ట్ అమోనియం సల్ఫేటు | 2.02 గ్రా |

సల్ఫ్యూరిక్ ఆమ్లం, స్పెషల్‌గ్రేడ్ [1.84] 2 యం. యల్.
స్వేదన జలం — ఒక లీటరు ద్రావణం చేయుటకు
రి ఏజెంట్లు, ఎల్సిటికల్ రి ఏజెంటు గ్రేడ్‌వై యుండవలెను.

గమనిక :- ద్రావణం వాని టిన్‌టోరియల్ విలువ కొంత కాలం స్థిరంగా యున్నప్పటికి, ఎక్కువ కాలం నిల్వ చేసిన తరువాత వాడుటకు పూర్వం మరల పరీక్ష చేయవలెను.

ii) జున్ను (ఛీస్) మరితర పదార్థములో వాడుటకు, నీటిలో అన్నొట్టో రంగు ద్రావణం తయారు చేయుటకు త్రాగెడి నీరు వాడవలెను.

కొద్ది పరిమాణంలో (0.05 - 3 శాతం) క్షారం వాడవచ్చును.

ద్రావణం స్ఫుటంగా నుండవలెను మరియు తగిన ఆధార పాత్రలలో 15°C వద్ద నిల్వ చేసినప్పుడు రంగు అస్లే యుండవలెను.

రంగు - 1 : 10,000 [w/v] విలీనతలో సోడియం హైడ్రాక్సైడ్ లేక పొటాషియం హైడ్రాక్సైడ్‌లో ద్రావణం రంగు 1 సెం. మి. సెల్‌పై కొలువగా పైన (i) లో పేర్కొనబడినట్లుండవలెను.

లోహ మాలిన్యముల గరిష్ఠ పరిమితి :

ఆర్సెనిక్— [As గా] 5 పి. పి. యం.
సీసం — [Pb గా] 20 పి. పి. యం.
రాగి — [Cu గా] 30 పి. పి. యం.

ఎ. 26. 10 : రిబోఫ్లావిన్
(Riboflavin)

రిబోఫ్లావిన్, నారింజ - నారింజ పసుపు రంగులో నున్న స్ఫటిక పొడి

ద్రావణీయత :- నీటిలో కొంచెంగా కరుగును. ఉప్పు ద్రావణంలో మరియు 10 శాతం [w/v] యూరియా ద్రావణంలో ఎక్కువ కరుగును. ఆల్కహాలులో బహు స్వల్పంగా కరుగును. క్లోరోఫర్మ్‌లో, ఈథర్ ద్రావణిలో అసలే కరుగుదు. మరియు కార హైడ్రాక్సైడ్‌ల విలీన ద్రావణంలో కరుగును.

నామాంతరములు పర్యాయ పదములు :
విటమిను బి 2; లాక్టోఫ్లవీన్, లాక్ట్రోఫ్లవీన్
రంగు : పసుపు - నారింజ పసుపు
తరగతి - ఐసో యాల్లక్సియాజైన్
రసాయన నామం — 6-7- డై మిథైల్-9 (డి.రిబిట్టైల్]
ఐసో అల్లోక్సజైన్
అనుభావిక ఫార్ములా - $C_{17}H_{20}N_4O_6$
అణుభారం 376.38

గుర్తింపు - 100 మి. లీ. ల నీటిలో 1 మి. గ్రా రిబోఫవీను ద్రావణం లేత పసుపు - ఆకు పచ్చ మరియు చిక్కని పసుపు - ఆకు పచ్చ రంగులో కనబడే, సోడియం డై థయొనైట్ మరియు ఖనిజ ఆమ్లములు లేక క్షారములు కలిపినప్పుడు మాయమగు ప్రతి దీప్తి కలిగియుండును.

సాధారణ అవసరములు - ఏ రూపములోనయినా పాదరసం, సిలీనియం మరియు క్రోమియం, ఆరోమేటిక్ నైట్రో కాంపౌండులు, ఆరోమాటిక్ హైడ్రోకార్బనులు మరియు సైనైడులు లేనిదై యుండవలెను.

పాన్‌క్యూ 4R క్రింది అవసరములను గూడ పాటించవలెను.

| క్రమ సంఖ్య<br>1 | లక్షణములు<br>2 | అవసరములు<br>3 |
|---|---|---|
| 1. | స్వచ్ఛమయిన రంగు అంశం $105^{\circ} \pm 1^{\circ}C$ వద్ద 2 గంటలు పొడిచేసి సవరించగా | 80. తగ్గకుండ |
| 2. | $134^{\circ}C$ వద్ద బాష్పశీల పదార్థం శాతం, ద్రవరాశిన | 10. మించకుండ |
| 3. | నీటిలో కరుగని పదార్థము శాతం ద్రవ్యరాశిన | 0.5 " |
| 4. | సంయోగ ఈథర్ సారములు శాతం ద్రవ్యరాశిన | 1.0 " |
| 5. | ఉపవర్ణములు శాతం | 0.5 " |
| 6. | మధ్యస్థ, రంగు శాతం | 0.5 " |
| 7. | ఆర్సెనిక్ మిలియనుకు భాగములు | 3 " |
| 8. | సీసం " " | 10.0 " |

ఎ. 26. 12 : కార్మోసైన్
(Carmoisine)

సామాన్య నామం — కార్మోసైన్

పర్యాయ పదములు— అజోరుబైన్, సి. ఐ. ఫుడ్ రెడ్ 3, ఇ. సి. క్రమ సంఖ్య ఇ. 122

స్వేదన జలంలో — 0.1 శాతం [W/V] ద్రావణంలో రంగు - ఎఱుపు

రంగు సూచి నం. [1956] — 14720
వర్గం — మానోజో
రసాయన నామం - 4-సల్ఫో - 1 - నాప్తెలాజో - 1 - నాఫ్తాల్ - 4-సల్ఫోనిక్ ఆమ్లం యొక్క డై సోడియం లవణం

అనుభావిక ఫార్ములా : $C_{20}H_{12}N_2O_7S_2Na_2$
అణు భారం : 502.44

సాధారణ అవసరములు పదార్థం, ఏ రూపంలోనయినా. పాదరసం సెలీనియం మరియు క్రోమియంలు; ఆరోమాటిక్ యామైన్‌లు, ఆరోమాటిక్ నైట్రో కాంపౌండులు, ఆరోమాటిక్ హైడ్రాకార్బనులు మరియు సైనైడులు లేనిదై యుండవలెను.

కార్మోసైన్ క్రింది అవసరములను గూడ పాటించవలెను.

| క్రమ సంఖ్య | లక్షణములు | | అవసరములు |
|---|---|---|---|
| 1 | 2 | | 3 |
| 1. | స్వచ్ఛమైన రంగు శాతం (శాంపిల్ 105 ± 1°C వద్ద 2 గం.లు పొడిచేసి సవరించగా) | | 85 తగ్గకుండా |
| 2: | 135°Cవద్ద బాష్పశీల పదార్థం శాతం ద్రవరాశిన | | 10 మించకుండా |
| 3. | నీటిలో కరుగని పదార్థం శాతం | | 0.5 ,, |
| 4. | సంయోగ ఈథర్ సారముల శాతం | | 0.5 ,, |
| 5. | ఉప వర్ణముల శాతం | | 1.0 ,, |
| 6. | మధ్యస్థ రంగుల శాతం | | 0.5 ,, |
| 7. | ఆర్సెనిక్ మిలియనుకు భాగములు | — | 3 ,, |
| 8. | సీసం ,, ,, | — | 10 ,, |

ఎ. 26. 13 : ఫాస్ట్ రెడ్ - ఇ

సామాన్య నామం : ఫాస్ట్‌రెడ్ - ఇ

పర్యాయ పదములు : సి. ఐ. ఫుడ్ 4, రోజ్ సాలిడ్ - ఇ

స్వేదన జలంలో 0.1 శాతం (M/V) ద్రావణం రంగు — ఎరుపు

రంగు సూచి సంఖ్య — (1956) నెం. 16045

వర్గం - మొనోజో

రసాయన నామం :- 4 - సల్ఫో - నాఫ్థలాజో - 2 - నాఫ్థాల్ - 6 - సల్ఫోనిక్ ఆమ్లం

అనుభావిక ఫార్ములా - $C_{20} H_{12} N_2 O_7 S_2 Na_2$

అణుభారం - 502.44.

సాధారణ అవసరములు : పదార్థం ఏ రూపంలోనయినా, పాదరసం, సిలీనియం మరియు క్రోమియంతో, ఆరోమాటిక్ అమైనులు, ఆరోమాటిక్ నైట్రిక్ సమ్మేళనములు, ఆరోమాటిక్ హైడ్రోకార్బనులు, మరియు సైనైడులు లేనిదై యుండవలెను.

ఫాస్టు రెడ్ - ఇ క్రింద అవసరములను కూడ పాటించవలెను.

| క్రమ సంఖ్య | లక్షణములు | అవసరములు |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 1. | స్వచ్ఛమైన రంగు అంశం శాతం (శాంపిల్ 105 $\pm$ 1°C వద్ద 2 గం.లు పొడిచేసి సవరించగా) | 85 తగ్గకుండా |
| 2. | 135°C వద్ద బాష్పశీల పదార్థం శాతం (ద్రవ్యరాశిన) | 10 మించకుండా |
| 3. | నీటిలో కరుగని పదార్థం శాతం ద్రవ్యరాశిన | 0.5 మించకుండా |
| 4. | సంయోగ ఈథర్ సారముల శాతం | 0.5 " |
| 5. | ఉపవర్ణముల శాతం | 4.0 " |
| 6. | మధ్యస్థ రంగుల శాతం | 0.5 " |
| 7. | ఆర్సెనిక్ మిలియనుకు భాగములు | 3 " |
| 8. | సీసం " " | 10 " |

ఎ. 26. 14 : కోల్‌టార్ ఆహార రంగుల తయారీలు మరియు మిశ్రమములు

రంగు తయారీ : రంగు తయారీలు అనగా ఒకటిగాని, ఎక్కువగాని అనుమతించబడిన కోల్‌తార్ ఆహార రంగులు. విలీనకారి మరియు/లేక ఫిల్లర్ పదార్థంతో కలిగియుండి ఆహారములకు రంగు కలిగించుటకు వాడుటకుద్దేశించబడిన తయారీ.

రంగు మిశ్రమం : ఆహారములకు రంగు వేయుటకు, వాడుటకుద్దేశించబడి విలీనకారి మరియు / లేక ఫిల్లర్ పదార్థములు లేకుండా, రెండుగాని ఎక్కువగాని అనుమతించబడిన కోల్‌తారు ఆహారం రంగుల మిశ్రమం.

రంగు తయారీలోగాని రంగు మిశ్రమంలోగాని అనుమతించబడిన కోల్‌తారు ఆహార రంగులు, సంగతమైన ప్రమాణములకు అనుగుణంగా నిర్ణీత ప్రమాణములకు అనుగుణంగా యుండవలెను. రంగు తయారీలు పొడిగాగాని, ద్రవముగాగాని, ఉండవచ్చును. ద్రవ తయారీలు సాధ్యమయినంతవరకు అవశేషములు లేనివై ఉండవలెను. పొడి తయారీలు, ముద్దలు మరితర కనిపించు బాహ్యపదార్థం లేనివై ఉండవలెను. రంగు తయారీలు, మిశ్రమములు, ఈ నియమముల క్రింద అనుమతించబడిన పరిరక్షకములు మరియు, స్థిరత్వ కారకములు కలిగియుండవచ్చును.

ఈ క్రింది విలీనకారి లేక ఫిల్లర్ పదార్థములు రంగు తయారీలో వాడుట మాత్రమే అనుమతించబడవలెను.

ఎ. త్రాగెడి నీరు, బి. తినదగు ఉప్పు, సి. చక్కెర, డి. డెక్ట్రోసు మోనోహైడ్రేటు, ఇ. ద్రవ గ్లూకోస్, యఫ్. సోడియం సల్ఫేటు, జి. టార్టారిక్ అమ్లము, హెచ్. గ్లిసరీన్, ఐ. ప్రొపిలేన్ గ్లైకోలు, ఆహారగ్రేడ్, జె. విలీన ఎసిటిక్ ఆమ్లం, కె. సార్బిటాల్, ఆహారగ్రేడ్, యల్. సిట్రిక్ ఆమ్లం

రంగు తయారీలో లేక మిశ్రమంలో కోల్‌టార్ రంగు అంశంశాతము (m/m) ఆధారపాత్ర లేబిల్‌పై ప్రకటించవలెను. పొడి రంగు తయారీలో ప్రకటించబడిన విలువ, తేమ లేని ప్రాతిపదికపైన, ద్రవ తయారీలో ప్రకటించ

బడిన విలువ 'ఎట్లు ఉన్నది అప్లే' ప్రాతిపదికపైన, మరియు మొత్తం రంగు ప్రకటించబడిన విలువలో ± 15 శాతంలో ఉండవలెను. రంగు తయారీలు, మరియు రంగులు మిశ్రమములు క్రింది అవసరములు గూడ పాటించవలెను.

| క్రమ సంఖ్య | లక్షణములు | అవసరములు |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 1. | నీటిలో కరుగని పదార్థము శాతం [ద్రవ్యరాశిన] | 1.0 మించకుండా |
| 2. | ఆర్సెనిక్ [As గా] మిలియనుకు భాగములు | 3 ” |
| 3. | సీసం [Pb గా] ” ” | 10 ” |

గమనిక : అన్ని అవసరములు పొడి లెక్కన

ఎ. 27. 01 :- వెండి ఆకు
(Silver leaf)

ఆహార గ్రేడ్ — ముడుతలు, పలకలుగా, కనీసం 99.9 శాతం వెండి కలిగి యున్నదిగా నుండవలెను.

ఎ. 28. వేరుశనగ పప్పు (పొట్టు తీసినది) :-

Arachis hypogols అనుమొక్క నుండి లభించిన సామాన్యముగా "మూంగ్ ఫలీ" అని పిలువబడు నేరుగా భుజించదగు వేరుశనగ పప్పు అను పప్పులు [Kernels] మహుఅ, ఆముదం, వేప, లేక బ్రహ్మదండి వంటి తినదగని గింజలు లేనివై యుండవలెను, రంగు పదార్థము మరియు పరిరక్షక పదార్థములు లేనివై యుండవలెను. రాళ్ళు, దుమ్ము, మట్టి వంటి అన్య పదార్థము లేనిదై యుండవలెను. పప్పులు క్రింది ప్రమాణములను కూడ అనుగుణంగా యుండవలెను.

ఎ. తేమ — 7.0 శాతం మించకుండా

బి. స్వల్పంగా చెడిన వానితో సహా చెడిన పప్పులు — 5.0 శాతం [బరువున] మించకుండా

సి. అఫ్లాటాక్సిన్ అంశం - మిలియన్కు 30 భాగములు మించకుండా

## ఎ. 29 పానీయములు – ఆల్కాహోలిక్

### ఎ. 29. 01: కల్లు
### (Toddy)

అనగా కొబ్బరి, ఈత తాటి చెట్టు లేక ఏదయిన ఇతర రకములైన [Palm] చెట్టు యొక్క, సారాగా పులిసిన ఊట. అది తెల్లగా మబ్బుగా ఉండి నిల్వ చేయగా పేరుకొను పదార్థములు కలిగి, వూటకు స్వాభావికమైన సహజ మయిన వాసన/రుచి కలిగి, ఇతర ఆల్కాహాలు కలుపకుండగానే పులిసినది. అది కలుపబడిన రంగు పదార్థములు, దుమ్ము, అన్య పదార్థములు, లేక ఇతర ఆరోగ్యహాని కలిగించు పదార్థం లేనిదై యుండవలెను. క్లోరల్ హైడ్రేటు మరియు పెరాల్డిహైడు లేనిదై యుండవలెను అది క్రింది ప్రమాణముల కనుగుణంగా యుండవలెను.

| | |
|---|---|
| 1. ఆల్కాహాలు అంశం | 5.0 శాతం [V/V] తగ్గకుండా |
| టార్టారిక్ ఆమ్లంగా మొత్తం ఆమ్లములు [100 లీటర్ల Absolute ఆల్కాహాలుగా చెప్పబడు] | 500 గ్రాములు మించకుండా |
| సి. ఎసెటిక్ ఆమ్లంగా బాష్పశీల ఆమ్లం (100 లీటర్ల Absolute ఆల్కాహాలుగా చెప్పబడు) | 100 గ్రాములు మించకుండా |

గమనిక :- ఈ అనుబంధంలో విధించబడిన ప్రమాణములకు భంగం లేకుండ, ఏ ఆహార వస్తువు తయారీలోనయినా నీరు వాడినప్పుడు అట్టి నీరు, వ్యాధులు కలిగించు మైక్రో ఆర్గానిజములు లేనిదై, మరియు ఆరోగ్యమునకు హాని కలిగించు రసాయన భాగాంశములు లేనిదై యుండవలెను.

— —

# భాగం XI-A

## పంట కాలుష్య కారిణులు మరియు సహజంగా సంభవించు విష పదార్థములు

57. ఎ:- "పంట కాలుష్య కారిణి" అనగా ఆహారమునకు ఉద్దేశ్యపూర్వకముగా కలుపబడని, సేద్యం, పశు సంవర్ధనంలో మరియు పశు వైద్యంలో తీసికొనబడు చర్యలతో సహా, అట్టి ఆహార వస్తువుల ఉత్పాదన ప్రక్రియలలో, తయారీ ప్రాసెసింగ్, ట్రీట్‌మెంటు, ప్యాకింగ్, ప్యాకేజింగ్, రవాణాలో, పట్టుకొనుటలో, పరిసరముల కాలుష్యము వలన, ఆహార వస్తువునకు కలియు పదార్థము

2. క్రింది పట్టికలో (2)వ కాలంలో పేర్కొనబడిన ఆహారము కాలం (1) లో సంబంధిత నమోదులో పేర్కొనబడిన పరిమాణం మించి ఉండరాదు.

### పట్టిక

| కాలుష్యము పేరు | ఆహార వస్తువు | మి గ్రా/కి గ్రా |
|---|---|---|
| ఆఫ్లాటాక్సిన్ | అన్ని అహార వస్తువులు | 0 03 |

57-బి:- సహజముగా సంభవించు విష పదార్థములు: ఏ ఆహార వస్తువులోనైనా సహజంగా సంభవించగల, క్రింది పట్టికలోని విష పదార్థములు సదరు పట్టికలోని కాలం (2)లో సంబంధిత నమోదులో పేర్కొనబడిన పరిమితి దాటరాదు.

| పదార్థం పేరు<br>1 | గరిష్ఠ పరిమితి<br>2 |
|---|---|
| ఆగారిక్ ఆమ్లం | 10 పి. పి. యం. |
| హైడ్రోసియానిక్ ఆమ్లం | 5 పి. పి. యం. |
| హైపరిసైన్ | 1 పి. పి. యం. |
| సాఫ్రోల్ | 10 పి. పి. యం. |

జి. యస్. ఆర్. 764 (ఇ) తేది. 15-11-84 ద్వారా చేర్చబడినది.

# ఆంధ్రప్రదేశ్ ఆహార కల్తీ నివారణ నియమములు
# 1957

జి. ఓ. యం. యస్. 597 పబ్లిక్ హెల్తు తేది 20-3-1958

అధిసూచన

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 యొక్క సెక్షను 24, సబ్ సెక్షను (1) క్రింది అధికారములు పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ గవర్నరు, యిందు మూలంగా ఈ క్రింది నియమములు చేయుచున్నారు :-

1. (1) సంగ్రహనామము :- పరిధి, ప్రారంభము :-

ఈ నియమములను ఆంధ్రప్రదేశ్ ఆహార కల్తీ నివారణ నియమములు, 1957 అని పిలువబడును.

2) అవి ఆంధ్రప్రదేశ్ అంతటా వర్తించును.

3) అవి రాజపత్రంలో ప్రకటించిన తేది నుండి అమలులోనికి వచ్చును.

2. నిర్వచనములు :-

ఈ నియమములలో, సందర్భముగా వేరుగా కోరిన తప్ప

ఎ) 'చట్టం' అనగా ఆహార కల్తీ నివారణ చట్టం 1954

బి) 'ప్రభుత్వం' అనగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

సి) 'ఫుడ్ హెల్త్ అథారిటీ' అనగా డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ హెల్త్

డి) 'ఆరోగ్యాధికారి' అనగా సంబంధిత లోకల్ అథారిటీచే నియోగించబడిన ఆరోగ్యాధికారి మరియు అట్టి అధికారి లేనప్పుడు జిల్లా ఆరోగ్యాధికారి

ఇ) i) 'లోకల్ అథారిటీ' అనగా మద్రాసు జిల్లా బోర్డుల చట్టం 1920లో నిర్వచించబడిన జిల్లాలో మద్రాసు గ్రామ పంచాయితీల చట్టం 1950 క్రింద ఏర్పాటు అయిన పంచాయితీ పరిధిలోని ఏ ప్రాంతమునకైనా, సంబంధిత పంచాయితీ, లేక సదరు పంచాయితీ రద్దయినచో గ్రామ పంచాయితీ చట్టం 1950, సె. 48 సబ్‌సెక్షను 5 క్రింద పంచాయితీ యొక్క అధికారములు విధులు నిర్వర్తించుచున్న ఇతర అథారిటీ.

ii) పై చెప్పబడినట్లు నిర్వచించబడిన జిల్లాలో గ్రామ పంచాయితీ చట్టం 1950 క్రింద ఏర్పాటయిన పంచాయితీ అధికార పరిధిలో లేని అన్ని ప్రాంతములకు, సంబంధిత జిల్లా బోర్డు; లేక జిల్లా బోర్డు రద్దు అయినచో ప్రభుత్వంచే జిల్లా బోర్డు యొక్క కర్తవ్యములు నిర్వర్తించుటకు నియమింపబడిన అథారిటీ.

3. ప్రభుత్వము యొక్క ప్రత్యేక అధికారము :-

ఆహార పదార్థముల వాడకందార్ల సాధారణ హితములపై ప్రభావము కల్గించునట్లనిపించిన ఏ పదార్థమునకు సంబంధించి అయినా ప్రభుత్వము, ఏ ప్రభుత్వ ఉద్యోగినయినా, విశ్లేషణము, ఆహార శాంపిళ్ళను పొందమని ఆదేశించవచ్చును, మరియు దానిపై అట్టి ప్రభుత్వ ఉద్యోగి, ఈ చట్టం క్రింద ఫుడ్ యిన్స్పెక్టరుకు గల అధికారములన్నిటినీ కలిగియుండును. మరియు క్రింది మార్పులకు లోబడి, చట్టం, సదరు ప్రభుత్వోద్యోగి ఫుడ్ ఇన్స్పెక్టరు అయినట్లుగానే వర్తించును.

ఎ) సెక్షను 11 యొక్క సబ్‌సెక్షను (i) లోని క్లాజు [సి] యొక్క సబ్ క్లాజు (ii), (iii) లో పేర్కొనబడిన రెండు భాగములను పబ్లిక్ ఎనలిస్టుకు పంపబడవలెను. అతడు ఒక భాగమును విశ్లేషణము చేసి అది కల్తీ అని అభిప్రాయపడినచో, రెండవ భాగమును తన సర్టిఫికేటుతోపాటు, ఏ ప్రాంతములోనయితే శాంపిల్ తీసికొనబడినదో, ఆ ప్రాంతము యొక్క ఫుడ్ ఇన్స్పెక్టరుకు పంపవలెను. ఆ మీదట సదరు అధికారి ప్రభుత్వముచే చేయబడిన నియమములు ఏమన్నా ఉన్నట్లయితే, వానికి లోబడి తానే విశ్లేషణము చేయించినట్లుగా తదుపరి చర్యలు తీసికొనజేయవలెను;

బి) మరియు 20వ ప్రభుత్వంచే అట్టి విశ్లేషణము కొరకు నిర్ణయింపబడిన రుసుము, శాంపిల్-తీయబడిన ప్రాంతమునకు ప్రయాణ భత్యముతో సహా వానిని పొందుటకు అయిన ఖర్చు భరించవలెను.

4. ప్రభుత్వంచే అధికార ప్రధానము :-

ప్రభుత్వం, రాజపత్రంలో అధిసూచన ద్వారా, పై చట్టం క్రింద దత్తం చేయబడి తమ అధికారములను, బాధ్యతలను ఏ క్రింది ఉద్యోగికయినా ప్రదానము చేయవచ్చును.

అయితే, లోకల్ అథారిటీచే తన పరిధిలోని లోకల్ ఏరియాకి పబ్లిక్ ఎనలిస్టు, ఫుడ్ ఇన్స్పెక్టరు, లేక ఇన్స్పెక్టర్లు ప్రభుత్వము యొక్క పూర్వానుమోదముతో మాత్రమే నియమింపబడవలెను.

5. ఫుడ్ హెల్త్ అథారిటీ యొక్క బాధ్యతలు :-

ఫుడ్ హెల్త్ అథారిటీ ఈ చట్టం క్రింద మరియు దీని క్రింది నియమముల క్రింద ఫుడ్ ఇన్స్పెక్టర్ల మరియు లోకల్ అథారిటీల బాధ్యతలను, కార్యప్రవర్తనల నియంత్రణ, పర్యవేక్షణ చేయవలెను.

6. ఫుడ్ హెల్త్ అథారిటీ యొక్క అధికారములు :-

ఫుడ్ హెల్త్ అథారిటీ సమయ సమయమునకు, సందర్భము కోరినట్లుగా, ఈ చట్టం, మరియు దీని క్రింది నియమములు అమలు పరుచుటకు అవసరమైనట్టి చర్యలను తీసికొనుటకు సిఫారసు చేయవచ్చును. మరియు సదరు లోకల్ అథారిటీ అట్టి చర్యలను అమలు పరచుటకు బద్ధమై యుండును.

7. ఫుడ్ హెల్త్ అథారిటీ యొక్క అధికారముల, విధుల ప్రదానము :-

ప్రభుత్వముచే ఇవ్వబడిన ఆదేశములు, లేక విధించబడిన హద్దులకులోబడి, ఫుడ్ హెల్త్ అథారిటీ, సమయ, సమయమునకు, వ్రాతపూర్వకంగా ఈ చట్టం క్రింది, లేక దీని క్రింది నియమముల క్రింది తనకు గల అన్ని లేక కొన్ని అధికారములను మరియు బాధ్యతలను పేరునగాని, అధికార హోదాపైగాని ఒక ఆరోగ్యాధికారి, లేక ఫుడ్ ఇన్స్పెక్టరుకు లేక లోకల్ అథారిటీకి ప్రధానము చేయవచ్చును; మరియు ఎప్పుడైనా పూర్తిగా గాని పాక్షికంగా గాని అట్టి దత్త ప్రధానమును ఉపసంహరించవచ్చును,

8. లోకల్ అథారిటీల విధులు :-

లోకల్ అథారిటీ ఈ చట్టం మరియు దీని క్రింది నియమముల ఉద్దేశ్యములను అమలు పరచుటకు సమయ సమయమునకు అవసరమయిన చర్యలను లోకల్ అథారిటీ తానుగా మరియు ఫుడ్ హెల్త్ అథారిటీ కోరిక పైన అనుసరించవచ్చును.

అయితే ఏ కారణం చేతనయినా లోకల్ అథారిటీ అట్టి చర్యలు అమలు పరచ లేకపోయినప్పుడు గాని ఫుడ్ హెల్త్ అథారిటీకి, అట్టి లోకల్ అథారిటీకి మధ్య అభిప్రాయభేదము వచ్చినప్పుడుగాని విషయము ప్రభుత్వముచే పరిష్కారము నకు పంపవలెను. ప్రభుత్వము యొక్క తీర్పు కడపటిది.

9. ఖర్చుల చెల్లింపు :-

ఈ చట్టం, దీని క్రింది నియమముల అమలుకు సంబంధించి, ఈ చట్టం క్రింది ప్రాసిక్యూషనుల ఖర్చు, ఫుడ్ యిన్స్పెక్టర్ల ప్రయాణ భత్యములు న్యాయసలహా ఖర్చులు వగైరా నేరం, ఏ లోకల్ అథారిటీ యొక్క అధికార పరిధిలో జరిగినదో అట్టి లోకల్ అథారిటీ భరించవలెను. అట్టి లోకల్ అథారిటీ లేనిచో రాష్ట్రముయొక్క సంచిత నిధి (Consolidated Fund) నుంచి చెల్లించవలెను

10. లోకల్ అథారిటీ యొక్క లోపము: -

ప్రభుత్వం యొక్క అభిప్రాయంలో ఏదేని లోకల్ అథారిటీలో లోపంచేసినా లేదా చట్టం క్రింది విధులను నిర్వర్తించలేకపోయినా, ప్రభుత్వం రాజపత్రంలో/అధి సూచనద్వారా ఎవరైనా ప్రభుత్వోద్యోగికి అట్టి విధులను నిర్వర్తించుటకు ప్రాధికార మీయవచ్చును. అందుకుగాను ఈ చట్టం క్రింద సంబంధించిన లోకల్ ఏరియాలో లోకల్ అథారిటీకిగల అన్ని అధికారములను చలాయించవచ్చును.

11. ఫుడ్ యిన్స్పెక్టరు యొక్క అధికార పరిధి :-

ఫుడ్ యిన్స్పెక్టరు తాను నియమింపబడిన లోకల్ ఏరియాలో ఈ చట్టం క్రింద తనకు దత్తము చేయబడిన లేక ప్రదానము చేయబడిన అన్ని అధికారములను విధులను చలాయించవచ్చును, నిర్వర్తించవచ్చును.

12. పబ్లిక్ ఎనలిస్టు యొక్క అధికార పరిధి :-

లోకల్ అథారిటీ స్వంత పబ్లిక్ ఎనలిస్టును నియమించుకొను అధికారం ఇవ్వబడినచోట తప్ప మిగతా రాష్ట్రమంతటికీ అధికార పరిధి కలిగియుండునట్లు ప్రభుత్వం రాజపత్రంలో ప్రకటనలద్వారా నిర్దేశించబడిన అర్హతలు కలిగియున్న ఒకరుగాని, ఎక్కువగాని వ్యక్తులను పబ్లిక్ ఎనలిస్టుగా నియమించవచ్చును.

13. శాంపిళ్ల నెలసరి కోటాలను నిర్ణయించుటకు ప్రభుత్వమునకధికారము :-

రాష్ట్ర ప్రభుత్వము లోకల్ ఏరియానుండి ఫుడ్ యిన్స్పెక్టరు విశ్లేషణ కొరకు పంపవలసిన శాంపిళ్ళ నెలసరి కోటాలను నిర్ణయించవచ్చును.

14. ఫుడ్ యిన్స్పెక్టరు పంపిన ఆహార శాంపిల్ విశ్లేషణమునకు రుసుము :-

ప్రభుత్వం విశ్లేషణ సదుపాయములు కలిగించినప్పుడు లోకల్ అథారిటీ చట్టం క్రింద తీసికొనబడిన శాంపిల్ ఒక్కటికి రు. 7.50ల చొప్పున సొమ్ము ప్రభుత్వమునకు కట్టవలెను.

15. సెక్షను 12, సెక్షను 13 (2) ల ప్రకారం విశ్లేషణకు రుసుము :

పబ్లిక్ ఎనలిస్టుచే, సె. 12, సె. 13 (2) ల ప్రకారం విశ్లేషణ చేయబడిన శాంపిళ్ళకు చెల్లించబడవలసిన రుసుము శాంపిల్ ఒకటికి రూ 10/-లు తగ్గరాదు అయితే పబ్లిక్ ఎనలిస్టు పనినిబట్టి (శాంపిల్‌కు 50/-లు మించకుండ) తన విచక్షణలో, ఎక్కువ రుసుము కోరవచ్చును.

16. జరిమానాలు లోకల్ అథారిటీకి చెల్లించుట :-

ఈ చట్టంక్రింద మరియు దీని క్రింది నియమముల క్రింద నేరములలో వసూలయిన జరిమానా మరియు ఏమయినా ఉన్నట్లయితే ఖర్చులు, వసూలు రుసుము

క్రింద 10 శాతము న్యాయవ్యవస్థ ఉంచుకొనగా మిగిలినవి సంబంధిత లోకల్ అథారిటీకి చెందవలెను.

గమనిక : జి. ఓ. యం. యస్. 2321 హెల్త్. తేది 17-10-69 ద్వారా న్యాయ వ్యవస్థ ఉంచుకొను జరిమానా శాతము 12 కు పెంచబడినది.

17. అధికారములను ప్రదానము చేయుటకు ప్రభుత్వమునకు అధికారము -

రాష్ట్ర ప్రభుత్వం రాజపత్రంలో అధిసూచనద్వారా ఈ చట్టం క్రింద తనకు సంక్రమించిన దత్తము చేయబడిన అధికారములను తాను విధించు షరతులకు లోబడి చలాయించునట్లుగా ఏ వ్యక్తికయినా, అథారిటీకయినా ప్రదానము చేయవచ్చును.

ఆహార కల్తీ నివారణ నియమములు 1957 కు సవరణల ముసాయిదా. జి. ఓ. యం. యస్. 144 మెడికల్ అండ్ హెల్త్ 26-1-85

అధిసూచన ముసాయిదా

ఆహార కల్తీ నివారణ చట్టం 1954, సె. 4 మరియు సె. 24 ల క్రింద అధికారము పురస్కరించుకొని జి. ఓ. యం. యస్. 597 హెల్త్ 28.3.58 లో జారీ అయిన ఆంధ్రప్రదేశ్ ఆహార కల్తీ నియమములు 1957 కు ప్రతిపాదించబడిన సవరణల ముసాయిదా సదరు చట్టం సె. 24 [i] లో కోరబడినట్లు, సాధారణ సమాచారము కొరకు ఆంధ్రప్రదేశ్ రాజపత్రంలో యిందుమూలంగా ప్రకటించబడినది. —

సదరు ముసాయిదా ఆ అధిసూచన రాజపత్రంలో ప్రకటించబడిన తేదీ నుండి 30 రోజుల తర్వాత పరిశీలనకు తీసుకొనబడునని. అట్టి గడువు ముగియక ముందు ఏ వ్యక్తినుండి అయినా, దీనికి సంబంధించి వచ్చిన అభ్యంతరములు, సలహాలు పరిశీలించబడునని యిందుమూలంగా నోటీసు యివ్వబడటమయినది అభ్యంతరములు సలహాలు ప్రభుత్వ సెక్రటరీ, మెడికల్ అండ్ హెల్తు డిపార్టుమెంట్ ఆంధ్రప్రదేశ్ హైద్రాబాదుకు పంపవలెను.

సవరణ ముసాయిదా

సదరు నియమములతో —

1. రూలు 1 [ii] లో చివరన "కంటోన్మెంటు / విమానాశ్రయం / ఓడరేవు / రైల్వేల పరిధిలోని లోకల్ ఏరియాలు మినహాయించి" అను పదములు చేర్చవలెను.

2. రూలు క్లాజు [సి] లో "డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ హెల్తు" పదములకు బదులుగా "ఆహార కల్తీ నివారణ చట్టం 1954, సెక్షను 2 [iv] క్రింద రాష్ట్ర ప్రభుత్వముచే ఫుడ్ హెల్తు ఆథారిటీగా అధిసూచన చేయబడిన అధికారి" అను పదములు ప్రత్యామ్నాయము చేయవలెను.

3. రూలు 2 క్లాజు [ఇ] ఐటం [ii] తొలగించవలెను.

4. రూలు 2 [ఇ] తరువాత క్రింది క్లాజులు చేర్చవలెను.

యఫ్. 'తయారీదారు' అనగా వృత్తి, వ్యాపారము కొరకు ఆహార వస్తువులను తయారుచేయుటలో పాల్గొను వ్యక్తి.

జి. 'టోకు వ్యాపారి' అనగా మరల అమ్మకం నిమిత్తం, ఆహార వస్తువుల, అమ్మకం, అమ్మకం కొరకు నిల్వ, లేక పంపిణీలలో పాల్గొను వ్యక్తి.

హెచ్. 'చిల్లర వ్యాపారి' అనగా టోకు వ్యాపారి కాని, యితర ఆహార వస్తువుల వ్యాపారి.

ఐ. 'సంచార వ్యాపారి' అనగా స్థిర వ్యాపార స్థలము లేకుండా, వివిధ ప్రదేశములలో తిరుగుచూ ఆహార వస్తువులు అమ్ముకొను వ్యాపారముచేయు వ్యక్తి.

ఈ నియమములలో నిర్వచించబడని అన్ని ఇతర పదములు చట్టంలో ఇవ్వబడియున్న అర్థము కలిగియుండును.

5. రూలు 3 లో 'ప్రభుత్వోద్యోగి' అను పదమునకు ముందు 'ఆహార శాంపిల్సు తీయుటలో కేంద్ర ఆహార కల్తీ నివారణ నియమావళి 1955, రూలు 8 క్రింద అర్హత కలిగియున్న' చేర్చవలెను.

6. రూలు 3 లో క్లాజు [ఎ] కు బదులుగా క్రింది క్లాజు ప్రత్యామ్నాయము చేయబడవలెను.

ఎ. ఆహార కల్తీ నివారణ చట్టం 1954, సెక్షను 11 [సి] [i] క్రింద లోకల్ హెల్తు అథారిటీకి సమాచారము తెలియపరచుచూ ఒక శాంపిల్‌ను పబ్లిక్ ఎనలిస్టుకు విశ్లేషణము కొరకు పంపవలెను. మరియు మిగిలిన రెండు శాంపిళ్ళను సె. 11 [i] (సి) [ii] క్రింద లోకల్ [హెల్త్] అథారిటీకి పంపవలెను.

7 రూలు 3 క్లాజు [బి] లో 'శాంపిల్ తీసికొనబడిన ప్రదేశము యొక్క లోకల్ హెల్తు అథారిటీచే చెల్లించబడవలెను' అని ప్రత్యామ్నాయము చేయబడవలెను.

8. రూలు 4 కు బదులుగా క్రింది రూలు ప్రత్యామ్నాయము చేయబడవలెను.

ప్రభుత్వముచే అధికార ప్రధానము :-

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 క్రింద తమకు 'దత్తము చేయబడిన' అధికారములు, బాధ్యతలను -

1. ప్రభుత్వము రాజ పత్రములో అధిసూచన ద్వారా ప్రదానము చేయవచ్చును.

2. కేంద్ర ఆహార కల్తీ నివారణ నియమావళి 1955, రూలు 8 క్రింద నిర్దేశించబడిన అర్హతలు కలిగియున్నట్టి వ్యక్తులను ఫుడ్ ఇన్‌స్పెక్టర్లుగా నియమించుటకు ఆహార కల్తీ నివారణ చట్టం 1954, సె. 9 క్రింద తమకు దత్తము చేయబడిన అధికారములను రాజ పత్రములో అధిసూచన ద్వారా ఫుడ్ హెల్తు అథారిటీకి ప్రదానము చేయవచ్చును.

3. ప్రభుత్వము ఈ చట్టము యొక్క సె. 20 (i) క్రింద ఫుడ్ హెల్తు అథారిటీకి ఈ చట్టం క్రింద అభియోగము ప్రారంభించుటకు లిఖిత అనుమతి యిచ్చుటకు ఫుడ్ హెల్తు అథారిటీకి అధికార మీయవచ్చును.

9. రూలు 5 లో 'ఫుడ్ ఇన్స్పెక్టర్లు మరియు లోకల్ అథారిటీలు' పదములకు బదులుగా 'పబ్లిక్ ఎనలిస్టు. ఫుడ్ ఇన్స్పెక్టరు మరియు లోకల్ హెల్తు అథారిటీలు' ప్రత్యామ్నాయము చేయవలెను.

10. రూలు 6 కు బదులు క్రింది రూలు ప్రత్యామ్నాయం చేయబడవలెను' ఫుడ్ హెల్తు అథారిటీ యొక్క అధికారములు:-

1) ఫుడ్ హెల్తు అథారిటీ అహార కల్తీ నివారణ చట్టం 1954 యొక్క అమలుకు, పరిపాలన యొక్క సాధారణ పర్య వేక్షణకు బాధ్యుడై యుండును.

2) ఫుడ్ హెల్తు అథారిటీ ప్రభుత్వమును కోరినపుడు, ఈ చట్టం యొక్క అమలు, పరిపాలనకు సంబంధించిన విషయములలో రాష్ట్ర ప్రభుత్వమునకు సలహా యివ్వవలెను.

3) ఫుడ్ హెల్తు అథారిటీ, ప్రజారోగ్య దృష్ట్యా రాష్ట్ర మంతటా, లేదా ఏదేని లోకల్ ఏరియా / లోకల్ ఏరియాలలో అధిసూచన ద్వారా, అధిసూచనలో పేర్కొనబడిన కాలములో ఏదేని ఆహార వస్తువు యొక్క విక్రయం, విక్రయం కొరకు తయారీ, నిల్వ లేక సంపిణీని నిషేధించుటకు అధికారం కలిగియుండును.

4) ఫుడ్ హెల్తు అధారిటీ ఫుడ్ ఇన్స్పెక్టర్లకు శిక్షణ ఏర్పాటు చేయవలెను.

5) ఫుడ్ హెల్తు అథారిటీ ఈ చట్టం యొక్క అమలును సమయ సమయమునకు సమీక్ష చేయవలెను. మరియు కేంద్ర ప్రభుత్వమునకు ఇంకను మేలైన మరియు పటిష్టకరమైన అమలుకు నియమములను, ప్రమాణములను లేక నిబంధనలను సవరించుటకు సలహాలివ్వవలెను.

6) ఫుడ్ హెల్తు అధారిటీ యొక్క నిర్ణయంపై అప్పీలు రాష్ట్ర ప్రభుత్వమునకుండును. రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయమును తుది నిర్ణయము.

11. రూలు (7)లో "పేరునగాని, హోదాన గాని 'హెల్తు ఆఫీసర్ లేక ఫుడ్ ఇన్స్పెక్టరుకు లేక లోకల్ అధారిటీకి' బదులు "లోకల్ హెల్తు అధారిటీ" ప్రత్యామ్నాయము చేయబడవలెను.

12. రూలు 8 లో ప్రతికల్పనకు బదులు క్రిందిది ప్రత్యామ్నాయము చేయబడ వలెను,

"అయితే—

1) లోకల్ హెల్తు అథారిటీ ఫుడ్ హెల్తు అథారిటీకి లోబడి యుండవలెను,

2. లోకల్ హెల్తు అథారిటీ తన అధికార పరిధిలో ఈ చట్టం యొక్క అమలు మరియు ప్రతినిత్య ప్రతిపాలనకు బాధ్యత కలిగియుండును.

3. లోకల్ హెల్తు అథారిటీ ఈ చట్టంయొక్క సెక్షన్ 10 సెక్షన్ [4] క్రింద స్వాధీనం చేసుకొనబడిన, త్వరగా చెడిపోవు ఆహార వస్తువును, అట్టి ఆహార వస్తువు మానవ ఆహారమునకు పనికిరానంతగా చెడిపోయినదని తృప్తిపడినచో, విక్రయదారుకు నోటీసు ఇచ్చిన తరువాత నాశనం చేయవచ్చును.

4. లోకల్ హెల్తు, అథారిటీ ఫుడ్ ఇన్‌స్పెక్టర్లు పంపిన శాంపిళ్ళ రెండు భాగములను తీసికొనవలెను మరియు ఆధార పాత్రమీది మరియు కవరు మీది సీలును నమూనా ముద్రతో పోల్చి చూసి సీలు యొక్క పరిస్థితిని వ్రాయవలెను, మరియు వానిని తన స్వాధీనములో భద్రంగా ఉంచవలెను. ఫుడ్ ఇన్‌స్పెక్టర్ ఒక భాగం పబ్లిక్ ఎనలిస్టుకు పంపినట్లుగా సమాచారమును కూడ పొందవలెను.

5. పబ్లిక్ ఎనలిస్టుగాని, ఇన్‌స్పెక్టరుగాని పబ్లిక్ ఎనలిస్టుకు పంపబడిన శాంపిల్ పోయినదని / చెడిపోయినదని సమాచారం పంపినప్పుడు లోకల్ హెల్తు అథారిటీ రెండవ భాగమును పబ్లిక్ ఎనలిస్టుకు విశ్లేషణ కొరకు పంపవలెను.

6. లోకల్ హెల్తు అథారిటీ పబ్లిక్ ఎనలిస్టు నుండి నివేదికను పొందవలెను.

7. లోకల్ హెల్తు అథారిటీ అభియోగము ప్రారంభించిన వెంటనే, ఎవరి నుండయితే శాంపిలు తీసికొనబడినదో అట్టి వ్యక్తికి మరియు విక్రయదారుఅట్టి వస్తువును ఎవరినుండయితే కొనెనో, అట్టి వ్యక్తి పేరు మరి ఇతర వివరములు సె. 14 [ఎ] క్రింద తెలియపరచినచో, అట్టి

వ్యక్తికి గూడ, కేంద్ర ఆహార కల్తీ నివారణ నియమావళి 1955, రూ. 9 లో వినియ - ఎ పరచిన పద్ధతి ప్రకారం విశ్లేషణ ఫలితము యొక్క నివేదిక నకలును పంపవలెను

8. లోకల్ హెల్తు అథారిటీ, పబ్లిక్ ఎనలిస్టు ఇచ్చిన నివేదిక తప్పు అని అభిప్రాయపడినప్పుడు శాంపిలు భాగములలో ఒకదానిని మరి యొక్క పబ్లిక్ ఎనలిస్టుకు పంపు అధికారం కలిగియుండును.

9. శాంపిల్, చట్టంయొక్క నిబంధనలు లేక దీని క్రింద చేయబడిన నియమముల కనుగుణం ఉన్నప్పుడు లోకల్ హెల్తు అథారిటీ, ఎవరినుండయితే శాంపిలు తీసుకొనబడినదో అట్టి వ్యక్తికి మరియు ఈ చట్టం యొక్క సె. 14 [ఎ] క్రింద పేరు, చిరునామా, మరి ఇతర వివరనులు తెలియబరచబడినచో అట్టి వ్యక్తికి, కేంద్ర ఆహార కల్తీ నివారణ నియమావళి 1955, రూ. 9 -ఎ తో నివిమయపరచబడిన పద్ధతి ప్రకారము, పబ్లిక్ ఎనలిస్టు యొక్క రిపోర్టు చేరిన (10) రోజులలోగా ఫలితం తెలియపరచవలెను.

కోర్టునుండి ఉత్తర్వు పొందినపుడు, లోకల్ హెల్తు అథారిటీ అట్టి ఉత్తర్వు అందిన (5) రోజులలోగా శాంపిళ్ళ యొక్క భాగము భాగములను కోర్టుకు పంపవలెను.

శాంపిల్ యొక్క 2 భాగములను కోర్టుకు పంపగా, కోర్టు ఒక భాగమును లోకల్ హెల్తు అథారిటీకి తిరిగి పంపినపుడు, లోకల్ హెల్తు అథారిటీ అట్టి భాగమును కేంద్ర ఆహార పరిశోధనా శాల డైరక్టరునుండి సర్టిపికేటు వచ్చునంతవరకు ఉంచవలెను.

కేంద్ర ఆహార పరిశోధన శాల డైరక్టరుకు పంపబడిన శాంపిలు పోయిన లేక చెడిపోయినపుడు, కోర్టు అట్లు ఉత్తర్వు చేసినచో, అట్లు కోరబడిన యెడల లోకలు హెల్తు అథారిటీ శాంపిలు యెక్క మిగిలిన భాగమును కోర్టుకు పంపవలెను.

లోకలు హెల్తు అథారిటీ, ఈ చట్టం క్రింద నేరములన్నిటికి బాధ్యత వహించునట్లు డైరెక్టరును, మేనేజరును బాధ్యునిగా చేయుచు కంపెనీచే

ప్రాధికారమీయబడినట్లు నామ నిర్దేశంను తీసికొనవచ్చును. లోకలు హెల్తు అథారిటీ, కేంద్ర అహార కల్తీ నివారణ నియమావళి 1955 రూలు 12 (బి) లో వినిమయ పరచిన విధానం ప్రకారం అట్టి నామ నిర్దేశంను అంగీకరించవలెను.

లోకలు హెల్తు అథారిటీ, కేంద్ర ప్రభుత్వం లేక ఫుడ్ హెల్తు అథారిటీచే ఇవ్వబడు సూచనలు ఆదేశములు ఖచ్చితంగా అనుసరించబడునట్లు చూడవలెను, తన క్రింద నియమించబడిన ఫుడ్ ఇన్స్పెక్టర్లకు ఇవ్వబడిన పేపర్ స్లిప్‌లు (Paper slips) చూపించుచూ లోకలు హెల్తు అథారిటీ రికార్డు చేయవలెను.

లోకలు (హెల్తు) అథారిటీ, సంబంధించిన పబ్లిక్ ఎనలిస్టుకు సమాచారం కొరకు మరియు పేపరు స్లిప్పు యొక్క అధికారం పరీక్ష చేయు నిమిత్తం, తన సంతకం నమూనా, తపాలా చిరునామా మరియు తన అధికార పరిధి, పంపవలెను.

13. రూలు. 9 లో 'ఎవరి అధికార పరిధిలో నేరం జరిగినదో, మరియు అట్టి అథారిటి లేనప్పుడు రాష్ట్ర సంచిత నిధినుండి చెల్లించబడవలెను' పదములకు బదులు "అహార కల్తీ నివారణ చట్టం, 1954 నిబంధనలు అమలు పరచు" అను పదములు ప్రత్యామ్నాయము చేయబడవలెను.

14. రూలు 10 లో లోకలు అథారిటి 'పదము ఎక్కడెక్కడ వచ్చినా,"లోకలు హెల్తు అథారిటి?" అను పదము ప్రత్యామ్నాయము చేయబడవలెను,

15. రూలు 12 లో 'తన స్వంత పబ్లిక్ ఎనలిస్టును నియమించుటకు లోకలు అథారిటికి అధికారమివ్వబడినప్పుడు తప్ప' అను పదములు తొలగించ వలెను.

16. రూ. 13 తొలగించబడవలెను,

17. రూ. 14లో 'రూ.7-80 కు' బదులు 'శాంపిల్ ఒకటికి(పాల శాంపిలు తప్ప) 20 రూపాయలు, పాల శాంపిలుకు రూ. 10/-లు' అను పదములు అంకెలు ప్రత్యామ్నాయం చేయబడవలెను.

18. రూ. 15 కు బదులు క్రింది రూలు ప్రత్యామ్నాయం చేయబడవలెను "సెక్షను 12, సెక్షను 13 (2)ల ప్రకారం విశ్లేషణకు రుసుము - పబ్లిక్

ఎనలిస్టుచే సె. 12, సె. 13(2)ల నిమిత్తం విశ్లేషణ చేయబడిన శాంపిళ్ళకు పైవేటు శాంపిళ్ళకు, ఇతర రాష్ట్ర ప్రభుత్వముల శాంపిళ్ళకు చెల్లించబడ వలసిన రుసుము పాల శాంపిలు ఒకటికి రూ. 10/-లు తగ్గరాదు మరియు అన్ని ఇతర ఆహార వస్తువులకు శాంపిలు ఒక్కంటికి రూ. 20/-లు రుసుము విధించ వలెను"

19. రూలు 16 కు క్రిందిది ప్రత్యామ్నాయము చేయబడవలెను.

ఎ) క్రిమినలు ప్రొసిజర్ కోడ్ 1973 సబ్ సెక్షన్ (2)లో ఏమి ఉన్నప్పటికి, ఆహార కల్తీ నివారణ చట్టం 1954 యొక్క నిబంధనల క్రింద, మరియు దీని క్రింద చేయబడిన నియమావళి క్రింద, కోర్టు విధించిన అన్ని జరిమానాలు మరియు ఖర్చులలో అప్పీలు గడువు గడచిన తరువాత, న్యాయ వ్యవస్థచే, వసూలు ఖర్చుల క్రింద 10 % ఉంచుకొని మిగిలినవి మొదట రాష్ట్ర ప్రభుత్వం లేక సంబంధిత లోకలు అథారిటీకి జమ చేయవలెను.

బి) అప్పిలేట్ కోర్టు జరిమానా మొత్తంను తగ్గించినపుడు లేక ఈ చట్టం క్రింద మరియు ఉత్తర్వుల క్రింద ఏ వ్యక్తి అయినా దోషిగా నిర్ణయించబడిన తీర్పును కొట్టివేసి జరిమానా వాపసుకు ఉత్తర్వు నిచ్చినపుడు, సంబంధించిన లోకలు ఏరియా యొక్క లోకలు హెల్తు అథారిటీ, దాని ప్రకారం జరిమాన వాపసు ఇవ్వవలెను.'

20. రూలు 17 తరువాత క్రింది నియమములు చేర్చవలెను.

18. రాష్ట్రమునకు రెండవ పబ్లిక్ ఎనలిస్టు :-

కర్ణాటక ప్రభుత్వం యొక్క పబ్లిక్ ఎనలిస్టుగాని రాష్ట్ర ప్రభుత్వంచే అధిసూచన చేయబడిన ఏ ఇతర పబ్లిక్ ఎనలిస్టు అయినా, ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె. 13 సబ్ సె. 2 (ఇ) లోని నిబంధనల నిమిత్తం 2వ పబ్లిక్ ఎనలిస్టు అయి ఉంటును.

## భాగం II

## లైసెన్సింగ్ షరతులు

19, లైసెన్సింగ్ అథారిటీ :-

ఆహార కల్తీ నివారణ నియమావళి 1955 రూలు 50 నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం, రాజపత్రంలో అధిసూచనద్వారా తగిన హోదాగా భావించిన

వ్యక్తులను వారికే కేటాయించబడిన లోకల్ ఏరియాలో లైసెన్సులు ఇచ్చుటకు లైసెన్సింగ్ అథారిటీగా నియమించవచ్చును

ఈ నియమముల క్రింద లైసెన్స్ మంజూరి కొరకు దరఖాస్తు, ఈ నియమము లకు అనుబంధించబడిన ఫారం I లో సంబంధించిన లోకల్ ఏరియా యొక్క లైసెన్సింగ్ అథారిటీకి చేయవలెను. అతడు ఇందులో విధించబడిన విధానము ప్రకారం ఫారం - II లో లైసెన్సు మంజూరు చేయవలెను.

20. లైసెన్సుకు షరతులు :- లైసెన్సు ఇచ్చుటకు ముందు క్రింది షరతులు నెరవేర్చవలెను-

ఎ. ఆహార వస్తువు విక్రయమునకు ప్రదర్శన, లేక పంపిణీ చేయు వ్యాపార ఆవరణ, లేక దుకాణం పారిశుద్ధ లోపములు లేకుండా ఉండవలెను; మరియు వ్యాపార ఆవరణకు లైసెన్సింగ్ అథారిటీ కోరబడినట్టి మార్పులు చేయవలెను.

బి. లైసెన్సు దారు అంటురోగములు లేదా అసహ్యకరమైన రోగములచే బాధ పడుచున్న ఏ వ్యక్తిని ఉద్యోగములో పెట్టుకొనరాదు.

సి. ఆహార వస్తువుల ప్రతీ తయారీదారు, లేక టోకు వ్యాపారి, లేక పంపిణీ దారు తయారు చేయబడిన, ముట్టిన, లేక అమ్మిన పరిమాణములను చూపుచు ఒక రిజిష్టరు నిర్వహించవలెను; మరియు అట్టి రిజిష్టరు లైసెన్సింగ్ అథారిటీ, లేక ఫుడ్ ఇన్స్పెక్టరు కోరినపుడు తనిఖీ కొరకు చూపవలెను.

డి. లైసెన్సుదారు ఎప్పుడును లైసెన్సు కాలమునందు లైసెన్సు షరతులకు వ్యతిరేకముగా ఏ ఆహార వస్తువును తయారీ, విక్రయము, నిల్వ, పంపణీ చేయరాదు.

ఇ. లైసెన్సు అవసరమయిన ఏ ఆహార వస్తువునయినా అమ్మకమునకు తయారీ, నిల్వ, విక్రయం, పంపిణీ లేక అమ్మకమునకు ప్రదర్శన చేయ దలచిన ఏ వ్యక్తి అయిన నిర్ణీత నమూనాలో షెడ్యూలు 1, షెడ్యూలు 2 లలో విహితపరచిన రుసుము మరియు ఫారం iii లో యోగ్యత గురించి మెడికల్ సర్టిఫికేటు కూడ జతపరచి దరఖాస్తు పెట్టవలెను. లైసెన్సు రుసుము, మరియు, ఉన్నట్లయితే, కాంపౌండింగు రుసుము, ప్రభుత్వ ఖజానాలో లేక

స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్‌లో క్రింది హేడ్ ఆఫ్ అకౌంట్ క్రింద జమ చేయవలెను.

"182 - Public Health - Sanitation and water supply (35) - Fees, Fnies etc under H. F. A. Act"

యఫ్. ఆహార వస్తువులు ఒకటి కంటే ఎక్కువ ఆవరణలలో లేక స్థలములలో అదే వ్యక్తి, లేక వ్యక్తులచే, ఒకటి కంటే ఎక్కువ లోకల్ ఏరియాలలో విక్రయం కొరకు తయారీ, విక్రయం, లేక పంపిణీ చేయబడినచో ఒకే లోకల్ ఏరియా లేని ప్రతి ప్రదేశమునకు సంబంధించి విడిగా దరఖాస్తు పెట్టబడవలెను; మరియు విడిగా లైసెన్సు ఇవ్వబడవలెను.

జి. లైసెన్సింగ్ అథారిటీ లైసెన్సు ఇచ్చుటకు నిరాకరించినపుడు లేక నిలుపుదల చేసినపుడు లేక రద్దు చేసినపుడు, అట్టి ఉత్తర్వు చేయకముందు అది లైసెన్సుదారుకు లేక దరఖాస్తు దారుకు, అట్టి ఉత్తర్వు ఎందుకు చేయకూడదో, నిర్ణీత గడువులో జవాబు చెప్పవలెనని కోరుచూ లిఖిత పూర్వకమయిన నోటీసు ఇవ్వవలెను మరియు దరఖాస్తుదారు లేక లైసెన్సు వారు అట్టి కారణం చూపనిచో లేక కారణం చూపినచో, లైసెన్సింగ్ అథారిటీ యొక్క అభిప్రాయములలో అది సంతృప్తికరంగా లేనప్పుడు, లైసెన్సింగ్ అథారిటీ ఉచితమయిన ఉత్తరువులు జారీ చేయవచ్చును.

హెచ్. ఈ నియముల క్రింద లైసెన్సింగ్ అథారిటీ చేసిన ఉత్తర్వులపై ఏ వ్యక్తి అయిన రాష్ట్ర ఫుడ్ హెల్తు అథారిటీకి అట్టి ఉత్తర్వు అందిన [30] రోజులలో అప్పీలు చేసికొనవచ్చును.

ఐ. ఏ లైసెన్సుదారునూ, లైసెన్సు నిలుపుదల చేసినందుకు లేక రద్దు చేసినందుకు నష్టపరిహారమునకు లేక దాని గురించి కట్టబడిన ఎట్టి రుసుము యొక్క వాపసునకు అర్హుడు కాదు.

జె. మానవ భోజనమునకుద్దేశించబడినవి కావని లేబిలు ద్వారా లేక నోటీసు బోర్డు ద్వారా ప్రకటించబడిన ఎట్టి ఆహార వస్తువులను, లైసెన్సు క్రింద ఇతర ఆహార వస్తువుల తయారీ లేక విక్రయమునకు నిల్వ చేయు అదే ఆవరణలో, నిల్వ చేయరాదు.

కె. లైసెన్సు పటములో పెట్టి లైసెన్సు యివ్వబడిన ఆవరణలో ప్రముఖమైన భాగములో ప్రదర్శించబడవలెను. మరియు అది ఎవరైనా లైసెన్సింగు అధారిటి లేక, ఫుడ్ ఇన్‌స్పెక్టరు కోరినపుడు హాజరు పర్చవలెను

యల్. లైసెన్సు, లైసెన్సింగ్ అధారిటీ యొక్క లిఖిత పూర్వక అనుమతి లేకుండా బదిలీ చేయబడరాదు. లైసెన్సులో పేర్కొనబడిన ఆవరణకు, అందులో పేర్కొనబడిన వ్యక్తి, వ్యక్తులకు మరియు పేర్కొన బడిన ఆహార వస్తువునకు మాన్యత కల్గియుండును. ఒక వేళ లైసెన్సుదారు ఏదైనా లైసెన్సు కావలసిన ఆహార వస్తువు అమ్మకమునకు ఆదనముగా ఉంచగోరినచో, అతడు ఉన్నట్లయితే, అదనపు రుసుము చెల్లింపుకు లోబడి లైసెన్సుకు దరఖాస్తు పెట్టుకొనవలను

యమ్. ఇందులో విహితపరచబడిన లైసెన్సు షరతులు, ఆహార కల్తీ నివారణ నియమావళి యొక్క రూలు 49 మరియు 50 లోని షరతులతో కలిపి చదువ వలెను మరియు అదనముగా ఉండును.

న్. లైసెన్సింగ్ అధారిటి చే ఒకటి కంటె ఎక్కువ ఆహార వస్తువులకు ఒకే లైసెన్స్ ఇవ్వబడవచ్చును.

ఓ. రాష్ట్ర ప్రభుత్వము లయిసెన్సింగ్ అధారిటీలను నియమించవలెను. లైసెన్సింగ్ అధారిటి, ఫుడ్ హెల్తు అధారిటి యొక్క పూర్వ ఆమోదముతో, లిఖితపూర్వక ఉత్తర్వు ద్వారా లైసెన్సులపై సంతకం చేయు అధికారము మరియు ఉత్తర్వులో పేర్కొనబడినట్టి అధికారములను, తన అధీనములోని ఫుడ్ ఇన్‌స్పెక్టర్లకు ప్రదానము చేయవచ్చును.

పి. ఆహార వస్తువుల తయారీ, నిల్వ లేక ప్రదర్శన కొరకు లైసెన్సు కావలసి యున్నచో అట్టి లైసెన్సు మంజూరు చేయుటకు ముందు లైసెన్సింగ్ అధారిటి ఆవరణను తనిఖి చేయవలయును మరియు కేంద్ర ఆహార కల్తీ నివారణ నియమావళి 1955, రూలు 49 క్రింద ఏర్పాటు చేయబడిన లైసెన్సు నిబంధనల ప్రకారం పారిశుద్ధలోపములు లేనట్లుగా తృప్తిచెంద వలెను. దరఖాస్తుదారు ఆవరణకు లయిసెన్సింగ్ అధారిటిచే కోరబడినట్టి మార్పులు చేయవలను.

క్యూ. హోటళ్ళు, రెస్టారెంట్లు మరియు ఇతర ఆహార విక్రయశాల (సంచార ఆహార విక్రయశాలతో సహా)ల యజమానులు నేతిలో, తినదగు నూనె మరి ఇతర కొవ్వులలో వండబడిన తీపి పదార్థములు, ఖాద్యాలు మరితర వస్తువులు అమ్మిన లేక అమ్మకమునకు ప్రదర్శించినచో గునుగోలుదారు సమాచారముకొరకు అట్టి ఆహార వస్తువులు వండబడిన వంట నూనె తెలియబరచుచు బోర్డు ప్రదర్శించవలెను.

ఆర్. అమ్మకమునకుద్దేంచబడిన ఆహార వస్తువుల నిలువ లేక తయారీలో ఉపయోగించిన పాత్రలన్నియు కాలుష్యము నివారించునట్లు తగినట్టి మూత గలిగియుండవలెను.

ఎస్. ఈ నియమముల క్రింద లైసెన్సు పొందిన వీధుల వెంట తిరిగి అమ్ము వ్యాపారి స్ఫుటముగా లైసెన్సు నంబరు, లైసెన్సు మంజూరు చేయబడిన ఆహార వస్తువు స్వభావము, తన పేరు, చిరునామా, ఉన్నట్లైతే, తాను ఎవరి కొరకైతే పని చేయుచున్నాడో అట్టి యజమాని యొక్క పేరు, చిరునామా, చూపుచు తన భుజము పైన లోహపు బాడ్జి గాని తన ఫోటో కలిగియున్న గుర్తింపు కార్డు గాని ఉంచుకొనవలెను. గుర్తింపు పత్రం ప్రతి సంవత్సరం పొడిగించుకొనవలెను.

టి. ఆహార వస్తువులు అమ్ము ప్రతి లైసెన్సుదారు అమ్మకమునకు ప్రదర్శించుచున్న లేక ప్రతిపాదించుచున్న లేక ప్రతిపాదించున్న వస్తువుల స్వభావము చూపుచు ఒక నోటీసు బోర్డు ప్రదర్శించవలయును.

యు. లైసెన్సుదారు, చేతులు కడుగుకొనుటకు మరియు వంటసామాగ్రి కడుగుటకు శుభ్రము చేయుటకు సరి అయిన ప్రదేశం ఏర్పాటు చేయవలయును. లైసెన్సుదారు ఆవరణను లైసెన్సు మంజూరు చేయబడిన పనికి తప్ప ఇతర అవసరములకు వాడరాదు.

వి. లైసెన్సింగ్ అథారిటీ, తగిన కారణములున్నచో, ఈ నియమముల క్రింద నిర్ణీతమయిన రుసుము తీసికొని 'డూప్లికేట్' అని పదములు ప్రస్ఫుటముగా కనబడునట్టి లైసెన్సు యొక్క మరి యొక్క ప్రతి ఇవ్వవచ్చును.

21. లైసెన్సింగ్ రుసుము :-

ప్రతి లైసెన్సునకు షెడ్యూలు i మరియు ii లలో విహితపరచిన రుసుము వసూలు చేయవలయును.

22. లైసెన్సు గడువు :-

ఎ. రద్దు లేక తాత్కాలిక రద్దు, నిలుపుదల చేసినపుడు తప్ప, లైసెన్సు ప్రతి సంవత్సరం మార్చి 31 తేది వరకు అమలులో ఉండును. ఐతే లైసెన్సు మానత్య గడువు ముగియక ముందు క్రొత్త లైసెన్సు కొరకు దరఖాస్తు చేయబడినచో అట్టి దరఖాస్తు ఉత్తర్వులు చేయువరకు లైసెన్సు మాన్యత కొనసాగును.

బి. డూప్లికేటు లయిసెన్సునకు రుసుము, తయారీదారు రుసుము 10/- (పది రూపాయలు మాత్రమే) టోకు వ్యాపారి రూ. 5/- (ఐదు రూపాయలు మాత్రమే) మరియు చిల్లర వ్యాపారి రూ, 1/- (ఒక రూపాయి మాత్రమే) కట్టవలెను.

సి. లైసెన్సు ఒక ఏప్రిల్ 1వ తేదినుండి ప్రారంభమై మార్చి 31వ తేదీతో అంతమగునట్లు ఒక సంవత్సరకాలమునకు మంజూరి చేయవచ్చును. ఆహార కల్తీ నివారణ నియమావళి 1955, రూలు 50 దీనికి వర్తించును.

డి. ప్రస్తుత లయిసెన్సు గడువు ముగియుటకు కనీసం (30) రోజులు ముందు లయిసెన్సుదారు, లయిసెన్సుపొడగింపునకు ఫారం-1 లో దరఖాస్తు చేయవలయును. తప్పినచో ఆలస్యమునకు అపరాధముగా తయారీదారు, టోకు వ్యాపారినుండి రూ, 10/- (పది రూపాయలు మాత్రమే), చిల్లర వ్యాపారి నుండి రూ. 5/- (ఐదు రూపాయలు మాత్రమే) సంచార వ్యాపారినుండి రూ. 1/- (ఒక రూపాయ మాత్రమే) నెలకు వసూలు చేయబడవలెను. లైసెన్సు గడువు ముగిసిన 6 నెలల తరువాత పొడగింపునకు చేయబడిన దరఖాస్తు క్రొత్త లైసెన్సుకొరకు దరఖాస్తుగాను, పాత లైసెన్సు రద్దయినట్లుగాను పరిగణించబడవలెను. అంతేగాక ఒక సంవత్సరం కంటే తక్కువ కాలమునకు మంజూరు చేయబడిన లైసెన్సును పొడగించబడరాదు.

ఇ. పొడగింపు రుసుము కూడ షెడ్యూలు - I మరియు - II లలో విహితపర్చబడిన ప్రకారం వసూలు చేయబడవలెను. లోకల్ హెల్తు అథారిటీలు, లేక ప్రాధికారమీయబడినచో, ఫుడ్ ఇన్స్పెక్టర్లు లైసెన్సును పొడిగించవచ్చును.

23. లైసెన్సు రద్దు :-

ఎ. లైసెన్సింగ్ అథారిటీ లిఖిత పూర్వకంగా కారణములు వ్రాసి లైసెన్సుదారునకు ప్రతివాదము చేయుటకు అవకాశమిచ్చిన తర్వాత, ఈ నియమముల క్రింద మంజూరు చేయబడిన లైసెన్సును రద్దు చేయవచ్చును; కొట్టివేయవచ్చును, నిలుపు చేయవచ్చును, లేక పొడిగించుటకు తిరస్కరించవచ్చును.

బి. లైసెన్సు ఇచ్చుటకు నిరాకరించిన, కొట్టివేసిన, నిలిపి వేసిన, లేక పొడిగించుటకు నిరాకరించిన లైసెన్సింగ్ అథారిటీ యొక్క ఉత్తరువుపై ఫుడ్ హెల్తు అథారిటీకి అప్పీలు చేసికొనవచ్చును. వారి ఉత్తర్వు తుది ఉత్తర్వు అగును.

24. రుసుము :-

లైసెన్సు నియమముల క్రింద ఏ రుసుము అయినా కాంపౌండింగు రుసుముతో సహా ఫుడ్ హెల్తు, అథారిటీ ఉంచుకొనవలెను. 90 శాతము సంబంధించిన లోకల్ హెల్తు అథారిటీకి జమ చేయవలెను.

షెడ్యూలు I.

ఆహారముల తయారీ మరియు విక్రయమునకు లైసెన్సు రుసుము యొక్క పట్టిక.

| | | రూ. పై. |
|---|---|---|
| 1. | నూనె, బియ్యం, పిండి (ప్రతి వస్తువునకు) | 75-00 |
| 2. | చక్కెర | 75-00 |
| 3. | కార్బనీకృత జలము | 30-00 |
| 4. | ఐస్, ఐస్‌క్యాండీ, ఐస్‌క్రీం, (ప్రతి వస్తువునకు) | 30-00 |
| 5. | ఐస్, ఐస్‌క్యాండి, ఐస్‌క్రీం (ఏ రెండు ఐటంలకైనా) | 50-00 |

| | | |
|---|---|---|
| 6. | బిస్కట్లు, రొట్టె, మరి ఇతర బేకరీ ఉత్పత్తులు | 50-00 |
| 7. | ఐస్, ఐస్‌క్రీం, మరియు ఐస్‌క్యాండీ | 75-00 |
| 8. | కన్‌ఫెక్షనరీ | 30-00 |
| 9. | డైరీ ఉత్పత్తులు అనగా | 20-00 |
| ఎ. | పాలు లేక స్కిమ్డ్‌పాలు సెపరేటెడ్ పాలు లేక రికన్‌స్టిట్యూటెడ్ పాలు | 20-00 |
| బి. | పాలు లేక స్కిమ్డ్‌పాలు సెపరేటెడ్ పాలు లేక రికన్‌స్టిట్యూటెడ్ పాలు (ఫ్యాక్టరీలో అమ్మినచో) లేక రోజుకు 5 క్వింటాళ్ళ కంటే ఎక్కువ అమ్మినచో) | 50-00 |
| సి. | పాల ఉత్పత్తులు, ఖోవా క్రీం, రబ్రీ, పెరుగు మరియు ఇతర ఖోవా తీపి పదార్థములు | 60-00 |
| డి. | నెయ్యి, (విక్రయమునకు ఫ్యాక్టరీ తయారుచేసినచో) | 75-00 |
| ఇ. | వెన్న (విక్రయమునకు ఫ్యాక్టరీ తయారుచేసినచో) | 50-00 |
| యఫ్. | పాల ఉత్పత్తులు, శిశు ఆహారము, నెయ్యి మరియు వెన్న | 75-00 |
| 10, | మరబట్టిన సుగంధ ద్రవ్యములు, గానుగ (యాంత్రిక శక్తి లేకుండ) లో తీసిన నూనె, గృహ పరిశ్రమలో బెల్లం, ప్రతి వస్తువునకు. | 20-00 |
| 11. | ఆల్కహాలిక్ పానీయములు | 75-00 |
| 12. | ఆహారము తయారుచేసి క్రిందివానిలో అమ్మినచో | |
| ఎ. | హోటలు - రెస్టారెంట్ | 40-00 |
| బి. | హోటలు | 30-00 |
| సి. | దాభా | 20-00 |
| డి. | ఇద్దరు లేదా ఎక్కువ నౌకర్లున్న రెస్టారెంట్ | 30-00 |
| ఇ. | ఒక నౌకరున్న రెస్టారెంట్ | 20-00 |

| | | |
|---|---|---|
| | యఫ్. సంచార విక్రయవారు | 10-00 |
| | జి. రేరీ వాలా | 10-00 |
| 13. | తీపి పదార్థములు | 20-00 |
| 14. | దేశీయ సారా | 25-00 |
| 15. | ఇంగ్లీషు సారా, విస్కీ, బీర్ వగైరా | 75-00 |
| 16. | ఏదైన ఇతర వస్తువు | 15-00 |

## షెడ్యూలు II.

### ఆహార విక్రయమునకు లైసెన్సు రుసుము యొక్క పట్టిక

| | | |
|---|---|---|
| 1. | టోకు వ్యాపారి | 50-00 |
| 2. | టోకు - చిల్లర వ్యాపారి | 60.00 |
| 3. | చిల్లర వ్యాపారి | 20-00 |
| 4. | సంచార వ్యాపారి | 10-00 |
| 6. | రేరివాలా | 15-00 |
| 7. | హాల్వాయి | 15-00 |
| 8. | తయారుచేసిన టీ అమ్మువారు | 10-00 |
| 9. | దాభా | 10-00 |

---

## ఫారం I

విక్రయమునకు తయారీ / విక్రయం / విక్రయం కొరకు నిల్వ / టోకున / చిల్లరన పంపిణీ చేయుటకు లైసెన్సు / పొడిగింపునకు దరఖాస్తు నమూనా.

లైసెన్సింగ్ అథారిటీకి / లోకల్ హెల్తు అథారిటీకి

నేను / మేము ........................................ యొక్క కుమారుడు / కుమార్తె / భార్య, వయస్సు ........................................పురుషుడు/స్త్రీ........ నివాసం........................................ వృత్తి....................

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 క్రింది నిబంధనలు మరియు నియమావళి క్రింద లైసెన్సింగు అథారిటీ / క్రింది లోకల్ ఏరియాలో ........ .................. వద్ద ఆవరణలోని దుకాణములోనుండి విక్రయం కొరకు తయారి / విక్రయం / విక్రయించుటకు నిల్వ / టోకున / చిల్లరన పంపిణీ చేయుటకు కొత్త లైసెన్సు / పొడగింపు కొరకు దరఖాస్తు చేయుచున్నాను(ము).

2. లైసెన్సు దరఖాస్తు చేసిన ఆహార వస్తువుల తరగతి........

3. నేను / మేము ఆహార కల్తీ నివారణ చట్టం 1954 యొక్క నిబంధనలు మరియు దాని క్రింది నియమములకు కట్టుబడియుండెదను [ము], మరియు మంజూరు చేయబడిన లైసెన్సు నిర్బంధములు మరియు షరతులకు లోబడి పై వ్యాపారము చేసెదను(ము).

4. నేను/మేము ఇందులో నా/మా స్వంత, మరియు నా/మా నౌకరు/నౌకర్ల మెడికల్ సర్టిఫికేటు(లు) ఫారం III లో జత పరచుచున్నాను(ము).

5. రూ........ లు ప్రభుత్వము 'హెడ్ ఆఫ్ అకౌంటు'

"082 - Public Health Sanitation and water supply (35) Fees, Fines under P F A Act etc."

క్రింద చెల్లించినాను/జమకట్టినాను.

6. నా/మా పరోక్షములో శ్రీ/శ్రీమతి........................................ వయస్సు ............ పురుషుడు/స్త్రీ................ నివాసము............... పై వ్యాపారము నిర్వహించును.

7. పై చెప్పబడిన విషయములు నా/మాకు తెలిసినంత వరకు, నమ్మకమునకు సత్యములు మరియు ఏవైన అసత్యములు కనుగొనబడినచో లైసెన్సు నిలుపుదల రద్దు లేక, జప్తు చేయబడును.

గమనిక :- భాగ స్వామ్య సంస్థ లేక లిమిటెడ్ కంపనీ, లేక కోఆపరేటివ్ సొసైటి అయిన సందర్భములో, భాగస్వామ్య పత్రము, లేక ఆర్టికిల్స్ ఆఫ్

అసోసియేషన్, లేక కో ఆపరేటివ్ సొసైటీల రిజిష్ట్రారు ఇచ్చిన రిజిస్ట్రేషను సర్టిఫికేటు.........నకలు దరఖాస్తుకు జత పరచవలెను.

తేది........

దరఖాస్తుదారు సంతకం నమూనా

1....................... దరఖాస్తుదారు సంతకం.

2.......................

3.......................

---

ఫారం II

నం. తేది.

............ యొక్క విక్రయం కొరకు తయారీ / విక్రయం / విక్రయం కొరకు నిల్వ / పంపిణీకి లైసెన్సు.

శ్రీ/శ్రీమతి........

యొక్క కుమారుడు / కుమార్తె / భార్య.......................వయస్సు ............ పురుషుడు/స్త్రీ ................... నివాసం ............... జిల్లా ............... ఇందుమూలంగా, తయారీదారు / టోకువ్యాపారి / చిల్లర వ్యాపారి/గా ............... ...............మునిసిపల్ (ప్రకటిత ఏరియా) పట్టణ ప్రాంతం/గ్రామ ప్రాంతం/ పరిధిలోని............ ఆవరణలో ఆహార కల్తీ నివారణ చట్టం 1954 నిబంధనలకు మరియు నియమావళికి మరియు రాష్ట్ర నియమములో రూలు 20 క్రింది షరతులకు లోబడి * ..........................—............ విక్రయించుటకు / విక్రయమునకు ప్రతిపాదించుటకు లేక ప్రదర్శించుటకు లేక నిల్వ చేయుటకు లైసెన్సు మంజూరు చేయబడినాడు.

లైసెన్సుదారు శ్రీ / శ్రీమతి ..................... వయస్సు ............ పురుషుడు/స్త్రీ ...................నివాసం ..................... లేనప్పుడు సె. 17 సబ్‌క్లాజు (2) క్రింద నామ నిర్దేశము చేయబడిన శ్రీ / శ్రీమతి ............... ........................డైరెక్టరు / మేనేజరు వ్యాపారమునకు బాధ్యత వహించును.

లైసెన్సు……… తేదీనుండి ……………… వరకు అమలులో ఉండును.

జారీ చేయబడిన తేదీ. లైసెన్సింగ్ అథారిటీ

* ఇచట లైసెన్సు మంజూరు చేయబడిన ఆహార వస్తువులు పేర్కొనుము.

## ఫారం III

### మెడికల్ యోగ్యతా పత్రము

1. పేరు
2. తండ్రిపేరు
3. వయస్సు
4. ప్రస్తుత చిరునామా
5. ఎత్తు
6. గుర్తులు
7. సంతకము / వేలిముద్ర
8. యక్స్-రే రిపోర్టు
9. మల మూత్ర పరీక్షల రిపోర్టు
10. కలరా, మశూచికము, మరియు టైఫాయిడులకు నిరోధక టీకాలు తీసికొనిన తేది

తేది. మెడికల్ ఆఫీసర్

స్థలము

— — —

## ఫారం IV

ఆహార కల్తీ నివారణ చట్టం 1954, రూలు 50 (12) క్రింద వెన్న, నేయి వనస్పతి, తినదగు నూనెల మరియు ఇతర కొవ్వుల తయారీదార్లు - లేక టోకు వ్యాపారులు, లేక యితర వ్యాపారులు వ్రాయవలసిన రిజిష్టరు.

1. పేరు
2. ఆవరణ చిరునామా
3. లైసెన్సు యొక్క సంఖ్య, తేది.
4. చేయబడు కార్యములు
5. తరువాయి పేజీలు

| క్రమ సంఖ్య | తేదీ తయారు చేయబడిన పరిమాణము | విక్రయించబడిన పరిమాణము | పదార్థము యొక్క స్వభావము | వర్ణన గుర్తు లేక బ్రాండు |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |

| కొనుగోలుదార్ల పేర్లు | నిల్వ | రిమార్కులు |
|---|---|---|
| 6 | 7 | 8 |

## ఫారం V

స్థిరమైన వ్యాపార స్థలం లేని సంచార వ్యాపారుల లైసెన్సు పొడిగింపు కొరకు దరఖాస్తు ఫారం లైసెన్సింగులోకలు అధారిటీ హెల్తు అధారిటీ

నేను / మేము ———————————————— యొక్క కుమారుడు / కుమార్తె / భార్య, వయస్సు ——————పురుషుడు / స్త్రీ—————— నివాసం———————————— వృత్తి ———————————— ఆహార కల్తీ నివారణ చట్టం 1954 క్రింది నిబంధనల మరియు దీని క్రింది నియమముల క్రింద ఆహార వస్తువులు మరియు పానీయముల విక్రయంకొరకు తయారీ/విక్రయం/విక్రయంకొరకు ప్రదర్శన / నిల్వ చేయుటకు లైసెన్సు కొరకు / పొడిగింపు కొరకు దరఖాస్తు చేయుచున్నాను(ము). ఇంకను, సదరు వస్తువుల అమ్మకం లైసెన్సింగు ఆథారిటీ పరిధిలో లోకల్ హెల్తు అధారిటీ యొక్క లోకల్ ఏరియాలో, చేతి బండిపై వీధుల వెంట తిరిగి చేయుదునని ప్రకటించుచున్నాను(ము).

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రకటనలు

సెక్షను 2 : –

(జి. ఓ. యం. యస్ హెల్త్ తేది 6-2-58
జి. ఓ. 1776 హెల్త్ తేది. 27-6-60 ద్వారా సవరించబడినట్లు)

ఆహార కల్తీ సవరణ చట్టం 1954 యొక్క సె 2 క్లాజు (Vii) క్రింద సంక్రమించిన అధికారములు పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఇందు మూలంగా ఆంధ్ర ప్రదేశ్ రాజపత్రంలో ఈ ప్రకటన ప్రచురించబడిన తేదీ నుండి అమలులోకి వచ్చు విధంగా, సదరు చట్టం నిమిత్తం, హైద్రాబాదు పట్టణ మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలోని ప్రాంతములన్ని ఒక లోకల్ ఏరియాగను, మరియు సికింద్రాబాదు పట్టణ మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలోని ప్రాంతములు మరియు హైద్రాబాదు మున్సిపల్ కార్పొరేషన్ పరిధి మినహాయించి, రాష్ట్రములు పునర్వ్యవస్థీకరణ చట్టం 1956, సె. 3 యొక్క సబ్ సెక్షను [i] లో ఉదహరించబడిన ఇతర ప్రాంతములన్నియు ఒక లోకల్ ఏరియాగాను ప్రకటించుచున్నారు.

సెక్షను 2 (viii ఎ)

(జి. ఓ. యం. యస్. 1212 హెల్త్, మెడికల్ హెల్త్,
డిపార్టుమెంటు తేది. 29-12-76
మెమోరండం 345/కె. 2/77-12 మెడికల్
అండ్ హెల్త్ తేదీ 28-4-77 సవరణతో)

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె. [2] క్లాజు (viii) [ఎ] క్రింద సంక్రమించిన అధికారములు పురస్కరించుకొని ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు యిందు మూలముగా క్రింది పట్టికలో 2 వ కాలములో పేర్కొనబడిన లోకల్ ఏరియాలకు వానికెదురుగా కాలం [3] లో పేర్కొనబడిన అధికార్లను, సదరు ప్రాంతములకు ఆరోగ్య పరిపాలనాధికారములుగల లోకల్ [హెల్త్] అథారిటీలుగా నియమించుచున్నారు.

## పట్టిక

| క్రమ సంఖ్య | లోకల్ ఏరియా | లోకల్ (హెల్తు) అథారిటీగా నియమించ బడిన అధికార్లు |
| --- | --- | --- |
| 1 | 2 | 3 |
| 1. | హైద్రాబాద్ మునిసిపల్ కార్పోరేషన్ హైద్రాబాద్, డివిజను మరియు సికింద్రాబాదు డివిజనులు | మునిసిపల్ కార్పోరేషను యొక్క ఛీఫ్ మెడికల్ ఆఫీసర్ ఆఫ్ హెల్త్ |
| 1. ఎ). | మునిసిపల్ కార్పోరేషను, హైద్రాబాదు, సికింద్రాబాదు డివిజను | సికింద్రాబాదు డివిజను మెడికల్ ఆఫీసర్ ఆఫ్ హెల్త్. |
| 2. | మునిసిపల్ కార్పోరేషన్ హైద్రాబాద్ వార్డు నం. 16, 17, 18, 22, 33లు గల సికింద్రాబాదు డివిజను సర్కిలు — 1 | హైద్రాబాదు మునిసిపల్ కార్పోరేషను అసిస్టెంటు మెడికల్ ఆఫీసరు ఆఫ్ హెల్తు సర్కిలు - 1. |
| 3. | మునిసిపల్ కార్పోరేషన్ హైద్రాబాదు వార్డు నం. 14, 15, 19, 20, 21లు గలసికింద్రాబాదు డివిజను-సర్కిలు 2 | మునిసిపల్ కార్పోరేషను అసిస్టెంటు మెడికల్ ఆఫీసరు ఆఫ్ హెల్తుసర్కిలు-2. |
| 4. | మునిసిపల్ కార్పోరేషన్ ఆఫ్ హైద్రాబాద్ వార్డులు 2, 3 గల హైద్రాబాదు, సికింద్రాబాదు డివిజనులు - సర్కిలు 3 | మునిసిపల్ కార్పోరేషను అసిస్టెంటు మెడికల్ ఆఫీసరు ఆఫ్ హెల్తు సర్కిలు - 3. |
| 5. | మునిసిపల్ కార్పోరేషన్ హైద్రాబాదు, వార్డులు 9, 10, 11, 12, 13 గల హైద్రాబాదు సికింద్రాబాదు డివిజన్లు సర్కిలు - 4 | మునిసిపల్ కార్పోరేషను అసిస్టెంటు మెడికల్ ఆఫీసర్ ఆఫ్ హెల్తుసర్కిలు- 4. |

| | | |
|---|---|---|
| 6. | మునిసిపల్ కార్పొరేషన్ హైదరాబాదు వార్డులు 6, 7, 8 లు గల హైదరాబాదు, సికిం ద్రాబాదు డివిజన్లు సర్కిలు-5 | మునిసిపల్ కార్పొరేషను అసిస్టెంటు మెడికల్ ఆఫీసర్ ఆఫ్ హెల్తు సర్కిలు - 5. |
| 7. | మునిసిపల్ కార్పొరేషను వార్డు నం. 14, 15 గల హైదరాబాదు, సికింద్రాబాదు డివిజన్లు సర్కిలు 6. | మునిసిపల్ కార్పొరేషను అసిస్టెంటు మెడికల్ ఆఫీసర్ ఆఫ్ హెల్తు సర్కిలు - 6. |
| 8. | మునిసిపల్ హెల్తు ఆఫీసర్ లేని మునిసిపాలిటీ | మునిసిపల్ కమీషనర్ మరియు స్పెషల్ ఆఫీసర్ |
| 9. | మునిసిపల్ హెల్తు ఆఫీసరు గల మునిసిపాలిటీ | మునిసిపల్ హెల్తు ఆఫీసర్ |
| 10. | గ్రామ పంచాయతి | ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ |
| 11. | తిరుమల కొండ ప్రాంతం | తిరుమలకొండ ప్రాంతం హెల్తు ఆఫీసర్ |
| 12. | ప్రకటిత ప్రాంతం | ఎ. ప్రకటిత ప్రాంతపు హెల్తు ఆఫీసర్<br>బి. హెల్తు ఆఫీసర్ లేనిచో ప్రకటిత ప్రాంతంయొక్క ఆస్పత్రి లేక డిస్పెన్సరి యొక్క వైద్యాధికారి.<br>సి. హెల్తు ఆఫీసరు / మెడికల్ ఆఫీసరు లేనిచో ప్రకటిత ప్రాంతపు కార్యనిర్వహణాధికారి. |
| 13. | కంటోన్మెంటు ప్రాంతం, మిలటరీ ప్రాంతం, విమానాశ్రయప్రాంతం రైల్వే ప్రాంతం | *భారత ప్రభుత్వంచే ప్రకటించబడిన ఆరోగ్యాధికార్లు. |

## *భారత ప్రభుత్వ ప్రకటనలు

### జి. యస్. ఆర్. 1453 26-8-76

సె. 2 క్లాజు (viii) (ఎ) క్రింద సంక్రమించిన అధికారములు పురస్కరించుకొని, కేంద్ర ప్రభుత్వం, రైల్వే మంత్రిత్వ శాఖ యిందు మూలంగా జి. యస్. ఆర్. 282 తేది 28-2-70 లో కేంద్ర రాజపత్రంలో ప్రకటించబడిన లోకల్ ఏరియాలకు సంబంధించిన జోనల్ రైల్వే మెడికల్ సూపరిండెంటు డివిజనల్ మెడికల్ ఆఫీసర్లను వారి అధికార పరిధిలోని ప్రాంతములకు లోకల్ హెల్త్ అథారిటీగా నియమించుచున్నది.

### జి. యస్. ఆర్. 650 ఇ తేది 13-10-77

సె. 2 క్లాజు [viii-ఎ] క్రింది అధికారములను పురస్కరించుకొని కేంద్ర ప్రభుత్వం యిందు మూలంగా క్రింది షెడ్యూలులోని 2వ కాలంలో పేర్కొనబడిన అధికారిని, వానికెదురుగా షెడ్యూలు కాలం [3] లో పేర్కొనబడిన లోకల్ ఏరియాకు ఆరోగ్య పరిపాలనాధికారముగల లోకల్ హెల్త్ అథారిటీగా నియమించుచున్నది.

షెడ్యూలు

| క్రమ సంఖ్య | అధికారి | లోకల్ ఏరియా |
|---|---|---|
| 1. | ఇండియన్ పోర్టు హెల్త్ రూల్సు 1955, రూలు 2 క్లాజు 5, సబ్ క్లాజు [ఎ] క్రింద నియమించబడిన మేజరు పోర్టు యొక్క హెల్త్ ఆఫీసరు | తాను నియమించబడిన మేజరు పోర్టు పరిధిలోని ప్రాంతం. |
| 2. | ఇండియన్ ఎయిర్ క్రాఫ్ట్[పబ్లిక్ హెల్త్] రూల్సు 1954, రూలు 2, క్లాజు 8 లో ప్రస్తావించ బడిన హెల్తు ఆఫీసర్. | తాను నియమించబడిన విమానాశ్రయ సరిహద్దుల లోపల ప్రాంతం. |

## జి. ఓ. యం. యస్. 165 (యం అండ్ హెచ్) 23-2-82

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె. 2 క్లాజు [vii] మరియు [vii-ఎ] క్రింద అధికారములను పురస్కరించుకొని, జి ఓ. యం. యస్. 466 మెడికల్ అండ్ హెల్త్ తేదీ 18-7-79 లోని ఉత్తర్వులను రద్దు చేయుచు, ఆంధ్రప్రదేశ్ గవర్నరు యిందు మూలముగా— క్రింది షెడ్యూలులోని 1వ కాలములో నుదహరించబడిన అధికార్లు ఈ చట్టం నిమిత్తం, కాలం 2 లో అనుగుణంగా నమోదు అయిన లోకల్ ఏరియాలను, జి. ఓ. యం. యస్. 12 12 మెడికల్ అండ్ హెల్త్ తేదీ 29-12-76 ప్రకారం లోకల్ హెల్తు అథారిటీలు పని చేయుచున్న లోకల్ ఏరియాలు మినహాయించి దీని యొక్క 2వ కాలంలో అనుగుణంగా నమోదు అయిన లోకల్ ఏరియాలకు ఈ చట్టం నిమిత్తం, లోకల్ హెల్తు అథారిటీలుగా నియమించు చున్నారు.

### షెడ్యూలు

| క్రమ సంఖ్య | అధికారి హోదా | లోకల్ ఏరియా |
|---|---|---|
| 1. | రీజనల్ లేబరెటరీ యొక్క సివిల్ సర్జను, బేక్టీరియాలజిస్టు విశాఖపట్నం | ఇతర లోకల్ హెల్త్ అథారిటీలు పని చేయుచున్న ప్రాంతం తప్ప మిగత విశాఖపట్నం జిల్లాఅంతా |
| 2. | ,, గుంటూరు | ,, గుంటూరు జిల్లా అంతా |
| 3. | ,, కర్నూలు | ,, కర్నూలు జిల్లా అంతా |
| 4. | ,, వరంగల్ | ,, వరంగల్ ,, |
| 5. | అసిస్టెంటు ఫుడ్ కంట్రోలర్, హెల్తు ఆఫీసు | రంగారెడ్డి జిల్లా అంతా, |
| 6. | మెడికల్ ఆఫీసర్, డిస్ట్రిక్టు లేబరేటరీ శ్రీకాకుళం. | ఇతర లోకల్ అథారిటీలు పని చేయుచున్న ప్రాంతం తప్ప మిగతా జిల్లా అంతా |
| 7. | ,, ప. గోదావరి | ,, |
| 8. | ,, తూ. గోదావరి | ,, |
| 9. | ,, కృష్ణా | ,, |
| 10. | ,, ప్రకాశం | ,, |

| క్రమసంఖ్య | అధికారి హోదా | | లోకల్ ఏరియా |
|---|---|---|---|
| 11. | మెడికల్ ఆఫీసర్, డిస్ట్రిక్ట్ లేబొరేటరీ | నెల్లూరు | ఇతర లోకల్ అథారిటీలు పనిచేయుచున్న ప్రాంతం పత్ప మిగతా జిల్లా అంతం. |
| 12. | " | చిత్తూరు | " |
| 13. | " | కడప | " |
| 14. | " | అనంతపూర్ | " |
| 15. | " | మహబూబ్ నగర్ | " |
| 16. | " | నిజామాబాద్ | " |
| 17. | " | ఆదిలాబాద్ | " |
| 18. | " | కరీంనగర్ | " |
| 19. | " | ఖమ్మం | " |
| 20. | " | నల్గొండ | " |
| 21. | " | మెదక్ | " |

సెక్షను 9 :–

జి. ఓ. యం. యస్. 313 హెల్త్ తేది. 23-2-56

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 యొక్క సె. 9 క్రింద సంక్రమించిన అధికారములు పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ గవర్నరు, ఇందు మూలంగా–

1. క్రింది షెడ్యూలు యొక్క 1 వ కాలంలో పేర్కొనబడిన వ్యక్తులను, ఈ సదరు చట్టం నిమిత్తం ఫుడ్ యిన్స్పెక్టర్లుగా నియమించుచున్నారు.

2. పైన పేర్కొనబడిన వ్యక్తులు షెడ్యూలు యొక్క 2 వ కాలంలో అనుగుణమైన నమోదులో పేర్కొనబడిన లోకల్ ఏరియాలో అధికారములు చలాయించవలెనని ఆదేశించుచున్నారు.

షెడ్యూలు

| వ్యక్తులు | లోకల్ ఏరియా |
|---|---|
| 1. మున్సిపల్ హెల్తు ఆఫీసర్ మరియు వారి అదుపులోయున్న శానిటరీ ఇన్స్పెక్టర్లు | హెల్తు ఆఫీసరు కలిగియున్న మునిసిపాలిటీలు. |
| 2. మున్సిపల్ కమీషనర్లు మరియు వారి అదుపులో ఉన్న శానిటరీ ఇన్స్పెక్టర్లు | హెల్తు ఆఫీసరులేని మునిసిపాలిటీలు. |
| 3. శానిటరీ ఇన్స్పెక్టర్లు | శానిటరీ యిన్స్పెక్టరు కలిగియున్న పంచాయితీ. |
| 4. సంబంధించిన రేంజి యొక్క ఎగ్జిగ్యూటివ్ ఆఫీసరు లేక హెల్తు ఇన్స్పెక్టరు. | శానిటరీ ఇన్స్పెక్టరు లేని పంచాయితీ. |

జి. ఓ. యం. యస్. 1940 హెల్త్ తేది 22-7-60

అహార కల్తీ నివారణ చట్టం 1954 సె. 9 క్రింద సంక్రమించిన అధికారములు పురస్కరించుకొని ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు యిందు మూలంగా—

1. షెడ్యూలు 1వ కాలంలో పేర్కొనబడిన వ్యక్తులను సదరు చట్టం నిమిత్తం ఫుడ్ ఇన్స్పెక్టర్లుగా నియమించుచున్నారు.

2. పై చెప్పబడిన వ్యక్తులు సదరు షెడ్యూలు 2వ కాలంలో అనుగుణంగా నమోదు చేయబడిన లోకల్ ఏరియాలో అధికారములను చెలాయించవలెనని ఆదేశించుచున్నారు.

VIII

షెడ్యూలు

| వ్యక్తులు | లోకల్ ఏరియా |
|---|---|
| హైద్రాబాదు మున్సిపల్ కార్పోరేషను ఫుడ్ యిన్స్పెక్టర్లు | హైద్రాబాదు మున్సిపల్ కార్పోరేషన్‌లో ప్రస్తుతం ఉన్న పోస్టులలో 4 హెల్తు ఇన్స్పెక్టరు పోస్టులు హోదాపై ఫుడ్ యిన్స్పెక్టర్లుగా నియోగింపబడి, హైద్రాబాదు మున్సిపల్ కార్పోరేషను లోకల్ ఏరియాలో ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె. 9 క్రింది అధికారములు చలాయించుటకు అట్లు నియమించబడియున్నారు. |
| సికింద్రాబాదు మున్సిపల్ కార్పోరేషను మరియు మిగిలిన తెలంగాణ (రాష్ట్రముల పునర్వ్యవస్థీకరణ చట్టం 1956 సె. 3 [i] లో నుదహరించిన ప్రకారం) | ప్రస్తుతం సికింద్రాబాదు మున్సిపల్ కార్పోరేషనులోని శానిటరీ ఇన్స్పెక్టర్లు తెలంగాణా ప్రాంతములో జిల్లాలలోని శానిటరీ యిన్స్పెక్టర్లు హోదానిబట్టి ఫుడ్ ఇన్స్పెక్టర్లుగా నియోగించబడి, మరియు ఆహార కల్తీ నివారణ చట్టం సె. 9 క్రింద అధికారములు చలాయించు నిమిత్తం అట్లు నియమించబడియున్నారు. |

జి. ఓ. యం. యస్. 1102 హెల్త్, తేది 16-11-76

ఆహార కల్తీ నివారణ చట్టం, 1954 సె. 9 క్రింద సంక్రమించిన అధికారములు పురస్కరించుకొని, ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు యిందు మూలంగా, హెల్తు ఆఫీసరు మరియు సదరు చట్టం క్రింద ఫుడ్ యిన్స్పెక్టర్లుగా పని చేయుటకు అర్హత కలిగిన, తిరుమల కొండల లోకల్ ఏరియాలో పని చేయుచున్న, శానిటరీ యిన్స్పెక్టర్లను, సదరు చట్టం నిమిత్తం ఫుడ్ ఇన్స్పెక్టర్లుగా నియమించుచున్నారు. మరియు వారు 'తిరుమల కొండల' లోకల్ ఏరియాలో అధికారములు చలాయించవలెను.

సెక్షను 15

(జి. ఓ. యం. యస్. 305 హెల్తు తేదీ 6-2-58,
జి. ఓ. యం. యస్. 1776 హెల్తు తేదీ 27-6-60 ద్వారా సవరించబడిన విధంగా)

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె 15 క్రింద సంక్రమించిన అధికారముల పురస్కరించుకొని, ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు యిందు మూలంగా—

హైద్రాబాదు, సికింద్రాబాదు పట్టణ మున్సిపల్ కార్పొరేషను మరియు రాష్ట్రీయుల పునర్వ్యవస్థీకరణ చట్టం 1956, సెక్షను [3] యొక్క సబ్ సె. [i]లో ఉదహరించబడిన ప్రాంతములలోని, వైద్య వృత్తి సాగించుచున్న వైద్యులందర్నీ ఈ ప్రకటన ఆంధ్ర ప్రదేశ్ రాజపత్రంలో ప్రకటించబడిన తేది నుండి తమకు తెలిసియున్న విషాహార సంఘటనలన్నీ, సదరు కార్పొరేషనుకు సంబంధించిన మెడికల్, హెల్తు ఆఫీసరుకు లేక సందర్భానుసారంగా జిల్లా ఆరోగ్యాధికారికి తెలియపరచవలెనని ఆదేశించుచున్నారు.

జి. ఓ. యం. యస్. 435 హెల్త్ తేది 12-3-56

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె. 15, క్రింద సంక్రమించిన అధికారముల పురస్కరించుకొని, ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు యిందు మూలంగా, క్రింది షెడ్యూలు 1 వ కాలంలో ఉదహరించబడిన లోకల్ ఏరియాలో వృత్తి సాగించుచున్న వైద్యులందర్నీ తమకు తెలిసియున్న విషాహార సంఘటనలన్నీ, షెడ్యూలులో 2వ కాలంలో అనుగుణమైన నమోదులో ఉదహరించబడిన అధికారికి తెలియపరచవలెనని ఆదేశించుచున్నారు.

షెడ్యూలు

| లోకల్ ఏరియా | అధికారి |
|---|---|
| 1 | 2 |
| 1. మునిసిపల్ ప్రాంతం | మునిసిపల్ హెల్తు ఆఫీసరు |
| 2. ఇతర ప్రాంతములు | జిల్లా ఆరోగ్యాధికారి |

సె. 16

జి. ఓ. యం యస్. 414 యం. అండ్ హెచ్(4) తేది 29-7-85

ఆహార కల్తీ నివారణ చట్టం 1954, సె. 16-ఎ క్రింద సంక్రమించిన అధికారములు పురస్కరించుకొని, ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు యిందుమూలంగా, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రములోని జుడిషియల్ మొదటి తరగతి మేజిస్ట్రేటులందరికీ, సదరు సెక్షనులో ప్రచురించబడిన నేరములన్నిటినీ సంక్షిప్త విచారణ జరుపుటకు అధికారమిచ్చుచున్నారు.

సెక్షను 20

జి. ఓ. యం. యస్ 1621 హెల్త్ తేది 29-9-56

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె. 20 సబ్ సెక్షను [1] క్రింద సంక్రమించిన అధికారములు పురస్కరించుకొని ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు, సదరు చట్టం క్రింద నియమితమయిన ఫుడ్ ఇన్స్పెక్టర్లకు, ఈ చట్టం క్రింద నేరములను ప్రాసిక్యూషను చేయుటకు, ప్రాసిక్యూషను చేయుటకు తమ అనుమతి యిచ్చుటకు, అధికారమిచ్చుచున్నారు

జి. ఓ. యం యస్. 1656 హెల్త్ తేది 24-7-70

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె. 20 సబ్ సె. [1] క్రింద సంక్రమించిన అధికారములు పురస్కరించుకొని ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు తెలంగాణా ప్రాంతంలోని ఫుడ్ ఇన్స్పెక్టర్లందరికీ, సదరు చట్టం క్రింద నేరములను ప్రాసిక్యూషను చేయుటకు, చేయుటకు తమ అనుమతి యిచ్చుటకు అధికారమిచ్చుచున్నారు.

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె. ii 20, సబ్ సె. ii (1) క్రింద సంక్రమించిన అధికారములు పురస్కరించుకొని, జి. ఓ. యం. యస్. 1621 హెల్త్ 20-9-56 లో యివ్వబడిన నోటిఫికేషను సవరించుచూ, ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు యిందుమూలంగా సదరు చట్టం క్రింద శిక్షింపదగిన నేరములకు ప్రభుత్వోద్యోగులు లేక ప్రభుత్వ సంస్థలకు డిప్యుటేషనుపై ఉన్న ప్రభుత్వోద్యోగులపై తప్ప ఇతరులపై ప్రాసిక్యూషను ప్రారంభించుటకు ప్రాసిక్యూషనుకు తమ

అనుమతి యిచ్చుటకు, ఈ చట్టం క్రింద నియమితులయిన ఫుడ్ ఇన్స్పెక్టర్లకు అధికారమిచ్చుచున్నారు.

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 సె. ii 20 క్రింది అధికారములు పురస్కరించుకొని, వరుసగా 13-8-70 తేదీ రాజపత్ర భాగం1 - పేజీ 144 లో మరియు 13-177 రాజపత్రం భాగం 1 పేజీ 31 లో ప్రకటించబడిన జి. ఓ. యం. యస్. 1656 హెల్త్ తేదీ 24-7-70, మరియు జి. ఓ. యం. యస్. 1233హెల్తు తేదీ 31-12-76 లోని ఉత్తర్వులను సవరించుచూ, ఆంధ్రప్రదేశ్ గవర్నరు యిందు మూలంగా, సదరు చట్టం క్రింద నియమించబడిన ఏ ఫుడ్ ఇన్స్పెక్టరు అయినా, ప్రభుత్వోద్యోగి లేక పబ్లిక్ రంగ సంస్థలలో డిప్యూటీషనులో యున్న ప్రభుత్వోద్యోగి పైన తప్ప ఇతర వ్యక్తులందరిపై, సదరు చట్టం క్రింద శిక్షించ దగిన నేరములకు ప్రాసిక్యూషను పెట్టుటకు, ప్రాసిక్యూషను పెట్టుటకు అనుమతించుటకు, అధికారమించుచ్చున్నారు.

## ఇతర ఉత్తర్వులు

### జి. ఓ. యం. యస్. 2321 హెల్త్ ది. 17-10-69

ప్రభుత్వం ప్రతిపాదనలను హైద్రాబాదు సంప్రదింపుతో పరీక్ష చేసి, న్యాయ శాఖ వసూళ్ళ ఖర్చు క్రింద ఉంచుకొనవలసిన శాతం 10 నుండి 12కు పెంచుటకు ఆహార కల్తీ నివారణ చట్టం క్రింది నేర విచారణలో హాజరయిన సాక్షులకు బత్తా కోర్టులో చెల్లించవలెనని నిశ్చయించినది.

### జి. ఓ. యం. యస్. 1522 హెల్త్ 23-4 64 హెల్త్ హౌసింగ్ అండ్ మునిసిపల్ అడ్మినిస్ట్రేషన్ డిపార్ట్మెంట్

లంకధాన్యం/పప్పు (అమ్మకం నిషేధం) ఉత్తర్వు, 1963.

ఆహార కల్తీ నివారణ నియమావళి 1955, రూలు 44-ఎ క్రింద ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు క్రింది ఉత్తర్వు చేయుచున్నారు-

## ఉత్తర్వు

ఈ ప్రకటన రాజపత్రంలో ప్రకటించబడిన తేదీ నుండి ఏ వ్యక్తియు,

ఎ. లంక ధాన్యము (Lathrus sativus) మరియు దాని నుండి తయారైన పదార్థములు

బి. లంక పప్పు ( " ) "

సి. లంక పప్పు పిండి ( " ) "

డి. లంక ధాన్యం మరియు, శనగలు (Cicer Arietium) లేకఇతర ధాన్యముల మిశ్రమం,

ఇ. లంక పప్పు, శనగ పప్పు లేక ఇతర పప్పుల మిశ్రమం.

యఫ్. లంక పప్పు పిండి మరియు శనగ పిండి లేక ఇతర పిండి మిశ్రమం,

అమ్మరాదు, అమ్ముటకు ప్రతిపాదించరాదు, ప్రదర్శించరాదు, లేక ఏ రూపములోనయినా అమ్ముటకు గాని, అమ్ముటకుద్దేశించిన ఏ ఆహార పదార్థముల యొక్క తయారీలోగాని వాడుటకు, తన స్వాధీనంలో కలిగియుండరాదు—

విశదీకరణ :—

కొన్ని భారతీయ భాషలలో 'కేసరి ధాన్యం' యొక్క సదృశ పదములు క్రింద ఇవ్వబడినవి.

హిందీ : కేసరీ లేక ఖై సారి, సంస్కృతం :— త్రిపాటీ, తెలుగు : లంక, గుజరాతి మరియు మర్వాడి : లఖ్

# రాష్ట్ర ప్రభుత్వ ప్రకటనలు

## అధి సూచన

జి. ఓ. యం. యస్. 166 మెడికల్ హెల్త్ (యల్) తేది 23-2-82.

ఆహార కల్తీ నివారణ చట్టం 1954 (1954 యొక్క 37 వ చట్టం), సె. 2 క్లాజు (VII), (VIII)ల క్రింద సంక్రమించిన అధికారములను పురస్కరించుకొని, ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు ఇందు మూలంగా డా॥ సి. రాజ్యలక్ష్మి, డైరక్టరు, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్రివెంటివ్ మెడిసిన్ అండ్ పబ్లిక్ హెల్త్ లాబరెటరీలు, ను రాష్ట్ర మంతటికి లోకల్ హెల్త్ అథారిటీగా నియమించు చున్నారు.

గమనిక :

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రకటనలు

X వ పేజీ 18 వ పంక్తికి తర్వాత—

జి. ఓ. యం. యస్. 1233 హెల్త్ (కె 2) మెడికల్ అండ్ హెల్త్ తేది. 31-12-76.

మరియు

XI వ పేజీలో 2 వ పంక్తికి తర్వాత

జి. ఓ. యం. యస్. 650 మెడికల్ అండ్ హెల్త్ కె 2 తేది. 22-6-77

అని చదువుకొన వలసినది.

# నియమావళి - అంశానుక్రమ సూచన


అల్లం ఎ.05.13 128
అవిసె నూనె ఎ.17.04 184
ఆధారపాత్ర పై సీలు ఎ.15 174
ఆవాలు ఎ.05.15 130
ఆహార రంగులు
రూ 26,28-31-32 218
—గరిష్ఠ పరిమితులు 34
—నిషేదం 33
—స్వచ్ఛత 35
ఆహారములో మిశ్రమం రూ43 50
ఆహారములో కొన్ని మిశ్రమముల
నిషేధం రూ44 51
అయోడీకృత లవణములు
ఎ.15.01 174
ఆలివ్ నూనె ఎ.17.07 186
ఇప్పనూనె ఎ.17.05 185
ఇంగువ ఎ.04 117
ఉప్పు ఎ.15 173
ఎమల్సీకరణులు 88
—వాడకం 90
ఐస్‌క్యాండీ ఎ07.04.01 138
ఐస్ లాల్లీలు ఎ 07.04 138
ఐసింగ్ సుగర్ ఎ 07.09 141
కస్టర్డ్ పౌడరు ఎ.18.10 206
కార్బనీకృత నీరు ఎ.01.01 115
క్రిమిసంహారక క్రియలు 94
కేంద్ర ఆహార పరిశోధనా శాల 4
కుశాంపిల్ పంపుట 7
కల్లు ఎ. 29. 01 237
కాసు ఎ. 21 214
కీటకములవలన చెడిన ఆహార
అమ్మకం రూ 48బి 61
కస్టర్డ్ పౌడరు ఎ. 18. 10 206
కార్న్‌ఫ్లెక్స్ ఎ 18.09 206
కాఫీ ఎ. 08 142
కుంకుమ ఎ. 05-19 133
క్యూబు చక్కెర ఎ. 07.06 139
కొవ్వు ఎ. 10 145
కొబ్బరి నూనె ఎ 17.01 183
ఖోవా ఎ. 11.02.17 164
గసగసాలు ఎ. 05.18 133
—నూనె ఎ. 17.08 186
గ్లూకోస్ సిరప్ ఎ, 07.11 142
గోధుమ రవ్వ ఎ. 18.03 202
గోల్డెన్ సిరప్ ఎ. 07-08 140
చక్కెర ఎ. 07.01 137
చచ్చిన జంతువుల మాంసం
రూ. 48 59
చిక్కుడు ఎ. 06 136
చికోరీ ఎ. 08-02 143

జాజికాయ ఎ. 05.16 131
జాపత్రి ఎ. 05.14 129
జీలకఱ్ఱ ఎ. 05.09 125,126
జెలాటిన్ ఎ 22 214
టాఫీలు ఎ. 25-02 216
టీ 44ఇ ఎ. 14 170
డెక్ట్రోస్ ఎ, 07.07 140
తవుడు నూనె ఎ. 17.23 197
తీపి చేయు పదార్థము రూ47 59
తీపి పదార్థములు ఎ. 25 215
తేనె రూ. 44-డి,రూ.45,
ఎ. 07.03 138
దాల్చిన ఎ. 05.06 123
ధనియాలు ఎ. 0.5.08 124
ధాన్యములు ఎ.18 198
నామనిర్దేశము, కంపెనీచే 20
నీరు కలిపినపాల అమ్మకం 51
నువ్వులనూనె ఎ 17.11 188
నూనెలు ఎ 17 183
నేయి ఎ 11.02.21 166
పసుపుకొమ్ము ఎ. 0.5.20 134
ప్రమాణములు 115
పబ్లిక్ ఎనలిస్టు అర్హతలు 9
—విధులు 10
పరిరక్షకము-నిర్వచనము 73
—పరిమాణము
—వర్గీకరణ 73
—పరిమితి 73
—నిషేధం 75
—పాలు వగైరాలలో 26
పాలు, పాల ఉత్పత్తులు 148
పాలు, ప్రమాణములు 151
పండ్లు, పక్వము చేయుట
ప్రత్తి గింజల నూనె 183
పామ్ ఆయిల్ 193
పామోలిన్ 194
పిండి ఆహారములు 116
పొద్దు తిరుగుడు నూనె 187
ప్యాకింగ్ 35
ఫలాల ఉత్పత్తులు ఎ. 16 176
ఫుడ్ ఇన్స్పెక్టరు అర్హతలు 13
— అధికారములు
—విధులు 15
బాదం నూనె ఎ. 17.16 191
బార్లీ ఎ. 18-05 202
బిస్కత్తులు ఎ. 18.07 205
బురా ఎ. 07.02 137
బేకింగ్ పౌడర్ ఎ. 02 115
బెల్లం ఎ. 07.05 139
మలై ఎ. 11.02.05 157
మసాలా పొడి ఎ. 05.21 135
మార్గరిన్ ఎ.12 169
మిశ్రమాహారముల నిషేధం 51,58
మిరపకాయలు ఎ. 05.05 122
మిరియాలు ఎ 05.07 132,133
మెంతులు ఎ. 05.12 127
మొక్కజొన్న నూనె ఎ. 17.14 190
పిండి ఎ. 18.08 205

మైదా ఎ.18.02 209
యాంటీ ఆక్సిడెంట్లు 86
యాంటి కేకింగ్ ఏజెంట్లు 90
యారోరూట్ ఎ. 03.01 116
యాలకలు ఎ.05.03. 119
రుచికారకములు 91
రొట్టె ఎ. 18.14 209
లవంగాలు ఎ. 05-07 123,124
లేబిల్, పై అంశములు 35
—పై ప్రకటనల భాష 38
—పై ప్రకటనల శైలి 39
—ఫారంలు 42
లైసెన్సు షరతులు 63,66
—కాలపరిమితి 72
....విధానము 72
లంక పప్పు, అమ్మకం 54
లాజెంజీలు 218
వనస్పతి ఎ. 19 211
విశ్లేషణం కొరకు పంపుట 21
—కొరకు నోటీసు 19
—నివేదిక నకలు 17
వాము ఎ. 05.23 136
వారంటీ 19
వెనిగార్ ఎ. 20 213
వెన్న 165
శనగపిండి ఎ 18.14 202
శాకరీన్ ఎ. 07.10 141
శిశువులపాల ఆహారం 165
సగ్గుబియ్యం ఎ. 03.02 116
సాజీర ఎ. 05.01 118
సాస్ ఎ. 16.02 182
సుగంధ ద్రవ్యాలు ఎ.05 118
సోంపు ఎ. 11 127
సోయాబీన్ నూనె 189

# పారిభాషిక పదకోశము

## అ

| | |
|---|---|
| అధిసూచన | Notification |
| అధిప్రమాణితము చేయబడిన | Authenticated |
| అనార్ద్ర | Anhydrous |
| అనుబంధము | Appendix |
| అనుసూచి | Schedule |
| అనుపూరక | Supplemental |
| అపరాధ చింత | Mensrea |
| అభినిశ్చితమైన | Ascertained |
| అభియోగము | Prosecution |
| అయితే | Provided that |
| అవశేషము | Residue |
| అవసరములు | Requirements |
| అవిసె | Linseed |
| అల్లం | Ginger |
| అంత ఫలకవచం | Endocarp |
| అంతశ్చర్మం | Endodermis |
| అంతర్దారువు | Hardwood |
| అండవృంతం | Funicle |
| అంశము | Component |
| అర్థాన్వయము | Interpretation |

## ఆ

| | |
|---|---|
| ఆకర్షక పత్రావళి | Corella |
| ఆక్సీకరణి | Oxidant |
| ఆనుభావిక ఫార్ములా | Empirical formula |

| | |
|---|---|
| అనుషంగిక | Incidental |
| ఆహార వస్తువు | Food article |
| ఆమ్లీకరణము | Acdification |
| ఆర్ద్ర | Hydrous |
| ఆర్ద్రాకర్షక | Hygroscopic |
| ఆవాలు | Mustard, Sarson, Rapeseed |

ఇ

| | |
|---|---|
| ఇంగువ | Asafoetida |
| ఇప్ప | Mahua |

ఉ

| | |
|---|---|
| ఉత్పన్నము. | Derivative |
| ఉత్తర్వు | Order |
| ఉత్పత్తి | 1. Produce 2. Product |
| ఉత్పాదకుడు | Producer |
| ఉత్ప్రేరకము | Catalyst |

ఎ

| | |
|---|---|
| ఎండబెట్టబడిన | Dried |
| ఎమల్సీకరణి | Emulsifying Agent |
| ఏక జాతీయము | Homogenous mixture |
| ఏకరీతిగా | Homogenous |
| ఏదైనా | If any |
| ఏర్పాటు చేయు | Provide for |

క

| | |
|---|---|
| కరగిన | Fused |
| కమ్మదనము | Flavour |

| | |
|---|---|
| క్రమబద్ధము చేయు | Regulate |
| కర్ర పెండలం | Topioca |
| కంకి | Spike |
| కసింద | Casia |
| కారావాసము | Imprisonment |
| కాలుష్యము | Contamination |
| కాలుష్యకము | Contaminent |
| కాండం | Stem |
| క్రిమి సంహారిణి | Inseoticide |
| కీలం | Style |
| కీలాగ్రం | Stigma |
| కృత్రిమ | 1. Artificial 2. Synthetic |
| కుసుమ | Saflower |
| కుంకుమ | Saffron |
| కేసరాలు | Stamens |
| కొమ్ము | Rhizome |
| కొవ్వు | Fat |

ఖ

| | |
|---|---|
| ఖర్జూర | Date palm |

గ

| | |
|---|---|
| గతకాలిక ప్రభావం | Retrospective effect |
| గసగసాలు | Poppy |
| గాఢత | Concentration |
| గుళిక | Capsule |

ఘ

| | |
|---|---|
| ఘటక | Constituent |

## చ

| | |
|---|---|
| చక్కెర | Sugar |
| చట్టం | Act |
| చర్య | 1. Action 2. Proceeding |
| చెఱకు | Sugar-cane |

## జ

| | |
|---|---|
| జలయానకము | Acqueous Media |
| జలసంకలన చర్య | Hydrolysis |
| జలేతర | Non- acqueous |
| జవాబుదారి | Responsibility |
| జాజికాయ | Nutmeg |
| జాపత్రి | Mace |
| జీడి మామిడి | Cashew |
| జీల కఱ్ఱ | Cumin |

## త

| | |
|---|---|
| తటస్థీకరణ చేయబడిన | Nuetralised |
| తయారీ | Manufacture |
| తరంగ దైర్ఘ్యము | Wavelength |
| తవుడు | Rice bran |
| తృణ ధాన్యములు | Cereals |
| తేర్చగా | On decantation |

## ద

| | |
|---|---|
| దత్తము చేయు | Confer (Powers) |
| ద్రావ్యాప్తి (ద్రవీభవన స్థానం) | Melting point |
| దాల్చిన చెక్క | Cinnamom, Caraway |
| ద్రవకారి | Flux |
| ద్రవ్యరాశి | Mass |

| | |
|---|---|
| ద్రావణము | Solution |
| ద్రావణి | Solvent |
| ద్రావణీయత | Solubility |
| ద్రావితము | Solute |
| దుంప | Tuber |
| ధనియాలు | Coriander |
| ధాన్యములు | Cereals |
| ధృవీకరణ పత్రము | Certificate |

న

| | |
|---|---|
| నమ్యత | Flexibility |
| నమోదు | Entry |
| నార | Fibre |
| నిబంధన | Provision |
| నామ నిర్దేశము | Nomination |
| నివారణ | Prevention |
| నియమము | Rules |
| నియంత్రణలో | Under the control of |
| నిరింద్రియ | Inorganic |
| నిర్వర్తించు | Preform |
| నిర్దేశించబడిన | Perscribed |
| నిర్దిష్ట పరచిన | Specified |
| నిక్షేపితమైన | Suspended (In liquid) |
| నీలలోహిత | Violet |
| నులితీగె | Tendril |
| నువ్వులు | Sesame, Gingely |
| నూనె లేని ఆహారం | De-oiled meal |

ప

| | |
|---|---|
| పతన కిరణము | Incident ray |
| పత్ర పుచ్ఛాలు | Stipules |
| పదవీ రీత్యా | Ex-officio |
| పరిరక్షణ | Preservation |
| పరిరక్షక ద్రవ్యము | Preservative |
| పరిచ్ఛేదము | Section |
| పరిమితము చేయు | To restrict |
| పరిశోధన శాల | Laboratory |
| ప్రకటిత | Declared |
| ప్రక్రియ | Procedure |
| ప్రతికల్పన<br>ప్రతిబంధన | Proviso |
| ప్రతి దీప్తి | Flouroscence |
| ప్రతిపాదన | Offer |
| ప్రదానము | Delegation |
| ప్రస్తావించబడిన | Referred to |
| పాటల వర్ణం | Pink |
| పారదర్శక | Transparent |
| ప్రాధికారి | Authority |
| ప్రారంభిక | Preliminary |
| పిండి | Flowr |
| పిండి తీయబడిన | Exprassed |
| పుష్ప పుచ్ఛము | Bract |
| పుప్పొడి | Pollen |
| పుప్పొడి తిత్తులు | Stamen |
| పూర్వప్రమాణము | Precedent |
| పూర్వ సమ్మతి | Prior consent |
| పూర్వామోదము | Prior approval |
| పొడి | 1. Powder 2. Dry |

ఫ

| | |
|---|---|
| ఫలము | Fruit |
| ఫలకవచం | Pericarp |

బ

| | |
|---|---|
| బాదం | Almond |
| బాహ్య ఫల కవచము | Epicarp |
| బాష్పశీల నూనె | Volatile oil |
| బాష్పీభవన స్థానం | Boiling point |
| బీజకవచాలు | Seed Coat |
| బీజదళాలు | Coty ledons |
| బెండు | Cork |
| బొప్పాయి | Papaya |

భ

| | |
|---|---|
| భంగము | Prejudice |
| భావన | Ash |
| భాగస్వామ్య సంస్థ | Firm |

మ

| | |
|---|---|
| మకరందము | Nectar |
| మసాలాలు | Spices |
| మధ్య ఫలకవచము | Mesocarp |
| మంద పారదర్శక | Transluscent |
| మాన్యత | Validity |
| మలినములు<br>మాలిన్యములు | Impurities |
| మిరియాలు | Pepper |

| | |
|---|---|
| ముఠగు వాసన | Rancidity |
| మృదు ఫలం | Berry |
| మొక్క-జొన్న | Maize |
| పుడి (ధాన్యములు) | Whole (grain) |
| మృదు పానీయము | Soft drink |
| మూలిక | Inorganic |

య

| | |
|---|---|
| యజమాన్య | Proprietory |
| యవలు | Oats |
| యాలకులు | Cardamum |

ర

| | |
|---|---|
| రహస్య సమ్మతి | Connivance |
| రంగు | Colour, Coloring agent |
| రుచి | Flavour |
| రుచికారకము | Flavouring Agent |
| రుజువు | Proof |
| రూపరచన | Design |

ల

| | |
|---|---|
| లవంగములు | Cloves |
| లశునము | Bulb |

వ

| | |
|---|---|
| వక్రగతి | Deflection |
| వర్ధనం | Culture |
| వల్కలం | Cortex |
| విధించిన | Imposed |

| | |
|---|---|
| విలీనత | Distlation |
| వివరణ | Explanation |
| వినిమయము | Regulation |
| విహితపరచు | To prescribe |
| విరంజనం | Bleaching |
| విరుద్ధం | Repugnant |
| విశ్లేషణము | Analysis |
| విశిష్టధృవత్వము | Specific rotation |
| విషాహార | Food poison |
| విలీన ద్రావణము | Dilute Solution |
| విక్షేపము | Deflection |
| వెల్లుల్లి | Garlic |

శ

| | |
|---|---|
| శనగలు | Bengal gram |
| శుద్ధి చేయబడిన | Refined |
| శుష్క ఫలాలు | Dry fruits |
| శోషణము | Absorption |

స

| | |
|---|---|
| సమాంగ మిశ్రణం | Homogenous Mixture |
| సమ్మేళనము | Compound |
| సంశయలాభము | Benefit of doubt |
| సహాయక | Ancillary |
| సంకలనాత్మకము | Additive |
| సంఘటన | Composition |
| సంఘర్షక ప్రతి బంధకములు | Buffering agents |

| | |
|---|---|
| సంయోగము | Combination |
| సంబారములు | Condiments |
| సహజమైన | Natural, Charecteristic |
| సహాయము | Promoter |
| సహన పరిమితి | Tolerance limit |
| స్పర్శకము | Tentacle |
| స్థిరభారము | Constant weight |
| సారూప్య | Similar |
| స్రావము | Secretion |
| సిలేంద్రము | Fungus |
| సీమజీలకర్ర | Finnel |
| స్థిరత్వకారకము | Stabilising agent |
| సుసంగతము | Relevant |
| సూచి | List |
| స్మృతి | Code |
| సుగంధ ద్రవ్యాలు | Spices and eondiments |
| సూక్ష్మముగా పొడిచేసిన | Finely (divided) |
| సేంద్రియ పదార్థము | Organic matter |
| స్వేదనము | Distilation |
| సోంపు | Aniseed |

క్ష

| | |
|---|---|
| క్షయకరణి | Reducing agent |
| క్షారము | Alkali |